అంకితం :

సాహితీవనంలో లతను నాటిన మా అన్నయ్య

డా॥ గాలి బాలసుందరరావుకు

# ఎడారి పువ్వులు



"ఒదినా !..."

ఉదయం ఆరుగంటలయింది. అప్పుడే నిద్రలేచి కుంపటి రాజేస్తున్న పార్వతి ఈ పిలుపుకి వెనక్కి తిరిగి చూసింది. ఆ వచ్చింది రాజు. "రాజూ ! మెయిలుదిగి వచ్చావా?" అని ప్రశ్న వేస్తున్న పార్వతి రాజు వెనకాల ఎవరో ఆడపిల్ల నిలబడి వుండటం చూసి ఎవరు? అన్నట్లుగా రాజువంక చూసింది.

రాజు ఇటూ అటూ చూసి అమాంతం ఒదినగారి కాళ్ళమీద పడ్డాడు. దాంతో రాజు చేసినపని సగం అర్థం అయింది పార్వతికి. కాళ్ళమీదపడ్డ రాజుతలమీద చెయ్యి వేసి "ఏమిటయ్యా యిది! ఏం కొంపమీదకి తెచ్చావు?" అన్నది.

తలెత్తి ఒదినగారి కళ్ళనిప్పుల్లోకి చూస్తూ యింకే ధైర్యం తెచ్చుకున్నాడు రాజు. "నేను యీ పిల్లని పెళ్ళిచేసుకున్నాను వదినా! మీకు తెలియకుండా చేసుకున్నందుకు క్షమించండి. ఎట్లాగైనా అన్నయ్యకి నచ్చచెప్పి నన్ను రక్షించాలమ్మా" అన్నాడు. గతుక్కుమన్నది పార్వతి. ఆ పిల్ల వంక చూసింది. వెంటనే చూపుమార్చి పక్కకిటికీలోంచి చూసింది. దూరంగా కొండమీద దుర్గగుడి కనిపిస్తోంది. ఆకు పచ్చని కొండా, తెల్లని దేవాలయమూ, ఆ వర్ణాలకి సరి

హద్దు ఇదే కాబోలు అనిపించే ప్రహరీగోడ ఆమెని కలవర పెట్టినయ్. అనాలోచితంగా కళ్ళుమూసుకున్న పార్వతికి గర్భగుడిలో కూర్చుని ప్రపంచపర్యవేక్షణచేస్తున్న జగన్మాత కనకదుర్గావిగ్రహం లీలగా కనిపించింది. మనస్సులోనే జగజ్జననికి నమస్కరించి కళ్ళు తెరిచింది పార్వతి. ఎదురుగా ఆ పిల్ల ఆకుపచ్చని చీరా, తెల్లని రవికా, తలనిండా వాడిన కదంబపూలమాల, పచ్చగా మెరుస్తున్న మొగమూ, మెడలో బిగుతుగా కట్టిన నల్లపూసలూ, అందమైన అమాయకత్వంతో నిలబడి జాలిగా చూస్తోంది తనవంక– ఈ యింటి చిన్నకోడలు; తన మరిది వలచిచేసుకున్న ఇల్లాలు. ఈ ఇంట్లో తనకెంత స్థానంవున్నదో ఆమెకీ అంతే స్థానంవుంది.

ఒదినగారి ముఖంలోని భావాల్ని చదవగలిగిన రాజు అమ్మయ్యా అని నిట్టూర్పువిడిచాడు. "పోయి స్నానంచేసి రండమ్మా! ఈలోగా కాఫీ కలుపుతాను రాత్రి యెన్నింటికి భోజనంచేశారో ఏమో! చూడమ్మా! అదిగో బాత్‌రూమ్ స్నానంచేసి రామ్మా!" అని ఇద్దరికీ చెప్పింది పార్వతి. తన ఒదినగారి మొగంలో కనకదుర్గామూర్తి గోచరించింది రాజుకి.

తనకు తెలియకుండానే చేతులెత్తి నమస్కరించాడు.

సోమవారం ఏడుగంటలయింది. విజయవాడనగరం. అప్పుడే నిద్రలేచి బద్ధకంగా ఒళ్ళువిరుచుకొంటోంది. నిన్న ఆనందంగా గడిపిన విద్యార్థులూ, నిద్రపోతూ గడపిన ఉద్యోగులూ, కసిగా సోమవారంలోకి ప్రవేశిస్తున్నారు. స్టేషనులో హైద్రాబాదురైలు ఆగింది. అందులోంచి ఒక పెద్దమనిషి దిగ బ్రిడ్జి

దాటాడు. వారంరోజుల్నించీ అజంతా ఎల్లోరాల శిల్పం దర్శించి వస్తున్న ఆయనకి తన విజయవాడా, ఆకుపచ్చని కొండలూ, కనకదుర్గమ్మా కనిపించి, మధురమైన ఆంధ్రభాష వినిపించేసరికి ప్రాణంలేచివచ్చింది. వెనువెంటనే పార్వతి ప్రస న్నవదనం కూడా కళ్ళల్లో ఆడింది. రిక్షాలో యెక్కి గవర్నరు పేట చెట్లబజారు తొందరగా పోనీ అన్నాడు.

వాకిట్లో రిక్షా ఆగినచప్పుడుకి రాజు తొంగిచూసి తొందరగా వంటింట్లోకి పరుగెత్తి "వదినా! అన్నయ్య వచ్చాడు" అన్నాడు ఖంగారుగా. అతని కళ్ళల్లోకి చూస్తే ఎలాంటి శిక్ష వేస్తావోనని దేభారం అన్నట్లున్నాయ్ అతని చూపులు. పార్వతి చిరునవ్వు నవ్వుతూ పొయ్యిమీంచి గిన్నె కిందికి దించి చేతులుకడుక్కొని పమిటకొంగుకి తుడుచుకుంటూ సావిట్లోకి వచ్చింది. సామాను లోపలపెట్టి, రిక్షావాడికి డబ్బులిస్తున్న భర్త చిక్కిపోయినట్లు కనిపించాడు పార్వతికళ్ళకి. స్త్రీలో స్త్రీత్వమే కాకుండా మాతృత్వం కూడా వుందన్నసంగతి చాలామంది భర్తలు యెరగరు. కాని ఆనందరావు అలాం కాదు. వెనక్కి తిరిగి తనపార్వతి బంగారుమోము, ఆ మొగము మీద మెరిసే ఆరుద్రపురుగులాంటి కుంకుమబొట్టూ కనిపించే సరికి, ఎలాగైనా ఆంధ్రభామల తీరే వేరు అనిపించింది, ఆ హిస్టరీ లెక్చరర్ ఆనందరావుగారికి. "యాత్రతీరు కాబోలు మొగంమీద కనిపిస్తోంది." అని నవ్వింది పార్వతి.

"చెడితిరిగారా? నయం చెడి తిరిగారు కాదు!"

"నీలాంటి పార్వతులు దొరకనివాళ్ళంతా చెడ తిరుగు తారుగాని నాకేం ఖర్మం?"

"నాకేం ఖర్మం అని ధీమాగా అంటున్నారు కాని గ్యారంటీ ఏమిటి? అన్నట్లు చెప్పటం మర్చిపోయాను. తమ్ముడు దిగాడు" అన్నది పార్వతి.

ఆ మాటతో ఇందాకటినుంచి తలుపుచాటున పొంచి వింటున్న రాజుకి బయటికిరాక తప్పలేదు. "ఏమిటన్నయ్యా! అటకమీద పిల్లిలాగా అలాచూస్తావు. వచ్చింది మీ అన్న భార్యగాని పులికాదుగా!" అన్నది పార్వతి.

"ఎప్పుడొచ్చావురా? పరీక్ష బాగ వ్రాశావా?" అన్నాడు ఆనందరావు.

"బాగానే వ్రాశా నన్నయ్యా! ప్యాసవుతానని ధైర్యం వుంది. పేపర్లూ తేలికగానే వున్నాయి" అన్నాడు వినయంగా రాజు.

"పేపర్లు తేలికగానే వుంటయ్యిగా! మణుగుబరువు ఏం వుండవుగదా!" అంది పార్వతి. "ఏ వదినా! నువ్వూ మరీను" అంటూ రాజు అవతలకి వెళ్ళాడు. "లేవండి స్నానం చేద్దురుగాని" అంటూ తువాల భుజంమీద వేసుకుని ముందుకు నడిచింది పార్వతి.

విజయవాడలో కంట్రాక్టరు కుటుంబరావుగార్ని ఎరగనివారుండరు. ఆయన అందరిలాగా అన్యాయార్జితం చేయలేదని చెప్పుకుంటారు. బహుశా అందుకనే ఆయన ఎక్కువగా సంపాదించాడేమోకూడా. విజయవాడలో ఒక పెద్దమేడా, రామవరప్పాడులో నివేశనస్థలాలూ కాక స్వగ్రామంలో కూడా కొంత ఆస్తివున్నది. ఆయనకొడుకులే ఆనందరావూ రాజూను. ఆనందరావుకీ రాజుకీ పదునాలుగేళ్ళు వారవుంది. తల్లి

పోగొట్టుకున్న ఆ పిల్లలకే ఏలోటూ రాకుండా పెంచాడు కుటుంబరావుగారు.

ఆనందరావు యం. ఏ. ప్యాసయి, తండ్రి పలుకుబడి వల్ల వున్నవూరు విజయవాడలోనే లెక్చెరరుగా పనిచేస్తున్నాడు. ఆ ఇంటి అదృష్టంవల్ల అత్యంతసౌందర్యవతీ అణకువగల ఇల్లాలూ పార్వతి కోడలుగా అడుగుపెట్టటంతో తన భాగ్యంపండిందనుకున్నారు కుటుంబరావుగారు. ఏరోజునైతే సర్వసౌభాగ్యాలతో పార్వతి తన ఇంటి పార్వతిలాగా అడుగుపెట్టిందో ఆ రోజు నే ఇనప్పెట్టితాళంచెవితో పాటు అమాయకులైన తన ఇద్దరుకొడుకుల భారాన్ని పెద్దవాడైన తన బాధ్యతల్ని కూడా ఆమె భుజస్కంధాలమీద మోపి నిశ్చింతుడైనాడు కుటుంబరావుగారు.

పార్వతి కాపురానికి వచ్చేసరికి రాజుకి పదహారేళ్లు. తన కంటె నాలుగుసంవత్సరాలు మాత్రం చిన్నవాడైన తన మరిదిని తల్లి లేనిలోటు మరిపించ చేసింది. రాజుకి వదిన అంటే కనకదుర్గ అపరావతారం. ఆమెనడిచిన స్థలం పరమపవిత్రం. ఇంకెందుకు? ఆమె ఒక దేవత.

సంపుమనిషిని పెట్టుకునే తాహతు వుండి కూడా ఇంటి పన్లన్ని తనే చేసుకుంటుంది. ఎందుకమ్మా యీ చాకిరీ అంతా నీవే చేయటం అన్న మామగారి మాటలకు జవాబియ్యకుండా చిరునవ్వు నవ్వి వూరుకునేది. ఇప్పటికి పార్వతి కాపరానికి వచ్చి ఎనిమిదేళ్ళయింది. ఈ ఎనిమిది సంవత్సరాల్నించి సంసారం సాఫీగా నడిచిపోతోంది. రాజు మద్రాసులో లా చదువుతున్నాడు. మరిది ఇంటికివచ్చి పోగొట్టుకోవాలని

పార్వతి కోరిక. మామగారు నిరుడు పోయినదగ్గరినించీ పెద్ద లోటుగావుంది. ఆయన చనిపోతూ రాజుకి పవిత్రమైన లోటూ రాకుండా చూస్తానని పార్వతిచేత మాటతీసుకొని చనిపోయి నాడు. పెద్దకోడలి కడుపు ఫలించలేదనే దిగులుతో [illegible] చనిపోయినాడు. ఉన్న పెద్దదిక్కు రాలిపోవటంతో [illegible] పడుతూ పరధ్యానంమనిషి. అయిన [illegible] పాటు, అమాయికత్వమే కాకుండా [illegible] యిత్యంకు [illegible] మీద పడింది.

ఇంగ్లీషు లెక్చరుగారి చెల్లెల్ని రాజుకి [illegible] లని అనుకుంటానని కోరిక అలాగే వుండగా, రాజు [illegible] యిత్యం చేసి [illegible]. ఇప్పుడు [illegible] సర్దుకురావటం సమస్యగానే తోచింది పార్వతికి. [illegible] ముఖ్యం అమాయకంగా సత్యవతి [illegible] దూరం వచ్చింది. ఆమెకూడా తనలాగే ఆడపిల్ల. ఆ [illegible] అన్యాయంచేయటం భావ్యంకాదు.

పైగా తనిప్పుడు గర్భవతి. మనిషి [illegible]. సత్యవతి ఆప్తురాలుగా, తనచెల్లెలుగా, ఈ యింటి చిన్నకోడలుగా తనకి ఆదుకుంటుంది. తనభారం కొంత ఆమెమీద వేస్తే తనకే సుఖంగానే వుంటుంది. తన భర్త కోపం తనకు తెలుసు. అతనిదగ్గర యీ ప్రస్తావన యెలా తేవాలో అర్థం కావటంలేదు. సత్యవతి పొద్దుటినించీ బావగారికి కనపడకుండా తిరుగుతోంది పాపం! ఎంతసేపు అలా తిరుగుతుంది? పైగా ఆ పిల్ల పుట్టుపూర్వోత్తరాలు తను తెలుసుకోలేదు.

ఆమె పరిస్థితి చూస్తే పెద్దకుటుంబంపిల్లలాగానే వుంది. అన్న గారు సెలవుపెట్టి వారంరోజులు అజంతా ఎల్లోరాల దర్శ నార్థం వెళ్ళాడని విన్న రాజు, ఇదే సమయమని సత్యవతితో సహా దిగాడు. ఇప్పుడేంచేయాలో రిహార్సలు వేసుకుంటోంది పార్వతి.

కనకదుర్గాలయంమీద వెలిగించిన దీపాలవరుసలు, హిందువైన ప్రతివాడి హృదయంలోనూ ఏదో తెలియని పూజ్యభావాన్ని కలిగిస్తయ్. కిటికీలోంచి ఏకదీక్షతో గుడి వంకచూస్తున్న పార్వతికి కళ్ళనిండా నీరు నిండింది. వెన్నెలా వీధిలైటు కాంతీ రెండూకలిసి పసుపూ తెలుపూ కలిసిన మసకకాంతిగా కిటికీలోంచి గదిలోకి ప్రవహిస్తున్నది. ఆ మసక వెలుతురు పార్వతినుదుటిమీద పడి ఆమె సిందూర రంజితఫాలతలం సుమనోహరంగా వెలిగిపోతున్నది. జయజయ వైష్ణవిదుర్గే అన్న వాక్యాలు పార్వతికి జ్ఞాపకంవచ్చినయ్. అప్పుడే గదిలోకి వచ్చిన ఆనందరావు పార్వతి సౌందర్యానికి ముగ్ధుడైనాడు.

భర్తకి తమలపాకులు అందిస్తూ ఎన్నోసార్లు రాజు విషయం చెప్పాలనుకుంది. కాని ఆమెకి భయంవేసింది. అనేక విషయాలు మాట్లాడిందికాని ఆ విషయం ఎత్తలేదు. ఈసారి రాజుకు పెళ్ళిచేయాలని ఆనందరావు అన్నప్పుడైనా ఆ సంగతి చెప్పడానికి పార్వతికి ధైర్యంచాలలేదు. ఆరోజు వారు నిద్రపోయేసరికి రాత్రి ఒంటిగంట అయింది.

తెల్లవారింది. ఉదయాన్నే లేచి స్నానానికివచ్చిన ఆనంద రావుకి ఎవరో అపరిచితులు తననిచూసి తప్పుకుపోవడం కని

సించింది. పార్వతిని పిలిచి ఆ అమ్మాయి ఎవరో తెలుసు కుందామనుకుంటున్న ఆనందరావుకి మందారచెట్టుదగ్గర పార్వతి వాంతిచేసుకుంటూ కనిపించింది. అదిచూసేసరికి ఆనందరావుకి అమితమైనభయంపుట్టింది. కాపరానికి వచ్చిన ఇన్ని సంవత్సరాలనుంచి ఇలాంటి విపరీతాలు జరగని ఆనందరావు రాజుని పిల్చి డాక్టరుని పిల్చుకురమ్మన్నాడు. పార్వతి వద్దు అని చెపుదామనుకుంటూండగానే రాజు సైకిలుమీద పరిగెత్తాడు. ఆ అన్నదమ్ములహడావిడి చూసి నవ్వొచ్చింది. ఇంతలో డాక్టరుగార్ని వెంటబెట్టుకు వచ్చాడు. డాక్టరు పార్వతిని పరీక్షచేస్తున్నంతసేపూ ఆ విద్యాధికులిద్దరికీ ప్రాణం పేనా. "ఆనందరావుగారూ! మీరు తండ్రికాబోతున్నారు" అని చెప్పి డాక్టరు తనదారిన తాను పోయాడు. కొన్ని క్షణాలకిగాని డాక్టరు ఏంచెప్పిందీ ఆనందరావుకి అర్థం కాలేదు. అర్థమయిన వెంటనే పార్వతిగదిలోకి పరిగెత్తి నిజమేనా పార్వతీ అన్నాడు. ఆనందరావుప్రశ్నకి సిగ్గుతో కళ్ళు మూసుకుంది పార్వతి.

పార్వతీ నీకేం కావాలో కోరుకో అన్న ఆనందరావు మాటలకి పార్వతికి అమోఘమైన ఆలోచన తట్టింది. లేచి కూర్చుని "నిజంగానా?" అన్నది.

"నిజంగానే!"

"మాటతప్పరు గదా?"

"నాసంగతి తెలియదా?"

"అలా అయితే రాజుని క్షమించాలి?"

"ఎందుకూ?"

"అతను మనకు తెలియకుండానే పెళ్ళి చేసుకున్నాడు. ఇందాక మీరుచూసిన పిల్లే ఆ అమ్మాయి."

ఆశ్చర్యపోయిన ఆనందరావు అయిదునిముషాలు మాట్లాడలేదు. ఇదే సమయమని పార్వతి ప్రారంభించింది.

"ఇదుగో చూడండి, ఆ అమ్మాయి సాటివాళ్ళ పిల్లే గాని పరాయిది కాదు. ఇక కట్నం అంటారా?ఏం రాకపోతే. మనకి ఇంతఉంది. ఆ కట్నంవచ్చి మనల్ని ఉద్ధరించాల్సిన అవసరంలేదు. ఏదో యిష్టమయిచేసుకున్నాడు. చిన్నతనం వల్ల మనకి చెప్పలేకపోవటం తప్పే అయినా ఏం చేస్తాం. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. ఊరుకుందురూ, అదృష్టం ఉంటే పెళ్ళి బాగుంటారు" అన్నది. "సరే నీయిష్టం" అన్నాడు ఆనందరావు.

ఈవిధంగా సత్యవతికి ఆ ఇంట్లో స్థానం ఏర్పరచింది పార్వతి.

సత్యవతి మద్రాసులో ఇంటరుదాకా చదివింది. ఆమె అన్నగారు ఏదో [illegible] లో మేనేజరుగా ఉంటున్నాడు. [illegible] ప్రసన్నరావు సత్యవతిని ప్రేమించాడు. [illegible] ఆ [illegible] గారు, [illegible] సత్యవతి [illegible] [illegible] మూడుముళ్ళూ వేయించి, [illegible] [illegible] పంపులాంటివి [illegible] [illegible] సత్యవతి అన్నగారూ వదినగారూను.

(2)

పించింది. పార్వతిని పిలిచి ఆ అమ్మాయి ఎవరో తెలుసుకుందామనుకుంటున్న ఆనందరావుకి మందార చెట్టుదగ్గర పార్వతి వాంతిచేసుకుంటూ కనిపించింది. అదిచూచేసరికి ఆనందరావుకి అమితమైనభయంపుట్టింది. కాపరానికి వచ్చిన ఇన్ని సంవత్సరాలనుంచి ఇలాటి విపరీతాలెరుగని ఆనందరావు రాజుని పిల్చి డాక్టరుని పిల్చుకురమ్మన్నాడు. పార్వతి వద్దు అని చెప్పదామనుకుంటూ ఉండగానే రాజు సైకిలుమీద వెళ్ళిపోయాడు. ఆ అన్నాచెల్లెళ్ళ హడావిడి చూసి నవ్వొచ్చింది. ఇంతలో డాక్టరుగార్ని వెంటపెట్టుకుని వచ్చాడు. డాక్టరు పార్వతిని పరీక్షచేస్తున్నంత సేపూ ఆ విద్యాధికులిద్దరికీ పాలిపోయింది. "ఆనందరావుగారూ! మీరు తండ్రికాబోతున్నారు" అని చెప్పి డాక్టరు తనదారిన తాను పోయాడు. కొన్ని క్షణాలకిగాని డాక్టరు ఏంచెప్పిందీ ఆనందరావుకి అర్థం కాలేదు. అర్థమయిన వెంటనే పార్వతిదగ్గిరకి వచ్చి నిజమేనా పార్వతీ అన్నాడు. ఆనందరావు ప్రశ్నకి సిగ్గుతో తలవంచుకుంది పార్వతి.

పార్వతీ నీకేం కావాలో కోరుకో అన్న ఆనందరావు మాటలకి పార్వతికి అమోఘమైన ఆలోచన తట్టింది. మది కూడుకొని "నిజంగానా?" అన్నది.

"నిజంగానే!"

"మాటతప్పరు గదా?"

"నాసంగతి తెలియదా?"

"అలా అయితే రాజుని క్షమించాలి?"

"ఎందుకూ?"

"అతను మనకు తెలియకుండానే పెళ్లి చేసుకున్నాడు. ఇందాక మీరుచూసిన పిల్లే ఆ అమ్మాయి."

ఆశ్చర్యపోయిన ఆనందరావు అయిదునిముషాలు మాట్లాడలేదు. ఇదే సమయమని పార్వతి ప్రారంభించింది.

"ఇదుగో చూడండి, ఆ అమ్మాయి సాటివాళ్ల పిల్లే గాని పరాయిది కాదు. ఇక కట్నం అంటారా? ఏం రాకపోతే. మనకి ఇంతఉంది. ఆ కట్నంవచ్చి మనల్ని ఉద్ధరించాల్సిన అవసరంలేదు. ఏదో యిష్టమయి చేసుకున్నాడు. చిన్నతనం వల్ల మనకి చెప్పకపోవటం తప్పే అయినా ఏం చేస్తాం. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది. ఊరుకుందురూ, అదృష్టం వుంటే వాళ్లే బాగుంటారు" అన్నది. "సరే నీయిష్టం" అన్నాడు ఆనందరావు.

ఈవిధంగా సత్యవతికి ఆ ఇంట్లో స్థానం ఏర్పరచింది పార్వతి.

సత్యవతి మద్రాసులో ఇంటరుదాకా చదివింది. ఆమె అన్నగారు ఏదో కంపెనీలో మేనేజరుగా ఉంటున్నాడు. వీళ్ళున్న ఇంటికిందనే వున్న రాజు సత్యవతిని ప్రేమించాడు. ఆ ప్రేమ ముసుముసుగా చెలియలికట్ట దాటేసరికి, ఆ మెఅన్న గారు, రాజుకీ సత్యవతికీ ఓ టాక్సీలో వెళ్ళి తిరుపతి వెంకటేశ్వర సన్నిధానంలో మూడుముళ్ళూ వేయించి, తీసుకొచ్చాడు. కట్నం బాధ లేకుండానే పండులాంటి కుర్రాణ్ణి సాధించినందుకు సంతోషించారు సత్యవతి అన్నగారూ వదినెగారూను.

తెల్లవారితే పోలాలమావాస్య. కిందటిరాత్రి అరటి పట్ట తెచ్చి సీసామూతతో చిన్న కంతలుచేసి నేతితో ఒత్తులు తడిపి వాటిల్లో పెట్టింది పార్వతి. మూతవున్న మేదరిబుట్టలో పసుపు, కుంకుమ, పూలు; ఒక రాగిచెంబులో బియ్యంపోసి సిద్ధంగా ఉంచుకుంది.సత్యవతికి తోడికోడలి వ్యవహారం అర్థం కావటంలేదు "ఎందుకక్కయ్యా ఇవన్నీ?" అని అడిగితే "నువ్వే చూస్తావుగా"అని నవ్వి వూరుకుంది పార్వతి.

అలానవ్వి వూరుకున్నప్పుడు ప్రపంచంతలక్రిందులైనా పార్వతి మళ్ళీ జవాబుచెప్పదని సత్యవతి తన అనుభవంవల్ల గ్రహించింది. అందుకని మళ్ళీ అడుగలేదు. తెల్లవారుజామున నాలుగయింది. పార్వతి అప్పటికే లేచి అన్నిపనులూ పూర్తి చేసుకొని పట్టుచీర పట్టురవికా సంచిలో పెట్టుకొని సత్యవతిని లేపింది. సత్యవతికి కొంచెం విసుగనిపించింది. పార్వతిమాటకు ఎదురుచెప్పగమ్ము ఆ ఇంట్లో ఎవ్వరికీ లేదని వచ్చిననాడే తెలుసుకుంది. సత్యవతి లేచి మొగంకడుక్కుంటూవుండగా పక్కింటి సీతారామమ్మగారి కేక వినిపించింది.

"ఏమమ్మోయ్ పార్వతమ్మా! తెల్లారిపోతోంది.ఇంకా పట్నంపిల్ల నిద్రలేవలేదా ఏమిటి" అంటూను.

ఆ కేకతో సత్యవతి గబగబా మొగంకడుక్కుని తోటి కోడలిదగ్గిరకొచ్చి నిలబడింది. చిరునవ్వుతో సత్యవతిని చూసి "పదండి చిన్నగారూ" అంది పార్వతి.

ఇంకా చీకటిగానే వుంది. దీపాలు వెలుగుతూనే వున్నయ్యి. లోబ్రిడ్జి మెర్క్యురీదీపాలవెలుగు పట్టపగలులావుంది.

కాళేశ్వరరావుమార్కెట్టూ, సుభాస్‌చంద్రబోస్ స్టాచ్యూ దాటారు. చలివణికించివేస్తోంది. అప్పటికే దారిలో ఎంతోమందికలిశారు. వీళ్లందరికి ఏమిటీచాదస్తం? అనుకుంది సత్యవతి. వినాయకుడివిగ్రహం, రథందాటి క్రిష్ణమెట్లదగ్గర కొచ్చారు. నల్లని చీకటిలో నల్లనినదిలో దీపాలు అప్పటికే వదిలారు. అరటిపట్టల్లో వెలిగే ఆత్మల్లాగ మెల్లిగా సాగి పోతున్నాయి దీపాలవరుసలు. అప్పటికే క్రిష్ణఅంతా జనంతో నిండిపోయి వుంది. పార్వతీ సీతారావమ్మగారూ ఒకచోట బట్టలు పెట్టి నదిలో స్నానానికిఉపక్రమించారు. "ఉత్తమునిషివి కూడా కాదు పార్వతమ్మా! ఈ ఏడు మానేస్తేఏంపోయింది?" అన్నది సీతారామమ్మగారు. "ఏ సంవత్సరం మానితే ఆ సంవత్సరం మళ్ళీ రాదు పిన్నిగారూ" అంది పార్వతి.

మహాబలిపురం ఎక్స్‌కర్షన్, సముద్రస్నానంకన్నా ఈ మురికినీళ్ళు, కొల్లాయిగుడ్డల బ్రాహ్మలూ ఏంబావున్నారు అనుకుందిసత్యవతి. ఆమాటేపైకిఅందికూడా. "ఏమిటీచాదస్తం పిన్నిగారూ ? మద్రాసులో సరదాగా స్నేహితులతో సముద్ర స్నానం చేసినట్లు ఇక్కడలేదు. హాయిగా కారుమీద వెళ్ళి కారుమీద వచ్చేవాళ్ళం. ఇక్కడ ఈ చలిలో నడిచివచ్చి చన్నీళ్ళస్నానంచేస్తే ఏంసుఖం?" అంది. సరదావిషయాల్లో ఏమోకానిస్నానంవిషయంలోమాత్రం సముద్రం బాగుండదు. అంతమటుకు తెలుసు పార్వతికి. పవిత్ర క్రిష్ణానదిముందు ఏదీ పనికిరాదు. ఈ ముక్కలు పైకి అనలేదు పార్వతి.

"పార్వతమ్మా! ఇక్కడున్నారా తల్లీ" అంటూ ముసలి పురోహితుడు పురుషోత్తంగారు వచ్చారు. ఆయన మంత్రం

చదువుతుంటే పార్వతి తన్మయత్వంతో తానే నదినై నదియే తానై స్నానంచేస్తోంది. స్నానం పూర్తయి పూజమొదలు పెట్టేసరికి తెల్లవారవచ్చింది. సీతానగరం కొండచాటునుంచి బాలభానుడు తెలుగు సంస్కృతికి గులాబిరంగు వేస్తున్నాడు ఆ విచిత్రకాంతిలో ఆ కొండలు, అఖండ కృష్ణానదీ, వాటి సౌందర్యమూ చాలా విచిత్రంగావుంది సత్యవతికి. అంతేకాదు, తన [illegible]లు తన్మయత్వంకూడా. ఆరోజే గ్రహించింది పార్వతి సత్యవతికి కొంచెం అతిశయోక్తులు చెప్పటం అల వాటని. రాజుబోర్డుకట్టాడు. కొద్దిగా ప్రాక్టీసుకూడా అందు కున్నట్లే చెప్పవచ్చును. సత్యవతికి వంటచేతకాదు. అందుకనే ఆరవనెల వచ్చినాకూడా పార్వతే రెండుపూటలా వంట చేస్తోంది. ఆనందరావుకి ఇది నచ్చలేదు. అందుకే పార్వతితల్లికి రమ్మని వుత్తరం వ్రాశాడు. రాజు ఎవరోపిల్లను పెళ్ళిచేసు కొచ్చాడని బంధువులంతా మొదట అల్లరి ప్రారంభించారు. కాని కులం ఒకటేనని తెలిసినతరువాత పార్వతివల్ల భయం చేత ఎవరూ నోరెత్తలేదు. ఈ మూడు నెలల్లో ఆ దుమారం సాంతం అణిగిపోయిందనే చెప్పవచ్చును.

అసలు కొందరు పుడుతూనే దేవతాంశతో జన్మిస్తారు. వాళ్ళున్నచోట వారిఅధికారానికి లోటు ఎన్నడూ రాదు. ఏమనిషైనా వారి చల్లనిపర్యవేక్షణలో సుఖపడతానని ఒప్పు కోవాలి. మంచిని చెడునీ కూడా ఒకేత్రాసులో హెచ్చు తగ్గులు లేకుండా తూచి పంచుతారు వాళ్ళు. వాళ్ళ పర్య వేక్షణలో ఉండటంకూడా అదృష్టమే! ఎవరినీ వాళ్ళు ఏవిధముగాను కించపరచని దేవతామూర్తులు వాళ్ళు. పార్వతి

కూడా వాళ్ళల్లోఒకతె. రేపు పార్వతికి సూడిదలుఇచ్చేరోజు. ఆమెతల్లి రాజమ్మగారు సరంజామాతో ఈ రోజే దిగింది. ఆ ఇంట్లో అక్కా అక్కా అంటూ అప్యాయంగాతిరిగే సత్యవతిని చూస్తే ఆమె కెందుకో ముల్లుగుచ్చుకున్నట్లయింది.

తను తెచ్చిన సామాగ్రినీ చీరాంవికల్ని సీతారామమ్మ గారికీవారికీ ప్రదర్శిస్తోంది రాజమ్మగారు. "అక్కయ్యగారూ!ఆచీర ఏభైరూపాయిలయింది. ప్రత్యేకం నేయించి తెప్పించాను సుమా!" అంది రాజమ్మగారు. "బాగుందమ్మా" అంది సీతా రామమ్మగారు. "ఈఖరీదు పెడితే చక్కని సిఫాన్ ఏం వచ్చును. మామదాసులో చీరలున్నట్లు ఇంకెక్కడా వుండవు పిన్నిగారూ" అంది సత్యవతి.

'అయ్యోతల్లి! ఏంవిడ్డూరం!ఇంక మాట్లాడే ప్రాప్తిలేదు కాబోలు. మీరంతా చదువుకొన్న పిల్లలు కనుక ఆచీరలు కట్టుకుంటూరు పార్వతి కెందుకు?' అని దీర్ఘంతీసింది రాజమ్మగారు. "ఏంచదువుకోకపోతే, అక్కయ్యకన్నా తెలిసినవాళ్ళు న్నారా ఎక్కడన్నా ?" అంది సత్యవతి.

"అయ్యోరామ ... అయితే పిన్నిగారూ, లడ్లు ఇంకా చేయించాలా! రెండువందలు సరిపోతయ్యా? మదాసులో అయితే చక్కగా కొబ్బరికాయ, పండు సంచిలోవేసిస్తారు. ఇక్కడేమిటో కాళ్ళకు పసుపు పూయటమూ మొఖాన పసుపు పూయటమూనా. మనంఅలాచేద్దామా? రేపు, "ఏంఅమ్మగారు?" అని మళ్ళీఅందుకుంది సత్యవతి. ఈపిల్ల ఇలా మాటిమాటికి అడ్డురానటం రాజమ్మగారికి సుతరామూ ఇష్టం లేక పోయింది. ఏమంటానికీ వీలులేక అక్కడనుంచి పార్వతి

న్నారు కాబోలు! ఈ కేబేజీ ఉత్తగడ్డిలావుంది. మా మద్రాసులో కేబేజీ ఎంత రుచిగా వుంటుందనుకున్నారు" అంది సత్యవతి.

ఆ పిల్లను రెచ్చగొట్టి యింకా కొంత మాట్లాడించాలనుకుంది రాజమ్మగారు. ఆ మాటలు యెవరయినా వినటం తటస్థిస్తే ఈ సత్యవతిని ఆక్షేపించకమానరు. అదీ ఆవిడ ఉద్దేశ్యం. అందుకనే యిలా అంది, "ఏమోనమ్మా. మాయ దారి ఎరువులూ పట్నంసరుకూ ననుకో" అంది. దాంతో సత్యవతికి యెక్కడలేని ఉషారుపుట్టుకొచ్చి యిక ఆరంభించింది.

"మరేనండి... అసలు మద్రాసు మద్రాసేనండి. మా వదిన యీ కేబేజికూర జీడిపప్పులతో సహా వండుతుంది. ఎంత రుచిగా వుంటుందనుకున్నారు! ఆ రోజు అన్నయ్య మధ్యాహ్నం ఫలహారంకూడ అదేచేస్తాడు. అంత బావుంటుంది.... ఉడ్‌లాండ్స్‌లో భోజనంలాగ మా అన్నయ్యకు ప్రతిరోజూ నిండుగా విస్తరినిండా నాలుగు వుండాలి" అన్నది. వాళ్ళవదినె కూరగ బాగా వండుతుందన్నమాటకి రాజమ్మగారికి ఒళ్ళుమండినాగాని సత్యవతిని ఫ్రూల్ చేయాలన్న వుత్సాహంతో "అలాగా" అంది ఆశ్చర్యార్థకం మొహంపెట్టి.

దాంతో మరింత ఉషారువచ్చింది సత్యవతికి. ఇంతలో పక్కింటి సీతారామమ్మగారు పనిమీదవచ్చి "ఏంచేస్తున్నారమ్మా!" అంది. "ఆ ఏంలేదు. మా సత్యవతమ్మ ఏదో పట్నం కబుర్లు చెపుతుంటేనూ" అని వెటకారంగా నవ్వింది రాజమ్మగారు. ఆవిడ నవ్వును అర్థంచేసుకున్నట్లు సీతారామమ్మగారు

కూడ వచ్చే నవ్వును ఆపుకొని ఏంకబుర్లు సత్యవతీ! అంది. అమాయకపు సత్యవతి ఏదో చెప్పటానికి నోరు తెరచింది. ఇందాకటినుంచీ బద్ధకంగా గదిలో పడుకున్న పార్వతి యీ నాటకం అంతా వింటూనేవుంది. ఇంక వూరుకుంటే సాగేట్టులేదు. "సత్యవతీ" అని కేకవేసింది "అక్కయ్యా" అంటూ సత్యవతి గదిలోకి వెళ్ళింది. పార్వతి వేసిన కేకనుబట్టి తమ కుళ్ళుబుద్ధిని గ్రహించిదన్న సంగతి సీతారామమ్మగారికి అవగాహనఅయి "వెళ్లొస్తానమ్మా" అని వెళ్ళిపోయింది.

రైనస్ కాలువవడ్డున మెల్లిగానడుస్తున్నాడు రాజు. బళ్ళూ, రిక్షాలూ, కొబ్బరికాయలబేళ్ళు మాత్రమే అయితే యెలాఅయినా తప్పించుకోవచ్చును. బిచ్చగాళ్ళు, కూలివాళ్ళను తప్పించుకోవటం కష్టంగావుంది. అక్కడ పరీక్షగా చూస్తే కుడివైపున [illegible] ఎడమవైపున [illegible] ఒకరు భరత నాట్యం, మరొకరు కథకళీ చేస్తున్నారు. రాజు ఆలోచిస్తూ వంతెనదాటి మెల్లగా కృష్ణానదికేసి నడిచి ఒక బెంచిమీద కూర్చున్నాడు. సాయంత్రం అయిదయింది.

కృష్ణ ఆనకట్టమీంచి కొద్దిగావుంది. ఇవతలపాయ ఎండి పోయింది. మధ్యమధ్య చెలమలుగావున్న నీరు సూర్యకాంతి ప్రతిఫలించి అద్దాలలాగ మెరిసిపోతూ పంచరంగులన్నీ విడుదలచేస్తున్నాయి. మధ్యమధ్యవున్న ఇసుకదిబ్బలు మనిషి అడుగుపడనిచోట నవయువతి నితంబంలాగ మనోజ్ఞంగా ఉన్నయ్యి. మనిషిఅడుగుపడ్డచోట ఆ అందాలు చెరిగి పోయినయ్యి. రాజు తన ఆలోచనల్లో వున్నాడు. ఎంత సుందర దృశ్యమయినా రోజూ చూస్తుంటే అలవాటుగు

పోయింది. రాజుకి సత్యవతిని అర్థంచేసుకోవటం కష్టంగావుంది. తను ప్రేమించిన సత్యవతికీ ఈ సత్యవతికి భేదం కనిపిస్తోంది. అయినా తనూ సత్యవతిని అనివార్యపరిస్థితుల్లో పెళ్ళిచేసుకున్నాడు గాని నిజంగా ప్రేమించలేదనిపిస్తోంది. పైగా ఆ పిల్ల ఏమాట మాట్లాడినా తనకి న్యూనతగానే వుంటోంది. మొన్న దుగ్గవరం రైతులిచ్చిన ఫీజుపెట్టి ఒదినకీ సత్యవతికీ చెరో చీరా తీసుకెడితే ఒదిన సంతోషించింది. సత్యవతి "ఏం బాగుంది, మా అన్నయ్య తెచ్చిన చీరలాగాలేదు" అన్నది పుటుక్కున. ఒదిన తనవంక జాలిగా చూడకపోతే ఒకచెంప కాయ తగిలిద్దామనుకున్నాడతను. ఒదిన తనవంక ఆజ్ఞాపూర్వకంగా చూడటంతోనే తను నోరుమూసుకొని, అవతలకు పోవాల్సివచ్చింది. ఇదేకాదు. ప్రతిదీ అంతే. మొన్న యేదో ఇంగ్లీషుమాటకి అర్థం అడిగితే తనకీ జ్ఞాపకంలేక డిక్షనరీ చూసుకోమన్నాడు. దాంతో "యింతేనా, "లా" చదివారు! మా అన్నయ్య అయితే యెంతమాటకన్నా తడుముకోకుండా చెప్పేస్తాడు" అంది. తన మనస్సు చివుక్కుమంది దాంతో. తన కెందుకో ఆ పిల్ల అంటే మనస్సువిరిగిపోతుంది. రాజు బరువయిన మనస్సుతో ఇంటిముఖంపట్టాడు.

రక్తబిందువులాగా మెరుస్తున్న కుంకుమబొట్టును సరిదిద్దుకుంటున్న పార్వతి "ఏమే అమ్మాయి" అన్న తల్లిపిలుపు వినిపించేసరికి వెనక్కు తిరిగిచూసింది. "మరి రేపు బయలుదేరితే ఓ రెండునెలలు వుండి రావచ్చును. పురుడు అక్కడ పోద్దామంటే బొత్తిగా పల్లెటూరాయె. పురిటిరోజులు రాకమును పే ఓ రెండు నెలలువుంటే బాగుంటుంది" అన్నది. పార్వతిగుండె

గతుక్కుమన్నది ఆ మాటలతో! ఈ ఇంట్లోనించి తనీ సమయంలో వెడితే సత్యవతి కాపురం యెలాచేస్తుందో తెలియదు. పైగా యీామధ్య రోజూ సత్యవతీ రాజూ ఏవోమాటలనుకుంటూనే వున్నారు. దానికి సగంకారణం తన తల్లి అని తెలుసు పార్వతికి. ఈ సమయంలోనే తనవాళ్ళను విడిచి పెడితే ఉద్వేగపరిశ్రుతులైన ఆ అమాయకులిద్దరు ఏ అఘాయిత్యంచేసినా చేయవచ్చును. పార్వతి ఈ ఆలోచనలన్నీ ఆలోచించి "ఈ రెండు నెలలు నీవే వుండిపోరాదుటమ్మా, ఎందుకు అనవసరంగా అక్కడికి" అన్నది. "అయ్యో నాతల్లి! అనవసరం ఏమిటే? పుట్టింటికి రావటం అనవసరమా? ఏమిటి, ఒక్క పిల్లని, ఇంట్లో నాలుగురోజులుంటే నాప్రాణం సంతోషిస్తుంది. అయినా నీ తోడికోడలు వుందిగా. ఇంటిబెంగ కూడా అక్కరలేదు." అని వెటకారంగా నవ్వింది రాజమ్మగారు. ఏమాట అంటే వారికిమాత్రమే తగిలి యితరులకు అందులో ఏ తప్పూ కనిపించదో అలాంటి మాటలనటం రాజమ్మగారి ప్రత్యేకత. ఆవిడ చేసిన అపహాస్యం పార్వతిక గుండెల్లో గుచ్చుకుంది. ఆ తోడికోడలు వుందిగా. ఇంటిబెంగకూడ అక్కరలేదు అన్నమాటలో యెవ్వరికి ఏ తప్పు కనిపించదు. నిజమేకాని ఆ మాటలు, ఎవరిని ఉద్దేశించి అంటే వాళ్ళకు ఆ అక్షరాలు ముళ్లుగా మారి గుచ్చుకొంటయ్యి. సత్యవతి అసమర్థతనీ, అసత్యాలనీ అన్యాపదేశంగా యెత్తిపొడిచిందని, సాక్షాత్తు ఆ విరించికూడ తెలియదు. ఈ నెలరోజులనుంచి సత్యవతితాలూకు అన్ని బలహీనతల్ని అన్నికోణాలనుంచీ, ఫొటోతీసి, అందరికి ప్రదర్శించింది రాజమ్మగారు. అందులో

ముఖ్యంగా రాజుకి కనిపించేలాగ చేయడమే ఆవిడ పనిగా పెట్టుకున్నది అంటే అతిశయోక్తి కాదు. జీవితంలో రాజులాంటి వాళ్లుకొందరు కనిపిస్తారు. వాళ్ళకి యెదటివాళ్లు చెప్పిందాంట్లో అసంభావ్యమేమీ కనిపించదు. ఏదయినా జరగటానికి అవకాశం వుందా? లేదా? అని వాళ్ళెన్నడు ప్రశ్నించుకోరు. ఆ ఎదటి వాళ్ళ నేర్పునిబట్టి ఆ విషయాన్ని వాళ్లు కొంచెం ఎక్కువ తక్కువలుగా నమ్ముతారు. కాని అసలు నమ్మటం అనే విషయంలో అపనమ్మకం యేమీ లేదు.

ఈ రాజుసంగతి పార్వతికి తెలుసు. అందుకే ఆమె భయపడ్డది. కాని ఆనందరావుమీద అత్తగారి అధికారం ఉపయోగించి, పార్వతికి చెప్పించి ప్రయాణంకట్టించింది రాజమ్మగారు. అక్కడికీ ఆనందరావుక పరిస్థితులు చెప్పింది పార్వతి. ఆమెదగ్గర "అలాగా" అన్నాడు. అత్తగారు అడిగే సరికి, "అలాగే తీసుకెళ్ళండి" అన్నాడు. "నేనుమీకు చెప్పిం దంతా మర్చిపోయి తీసుకవెళ్ళమన్నారేమిటి?" అని పార్వతి. దబాయించేసరికి "ఏం చెప్పావూ?" అన్నాడమాయికంగా మొగంపెట్టి ఆ పరధ్యానం పంతులు. ఇక ఈయనతో లాభం లేదు అనుకొని పార్వతి ఓ పదిరోజులు వుండివద్దామని నిర్ణ యించుకొని, తల్లివెంట పుట్టింటికి వెళ్ళింది. సత్యవతికి వంట చేతకాకపోయినా చేయటం తప్పలేదు. బావగారికీ భర్తకీ పదింటికి భోజనం తయారుకావాలి. భర్తమాట ఎలావున్నా బావగారికి పదింటికి కాలేజీవుంది. మరి పొయ్యిలో నిప్పువేయ టందగ్గరనించి ఆమెకు కొత్తే. పార్వతి చేసేటప్పుడు దగ్గర వుండి చూడనందుకు కొంచెం విచారపడ్డది. పొయ్యిలో

మూడుకట్టెలు పడేసి వాటినెత్తిన నాలుగు నిప్పులు పోసింది. తను స్నానంచేసి వచ్చేసరికి పొయ్యి మండటలేదు సరిగదా పూర్తిగా ఆరిపోయింది. సత్యవతిరాజేస్తే నిమిషంలోమండేది. తనకు ఆరోజుల్లో పొయ్యిమండపెట్టటం అంత నేర్పుగా కని పించలేదు. ఏ పనిఅయినా అంతే. మొదాన్నించీ చూస్తే తేలి కగానే వుంటుంది. అలవాటయిన పనులన్నీ తేలికగానే వుం టుంది. అయితే ఈ మధ్యకాలములోనే లఘుగురుతాల్యాలు మనల్ని కంగారుపెడతాయి. సన్న చితుకులు వేసి గాలిపోసు సందువుంచి పుల్లలు పెడితే పొయ్యి మండుతుందన్న దేవ రహస్యం ఆ సత్యవతికి తెలియలేదు. చివరకు ఏదోకట్టి కుంపటినిండా చిన్నబొగ్గులు పేర్చి దానికూడా బియ్యం పడ వేసింది. నిండా బొగ్గులువేయటంవల్ల ఆ కుంపటికూడా సీధి పక్క ముసలమ్మలాగ కునికిపాట్లుపడుతోంది. అప్పటికే తొమ్మిదిన్నర అయింది. ఇక అరగంటలో పప్పు, పులుసు, పచ్చడి, కూర కావాలి. అన్నంమాత్రమే అయింది. కనుక గుండె గుభేలుమంది సత్యవతికి. ఇంతలో రాజు వంటఇంట్లోకి వచ్చి ఈ అవస్థచూశాడు. చూచి నవ్వాడు. ఊరుకోలేదు "ఏం డియర్! ఎందాకవచ్చింది వంట" అన్నాడు. ఆ వంట అన్న రెండుఅక్షరాలూ ఒత్తి పలకటంలో తన నైపుణ్యం అంతాచూపించాడు. ఈ విద్య రాజమ్మగారు నేర్పిపోయింది. సత్యవతికి కోపంవచ్చింది కాని ఏమిచేస్తుంది. మాట్లాడకుండా కుంపటి విసరటం ఆరంభించింది. రాజు మూతతీసిచూసి విరగ బడి నవ్వాడు. ఆ అన్నం వకపక్క వుడికింది. యింకో పక్క స్థిరంగా అట్లాగేవుంది. రాజు నవ్విన నవ్వుకు సత్యవతికళ్ళల్లో

నీళ్ళు తిరిగినాయి. రాజు ఆమెబాధ గమనించకుండానే గబ గబా ఆ గిన్నె దింపి కిందపెట్టి ఆ కుంపటిని సరిగ్గా మండేటట్లు చేశాడు. పెబ్బాలో అప్పడాలు ఒడియాలు తీసి వేయించాడు. వంకాయలు కాల్చి పచ్చిమిరపకాయలు, ఉప్పూ నూరి పచ్చడి చేశాడు. గిన్నెలో పెరుగు కొంచెం యింకో గిన్నెలో పోసి కొత్తిమీర వాము వేసి తిరుగమూత పెట్టి మెంతి పెరుగు చేశాడు. పీట వేసి కంచం పెట్టి అన్నగార్ని పిల్చుకరానటానికి వెళ్ళాడు. సత్యవతి యిదంతా చూసి వంట యింత తేలికా! అని ఆశ్చర్యపోయింది. పార్వతిశిష్యుడు రాజు చేసిన ఆ వంట చూసి వంటరాని ఏ ఆడపిల్లయినా తలవంచుకోవాల్సిందే. మొగవాళ్లుకూడ వంట చేయగలగాలి అనీ, ఆడపిల్లలుకూడ అవసరమైతే ఉద్యోగాలు చేసి కుటుంబాల్ని పోషించుకోవాలనీ, ప్రతివ్యక్తికి ఇంటా బయటా అన్నిపన్లూ చేయగలిగిన సామర్థ్యం వుండాలనీ పార్వతిసిద్ధాంతం. అది రాజుకికూడ నూరి పోసిందామె. ఆనందరావు వచ్చి పీటమీద కూర్చున్నాడు. బావగారొచ్చికూచున్నా, ముందేది వడ్డించాలో వెనుక ఏది వడ్డించాలో తెలియని సత్యవతికి మళ్ళీ రాజే శరణ్యమయి నాడు. తనుకూడ కంచం పెట్టుకుని అన్నం దగ్గర పెట్టుకుని రెండుకంచాల్లో వడ్డించాడు. ఆనందరావుకి ఏమిటిది? అని ప్రశ్నించాలన్న ఊహకూడ రాలేదు. పైగా మరదలు తన్ని చూసి, సిగ్గుపడుతున్నది కాబోలు. అందుకే తమ్ముడు వడ్డించాడు అనుకున్నాడతను. పైగా ఆ మెంతిపెరుగుయొక్క రుచిని గురించి అరగంటసేపు పొగిడి సత్యవతి బస్తీపిల్ల అయినా ఇంత చక్కగా వంట చేసినందుకు ఆనందిస్తున్నానని

రాజు ఆమాట అనేసరికి ఆమెకు ఆపలేని దుఃఖం వచ్చింది. పోయి ఏడుస్తూ పడుకుంది. తనెందుకు ఈయనతో అడ్డమయినమాటలు పడాలి. ఈయన స్వభావం తెలుసుకోకుండా తనూ అన్నయ్య తొందరపడ్డారు...నిజమే యెంత వాడుకాకపోతే అన్నకీ ఒదినకీ తెలియకుండా పెళ్ళిచేసుకోటానికి సాహసించాడు... అంతలో రాజు లోపలకువచ్చి పక్క వేయమన్నాడు. సత్యవతి లేవలేదు సరిగదా వినిపించుకోనన్నా వినిపించుకోలేదు. రాజు శాంతస్వభావికాదు. “నిన్నే! వినుపించుకోవేం?” అని గదమాయించాడు. దాంతో ఒళ్ళుమండింది సత్యవతికి. చివాలున లేచి కూర్చుని “నేనేం మీ దాసీనికాను.” అని జవాబు చెప్పింది

ఉద్రేకప్రకృతిగల రాజు ఆ సమాధానం భరించలేకపోయినాడు. ఒళ్ళు తెలియని కోపంవచ్చింది. విసురుగా ఓ చెంపకాయ కొట్టాడు. బంగారురంగు వెల్వెట్‌లాగా మెరిసే చెక్కిలిమీద గులాబిరంగు చారలు అద్దినట్లు వేళ్ళగుర్తులు పడ్డాయి. సత్యవతి చాల సుకుమారంగా పెరిగింది. ఇదే మొదటిసారి ఆమె దెబ్బలుతినటం. తోకత్రొక్కిన త్రాచులాగ బుసకొట్టింది ఆమెమనస్సు. ఆమెలోని గర్వం ఆమెను రెచ్చగొట్టింది. చేతి వాచీవంక చూసింది. మొయిలుకింకా టైముంది. దండెంమీదవున్న చీరలు గబగబా పెట్టెలో వేసుకొని, సందిట్లో రిక్షాపిలిచి దాంట్లోయెక్కి స్టేషనుకిపోయి టిక్కెట్ తీసుకొని రైల్లో కూర్చుంది. మరదలు రిక్షాపిలవటం విన్న ఆనందరావు తమ్ముడూ మరదలు సెకండ్ షోకి సినిమాకు వెడుతున్నారుకాబోలు అనుకుని మళ్ళీ

తనపుస్తకంలో పడిపోయినాడు. సత్యవతి రిక్షా నెక్కడం చూస్తూనే వున్నాడు రాజు. కాని యెక్కడికి అని అడుగలేదు. ఆ క్షణంలో ఆడదానికి యింత అహంకారమా? అని అలముటిస్తోంది అతని మనసు. అసలు సత్యవతి మద్రాసు వెడుతుంది అని అతనికి తెలుసు. వెడితే వెళ్ళనీ ఆడది కోపగించి లేచిపోయింది అంటే ఆడదానికే నష్టంగాని, మొగవాడికి ఏ విధమయిన నష్టం లేదనికూడా అతనికి తెలుసు. అతనికి తెలియనిది... అతనికేకాదు, ఏ మగవాడికీకూడ తెలియనిసంగతి ఒకటివుంది. అదేమిటంటే అలాంటి సత్యవతుల అంతర్యాలలో అంతర్వాహినిగా ప్రవహించే అనురాగప్రవంతులు. అవి మాత్రం ఏనాటికీ అంతర్గతంగానే అస్తమించిపోతాయి. ఆ అమృతప్రవంతులని అర్థంచేసుకొని, ఆస్వాదించగలిగిన అదృష్టవంతులు చాలా తక్కువమంది వుంటారు... అసలు లేరేమో కూడా. సత్యవతి వెళ్ళినందుకు రాజు ఏమాత్రము బాధపడలేదు. అయిదారుసార్లు అన్నంపడేసిన కుక్కపిల్ల ఇంటిచుట్టూ తిరుగుతూంటే ఏమీ వుండదు అది కొన్నాళ్ళు కనపడక పోయినా యేమీ వుండదు. సత్యవతి వెడితే రాజుకి అలాగే వుంది. ఆ ఆలోచనలమధ్యలో పార్వతి జ్ఞాపకంవచ్చింది. రాజు ఆమెకి మనస్సులోనే నమస్కరించి వదినా నన్ను క్షమించు. నీవు లేకపోబట్టే సత్యవతి అలా ప్రవర్తించింది. దాంట్లో నాతప్పేమీ లేదు అనుకున్నాడు రాజు. రైలు క్రిష్ణా కెనాల్ దాటింది. సత్యవతి కిటికీలోంచి బయట చీకట్లోకి చూసింది. చీకటి, యెక్కడచూసినా చీకటి, కాంతిలేశంకూడా లేని కటికచీకటి. ఆమె అంధకారం భరించలేక రెప్పలిక

చూసింది. ఎదురుగుండా పదునెనిమిదేండ్ల బాలింతరాలు పండంటి పాపడిని, వళ్లో పెట్టుకొని కూర్చున్నది. నిద్రపోతున్న ఆ పాపడు ఎందుకో నవ్వాడు. అవును, అతడు పెరిగి పెద్ద వాడవుతాడు. మగవాడుగ మారుతాడు. వెయ్యిమంది రాజుల వారసుడు వాడు. అందుకే అంత అహంభావంతో నవ్వుతున్నాడు. తను ఆడదయి పుట్టినంతమాత్రంచేత ఆ రాజుకు వంగి సలాం చేయాలా? తనూ ఇంటరుదాకా చదివింది. ఎక్కడయినా చాకిరిచేసి పొట్టపోసుకోవచ్చును, అంతగా అన్నగారు అన్నం పెట్టనంటే. అంతేకాని అతనికి వంగి వుండటం కల్ల. అయినా తన తప్పు యేముందని అత డలా కొట్టాడు. అసలు తప్పువుంటేమాత్రం అతనలా కొట్టటానికేం అధికారంలేదు. కుక్కల్ని పిల్లుల్ని కొట్టినట్లు, తోటిప్రాణుల్ని కొట్టటం మానవత్వంకాదు ... ఆలోచిస్తున్న సత్యవతికి అతను కొట్టినక్షణంలో తనెందుకు తిరగబడలేకపోయిందో అర్థం కాలేదు ... యుగయుగాలుగా అణగివుండటం అలవాటయిన ఆ మెనారీరక్తం అసలు ఆవిధంగా ఆలోచించలేకపోయింది ఆ క్షణంలో. యిప్పుడాలోచిస్తుంటే తనుమాత్రం యెందుకు కొట్టకూడదు? ఈ చెంపకొడితే ఆ చెంపకూడా వాయకొట్టించుకునేందుకు తను ఏసుక్రీస్తు అవతారంకాదే! పార్వతికి మనస్సులో నమస్కరించి, అక్కయ్యా, నన్నుక్షమించు. ఇందులో నాతప్పు యేమీలేదు ... అసలు నీవు లేకపోవటంవల్లనే ఇలా ప్రవర్తించాడు రాజు. నన్ను క్షమించు అక్కయ్యా, అనుకుంది సత్యవతి.

# 2

అప్పుడే నిద్రలేచిన చెన్నపట్నం బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటున్న సమయంలో సెంట్రల్ స్టేషన్‌నుంచి బయటికి వచ్చిన, సత్యవతి టాక్సీ యెక్కింది. తారురోడ్డుమీద రాత్రి కురిసిన మంచు నల్లపిల్ల పౌడరుసింగారంలావుంది. సత్యవతి ఆలోచనలాగానే టాక్సీ జారిపోతున్నది.

తనుచేసింది పొరపాటేమో! పొరపాటేమిటి? ఆత్మ గౌరవంగల ఏ స్త్రీ కూడ ఆ సమయంలో తనలాగానే ప్రవర్తిస్తుంది.

కాని ఆమె అంతరాంతరాల్లో యేదోమూలనుండి అది తప్పేమో అని వినిపిస్తోంది. తనకి తల్లి లేదు. తండ్రిలేడు. అన్న తనని పెంచి పెద్దదాన్నిచేశాడు. ఇప్పుడు తనుచేసినపనివల్ల అన్నయ్య బాధపడతాడేమో! ఏమైనా ఇక ఆలోచించటం అనవసరం జరిగిందేదో జరిగిపోయింది. ముందుసంగతే ఆలోచించాలి. రాయపేట పోష్టాఫీసువచ్చింది. హాస్పటల్, రాయపేట హైరోడ్డు, శ్రీపురంవీధి, అదిగో ఇల్లు. ఈ టాక్సీలో ఇలా తిరుగుతూంటేనే బాగుంటుంది. అనుకున్న సత్యవతి టాక్సీ ఆగగానే యత్రంలాగ ఇంట్లోకి నడిచింది.

అమ్మా అత్తయ్య వచ్చిందోయ్ అని, సత్యవతిఅన్న కొడుకు ఆరేళ్ళవాడు ఒకకేకపెట్టగానే ఉప్మా చేస్తున్న ఒదినగారూ, పేపరు చదువుతున్న అన్నగారు, ఒక్కఉదుటన వాకిట్లోకి వచ్చారు. "ఏమిటే చెల్లీ, టెలిగ్రామ్‌ఇస్తే స్టేషనుదగ్గరకు వచ్చేవాడినిగా. రాజేడీ?" అన్న అన్నగారి మాటలకు

సత్యవతి తెల్లబోయింది. అన్నగారు వచ్చి రాగానే రాజును గురించి అడుగుతారని, ఆమె అనుకోలేదు. ఆ ప్రశ్నకి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. ఇంతలో ఒదినగారు అడ్డు పడి రక్షించింది

"ముందు మొగం కడుక్కొని, కాఫీతాగుదువుగాని రావమ్మా. అన్నాచెల్లెళ్ళు తరువాత మాటలాడుకుందురు గాని" అని సత్యవతిని లోపలికి తీసుకువెళ్ళింది. మనస్సులోనే ఒదినగారికి వేయిదండాలుపెట్టుకొని లోపలికి వెళ్ళింది సత్యవతి. ప్రస్తుతం యీ ప్రశ్న తప్పించుకున్నాగాని, ఎప్పుడో ఒకప్పుడు ఈ ప్రశ్నకు జవాబిచ్చితీరాలి. ఏం చెప్పాలా? అని ఆలోచించింది ఆమె. జీవితంఅంటే ఆ క్షణంలో రాజేడీ అన్న ప్రశ్నగా కనిపించింది. ఈ ప్రశ్నకు జవాబు తను సరీగా యివ్వలేదు. తరతరాలనుంచీ, ఈ దిక్కుమాలిన దేశములో ప్రతిస్త్రీ ముందుగా నీ భర్త యేడీ? అన్న ప్రశ్నకు జవాబుచెప్పితీరాలి. అలా జవాబు చెప్పలేని స్త్రీని పతితగా, కులటగా లోకులు చెప్పుకుంటారు! ఈ పరిస్థితుల్లో సత్యవతి ఏం చెప్పాలో నిర్ణయించుకోలేకపోయింది. తను ఆలోచించకుండా రాజును వివాహంచేసుకున్నానేమో అని క్షణం సందేహించిందికూడా. సత్యవతికి నాలుగువేపులనుండీ ఒకే ఒక్క ప్రశ్న యెదురొక్కంటున్నది! రాజేడీ? రాజేడీ? ఎక్కడే నీ భర్త? అని

పార్వతి పుట్టినింటినుంచి విజయవాడ వచ్చింది. నిండు చూలుతోవున్న ఆమెను చూస్తుంటే పండి కోతకువచ్చిన చేను జ్ఞాపకంవస్తున్నది. ఆమెతో ఆమె తల్లికూడ వచ్చింది,

రాగానే "సత్యవతి ఏది?" అని రాజుని అడిగింది. "పుట్టినింటికి వెళ్ళింది." అన్నాడతను. ఇద్దరు మగవాళ్ళను వదిలి పుట్టి నింటికి వెళ్ళవలసిన అవసరం ఏం వచ్చిందా? అనే వుద్దేశ ముతో, "అంతా కులాసాగావున్నారా" అని ప్రశ్నించింది. "ఆహా" అనే రాజుజవాబులో అపశ్రుతి వినిపించినా ఆ గంభీర మూర్తి మళ్ళీ ప్రశ్నించలేదు.

ఆ రాత్రి ఆనందరావుని "మరదల్ని పుట్టింటికి పంపిం చారట యెందుకూ?" అని డబాయించిం దామె. "పాపం అన్నగారిమీద బెంగపెట్టుకుందట. చిన్నపిల్లఆయిరి" అన్నా డాయన, తమ్ముడు తనకి యెక్కిరింపుగా యిచ్చిన సంజాయి షీని మరింత ఘాటుగా అప్పగిస్తూ. యీ అమాయికుడిని ఏమి అడిగీ ప్రయోజనంలేదని నిర్ణయించుకున్న పార్వతి నిట్టూర్పు విడిచి ఒత్తిగిలి పడుకుంది.

* * * *

ఘనీభవించిన నైరాశ్యపథంలో తటిల్లేఖలా ఒక పిపాస, నాలుగువైపులా కమ్ముకున్న వానముసురులో ఒక నీరెండ, గమ్యమేదో తెలియని మహారణ్యమధ్యంలో ఒక కాలిదారి, మహానదీమధ్యంలో బ్రతుకు సుడితిరుగుంటే ఒక చుక్కాని- ఇవి దొరకడం చాలాకష్టమే అయినా, మానవుడు అవి దొరు కుతాయనే ఆశతోనే జీవిస్తాడు. ప్రస్తుతం సత్యవతికి శర్మ అలా కనిపించాడు. విచిత్ర ప్రకృతిగల ఆ యువకుడు తెనాలిలో జన్మించాడు. తెనాలి ఆంధ్రదేశానికి యెంతో మంది కళోపాసకుల్ని ప్రసాదించింది. సుప్రసిద్ధ కథారచయి తలు శ్రీ వెంకటచలం, కొడవటిగంటి కుటుంబరావు, గోపీ

చంద్, ప్రఖ్యాతనటులు స్థానం నరసింహారావు, మాధవ పెద్ది వెంకట్రామయ్య. తెలుగుసినిమా తెరకు కూడ ప్రఖ్యాత నటీనటకుల్ని ప్రసాదించింది తెనాలి. కాంచనమాల, డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు తెనాలినుంచే వచ్చారు. ఈ శర్మకూడా తెనాలిలో జన్మించాడు. సత్యవతికి శర్మనటన అన్నా, అతని మాటలన్నా, ఒక విచిత్రమయిన ఆకర్షణ వున్నది. రాజు వీరింట్లో ప్రవేశించకముందు శర్మ అదేగదిలో అద్దెకుండేవాడు. అతను ఏంచేస్తూవుండేవాడో ఏం తింటూవుండేవాడో కేవలం ఆ సర్వాంతర్యామికే యెరుక. తరువాత ఒకరోజు హఠాత్తుగా అతను గది ఖాళీ చేసి వెళ్ళిపోవటం, అదేగదిలో రాజు ప్రవేశించటం, ఇష్టాన్నే ప్రేమ అనుకుని భ్రమపడి, అతన్ని వివాహంచేసకోవటం సినిమారీలులా ఒక్కొక్కటే జరిగిపోయినయి. ఈనాడు అదే శర్మ గొప్ప నటకుడయి ఫ్రెంచికథల్లో, రాజకుమారుడిలా బీచీఒడ్డున కనిపించేసరికి సత్యవతి చాలా ఆనందించింది. తన అదృష్టం బాగులేక యీ రాజుని వివాహంచేసుకున్నాను, ఎంతపొరపాటు అనుకుంది. కొన్ని కొన్ని క్షణాల్లో స్త్రీ ఆలోచించగల ఆలోచనల్ని తలచుకోటానికికూడా భయంవేస్తుంది. ఆమె మనస్సే సేలనమైనదో, పరిస్థితులే ఆమెకు ప్రోద్బల మిస్తాయో నిర్ణయించి చెప్పటం కష్టం. అథవా అలా యెవ రయినా, నిర్ణయించినా అది పూర్తిగా తప్పని మరో స్త్రీ రుజువుచేస్తుంది. సత్యవతి మనస్సులో చాలా బలహీనత వుంది. నచ్చిన చిక్కొక్కడంటే అది బలహీనత అని ఆమె ఏ మాత్రము తెలుసుకోలేదు. అలా తెలుసుకోగలిగేవుంటే తన్ను

వున్న ఆ పరిస్థితుల్లో శర్మతో స్నేహం తిరిగి ప్రారంభించటం యెంత ప్రమాదకరమో ఆమె అర్థంచేసుకోగలిగేది. "సత్యవతీ యెప్పుడువచ్చావు?" అన్న శర్మప్రశ్నకి సత్యవతి చాలా చలాకీగా జవాబిచ్చింది. "నీవు యిప్పుడు పెద్ద యాక్టరువగుపోతివి. ఇంకా నన్నుజ్ఞాపకంవుంటాననుకోలేదు" అన్నది. సామాన్యంగా నటనే జీవనాధారంగా పెట్టుకున్నవాళ్ళు ఒక అలవాటుకు గురిఅవుతారు. అది యేమిటిఅంటే నిత్యజీవితంలో కూడ నటించటం. సత్యవతి ప్రశ్నకి శర్మ యిచ్చిన జవాబు ఒకవిధంగా నటనే అని చెప్పాలి. ఆ జవాబు యిది; "ఆ ప్రశ్న నిన్ను అడగాలనుకుంటున్నాను. సత్యా! వలచి పెళ్ళి చేసుకున్న భర్త, ఒడినిండిన సంసారం, నీకు నేను జ్ఞాపకం వున్నానా అని నా సందేహం." వలచి పెళ్ళిచేసుకున్న భర్త అనగానే రాజు జ్ఞాపకంవచ్చాడు. వలపు యెంత నిరర్థకమైన మాట! ఈ మాటకే తను భ్రమపడింది. సినిమాల్లోనూ, పుస్తకాల్లోనూ అధికంగా కనిపించే యీ మాట జీవితంలో యింత యెండమావి అవుతుందేమిటి? అసలు ప్రపంచంలో వలపు అనేదిలేకనేపోతే ఇంతమంది రచయితలు దీనినిగురించి యెందుకు రాస్తారు? ఇంతమంది గాయకులు దీనిని గురించి యెందుకు పాడుతారు? సుందరమయిన ఇంధ్రధనుస్సు కొన్ని క్షణాలలోనే విశ్వాంతరాళంలో లయించిపోతుంది. ఒకవేళ యీ వలపుకూడా అంతేనేమో! ఇంద్రధనువు సౌందర్యం నిలచే కనుక వుంటే మనకు అలవాటయిపోతుంది. ఆ మహా సౌందర్యంసామాన్యమయిపోతుంది. వలపుకూడా శాశ్వతంగా వుంటే దాని మాధుర్యం విషంగా పరిణతిచెందవచ్చును.

"ఏమిటి ఆలోచిస్తున్నావు సత్యవతీ" అన్న శర్మ ప్రశ్నకి ఆలోచనలు, జారిపోగా తలయెత్తి చూసింది సత్యవతి. ఆమె కనుకొలుకుల్లో కలువపూవు రేకులమీద నిలచిన వంటరి వర్ష బిందువుల్లా రెండు కన్నీటిబిందువులు నిలిచివున్నవి.

"అదేమిటిసత్యా!...నీకేమైనాకష్టంకలిగించానా?" అన్నాడు శర్మ ఆశ్చర్యపోయి.

"లేదు శర్మా! ఏవో ఆలోచనలు నన్ను బాధిస్తున్నయి. నీవునటుడివి. ఒకప్రశ్న అడుగుతాను. జవాబు చెప్తావా? నీకు తల్లిగాని స్త్రీని తల్లిగా, భార్యగాని స్త్రీని భార్యగా అనుకుని నీవు నటించేటప్పుడు నీ మనస్సు యెలావుంటుందో చెప్ప గలవా?"

సత్యవతి వేసిన ప్రశ్నకి శర్మ ఆశ్చర్యం ఎక్కువయి "అలా అడగడంలో అంతరార్థం నాకేమీ తెలియటంలేదు సత్యా...అయినా చెప్తున్నాను. ఉత్తమనటుడెప్పుడూ తన పాత్రలో లీనమవడు. కొంతవరకు మాత్రమే తాదాత్మ్యం చెందుతాడు. ఎంత ఉద్రేకపరమయిన సన్నివేశమయినా తన భార్యగావున్న స్త్రీ భార్యకాదనీ, తనతల్లిగావున్నస్త్రీ తల్లి కాదనీ, తప్పకుండా అతనికి జ్ఞాపకంవుంటుంది. కేవలం అది నటనే అని స్టేజిమీదనుంచి దిగినతరువాత ఆ యా వ్యక్తులకి యెలాంటి సంబంధమూ వుండదనీ గుర్తించుకోవాలి అప్పుడే రంగంమీదనయినా జీవితరంగంలోఅయినా సక్సెస్ కావ టం తేలిక" అన్నాడు.

"నీవు అప్పటికీ యిప్పటికీ ఒకలాగే మాటాడు తున్నావు శర్మా!" అన్నది సత్యవతి.

"నీ వేదో బాధపడుతున్నట్లున్నావు. సత్యా! రేపు నాకు కాల్‌షీట్లు ఏమీలేవు. మధ్యాహ్నం టీకిరాకూడదూ, మాట్లాడుకుందాం" అన్నాడు శర్మ.

"నాకూ ఏదో చెయ్యవలసిన పరిస్థితి యేర్పడింది. ఆ విషయంలో నీ సలహా తీసుకుందామనుకుంటున్నాను. రేపు టీకి వస్తాను. ఇక వెడతాను" అన్నది సత్యవతి. నడచివెడుతున్న సత్యవతిని దిగులుగా చూస్తూ కారు స్టార్ట్ చేశాడు శర్మ.

* * * *

జీవితానికి సాహిత్యానికి వుండే సంబంధం యెంతటి గాఢమయిందో చాలామందికి తెలియదు. దేశకాలసంఘటనలు రచనకి కొంతమటుకు ఆధారమయినా రచయిత వీటికి సరియైన రూపచిత్రణ చేసినరోజున కొన్ని సమస్యలకి కొంత సమాధానం రావచ్చును. పూరించలేని మహాసమస్యలలో జీవితం ఒకటి. క్షణక్షణం మార్పుచెందే మానవజీవితం, నీతి నియమాలనూ, సాంఘికవ్యవస్థలనూ తన కనుగుణంగా మార్చుకుంటూ ముందుకు పురోగమిస్తుంది. ఈ పురోగమనం సుఖజీవనంకోసం అని భ్రమిస్తాము. కాని ఆసుఖం లభించదు. నిన్న మనల్ని ఆశ్చర్యపెట్టిన మార్పు ఈరోజున మామూలై పోతుంది. ఇలా నిరంతరం దృశ్యం మారుతూనే వుంటుంది. ఈ మార్పే దృశ్యానికి సరియైన రూపకల్పనచేసినవాడే ఉత్తమ రచయిత. ఈవిధంగా వ్రాసిన యీ వారం సంపాదకీయం తిరిగి చదువుకుంటే తనకే అర్థంకాలేదు. విజయవాడనుంచి వెలువడే ఒక సాహిత్య వారపత్రికకు, యువకుడు, లినేదో

అభ్యుదయభావాలున్నవాడూ అనుకొంటున్న శివరావు సంపాదకుడు. అట్టే రాజకీయాలజోలికి పోకుండా సాహిత్యమూ, కథలూమాత్రమే ప్రచురిస్తూ మెల్లిగా కాలంగడుపు కొస్తున్నాడు. విజయవాడనుంచి వస్తున్న నాలుగైదు పత్రికల్లో ఈ పత్రికకే శాస్త్ర సర్క్యులేషన్ వుంది. పత్రిక పేరుకూడా అట్టే చెడ్డదికాదు. "కంటకం". ఈ పేరునుగురించి యెవరైనా ప్రశ్నిస్తే కనీసం గంటైనా లెక్చరుయిస్తాడు శివరావు. ఈ గంటలెక్చరుకీ సారాంశం ఒక్కటే. కంటకం సాహిత్యరంగంలో వుండే కంటకాల్ని పెళ్ళగిస్తుంది. ఏది యేమైనా కొత్తగా కథలువ్రాసి అవి అచ్చుఅవాలని తాపత్రియపడే యువతీయువకులకు శివరావు గురువు. సామాన్యంగా ప్రతి రచయితకీ పత్రికాసంపాదకుడుగా శివరావు కావలసినంత ప్రోత్సాహం యిస్తాడు. మీరు తప్పకుండా పైకి వస్తారనో మిమ్మల్ని తప్పకుండా పైకితెస్తాననో వాగ్దానం చేయటంతో, రచయిత అవాలని కలలుగంటున్న ప్రతివాడూ శివరావుశిష్యుడుగా మారిపోతాడు. ఏమాటకామాటే, శివరావుకూడా నిజంగా వాళ్ళను పైకి తేవాలనేవుంటుంది తనకి ఇష్టమైనవాళ్ళని. ఈవిధంగా పైకితేవాలనే మహోద్యమంలో అడుగడుక్కీ అడ్డుతగులుతూనే వుంటాడు, దానికి పెట్టుబడిపెట్టిన వెంకటపతిగారు.

ఆంధ్రుల్లో ప్రతినలుగురికీ ముగ్గురు రచయితలూ ఒక విమర్శకుడూ వుండితీరుతారు. అయితే వచ్చిన చావేమిటంటే వెంకటపతిగారు కవీ, విమర్శకుడూకూడా కావటం! సామాన్యంగా ప్రతీవారం ఒక పదిపేజీల వ్యాసం వ్రాసి,

కంటకంమొహాన పారేయటం ఆయన కలవాటు. ప్రతీవారం వ్రాసే వ్యాసాల్లో ఆయన సలహాయివ్వని సంస్థ అంటూ ఆంధ్రదేశంలో లేదు. నాటకాలవాళ్ళకి నాటకాలు యెలా వెయ్యాలో, పూర్వం భరతుడూ, సిద్ధేంద్రయోగీ ఏమి వ్రాశారో, చిత్రకారుడికి ఆడబొమ్మముక్కు అరంగుళం మందాన రవివర్మ యెట్లా చిత్రించేవాడో, డ్యాన్సుచేసే అమ్మాయిలు భామాకలాపంలో యెలా భరతనాట్యం చేయాలో యధావిధిగా సలహాలుయిస్తాడు. సామాన్యంగా యీయనవ్యాసాల్ని చూసి అందరూ నవ్వుకుంటున్నా, ఆయనకుమాత్రం ఆ విషయము తెలియదు. పైగా తనేదో గొప్ప విమర్శకుడని ఆయనఅభిప్రాయం. ఎవరైనా చచ్చినా, ఏ మంత్రియైనా రాజీనామాయిచ్చినా, యీయన వెంటనే ఒక వ్యాసం వ్రాసిపారేస్తాడు. కేవలం వెంకటపతిగారి వ్యాసాలే కంటకంలో సగానికిపైగా వుంటాయి. ఇక మిగిలిన సగంపేజీలలో శివరావు ప్రోత్సాహమీయదలచుకున్న యువతీ యువకులకి చోటు చాలటంలేదు. ప్రస్తుతం శివరావు హృదయపూర్వకంగా పైకితేవాలనుకుంటున్న ప్రత్యేక స్త్రీ వెంకటపతిగారికూతురు కామాక్షి. ఇప్పుడా కామాక్షి కంటకం పత్రికాకార్యాలయంలోకి గులాబిపువ్వులా ప్రవేశించింది. ఆమెకు దగ్గరదగ్గర 27 సంవత్సరాలు వుంటాయి. వెంకటపతిగారు మాత్రం యిరువదిమూడు సంవత్సరాలు అని చెప్పుతూ వుంటాడు. ఆ అమ్మాయికి యింతవరదాకా పెళ్ళికాకపోవటానికి అనేక కారణాలు చెపుతారు లోకులు.

లోకులుచెప్పే యీ కారణాల్లో ఒక్కటి నిజమైనా యీ జీవితంలో ఆమెకు పెళ్ళిగాదనేది నిర్వివాదాంశం. ప్రస్తుతం ఆమెను గొప్ప రచయిత్రిగా చేయమని వెంకటపతి గారూ, చేస్తానని శివరావూ అంటున్నారు. ప్రతిరోజూ ఒక రెండుగంటలు శివరావుదగ్గర శిక్షణపొందటం ఆమె రచయిత్రి కావటానికి చేయవలసినవాటిల్లో మొదటిమెట్టు. దీనివెనక పెద్ద ప్లాను వుందని శివరావుకి తెలియదు. ఏది యెలాగైనా కామాక్షిలాటి వ్యక్తిత్వంవున్న స్త్రీలు చాలా అరుదు. నల్లగా, పొడుగ్గా, ఆకర్షణీయంగా వుండే యీమె హృదయంలో యేమివుందో తెలుసుకోవటానికి ఆ బ్రహ్మకూడా తరంకాదు. ఆమెకి జీవితంఅన్నా మనుషులన్నా చాలా చిత్రమయిన అభిప్రాయాలున్నాయి. జీవితంలో మాధుర్యం వుందన్నా, మనుష్యుల్లో మానవత్వం వుందన్నా ఆమె నమ్మదు. ఇలాటి కామాక్షి తండ్రిచెప్పినంతమాత్రంచేతనే కంటకంఆఫీసుకి శివరావుశుశ్రూష చేయటానికి వస్తూందీ అంటే నమ్మబుద్ధిగాదు. తుఫానులా ఆఫీసులోకి ప్రవేశించిన కామాక్షి శివరావుసంపాదకీయం చదివి పకపకా నవ్వటం ప్రారంభించింది. విరగబడి నవ్వుతున్న ఆమె నవ్వుకి శివరావువళ్ళు మండుతోంది.

"ఏమిటండీ శివరావుగారూ! ఇది నాకేం అర్థంకావటం లేదు. కొంచెం తాత్పర్యం సెలవిస్తారా?" అని మళ్ళీ నవ్వటం ప్రారంభించిం దామె.

"నువ్వీ జన్మలో రైటరువి కాలేవు. అలా అయితే నా చెవి కోసేయిస్తాను" అన్నాడు చివరికి వళ్ళుమండి.

"తథాస్తు! మీ ఆశీర్వచనం సఫలమవ్వాలనే నా కోరిక. లేకపోతే నే వ్రాయటమేమిటీ నా మొహం!"

"మరయితే యెందుకొస్తున్నట్లు నీ విక్కడికి?"

"కేవలం తమరి దర్శనభాగ్యంకోసరం తప్ప మరి నా కింక యే కోరికా లేదు" అన్న దామె వ్యంగ్యంగా.

"చచ్చాం. కొంపతీసి నీవుగాని నన్ను ప్రేమించటం ప్రారంభించలేదుకదా" అన్నాడు శివరావు ఫ్లాస్కు కాఫీ కప్పులోకి వంచుతూ.

"పూర్తిగా మా జనకుడి అభిప్రాయం అదేఅయినా నేనుమాత్రం అలాటిపని యీ జీవితంలో చేయను." అన్న దామె కాఫీసిప్ చేస్తూ.

ఆమెవంక అదోలా చూస్తూ "కామాక్షీ" అన్నాడు శివరావు.

"ఏం సుందరేశ్వరా?" అంది నవ్వుతూ ఆమె.

"నీవు యింతచక్కగా మాట్లాడటం యెక్కడ నేర్చుకున్నావు?"

"మీ శుశ్రూష చేయటం ప్రారంభించినప్పటి నుంచే"

"అడిగిన ఏ విషయానికీ సూటిగా సమాధానం నీ జన్మలో చెప్పలేవుగదా!"

"నా జన్మలో చెప్పలేనివి చాలావున్నాయి. ఒకటి: నేను రైటర్ని కాలేనని ధైర్యంగా మా నాన్నకు చెప్పలేక పోవటం. రెండు: నేను నిన్ను ప్రేమిస్తున్నాను, పెళ్ళిచేసుకో అని ఏ మగవాడితోనూ అనలేకపోవటం. మూడు..."

"అక్కడికి చాలు. అయితే యీ రెండుపన్నా మీ నాన్నచేత చేయించాలని ప్రయత్నించటం మాత్రం శోచనీయం. సూటిగా ఒక్కటడుగుతాను చెప్పు. జీవితంలో నీ వే మొగవాడ్నైనా ప్రేమించగలవా అని?"

"నేను ప్రేమించినా నన్ను ప్రేమించగల దౌర్భాగ్యుడెవడూ యింతమటుకూ తటస్థించలేదు."

"మరి నేను విన్నకథలు వేరుగా వున్నయ్యే?"

"27 ఏండ్లదాక పెండ్లికాకుంటే కథలకేం భాగ్యం కావలసినన్ని!" అన్నది నవ్వుతూ.

"మ్మరైతే మీ నాన్న నీకు ఇరవైమూడేండ్లే నంటాడేమిటీ"

"ఓరి నీ అమాయికత్వం పాడుగానూ! ఆయన చెపితే మాత్రం నా మొఖంచూస్తే తెలియటల్లేదూ?"

"నీ మొహానికేం, నల్లకలువలు వికసించినట్లువుంటుంది."

"నాకు పెళ్ళికాకపోవటానికి లోకులుచెప్పే ముఖ్యమైన కారణాల్లో యిది ఒకటి."

"ఏమిటీ?"

"నేను నల్లగా వుండటం. యింకోటి- నా కేరెక్టరు మంచిదికాకపోవటం!"

"నలుపు సరే. కేరెక్టరు మంచిదికాకపోవటం నేను నమ్మను."

"నమ్మితే నీ కయ్యే నష్టమేమిటీ? అయినా నమ్మకపోవటానికంటే నమ్మటానికే ఎక్కువ అవకాశాలున్నాయి."

"ఏమిటవి ?"

"నేను మగవాళ్ళను చూసి సిగ్గుపడను. స్త్రీగా ఆక ర్షించే పదార్థం ఏదైనా నాలో వుందని నాకు జ్ఞాపకముండదు. మగవాళ్ళతో తిరుగుతాను. ఏ మగవాడినీ కేర్ చేయను. నేను మంచిదాన్ని కాదనేందుకు యింతకంటే ఆధారాలు ఏం కావాలీ?" అన్నదామె నిర్లిప్తంగా.

"నీవు ఇలా మాట్లాడి పెద్ద పొరపాటుచేస్తున్నావు. లోకంలో అందరూ మగాళ్ళు వాళ్ళు చేసిన తప్పుల్ని యెప్పుడూ చెప్పుకోరు."

"అందుకే వాళ్ళతప్పుల్ని చెప్పటానికి మా నాన్న వ్యాసాలు వ్రాస్తూవుంటాడు." అని పకపకా నవ్విందామె. అంతలోనే సీరియస్ అయిపోయి,

"ఏమిటో, శివరావు! జీవితం ప్రారంభించే మొదటి రోజుల్లో ప్రతిపువ్వూ మనకోసమే వికసిస్తూవుందనుకుంటాం. కొన్నాళ్ళు పోయినతరువాత కానీ, అవి ఎడారిపువ్వులని మనకు తెలియదు." అన్నది గాఢంగా నిట్టూరుస్తూ.

"నీ మనస్సులో అగ్నిపర్వతాలుకూడా కొన్నివున్నా యని నే నెప్పుడూ అనుకొంటూవుండేవాడిని. అది కొంత మటుకు నిజమేనని యిప్పుడనిపిస్తోంది" అన్నాడు శివరావు.

"అగ్నిపర్వతాలు కాదు శివరావు! మన అందరి మన స్సుల్లోనూ ఎడారిపువ్వులు కొన్నివున్నాయి. మహాభయంకర మైన ఎడారిలో ఒక చిన్న ఒయాసిస్. ఆ ఒయాసిస్ ప్రక్కన రెండు ఆకులతో ఒక చిన్న ఖర్జూరపుచెట్టు. ఆ ఖర్జూరపు చెట్టుకి ఒకటో రెండో పువ్వులుండవచ్చును. అప్పుడప్పుడు

దారితప్పిన ఒంటరిఒంటె ఏదైనా బక్కచిక్కిన తన మెడ చాచి ఆ పువ్వునందుకుంటే అదృష్టం ఆపువ్వుదో ఈ ఒంటెదో ఆలోచించేందుకు ఆ చుట్టుపక్కల యెవ్వరూ వుండరు.''

"నీవు జన్మతః రైటరువి. ఇప్పుడు ఒప్పుకోబుద్ధి వేస్తోంది. యెంత చక్కగా చెప్పగలిగావు!'' అన్నాడు శివరావు.

"ఇందాకే కదా యీజన్మలో నేను రైటర్ని కాలేనని అన్నావు. పిడకలుచేయమన్నా చేస్తా కానీ, వ్రాయటం మాత్రం చస్తే వ్రాయను.'' అంటూ లేచిపోయింది కామాక్షి. ఆమెవెళ్ళినవైపు తదేకంగా చూస్తూ అలా వుండిపోయినాడు శివరావు.

బందరుదగ్గర చిన్న పల్లెటూరిలో శివరావు పుట్టాడు. తండ్రి ఆయుర్వేదవైద్యుడు. అందులో ప్రత్యేకం కృషిచేసినవాడుకూడ. శివరావుతల్లి చనిపోనటంవల్ల ఆయన రెండోపెండ్లి చేసుకొన్నాడు. ఆవిడ కొంచెం దేశసేవ, నాగరికత రంగరించినమనిషి కావటంచేత మద్రాసులో కాపురంపెట్టవలసివచ్చింది. ఎందుకో శివరావు మనస్సులో తండ్రి నసహ్యించుకున్నాడు. దరిమిలా ఇతడు బియ్యే ప్యాస వటమూ, తండ్రి ఇతనికి ఇష్టంలేని వివాహంచేయటమూ జరిగింది. తండ్రిభయంవల్ల వివాహం అయితే చేసుకొన్నాడు కాని, ఆమెను తనభార్యగా చూడలేకపోయాడు. ఆ అమ్మాయి నల్లగా వుంటుంది. ఇతనికి నలుపుఅంటే పరమఅసహ్యం. అందుచేత ఆ అమ్మాయిని వదిలేసి బెజవాడ వచ్చాడు.

కంటకంపత్రికకి ఎడిటర్‌గా పనిచేస్తున్న యీ శివరావుకి వివాహం కాలేదనే వెంకటపతిగారి ఉద్దేశ్యం. ఉద్దేశ్యాన్ని అతడుఖండించలేదు! కామాక్షిని ఎలాఅయినా శివరావుకి కట్టి పెట్టాలని వెంకటపతిగారి ఉద్దేశ్యం. అది శివరావు గ్రహించ లేదు. కామాక్షికి యిష్టంలేదు.

ఫయిల్స్ అన్నీ కట్టి, ఇంటికివెళ్ళటానికి లేచాడు శివ రావు. అతను వాకిట్లో అడుగుపెట్టగానే రాజు యెదురైనాడు. రాజూ శివరావు కలిసి చదువుకున్నారు. మిత్రులిద్దరూ ఒకళ్ళ నొకళ్ళు పలుకరించుకొని కృష్ణకేసి నడిచారు. కృష్ణఒడ్డంబడే పాతబ్రిడ్జిదగ్గర ఇసుకలోకి దిగి ఇద్దరూ కూర్చున్నారు.

"రాజూ, చిక్కిపోయావేం! యీమధ్య ఏం జబ్బుపడ లేదు కదా?" అన్నాడు శివరావు రాజువంక చూస్తూ.

"శరీరానికి ఏ రోగంలేదు" అని నిర్లిప్తంగా సమా ధాన మిచ్చాడు రాజు.

"అంటే మనస్సుకేదో బాధ వుందన్నమాట. ఇప్పుడే నేను ఒక అమ్మాయిదగ్గర ప్రతి మనిషిమనస్సులోనూ ఎడారి పూవులు వికసిస్తూవుంటాయని పాఠం నేర్చుకున్నాను" అన్నాడు శివరావు.

"ఎవ రా అమ్మాయి, కామాక్షేనా?" అన్నాడు రాజు.

"నీ కెట్లా తెలుసు?" అన్నాడు ఆశ్చర్యంగా శివ రావు.

ఇలాంటి కొత్తకొత్త సూక్తులు కనిపెట్టేవాళ్ళు యింకె వ్వరూ లేరు."

"ఏమిటోయ్! కామాక్షి నీ కెలా తెలుసు?" అన్నాడు శివరావు.

"మొదట్లో ఆ పిల్లని నా కంటగట్టాలనే చూశాడు వెంకటపతిగారు."

"నీవు చాలా అదృష్టహీనుడివి. అలాంటి రత్నాన్ని పోగొట్టుకున్నావు." అన్నాడు నిట్టూరుస్తూ శివరావు. "మర యితే ఆ రత్నాన్ని నీవెందుకు తలదాల్చకూడదూ?" అన్నాడు నవ్వుతూ రాజు.

"నా సంగతి నీకు తెలుసుగా నాకు నలుపంటే అసహ్యం. లేకపోతే తప్పకుండా ఆమెను చేసుకొందును. సరేలే! మీ ఆవిడతో పోట్లాడి పంపించేశావా? మీ యిద్దరు ప్రేమించి పెండ్లి చేసుకున్నారేమో! అదే చిత్రం! ప్రేమించని నేనూ పెండ్లాన్ని ఒదిలేశాను. ప్రేమించి నీవూ పెండ్లాన్ని ఒదిలేశావ్! ప్రపంచంలో ప్రేమ అనేది అసలు వున్నదా లేదా అని సందేహం!" అన్నాడు శివరావు. "ఏమో! అది మీ రచయితలకి తెలియాలి. అడ్డమయిన చెత్తా వ్రాసి మనుష్యుల బుర్రలు పాడుచేస్తారు."

"ఛాఛా, మేమలాంటివాళ్ళంకాదోయ్. సృష్టికర్తలం. మీరు ఆలోచించుకోనివన్నీ మేమాలోచించిపెడతాం. అది సరేగాని, అస లేం జరిగింది?"

"పోనిద్దూ గోల. అసలేమన్నావుంటేగా చెప్పటానికి."

"మరి ప్రేమించుకున్నారు కాదటోయ్! ఆమాత్రం ఒకళ్ళనొకళ్ళు అర్థంచేసుకోలేరూ?"

"నన్ను చంపకు బాబూ! పోదాం పద" అన్నాడు రాజు లేస్తూ.

వాళ్ళు మెల్లగానడుస్తూ పీనుగులవంతెన దగ్గర కొచ్చేసరికి అక్కడేదో పెద్దకొట్లాట జరుగుతున్నది. "వుండవోయ్ ఆ గోలేమిటో చూచివస్తాను" అంటూ రాజు ఆ జనంలోకి చొరపడ్డాడు. ఆ గుంపుమధ్యలో లేడిపిల్లలా భయపడుతున్న ఒక ఆడపిల్ల నించొనివుంది. రాజు వినగా అక్కడ పోట్లాట ఏమిటో అర్థమయింది. ఆ అమ్మాయి ఒకమొగవాడిని మోసగించింది. అతడు వూళ్ళోలేనప్పుడు ఎవరితోనో మాటలాడిందట. వాడు రక్తం వచ్చేటట్లు దాన్ని కొట్టాడు. ఆమె వంటిమీద వున్న బట్టలు ఏ అవయవాన్నీ సరీగా కప్పటం లేదు. వాడు చావబాదుతున్నా కూడా ఆమె కిక్కురుమనటం లేదు. యుగయుగాలుగా తలెత్తలేని స్త్రీజాతికి ప్రతినిధి దెబ్బలుతింటూకూడా నోరెత్తని ఈ అమ్మాయా? ఒక్కమాటకే అలిగి పుట్టింటికిపోయిన తనభార్యా? ఎవరు ఉత్తమస్త్రీ? రాజు ఏదీ నిర్ణయించుకోలేకపోయాడు. వీళ్ళిద్దరిలో ఎవరి పద్ధతి మంచిదో కూడా అతను ఆలోచించలేకపోయాడు. శివరావు, రాజు ఇద్దరూ కలిసి రాజు ఇంట్లోకివెళ్ళారు. ఆనందరావు ఈజీ ఛేర్ లో పడుకొని పేపరుచదువుకొంటున్నాడు. "ఏమోయ్ శివరావ్! ఎలావుంది మీ పత్రిక" అని పలుకరించాడు.

"మీ తమ్ముడి ప్రాక్టీసులా వుందండీ" అంటూ కూర్చున్నాడు శివరావు. ఇంతలో పార్వతి బయటకు వచ్చి "ఏమయ్యా, శివరావు, ఎక్కడా కనిపించటమే లేదు" అన్నది. ఇంతలో "పార్వతక్కయ్యా" అంటూ కామాక్షి లోపల

కొచ్చింది. "ఇదేమిటీ, నీవు ఇక్కడకు కూడా తయారయావ్"
అన్నాడు శివరావు కామాక్షిని చూసి.

"మీ పత్రిక కొక న్యూస్ చెప్తా వ్రాసుకో. ఒకగంట క్రిందట విజయవాడనగరంలో ఆదర్శభారతనారీసంఘం అంటూ ఒకటి స్థాపించారు." అంటూ లోపలకు వెళ్ళింది.

"కామాక్షికీ మీకూ ఇంత పరిచయంవుందని నాకు తెలియదోయ్!" అన్నాడు శివరావు రాజువంక చూసి.

"అదేమిటోయ్! కామాక్షిని చిన్నప్పటినుంచి ఎరుగుదుము. మా రాజుకు దీన్నే చేయాలనుకొన్నాము... సరేలే. ఈ పిల్ల మాత్రం బంగారంకాదూ? రాజా! మరదలును ఎప్పుడు తీసుకొస్తావురా? పెండ్లి అయిన పిల్లని ఇన్నాళ్లు పుట్టింటిదగ్గర వుంచటం అంత మంచిపనికాదు" అన్నాడు ఆనందరావు. అన్నమాటలకి రాజు తలవంచుకున్నాడు. కొన్ని క్షణాల నిశ్శబ్దంతరువాత శివరావు వెళ్ళిపోయినాడు.

"అదేనక్కా! ఆ మండలికి నిన్ను అధ్యక్షురాలిని చేయాలని. నాకు వేరే వ్యాపకం ఏమీలేదు. ఇంట్లో కూర్చుంటే ఏమీ తోచటంలేదు. ఏదో కాలక్షేపానికి సరదాగా. ఏమంటావ్?" అన్నది కామాక్షి.

"నీవు చెప్పినది బాగానేవుంది. ఇప్పటి నా పరిస్థితిలో అవి అన్నీ కుదరవు కదమ్మా" అన్నది పార్వతి.

"పోనీ, ఆ తరువాతనే ఆమె.ముందే చెపుతున్నాను." అన్నది కామాక్షి. కిటికీలోంచి జగజ్జనని కనకదుర్గాదేవి ఆలయం మహోన్నతంగా దర్శనమిస్తోంది. అటుకేసి చూస్తున్న కామాక్షిని ఏవేవో విచిత్రమయిన అనుభూతులు ఆవరించు

కుంటున్నాయి. తన బ్రతుకంతా ఒక గులాబీపూవుచేసి ఆ మహాశక్తిపాదాలముందు అర్పిస్తే ఎంత బాగుంటుంది! ఆ క్షణంలో "యముని మహిషపు లోహగంటలు మబ్బుచాటున ఖణేలుమన్నాయి" అన్న శ్రీ శ్రీ గేయపాదం అప్రియంగా పైకి అన్నది. పార్వతి విచిత్రంగా చూసింది కామాక్షి మొఖం లోకి. ఇంతలోకే ఒక నల్లటి అమ్మాయి కాఫీ తెచ్చి అక్కడ పెట్టింది. "ఎవరీఅమ్మాయి?" అన్నది ఆ అమ్మాయి లోపలికి వెళ్ళినతరువాత కామాక్షి.

"నీకోసమే తెప్పించాను. ఈ అమ్మాయిపేరు లీల. వంటమనిషి కావాలన్నావుగా" అన్నది పార్వతి. "ఇంతకూ ఎవ రా అమ్మాయి? ఏ మా కథ?" అన్నది కాఫీసిఫ్ చేస్తూ కామాక్షి. "యెవరో ఇంటికి తీసుకెళ్ళి అడుగరాదు? తెలిసి పోతుంది" అని "లీలా! లీలా! ఒకసారి ఇలారామ్మా. ఈవిడే వంటమనిషి కావాలన్నది. మరి వెడతావా?" అన్నది పార్వతి. నల్లగా పొట్టిగా అందవికారంగా వున్న ఆ లీల సరేనని తల వూపింది.

"ఇప్పుడయినా బుద్ధితెచ్చుకో. అల్లరి చిల్లరివేషాలు మాని హాయిగా పనిచూసుకో" అని సలహాచెప్పి లీలని కామాక్షివెంట పంపింది పార్వతి.

"కొందరిదృష్టిలో జీవితంఅంటే చిల్లిపడ్డ బకెట్‌గా కనిపిస్తుంది. జీవితాన్ని అలా చూసేవాళ్లు సామాన్యంగా నష్టపోతూనేవుంటారు. ఒక నాలుగురోజులు వంటచేసి ఐదో రోజున లీల చెప్పకుండా పారిపోయింది" అంది. ఆ సంగతి చెప్పటానికి పార్వతిదగ్గర కొచ్చిన కామాక్షి అసలీ లీల ఎవ్వ

రని అడిగింది. లీలకథ లీల చెప్పుకున్నప్రకారం ఏమిటంటే తను మంచికుటుంబంలోనే పుట్టింది. తల్లీ, తండ్రీ, ఇద్దరన్నదమ్ములు ఉన్నారు. నల్లగా ఒంకరగా పొట్టిగా చట్టిముక్కుతో పరమవికారంగావుండే తన ఆకారం చాలా అందమయిందని ఆమెఅభిప్రాయం. కుటుంబంలో దరిద్రం ఎక్కువ. ఒక్కొక్క పరిస్థితిలో తిండికూడా సరిగ్గా వుండదు. ఇంతలో తల్లీతండ్రీ తనకు పెండ్లి చేశారనీ, ఆ మొగుడు నౌకరీచేస్తూ ఆఫీసులో డబ్బుకాజేసి జయిలుకెళ్లాడనీ, చెపుతుంది. ఇదీ ఆమెకథ. ఆ అమ్మాయిచూపులు అనుక్షణము మగవాళ్ళవయిపు ఆకలిగా చూస్తుంటాయి. పురుషుణ్ణిఆకర్షించాలని ఈ అందవికారపు పిల్ల చేసే ప్రయత్నం చూస్తుంటే జాలీ, కోపమూకూడా వస్తుంది. నాలుగేళ్ళపసివాడు మొదలుకొని ఎనభయియేళ్ళ వృద్ధుడివరకూ అందరూ తన్నే చూస్తున్నారని దాని అభిప్రాయం. అంతేకాదు, గర్వం కూడా.

పార్వతి చెప్పిన ఈ లీలకథ విని కామాక్షి ఆలోచించసాగింది. ఈ లీల అమాయికురాలు. తనలో యెంతో ఆకర్షణవుందనేవూహ ఆమెలో వేళ్లుతన్నుకుంది. ఈ అభిప్రాయం కాస్తోకూస్తో ప్రతిస్త్రీలోనూ వుంటుంది. అప్రయత్నంగా తనవంక తనుచూసుకుంది కామాక్షి. పార్వతి అదిచూసి నవ్వింది. ఇవాళ ప్రొద్దుటనుంచి అదోలా వుంది పార్వతి. కొద్దికొద్దిగా నడుంలో నొప్పులు వస్తున్నాయి. కడుపులో ఏవేవో చిన్న చిన్న కదలికలు ప్రారంభమవుతున్నాయి. పార్వతితల్లి లోపల అన్నీ సిద్ధంచేస్తూవుంది. కామాక్షితో మాట్లాడుతూనే ఒకటి రెండుతడవలు నడుంపట్టుకుంది పార్వతి. కామాక్షికి అర్థ

మయింది. పార్వతి ప్రసవించేదాకా వుండి, ఆపనీ ఈపనీ చేసి వెళ్ళమంది, పార్వతి తల్లి. పార్వతికి నొప్పులు ఎక్కువవుతున్నాయి. ఆమె బాధపడుతున్నకొద్దీ కామాక్షికి చిత్రంగా అనిపించింది. ప్రసవము ఇంతభయంకరమా? మరోజీవికి జన్మ యివ్వటానికి స్త్రీ ఇంత నరకయాతన అనుభవిస్తుందా? హృదయవిదారకమయిన పార్వతి కేకలు వింటున్నకొద్దీ కామాక్షికి ఆలోచనలవేగం అధికమవుతున్నది. ఒక అరగంటలో పార్వతి సుఖంగా ప్రసవించింది ఆడపిల్లని.

* * *

త్యాగరాయనగర్‌లో చక్కని చిన్నఇల్లు శర్మది. ఒక నాయర్ కుర్రవాడు వంట చేసిపెడ్తుంటే ఏవిధమయిన బాధలూ లేకుండా హాయిగా జీవిస్తున్నాడు. బంగళాముందు రకరకాల పూలమొక్కలూ, మేకప్ మీదవున్న ఎక్జిబిట్లాగ చక్కని సోఫాసీట్లూ రేడియోలు, తివాసీలతో నిండిన ఈ ఇంట్లోకి ప్రవేశించగానే సత్యవతికి చిన్న స్వర్గంలోకి ప్రవేశించినంత హాయి కలిగింది. ఆమెకోసం ఎదురుచూస్తున్న శర్మ హృదయపూర్వకంగా స్వాగతంచెప్పాడు సత్యవతికి. ఆ క్షణంలో అది ఒకసాంఘికచిత్రంలో సెట్టయినట్లూ, సత్యవతి హీరోయిన్‌గా, తను హీరోగా లౌసీన్‌లో యాక్ట్ చేస్తున్నట్లూ అనుభూతి కలిగింది శర్మకి. జన్మజన్మాంతరాల సంస్కారం రక్తంలో వుండటంచేత వివాహితయైన ఆ యువతిమీద తనకు కలిగిన చౌకబారు ఊహకి కళ్ళెంవేసి, సత్యవతితో మాట్లాడ్డం ప్రారంభించాడు. పరిసరవాతావరణం మధురంగా నిశ్శబ్దంగా వుంది. అసలు ఏకాంతమే నైతికపతనానికి మొదటిమెట్టు. ఏకాంత

ములో మనిషిమనస్సుని వుసుళ్ళదండులా ముసురుతాయి ఆలోచనలు. అందులో ఒంటరిగా స్త్రీ పురుషులు వుంటే, వారిద్దరిమధ్య నీతిదేవత నలిగి చచ్చిపోతుంది. యుగయుగాలుగా అంతుపట్టని స్త్రీపురుష ప్రణయరహస్యం ఏ స్త్రీకీ ఏ పురుషుడికీమధ్య కలుగుతుందో కేవలం ఆ సర్వాంతర్యామికే యెరుక. సత్యవతికీ శర్మకీ మధ్య ఒకప్పుడు కొన్నివూహాలుండేవి. కాని ప్రస్తుతం అలాంటిదేదీ లేదనే చెప్పవచ్చును. ప్రస్తుతసమస్య ఏమిటంటే, సత్యవతికి జీవనోపాధి కావాలి. అన్నకీ, ఒదినకీ తను భారంకాకూడదు. ఇప్పటికే తన ఒదినగారికి యెంతో లోకువయింది. అన్నకూడా యిదివరకంత గౌరవంగా చూడటం లేదు. తన రెక్కలమీద తను జీవించాలనే ఆమెఅభిలాష.

అంతా విని శర్మ నిట్టూర్పువిడిచాడు. నీవు చాల తెలితక్కువచేశావు సత్యవతీ! నువ్వతనిని వదిలిపెట్టి వచ్చేసిన కారణం చాలా చిన్నది. ఇంతకంటె మహామహా పెద్దకారణాలకే ఈ దిక్కుమాలిన దేశంలో భార్య భర్తను విడిచిపెడితే ఆమెకు ఎవ్వరూ సానుభూతిచూపరు. అలాటప్పుడు కేవలం ఒకచిన్నకారణానికే నీవురావటం అంతబాగాలేదు" అన్నాడు.

సత్యవతికళ్ళమ్మట నీళ్లు తిరిగినయి. "ఈ దిక్కుమాలిన దేశంలో ఆడదయి పుట్టినంతమాత్రంచేత చెంపకాయ తినికూడా చచ్చినట్లు పడివుండాలంటారు" అంది రోషంతో.

"పడుండాలని నేను అనటంలేదు; సానుభూతి దొరకదంటున్నాను అంతే. అయితే యిప్పు డేం చేస్తావంటావు?" అని అడిగాడు.

సత్యవతి కొంచెంసేపు ఆలోచించి "నేను బాగా పాడు తానని తెలుసుగా. ప్లేబాక్ పాడుదామని వుంది."

"సరే! దానికి ప్రయత్నిస్తాను. ఈలోగా మా స్టూడియోలో టెలిఫోన్ గరల్ పని ఒకటి కాళీగా వుంది. అందులో చేరు కానీ, మళ్ళీఒకసారి ఆలోచించుకోవటం మంచిది."

"నే నన్నీ ఆలోచించుకొనే వున్నాను. అతనికీ నాకూ ఇకముందు ఏ సంబంధమూ వుండదు."

"పిచ్చిగా మాట్లాడబోకు. జీవితం అంటే నువ్వను కున్నంత తేలికగాదు. ఇందులో సంబంధాలు తెంచుకుంటే తెగేఅంత ఓటివికావు. కొన్నాళ్ళు పనిచేసి చూడు. ఈలోగా యేమార్గం నీకు అనుకూలమని తోస్తే ఆ మార్గం అవలంబించ వచ్చును" అన్నాడు శర్మ.

"వెధవలోకం! ఎవరిబ్రతుకు వాళ్ళను బ్రతుకనీయదు" అన్నది సత్యవతి కసిగా.

"అలా బ్రతుకనిచ్చినా నీవు బ్రతుకలేవు ఒంటరిగా జీవించడం స్త్రీకి ఎంత నరకమో నీవు ఆలోచించివుంటే యిలా మాట్లాడవు. అయినా యెవరిబ్రతుకు వాళ్ళు బ్రతకటంలో అందం ఏమున్నది? స్త్రీ తన సౌందర్యాన్నిచూసి పురుషుడు మెచ్చుకోవాలని కోరుకుంటుంది. పురుషుడు తన ఆధిక్యతను చూపి స్త్రీని సమ్మోహితురాలిని చేయాలనుకుంటాడు. గాయ కుడు తన గానాన్నీ, చిత్రకారుడు తన చిత్రాన్నీ, కవి తన కవనాన్నీ లోకం మెచ్చుకోవాలని కలలుకంటాడు. మాన వుడు సంఘజీవి. ఒంటరిగాబ్రతకాల్సివచ్చినరోజున ఏ మనిషీ జీవించలేడు. అసలు యెవరిబ్రతుకు వారు బతకటంలోనూ,

మెవరిదారిన వారిని బ్రతుకనీయటంలోనూ, అందంలేదు" అన్నాడు శర్మ.

శర్మ చెప్పినదాంట్లో అసంభావ్యమేమీ కనిపించలేదు సత్యవతికి. కాని తనెందుకో ఆ మార్గంలో బ్రతకటానికి అవమానపడుతోంది. ఇంతలో పార్వతి జ్ఞాపకమొచ్చింది. ఆమె సౌమ్యవదనమూ, చల్లనిచూపులూ జ్ఞాపకమొచ్చినయి. ఈ పరిస్థితుల కనుగుణంగా ఆమె హాయిగానే జీవిస్తున్నది. ఎటు వచ్చీ తనకే ఆ వాతావరణం సరిపడలేదు. అయినా తన బావగారు భగవంతుడులాటివారు అనిపించింది సత్యవతికి. ఆయన పరధ్యానమూ, మంచితనమూ జ్ఞాపకమొచ్చి తను యేదో పోగొట్టుకున్నట్లు బాధపడింది. రేపు స్టూడియోలో కలుస్తానని శర్మకి చెప్పి ఇంటికి బయలుదేరింది. తనుచేసిందీ, చేస్తూవున్నదీ కూడా తప్పోఒప్పో తేల్చుకోలేనంత జడస్థితిలో పడిపోయిందామె. ఇంటికి వెళ్ళేసరికి అన్నగారదోమాదిరిగా చూస్తూ "యింత రాత్రిదాకా యెక్కడికి వెళ్ళావమ్మా" అని అడిగాడు.

"ఉద్యోగం సంపాదించుకొచ్చా నన్నయ్యా!" అంది.

మొదట "నీ గుప్పెడన్నం పెట్టలేనటమ్మా? నీవు ఉద్యోగం చేయాల్సినఖర్మ ఏమొచ్చింది" అని అన్నా, లాభనష్టాలు బేరీజువేసి చూసి వుద్యోగంచేయటమే మంచిది అని తేల్చుకొని "సరే నీయిష్టం" అన్నా డతడు. వదినగారు కాసేపు గొణిగినా భర్త తెలివిమీద అపరిమితమయిన నమ్మకం వుండటంవల్ల చివరికి మెదలకుండా వూరుకుంది.

"మరునాడు స్టూడియోలో శర్మ రికమెండేషన్ వల్ల తేలికగానే వుద్యోగం పొందగలిగింది ఆమె. ఇంటర్వ్యూ అయి, టాక్సీలో బయటకు బయల్దేరివస్తూవుంటే స్టూడియోలో ఒక చెట్టుకింద ఓ నల్లటి అందవికారపు అమ్మాయి పక్కనున్న కారుడ్రయివర్ కి తన్ను చూపిస్తూ ఏదో చెప్పి నవ్వుతోంది. సత్యవతి టాక్సీ నామెదగ్గరగా పోనిచ్చి "నీపేరు లీలకాదూ" అంది. లీల గర్వంగా సత్యవతివేపు ఒకచూపు చూసి చూశావ్ నా గొప్పతనం! అన్నట్లు ఆ డ్రయివరువేపు చూస్తూ "అవును" అంది. ఈ అందవికారపు అయోమయం లీలకే ఇంత ఆత్మధైర్యం వున్నప్పుడు తనకెందుకు లేకపోవాలి అనుకుంది సత్యవతి. లీలదగ్గర పాఠంనేర్చుకొంది ఆమె. గడుస్తున్న క్షణంతప్ప గడవబోయేక్షణం గురించి ఆలోచించనివాళ్ళు ఒకవిధంగా అదృష్టవంతులేనేమో! ఆ డ్రయివరుచేయి పుచ్చుకొని వూపుకొంటూ చాలా ఆనందంగా దర్జాగా నడిచిపోయింది ఆ అందవికారపు లీల. సత్యవతికి యెంతో ధైర్యం వచ్చి గబగబా టాక్సీయెక్కి "పోనీ" అన్నది. ఇప్పుడామె మనస్సు యెంతో తేలిక అనిపించింది.

తేనాంపేటబజారులో డ్రయివరుతో నడిచిపోతున్న లీల యేమాత్రం సిగ్గుపడటంలేదు. పయిగా చాలా ఆనందిస్తోంది. తనిప్పుడు ఒక సినిమాస్టారయిపోయింది. ఎంత లేదన్నా నెలకి పదిహేనురూపాయలుపయిన సంపాదిస్తోంది. ఊరికే రంగేసుకు నిలబడ్డందుకు మూడురూపాయలు ఇస్తారు. లీల సహజమయిన వాంఛలు గల ఆడది. ఆమెకు ఆకలి వేస్తుందీ, తినే పదార్థం యేదయినా యెక్కడిదయినా తిం

టుంది. నాగరికయువతిలాగా యిది అక్రమమా? సక్రమమా అని ఆలోచించే ఓపికా తీరికా కూడా ఆమెకులేవు. నిద్ర వస్తోందీ, ఏ స్టూడియో చెట్టుకిందో ఏ కారుసీడలోనో హాయిగా నేలమీద పడుకొని గంటలతరబడి నిద్రపోతుంది. అప్పుడప్పుడు ఆమెకు దైహికమయిన వాంఛ ప్రకోపిస్తుంది. అప్పు డామెకు యే పురుషుడయినాసరే. మరుక్షణంలో మామూలుమనిషి అయిపోతుంది. రేపటిసంగతి అసలు ఆలోచించదు. బ్రతుక లేనేమో అనే అధైర్యం ఆమెకు లేదు. తను స్త్రీ. తనలో కొన్ని అందాలూ ఆకర్షణాలూ వున్నాయని నమ్మకం. దారి పక్క దొరికే పూసలతోనూ యెవరన్నా పారవేసిన పూలదండ లతోనూ అలంకరించుకుంటుంది. ఏ సిగరెట్టుపీకయినా రోడ్డు పక్క కనిపిస్తే గబుక్కునతీసి నోట్లోపెట్టుకొని దారినపోయే పెద్దమనిషిని నిలవేసి అగ్గిపెట్టె అడుగుతుంది. ఆమెకు కారెక్కాలనిపిస్తే పరిగెత్తే ఏ టాక్సీనో ఆపి డ్రయివరుపక్క కూర్చుని వాణ్ణి కాస్తమురిపించి షికారు వెళ్ళొస్తుంది. ఇలాటి విచిత్రప్రకృతి గల ఈ అనాకారి లీల అంటే డ్రయివరు గోపా లానికి వెర్రిప్రేమ. దానికోసం వాడు చేయలేనిది లేదు. అది యెక్కడతిరిగినా ఏంచేసినా ఏమీఅనడు. లీల విసుక్కుంటూ వుంటుంది అప్పుడప్పుడు. "నీ వేమిటయ్యా! నాకు యీ లంప టం, హాయిగా చీకూచింతా లేకుండా బ్రతికేదానికీ. అప్పు డప్పుడు నిద్దర్లో నిన్ను చూడాలనిపిస్తే నీవు పక్కన వుంటావు, వుండకపోతావు. నీలాటివాడిమీద నాకు భ్రమతలెందుకూ? అసలు ఏలాటివాడిమీదనయినా నాకు భ్రమతలెందుకూ?" అంటుంది. లీలా, గోపాలం తేనాంపేట వీధుల్లో తిరిగితిరిగీ

పొద్దుగూకాక స్టుడియో కారుపెట్లోదూరి నిద్రపోయినారు. స్టుడియోఘూర్ఖాకి కూడా లీల అంటే సరదా. ఆమె లోపలికీ బయటికీ వస్తూపోతూవుంటే అతడేమీ అనడు.

* * *

సాయింత్రం ఆరయింది. విజయవాడనగరం ఎమ్యూజ్ మెంటుపార్కులో చవకబారు నర్తకిలా వికృతనాట్యం చేస్తున్నది. గవర్నరుపేటసెంటర్ లో ఆలోచిస్తూ నడుస్తున్న శివరావు లక్ష్మీటాకీస్ ముందు నుంచున్నాడు. అవయవ సౌందర్యం స్పష్టంగా కనిపించేలాగు ఒకతారబొమ్మ పెద్దసైజులో నిలబెట్టారు. కాసేపు ఆ తారనుచూసి గాంధీనగరంవేపు బయల్దేరాడు. గొడుగుదాటగానే పూలకుర్రాళ్ళు గులాబీపూవులు అమ్ముతున్నారు. వెర్రిగా ఒకరూపాయి గులాబీపువ్వులు కొన్నాడు. నవయువతిచెక్కిలిలాగా యెఱ్ఱగులాబీ రక్తాలు చిమ్ముతున్నది. గులాబీపూల సౌందర్యం శివరావుకి చాలా యిష్టం. అర్థంలేకుండా ప్రతిరోజూ గులాబీపూలు కొంటాడు. అవి వాడిపోయి రేకలు రాలిపోతూంటే అతనికి యెంతో బాధకలుగుతుంది. శివరావుజీవితానికీ ఆ గులాబీ పూలకీ అనిర్వచనీయమయిన సంబంధం వున్నది. ఆ గులాబీ పూలు ఏ సుందరిసిగలోనయినా అలంకరించుకుంటే అతనికి సంతోషం. కానీ అందులోవుండే ఆనందం అతనికి లభ్యం కాలేదు. అలా నడుచుకుంటూ వెళ్ళిన శివరావు డాక్టర్ మధుసూధనరావుఇంట్లో ప్రవేశించాడు. ఇక్కడికే ప్రతిరోజూ ఆమె వస్తూవుంటుంది. తెల్లగా పొడుగ్గా అందంగా వున్న ఆమెపేరు సునందన. ఆమె వేశ్య. మొదటిసారి డాక్టరింట్లో

ఆమెను చూసినప్పుడు సలుపంటే అసహ్యమూ తెలుపంటే ఆనందమూ పొందే శివరావు ఆమెను ప్రేమించాడు. సునందనకూడా యెవరినయినా చూసి పెళ్ళిచేసుకోవాలని వుద్దేశ్యంలో వుందేమో, అతని ప్రేమని వెంటనే ఒప్పేసుకుంది. ఇలా పెళ్లి చేసుకోవాలనుకుంటున్నామని డాక్టరుగారితో చెప్పటానికే శివరావు బయల్దేరాడు. శివరావు లోపలికి వెళ్ళేసరికి డాక్టరుగారు ఒంటరిగా కూర్చున్నారు.

"ఇన్ని గులాబీ లెవరికోయ్! సునందనకా యేమిటి?" అని నవ్వాడు డాక్టర్. ఆధునికుడు కవీ అభ్యుదయభావాలూ గల ఈ డాక్టరుగారంటే శివరావుకు చాలా యిష్టం. ఆయన ఏది వ్రాసినా శాస్త్రీయదృక్పథంతో నిర్దుష్టంగా వ్రాస్తాడు. యేది మాట్లాడినా హాస్యంగా అందంగా మాట్లాడుతాడు. ఈ డాక్టరుగారిదగ్గర రహస్యాలు దాచుకోవాలని యెవరికీ అనిపించదు. సునందనని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నానని ఆయనతో చెప్పాడు శివరావు. డాక్టరుగారు కొన్నిక్షణాలు ఆలోచించి "మీ ప్రేమగొడవ నేను చూస్తూనేవున్నాను. పెళ్ళిచేసుకోవటం అంత మంచిపని కాదేమో అని నా వుద్దేశ్యం. ఎందుకంటే ఆమె వేశ్య.కులానికి పట్టింపులేదునరే అనుకున్నా ఆమె అనాఘ్రాణితపుష్పంకాదు. ఏవిధంగాచూసినాఆమెను పెండ్లిచేసుకోవటంభవిష్యత్ జీవితంలోఅంతసుఖప్రదంగావుండదేమో అనిపిస్తోంది. మీకు పరిచయమయి ఇంకా నెలకాలేదు. అప్పుడే పెళ్ళిదాకా వచ్చింది మీ వ్యవహారం. ఇది నువ్వు ఆలోచించి చేస్తున్నపనిలాగ లేదు" అన్నాడు ఆయన.

శివరావు నవ్వి "మరి ఆమెకు మాటఇచ్చేశాను" అన్నాడు.

"శుభస్య శీఘ్రం! కానీండి" అన్నాడు నవ్వుతూ డాక్టర్. శివరావుమనస్తత్వమే ఒక పెద్ద సమస్య అయింది డాక్టరుకి. ఇతను చదువుకున్నవాడు, తెలివికలవాడు. అయినా గులాబీపూల విషయంలోనూ, తెల్లగావున్న ఆడపిల్లల విషయంలోనూ చాలా బలహీనుడు. "వెళతానండీ! సునందన ఇంటికి వెళతాను." అని డాక్టరుగారికి నమస్కారంచెప్పి సరాసరి సునందనయింటికే వెళ్ళాడు.

అది ఒక చిన్న పెంకుటిల్లు. చాలా శుభ్రంగా అలంకరించబడి వుంది. వాకిట్లో సునందనతల్లి మోహనాంగి కూర్చుని చుట్టతాగుతూంది. సౌందర్యపిపాసి అయిన శివరావుకి అది చూచేసరికి మనస్సు చివుక్కుమంది. తల వంచుకుని లోపలకు వెళ్ళాడు. మోహనాంగి తుపుక్కున వుమ్మేసి "అమ్మాయి స్నానంచేస్తావుంది బాబూ! కాస్సేపు కూర్చోండి. మీరేనా? అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాననా్నరంట" అన్నది. శివరావు జవాబిచ్చేందుకు అసహ్యించుకున్నాడు. యింతలో అలంకరించుకొని అపరమోహినీదేవతలాగ సునందన వచ్చింది. ఆమెను చూచేసరికి అన్నీ మరిచిపోయి ఆ గులాబీ పూలు ఆమెదోసిట్లో పోశాడు.

* * *

"శివరావు చేసుకున్న ఈ పెళ్ళివార్త ప్రతివాడి నోట్లోనూ వినిపించింది కొంతకాలం. తన వివాహవార్తను కంటకంమొదటిపేజీలో బాక్సుకట్టి ప్రకటించుకున్నాడు శివ

.రావు. నాలుగయిదు నెలలకి ఈ దుమారం యెలాగా అణిగి పోతుందిలే అనే ధైర్యముతో వున్నాడు శివరావు. వెంకట పతిగారుమాత్రం కామాక్షిని చేసుకోనందుకూ, తనప్లాను భగ్నమయినందుకూ విచారించాడు. "నీవెందుకు నాన్నా! విచారిస్తావ్ ? అత నేదో సరదాగా పెళ్ళిచేసుకుంటే నీదేం పోయింది. నన్ను పెళ్ళిచేసుకోలేదంటావ్ ? ఆ మాటకువస్తే ఒక్క శివరావేమిటి ? యెవరూ నన్ను పెళ్ళి చేసుకోవటంలేదు!" అని ఓదార్చింది.

"మళ్ళీ యెందుకురా పెళ్ళిచేసుకున్నావు?యిదివరకు చేసుకొని సుఖపడిచచ్చావుగనుకనా మళ్లీయిప్పుడు. అందులో సునందనా"అన్నాడురాజు. ఇప్పుడు సునందన మిత్రుడిభార్య అయిందన్నసంగతి మర్చిపోయి ఒక్క పార్వతిమాత్రం శివరావు వెళ్ళి పెళ్లిచేసుకున్నానని చెప్తే "ఈ తడవయినా సుఖపడవయ్యా"అని ఆశీర్వదించింది.పార్వతికి ప్రేమవివాహాలమీద అట్టే నమ్మకంలేదు.పిల్లకు మూడో నెలవచ్చింది.బంతిలా ఒళ్లు చేసింది రాజుకి కోర్టుకి వెళ్ళివచ్చిన తరువాత ఆ పిల్లతోటిదే ప్రపంచంగా వుంది. ఉత్తమయిల్లాలూ కొత్తగా మాతృ మూర్తి అయిన పార్వతి సర్వజనవంద్యురాలయిన పార్వతి లాగ వెలిగిపోతూన్నది. బిడ్డకు పాలిస్తూ కూర్చున్న పార్వతికి అప్పుడే యింట్లోకి వస్తున్న కామాక్షి అప్రయత్నంగా నమస్కరించింది.

"మీ ఆదర్శభారతనారీమండలి యేమయిందమ్మా!" అన్నది పార్వతి.

"ఆదర్శభారతనారీమండలంత న్యూసెన్సు సృష్టిలో మరొకటి లేదనుకో. సామాన్యంగా అక్కడికి చేరిన ప్రతీభారత నారీమణీ నగలమీద,చీరలమీద తప్ప మరిక దేనిమీదమాట్లా డదు" అన్నది కామాక్షి. "మరి నన్నుకూడా చేరుస్తానన్నావు కదూ" అన్నది నవ్వుతూ పార్వతి. "యేదో అన్నానుగానీ అక్కా! మా నాన్న అనుకున్నట్లు నేను రచయిత్రి నవటం యెంతనిజమో ఆదర్శభారతనారీమండలిలో ఆదర్శం వుండ టంకూడా అంతే నిజం" అన్నది కామాక్షి. పార్వతి నవ్వింది. పార్వతినవ్వులో వేయిమంది దేవతల మంచితనము వెల్లివిరి సింది. "శివరావుభార్యను చూద్దామనుకుంటున్నాను. టీకి రమ్మని పిలిచాడు. నువ్వుకూడా రారాదూ" అన్న కామాక్షి మాటకి పార్వతి నవ్వుతూ "నన్ను పిలువలేదుగా" అన్నది.

"ఒకవేళ తను వర్ణానంతరవివాహం చేసుకున్నాడని నువ్వు అసహ్యించుకోవటం లేదుగదా!"

"అలాటివి నాకెప్పుడూ లేవు. ఎవరికి సుఖమయిన పద్ధతిలో వాళ్ళ జీవితం నడుపుకుంటారు. మధ్యలో మనకే మిటి?" అన్నది పార్వతి.

"నినొ్నకటి అడుగుతా నక్కా,మరేమీఅనుకోవుకదూ."

"ఎందు కనుకుంటానమ్మా"

"ఎవరి కిష్టమయినపద్ధతిలో వాళ్లు జీవితాన్ని నడుపు కోవటం మంచిదేనంటావా?"

పార్వతి కొంచెంసేపు ఆలోచించింది. ఇతరులకు బాధ కలుగనంతవరకూ యెవరిపద్ధతిలో వారు జీవితాన్ని నడుపుకోవటం అంత విమర్శించదగ్గదిగాదు

"అయితే శివరావు చేసుకున్న పెళ్ళి సౌఖ్యవంతం అవుతుందని చెప్పగలవా?" అని సూటిగా ప్రశ్న వేసింది కామాక్షి.

"మనపద్ధతిలో ఆలోచిస్తే అది సౌఖ్యకరమవుతుందనే అనిపిస్తోంది. అతనిపద్ధతిలో దూరమాలోచిస్తే ఇది నిలచే వివాహం కాదని గ్రహించివుండగలిగేవాడు" అన్నది పార్వతి. "అయితే ఇది ఎక్కువకాలం నిలువదంటావా?" అని మరోప్రశ్న వేసింది కామాక్షి.

"అనే చెప్పాలి. సత్యవతీ రాజూ పెళ్ళిచేసుకున్నప్పుడు కూడా నాకిదే అనిపించింది. అది నిజంకూడా అయింది" అన్నది నిట్టూరుస్తూ పార్వతి.

"అన్నట్లు సత్యవతక్కయ్యదగ్గర్నుంచి ఉత్తరాలు వస్తున్నాయా?" అని కామాక్షి వేసిన ప్రశ్నకి పార్వతి కొన్ని క్షణాలు జవాబీయలేదు. తరువాత బిడ్డను ఊయల్లో పడుకో పెట్టి ఊయలని ఒకవూపువూపి మళ్ళీ వచ్చికూర్చుని,

"వచ్చిందమ్మా! ఏదో స్టుడియోలో టైపిష్టుగానో ఏదో చేరిందట. అన్నట్లు లీలకూడా ఆ స్టూడియోలోనే తిరుగుతూవుంటుందని వ్రాసింది" అని జవాబిచ్చింది పార్వతి.

"లీలా! లీల అక్కడెందుకుంది? పారిపోయి వెళ్ళిందా యేమిటీ? యేంచేస్తోంది?" అని ఆదుర్దాగా యెదురుప్రశ్న వేసింది కామాక్షి.

"అసలు ఉత్తరంలోసగం లీలనుగురించే వ్రాసింది. చాలా హాయిగా జీవిస్తూందట లీల."

"అంటే?"

"అంటే యేముందీ? ఆలోచించలేనివాళ్ళంతా సుఖపడతారు. ఆకలివేస్తే అన్నం, నిద్రవస్తే నిద్ర తప్ప మరొకదాన్నిగురించి ఆలోచించవలసిన ఓపిక, తీరికకూడా లేని లీల తప్పకుండా సుఖపడుతుంది. అందులో ఆశ్చర్యపడవలసింది ఏమీలేదు" అన్నది పార్వతి ఒక వుత్తమ రచయిత చెప్పినట్లు. తేలికగాచెప్పిన పార్వతి మాటలకూ, ఆమె వుత్తమ సంస్కారానికీ ఆశ్చర్యపోయింది కామాక్షి.

"వస్తానక్కయ్యా! శివరావు వెయిట్ చేస్తూవుంటాడు" అంది వాచీ చూసుకుంటూ

"వెళ్ళు. జాగ్రతగామాత్రం వుండు" అన్న పార్వతి మాటలకి నవ్వుతూ గడపదాటింది ఆమె.

"కామాక్షి వెళ్ళేసరికి శివరావుదంపతులు టీ తాగుతున్నారు. చల్లదనాన్ని కోరే ఆ వేసవిసాయంవేళ సునందన కట్టుకున్న తెల్లనిచీర, మల్లెపూవులూ, తెల్లని ఆ సుఘంధాయూ కలిసిపోయి వెన్నెలలో వున్నట్లు భ్రాంతి కలిగిస్తున్నాయి. ఎదురుగా టేబులుమీద గులాబీపూలరాశిఉన్నది. ఈవాతావరణం చూసిన కామాక్షి ఈ దాంపత్యం ఆట్టేకాలం వుండదని పార్వతక్కయ్య పొరపాటుపడలేదుగదా అనుకుంది. శివరావు కామాక్షిని సునందనకి, సునందనని కామాక్షికీ పరిచయంచేశాడు. కామాక్షిని శివరావు గౌరవిస్తున్నతీరు చూస్తే చచ్చేంత అనుమానంవేసింది సునందన తల్లి మోహనాంగికి. కొంచెంసేపు కూర్చొని లేచివస్తూ వివాహజీవితంలోని సుఖాలు తన కిహ అనుభవంలోకి రావేమో అనిపించి ఒక నిట్టూర్పు విడిచింది కామాక్షి. వివాహం అనేది ఒక సుడిగుండంలాంటిది. లోపల

వాళ్లు బయటికిరావాలని ప్రాణాలుగ్గపట్టుకొని మహాప్రయత్నం చేస్తూంటే బయటివాళ్లు కాలంచేత లోపలికి తోయబడతారని యెక్కడో చదివినది జ్ఞాపకమొచ్చింది ఆమెకు.

* * *

స్టుడియోలో టెలిఫోన్ దగ్గర కూర్చుని ఆలోచిస్తూంది సత్యవతి. ఎవరో వస్తున్నారు, పోతున్నారు. ఆమెకు అవేమీ పట్టటంలేదు. ఆమె మనస్సులో యిద్దరే వ్యక్తులు సుడిదిరుగుతున్నారు– రాజూ, శర్మ. ఆరోజు పార్వతక్కయ్య వుంటే రానిచ్చేదికాదు. నిషేధించిన ఫలం తినిన " ఆదం, " అది తినమని బలవంతపెట్టిందని "యీవు" మీదికి తోసేస్తే "యీవు" పాముమీదకు తోసేస్తుంది. అలావుంది నా కథ– అనుకుని తలెత్తింది సత్యవతి. ఎదురుగుండా లీల!

"ఏం లీలా! యిలావచ్చావ్?" అంది సత్యవతి.

"ఏం లేదు. మీపక్కన యేదో ఉత్తరంవుంటే పార్వతమ్మగారు వ్రాసేరేమోనని వచ్చాను. వారు కులాసాగా వున్నారాండీ! ఈ తడవ మీరు వ్రాసే ఉత్తరంలో లీల నమస్తే చేసిందని వ్రాయండి" అన్నది మేకప్ మీదవున్న లీల కళ్లు తిప్పుకుంటూ.

లీల కళ్ళుతిప్పుకోటం చూస్తే సత్యవతికి నవ్వొవచ్చింది. నవ్వుతూనే "ఇవాళ యేమివేష మేమిటే?" అన్నది.

"ఇవాళ రెండు డైలాగులుకూడా వున్నాయండోయ్, రిహార్సలు కెళ్ళాలి" అంటూ చెట్టుకింద కారుదగ్గర బీడీ కాలుస్తున్న గోపాలందగ్గర కెళ్లింది లీల.

తను లీలలా హాయిగా యెందుచేత బ్రతుకలేకపోతూ వుందో ఆమెకు అర్థంకాలేదు. లోకంలో రెండురకాల స్త్రీలే సుఖపడతారు. ఒకటి పార్వతక్కయ్యలాంటివాళ్లు. వాళ్ళకి సుఖంతోపాటు గౌరవంకూడా వుంటుంది. రెండు: లీలలాంటి వాళ్లు. వీళ్ళకి గౌరవం వుండదు కానీ, సుఖం వుంటుంది. తన లాంటివాళ్ళకి గౌరవమూ వుండదు, సుఖమూ వుండదు. ఒక నిట్టూర్పు విడిచింది సత్యవతి. ఇంతలోనే శర్మ కారుదిగి సత్య వతిదగ్గర కొచ్చాడు. సత్యవతికి శర్మ రావటం ఒకవిధమయిన హాయినిచ్చింది. ఎయిర్‌కండిషన్ లేని స్టుడియోనించి పైకి వచ్చినట్లుంది. "నీ డ్యూటీ యెంతవరకూ?" అన్నాడు శర్మ.

"అయిదున్నరవరకూ వుంది" అంది సత్యవతి.

"నువ్వీమధ్య మరీ నీరసంగా వుంటున్నావు సత్యావతీ! ఇవాళ యింటికి వద్దు. భోజనంచేసి అలా బీచీకి పోయి కాసేపు కూచొనివద్దాం" అన్నాడు శర్మ.

సత్యవతి మాట్లాడలేదు.

"నాతో రావటం నీకు ఇష్టంలేకపోతే, యెవరయినా యేమయినా అనుకుంటారనిగానీ వుంటే రావద్దు" అన్నాడు శర్మ.

సత్యవతి తెల్లబోయింది. తన మనస్సులో వున్న వూహాలు అతను పసికట్టినందుకు ఆశ్చర్యపడింది కూడా. ఆమెకు యెప్పుడూ నిజంచెప్పటం భయం. అందుకనే తప్ప కుండా వస్తానని చెప్పింది శర్మతో. ఇంతలో డ్రయివరు గోపాలంతో బాతాఖానీ పూర్తిచేసి లోపలకొస్తున్న లీల

పార్వతమ్మగారికి నమస్తే అని వ్రాయటం మర్చిపోకండేం అని మరోసారి జ్ఞాపకంచేసివెళ్లింది.

"పార్వతి యెవరూ?" అన్నాడు శర్మ.

"దేవత" అన్నది సత్యవతి

"సాయంత్రం ఆరుఅయింది. రంగురంగుల చాక్లెట్లు సీసాలో పోసినట్లు వున్నది బీచి. సౌందర్యవతిపాపిడిలా వున్న మెరీనారోడ్డుమీద కార్లు జారిపోతున్నాయి. సత్యవతీ శర్మ కారుదిగి యిసకలో కూర్చున్నారు. దొంగతనంచేసిన పళ్ళు యెప్పుడూ తీయగానే వుంటాయి. మనకిచ్చిన పండుకన్నా, మనము బజారులో కొనుక్కున్న పండ్లుకన్న, పక్కవాడి దొడ్లోంచి కోసినపండే చాలా తీయగా వుంటుంది. అది మానవస్వభావం. భగవంతుడు యే పండుసయితే తినవద్దని నిషేధించాడో, ఆ ఫలాన్నే తిన్నారు ఆదం, యీవులు. కాశీమజిలీకథల్లో యేదిక్కుకయినా వెళ్ళు, కానీ వుత్తరపు దిక్కుకి వెళ్ళొద్దు అంటుంది, రాజకుమారుణ్ణి పేదరాశిపెద్దమ్మ. ఆ దిక్కుకే వెడతాడు రాజకుమారుడు. యేది నిషేధిస్తే అదేమిటో తెలుసుకోవాలనీ, అనుభవించాలనీ ఆరాటపడతాడు మానవుడు. సత్యవతికి, శర్మకి మధ్య కొన్నిసంబంధాలకి నిషేధం వున్నది. అయినా ఆ నిషేధించబడిన సంబంధమే పెంపొందుతుంది. అదే జీవితంలో విచిత్రం.

నైతికమైన విలువలమీద సత్యవతికి అభిమానం అట్టే లేదు. పురాణాల్లోనూ కథల్లోనూ చెప్పినట్లు ఆచరించక పోయినా ఆదర్శాలు మాత్రం కొన్నివున్నాయి. తనంతటికి తాను బ్రతకాలనేది ఆ ఆదర్శాల్లో ఒకటి. ప్రేమించాలి.

కానీ వ్యభిచరించకూడదనేది ఆ ఆదర్శాల్లో రెండోది. ఐతే వాటిని ఆచరణలో యెలా పెట్టాలో ఆమెకు తెలియదు. రాజుని తను ప్రేమించలేదనీ, ప్రేమ అనుకొని భ్రమపడ్డాననీ, యిప్పుడామె అనుకుంటోంది. కానీ అంతరాంతరాల్లో అతడిమీద వుండే కోపంచేత తను అతడిని ప్రేమించటంలేదనుకొని తృప్తి పడుతున్నానేమోనని భయంకూడా వుంది. అదీకాక కామోద్రేకాన్ని రెచ్చగొట్టే ఈ వాతావరణంలో అతడితో వంటరిగా కూర్చోటం తప్పని రక్తగతమైన జన్మజన్మాంతరాల సంస్కారం ఆమెను హెచ్చరించింది. ఆమె లేచి నించుని,

"నాకెందుకో భయంగావుంది శర్మా! వెళ్లిపోదాం పద" అంటూ కారుదగ్గరకు నడిచింది. ఆమె తనమనస్సులో పడుతున్న వ్యథనంతటినీ అతను గ్రహించాడు. సత్యవతిని పాడుచేద్దామని అతనికెప్పుడూ లేదు. ఆమెను ఒక వ్యక్తిగా చేసి తనతప్పు తను తెలుసుకునేలా చేయాలనేదే అతని దృక్పథం. నిశ్శబ్దంగా అతడు సత్యవతివెంబడి నడిచాడు. ఆమెను సంతోషంగావుంచటానికి బీచికి తీసుకవచ్చాడేకాని యిలా బాధపడుతుందని తెలిస్తే తీసుకవచ్చేవాడే కాదు. ఈమాట పయికన్నాడు కూడా.

"యేమిటో శర్మా! నాకు జీవితంలో ఆనందమేమీ కనిపించటంలేదు. బతకాలనికూడా అనిపించటంలేదు." అన్నది నిట్టూర్చి సత్యవతి.

"చిన్నప్పుడు పుస్తకంలోంచి నాకు రాని పాఠంకాగితాలు చింపి అవతల పారేసేవాడిని. అంతమాత్రాన నాకు ఆ పాఠంవచ్చినట్లేనా?" అని నవ్వాడు శర్మ.

"మనిషి అనేవాడు యెందుకు బ్రతుకుతాడో అర్థం కావటంలేదు. అసలు బ్రతుకు అనేదానికి అర్థం అనేది లేదు."

"నీవు చాలా భ్రమపడుతున్నావు సత్యవతీ! జీవితం ఎప్పుడూ జీవించటంకోసమే. ఎన్నికష్టాల్లోనయినా శ్వాస పీల్చి జీవించటంలో మనిషి అపూర్వానందం అనుభవిస్తాడు. చచ్చిపోవాలని కుష్టురోగంతో బాధపడుతున్నవాడు కూడా అనుకోడు. వాడూ జీవించాలనే అభిలషిస్తాడు. మరి నువ్వెందు కింత నీళ్లుకారిపోతున్నావో అర్థంకావటంలేదు."

"నాకేముంది చెప్పూ. తల్లి, తండ్రి లేరు. కట్నమివ్వాలిసొస్తుందని దొరికినవాడికేసి కట్టాడు అన్నయ్య. అందులో కొంచెం నాతప్పూ వుందనుకో. అది వేరేసంగతి. పోనీ, ఆ దొరికినవాడయినా సవ్యమైనవాడా అంటే అదీలేదు. మళ్లీ అన్నయ్యకి వదినకి భారంగా వచ్చాను. ఏదో నీపుణ్యాన ఉద్యోగందొరికింది గానీ, అందులోనూ నే నిమళ్ళేకుండా వున్నాను" అన్నది నిట్టూరుస్తూ సత్యవతి.

"తెలివితక్కువవాడు పరిసరాలకి అనుగుణంగా మారితే తెలివిగలవాడు పరిసరాల్ని తనకనుగుణంగామార్చుకుంటాడు. నీకీ రెండూ చేతకావటంలేదు. తెలివిగలదానివీ కావు, తెలివితక్కువదానివీకాదు. నిర్దిష్టమయిన అభిప్రాయాలు కొన్ని వుండటం ప్రతివ్యక్తికీ అవసరం- అది తప్పయినా సరే. అది నమ్మి ధైర్యంగా ఆచరిస్తే జీవితంలో వాడు ముందుకు పోతాడు!.

"ఏమిటో శర్మా! నువ్వెన్ని చెప్పినా జీవితంలో నాకే ఆకర్షణా కనిపించటంలేదు."

"సరేలే! ఎందుకొచ్చినవాదన? కారెక్కు, ఇంటిదగ్గర దిగబెడతాను" అని కారుతలుపు తీశాడు శర్మ.

"ఏమిటో, జీవితంలో ఓడిపోయాననిపిస్తోంది" అంటూ కారెక్కింది సత్యవతి. కారు జవరాలిపయ్యెదలా తారురోడ్డు మీద జారిపోయింది.

* * *

"నన్ను పెళ్ళిచేసుకునేప్పుడు నే నెటువంటిదాన్నో తెలిసే పెళ్ళిచేసుకున్నారు. అలాటప్పుడు చీటికీమాటికీ జాగందీ గీగందీ అనాల్సిన అవసరం మీకులేదు" అన్నది సునందన మండిపడుతూ.

శివరావుమొహాన కత్తివాటుకి నెత్తురుచుక్క లేదు. తను ఉద్ధరించి వివాహంచేసుకొన్న సునందన ఈనాడిలా ఎదురుతిరుగుతుందని కల్లోకూడా అనుకోలేదు. సునందనకి వేలువిడచిన మేనమామ ఒకడున్నాడు. వాడిపేరు మాధవుడు. అత నీయింటికి వస్తే శివరావుకి మంట. సునందనని అతను పెడమార్గంలో పెడతాడని అనుమానం. నిన్నరాత్రి శివరావు యింటికి వచ్చేసరికి సునందన, మేనమామా మాట్లాడుతున్నారు. అదీ శివరావుకోపానికి కారణం. అతనితో మాట్లాడటానికి వీల్లేదని చెప్పాడు సునందనతో. ఆమె ధర్రుమంది.

"ఏం? యెందుకు పిల్లేదూ? మేనమామ యింటికివస్తే కూడా మాట్లాడనంత పాతివ్రిత్యంచేస్తానని మీా కేం మాటి వ్వలేదు నేను" అన్నది కోపంగా.

"పాతివ్రిత్యం! ఆ నాలుగక్షరాలు యెందుకు చెడ గొడతావ్?" అన్నాడు శివరావు. పాతివ్రిత్యం అన్నమాట నొక్కి పలుకుతూంటే సునందన కోపం తారామండలాన్ని అందుకుంది.

"అవును. ఆ మాట అనటానికికూడా మాకు అధికారం లేదు. నిజమే! నేను వేశ్యని. ఆ విషయం ఒప్పుకుంటున్నాను. పోనీ, తమకి యేకపత్నీవ్రితం అన్నమాట అనటానికి అర్హత యేమయినా వున్నదేమో ఆలోచించుకున్నారా" అన్నది షెలీమని. శివరావుకి దిమ్మతిరిగిపోయింది. ఒకవేళ తను పెళ్ళాన్ని ఒదిలేసినసంగతి ఈమెకి తెలియలేదుకదా అను కున్నాడు. అవును. ఆమె పతివ్రితా కాదు, తనుఏకపత్నీవ్రితుడూ కాడు. అలాటప్పుడు ఆమెను అని యేమి ప్రియోజనం, అను కున్నా డతడు. ఈమధ్య వీళ్ళిద్దరికి యేదోపోట్లాట వస్తూనే వుంది. శివరావు శాకాహారి. ఆమెకు రోజూ కైమావుండలూ, కోడిగుడ్లు వుంటేగాని ముద్దదిగదు. అవిచూస్తే అతనికి అస హ్యం. శాకాహారమే ఆమెను తెమ్మంటాడు. శివరావు ఆ మాట అన్నరోజున మీా యిష్టాలని నా నెత్తిమీాద రుద్దటానికి యెప్పుడూ ప్రియత్నించబోకండి" అన్నది సునందన. అత నికి వేశ్యలోవుండే రసికతా కావాలి, భార్యలో వుండే ఇల్లాలి తనమూ కావాలి. ఆమెలో రసికతవుంది కానీ రెండోది లేదు. వుండటం అసంభవంకూడా. అది ఆమెరక్తంలోనే లేదు. శివ

రావు చివాలున లేచిపోయినాడు. ఆ వెళ్లటం వెళ్లటం డాక్టర్ మధుసూదనరావు డిస్పెన్సరీకి వెళ్ళాడు. డాక్టరుగారు అతన్ని చూడగానే,

"ఏమిటోయ్ మై డియర్ షేక్స్పియర్! మొగం వేల వేశావ్?" అన్నాడు నవ్వుతూనూ.

"డాక్టరుగారు రచయితకూడా. మారుపేరుతో ఆయన వ్రాసిన కొన్నివ్యాసాలు రాజకీయప్రపంచాన్ని ఒకవూపు వూపి వదిలినాయి. అమితమేధానంతుడయిన ఆయనకి యేదీ సీరియస్‌గా కనిపించదు శివరావును నవ్వుతూ అలా పలుకరించి నర్సుని పిలిచి కాఫీతీసుకరమ్మని,

"యేమిటయ్యా, అలావున్నావ్? మీపత్రిక యెలా నడుస్తోందేమిటి?" అని ప్రశ్నించాడు.

"పత్రికేం? బాగానే వుంది."

"అయితే బాగాలేంది ఏమిటి?" అన్నాడు నవ్వుతూ డాక్టరుగారు.

"ఏమిటో, డాక్టరుగారూ! మనము అనుకున్న దొకటి అయితే అయేది మరొకటి" అంటూ అక్కడున్న కుర్రవాణ్ణి పిలిచి ఓ రూపాయి గులాబీపూలు తీసుకురమ్మన్నాడు.

"నీ కీ గులాబీపూల పిచ్చేమిటో నాకు అర్థంకాకుండా వుందయ్యా! యెక్కడయినా పూలపిచ్చి ఆడవాళ్ళకుంటుంది కానీ, మగవాళ్ళకుండటం యెక్కడా చూడలేదు."

"ఆ పూలఅందం చూస్తే మీకేమీ అనిపించదా డాకరుగారూ? వాటిని చూస్తుంటే నాకెంతో శాంతిగా వుంటుంది. వాటిరేకుల్ని చూస్తుంటే.........!"

"అందమయిన అమ్మాయిల పెదవులు జ్ఞాపకమొస్తాయి అంతేనా? కవిత్వాన్ని కవిత్వంగానే వుండనీ. జీవితంలో దాన్నెప్పుడూ ప్రవేశపెట్టకు. దానివల్ల అనర్థం తప్ప మరేమీ మిగలదు."

"మీరు వెయ్యిచెప్పండి, లక్షచెప్పండి. వాటిల్లో వేయిమంది అప్సరసల అందాలు కనిపిస్తాయి నాకు. వెయ్యి చందమామల వెన్నెలలు మురిపిస్తాయి."

"ఓరి నీకవిత్వం పాడుగాను, యింత చాదస్తుడివి, నీతో ఆ అమ్మాయి యెలా కాపురంచేస్తుందయ్యా?" అన్నాడు డాక్టర్ నవ్వుతూ.

"అసలు చేస్తుందా అన్నదే నాకూ అర్థంకావటం లేదు."

"కొంపతీసి తగూలేమీ ఆడుకోలేదుకదా?"

"తగూలంటే తగూలుకావు అనుకోండి. అయినా మనస్సులు కలవటంలేదు."

"ఆ సంగతి నే నెప్పుడో చెప్పాను. కనిపించిన ప్రతి అందమయిన స్త్రీనీ ముందు వెనుకలు చూడకుండా పెళ్లిచేసుకుంటే యిలాగే అవుతుంది. పెళ్ళిచేసుకునే ఆడవాళ్లు వేరయ్యా బాబూ! వాళ్ళు సత్యనారాయణవ్రతం పీటలమీదకి పనికివస్తారు. అంతేకానీ సునందనలాటి స్త్రీని నువ్వు నీ ఒక్కడికే వుండాలనుకోటం ఆమెకూ, లోకానికీకూడా అన్యాయం చేసినట్లు" అన్నాడు డాక్టర్, కాఫీకప్పు శివరావుముందుకు తోస్తూ.

ఇంతలో బోయ్ గులాబిపూలు తీసుకువచ్చాడు. శివరావు ఆ పువ్వుల్ని అందరికీ పంచాడు అవి రావటంతో అక్కడి వాతావరణమే విలక్షణంగా మారిపోయింది. లోషన్ వాసన, మందులవాసనలతో గులాబీలవాసనకూడా కలిసి విలక్షణమయిన గుబాళింపుయేర్పడింది.

"ఏమిటో డాక్టరుగారూ! జీవితంలో యెప్పుడూ పొరపాట్లే జరుగుతున్నాయి. నాకు నలుపంటే అసహ్యం. నాభార్య నల్లటిది. సౌందర్యంకోసం ఈమెను వివాహంచేసుకున్నాను. ఈమె తన ప్రవర్తనచేత నన్ను బాధపెడుతూంది. జీవితంలో నాకు సరిపడిన స్త్రీ ఇక దొరకదేమో అనిపిస్తోంది.

"ఏ స్త్రీ నయినా నీకు కావలసిన అన్నిలక్షణాలతో వుండాలని కోరుకోవటంకంటే, నీకు కావలసిన అన్నిలక్షణాలూ ఆమెలో పెంపొందించుకోవటం మంచిది.

"అది యెలా సాధ్యమవుతుంది? మనకనుగుణంగా ఆమె మారుతుందని నమ్మకం యేమిటి? సునందన మారింది గనుకనా?"

"స్వేచ్ఛగా హాయిగా యెగిరే విహంగాన్ని పంజర విహంగంచేయటానికి నీవు ప్రయత్నిస్తే ఆ వూచలు విరకొట్టడానికి ఆమె ప్రయత్నిస్తోంది. ఇందులో యెక్కువ తప్పు నీదేనని చెప్పవచ్చును."

"అవును, డాక్టరుగారూ! మీరు చెప్పింది నిజం. నా అభిప్రాయాల్ని ఆమెమీద రుద్దటమెందుకూ? అదుగో, కామాక్షి వస్తూంది మీ డిస్పెన్సరీకి. యేం ఏమన్నా ఒంట్లో

బాగాలేదేమిటి?'' అన్నాడు శివరావు.

కామాక్షి గజలక్ష్మిలా ప్రవేశించింది.

"ఏం నల్లపిల్లా! చెయ్యివాపు తగ్గిందా?" అన్నాడు డాక్టర్.

"శివరావుగారూ! మీకు జబ్బేమిటండోయ్, యిట్లా దయచేశారు"అన్నది టేబిలుమీద వున్న గులాబీపూలు తల్లో పెట్టుకుంటూ.

"శివరావు! నీ గులాబీలు సార్థకమయినాయయ్యా!" అన్నాడు డాక్టర్.

"రామరామ! డాక్టరుగారూ! ఆ గులాబీలు నేను ముట్టుకుంటే మాసిపోతాయండీ. అందులో యీయనకి నలుపంటే అసహ్యంకూడానూ"అని శివరావువైపుతిరిగి "ఏమండీ! మీ గులాబీ చెక్కిళ్లు నేను ముట్టుకుంటే మాసిపోతాయికదూ" అన్నది కామాక్షి.

"శివరావ్! నువ్వొత్త చమురుకళ్ళవాడివయ్యా! కామాక్షమ్మను కట్టుకుంటే తీరిపోనా"అన్నాడు డాక్టర్.

"మా నాన్నప్లాను అదే. నేనే పడనిచ్చానుకాదు." అన్నది కామాక్షి. శివరావు లేచినించొని "అవును డాక్టరుగారూ, జీవితంలో నేనెప్పుడూ పొరపాట్లు చేస్తూవుంటాను." అని వెళ్ళిపోయినాడు. కామాక్షి చాలా ఆశ్చర్యపడ్డది. డాక్టర్ నవ్వుతూ "చూశావా, కామాక్షీ! నిన్ను పెళ్ళిచేసుకోకపోవటం పొరపాటని ఒక పురుషుడు అనుకుంటున్నాడు. ఏదీ, చెయ్యిలా యియ్యి" అన్నాడు డాక్టర్ కొంటెగా.

"డాక్టర్ మధుసూదనరావుదగ్గర ఒక నర్సు వున్నది. ఆమెపేరు లిల్లీ గ్రేస్. ఆమె తల్లితండ్రులకి యిష్టంలేకుండా క్రిష్టియన్ సాంప్రదాయానికి విరుద్ధంగా తనతో చదువుకునే తురకతన్ని పెళ్ళిచేసుకుంది. త్వరలోనే ఆ ప్రేమ భ్రమకాగా సాయబుచేత చావుదెబ్బలుతిని పిల్లనెత్తుకొని పుట్టింటికి వచ్చేసింది. తల్లీ తండ్రీకూడా నీచంగాచూడటంతో విజయవాడ వచ్చి డాక్టరుగారిదగ్గర నర్సుగా ప్రవేశించింది.

డాక్టర్ నవ్వుతూ కామాక్షివంక చూసి "ప్రేమించి పెండ్లి చేసుకున్నాననుకున్న రాజూ సక్సెస్ కాలేకపోయినాడు, ప్రేమించి వర్ణాంతరవివాహం చేసుకున్న శివరావూ తప్పిపోయినాడు. ప్రేమించి మతాంతరవివాహం చేసుకున్న మా లిల్లీ సుఖపడటంలేదు. ఇదంతా చూస్తుంటే ప్రేమించటం అంత బుద్ధితక్కువపని సృష్టిలో మరొకటి లేదనిపిస్తూవుంది" అన్నాడు.

"అలా అనుకున్నవాళ్లే క్షణంలో ప్రేమలో పడిపోతారు. అయితే డాక్టర్! శివరావూ, సునందన తగువులాడుకున్నారా?" అన్నది జడ చేతికి మెలివేసుకుంటూ కామాక్షి.

"నువ్వూ ప్రేమను విమర్శిస్తావుకదాఅని అన్నాను. అయినా ప్రేమేమిటి నామొఖం. అదంతా రచయితలుచేసే న్యూసెన్సు. విఫలప్రేమచేత గుండెపగిలిందంటాను......"

"గుండెపగిలితే ఎలాబ్రతికాడూ అని మీ సందేహం. అవునా? మరి నేను ఆడపిల్లని: యివన్నీ మీతో మాట్లాడకూడదు" అంది మొగం అటుతిప్పుకొని కామాక్షి.

"ప్రమాదంలేదు. నేను డాక్టర్ని. వ్యాధికీ ఆధికీగూడ నేను మందిస్తాను. కాబట్టి నిరభ్యంతరంగా మాట్లాడవచ్చును. అయితే, కామాక్షీ, నువ్వు పెళ్ళెప్పుడు చేసుకుంటావ్?"

"అది మా నాన్ననడగాల్సిన ప్రశ్న. ఆయన కొయ్య బొమ్మను తెచ్చి కట్టినా నోరెత్తకుండా చేసుకోదలచుకున్నాను"

"మరి శివరావు నెందుకు చేసుకోలేదూ?" అన్నాడు డాక్టర్. కామాక్షి కొన్నిక్షణాలు మాట్లాడలేదు. తరువాత "మీరడిగిన ప్రశ్నే నన్ను నేను యెన్నోసార్లు వేసుకున్నాను. నా కెందుచేత యిష్టంలేదో నాకే అర్థంకాలేదు. దానికి కారణంవుందని నిన్న తెలిసింది."

"ఏమిటదీ?"

"అతని కిదివరకే పెండ్లి అయింది."

కొన్నిక్షణాలు ఆగి,

"నాకు తెలుసు. ఇలాంటిదేదో వుందని నాకనుమానం గానే వుంది. నా ఉద్దేశం నువ్వు నల్లగావుండటంచేత అతణ్ణే యిష్టపడలేదని. సరే, ఈ సంగతి నీకెలా తెలిసిందీ?"

"మా మామయ్య అత్తారివూరు అదేగా. ఆ అమ్మాయి యిప్పుడూ వదువుకుంటూందట."

"ఎందు కొదిలేశాడు ఆ పిల్లని? అదికూడా తెలుసా?"

"నల్లగా వుంటుందని కాబోలు" అని నవ్వింది కామాక్షి.

"అతనిది చాలా విచిత్రమయిన మనస్తత్వం. సౌంద ర్యాన్ని ప్రేమిస్తాడు. కాని దాన్ని యెలా సమకూర్చుకో వాలో తెలియదు. గులాబీపూలు యిష్టం. వాటిని పెంచి

ఆనందించటం తెలియదు. కాని ఆనందిస్తాడు. సునందన్ని వేశ్య అయినా అందంగా వుంటుందని పెళ్ళిచేసుకున్నాడు. ప్రస్తుతం యితనికీ ఆమెకీ కలవటంలేదు. నా ఉద్దేశ్యం ఇది కూడా చివరంటా వెళ్ళదనే."

"అయితే డాక్టరుగారూ! యిన్నాళ్లు మీారెందుకు పెళ్ళిచేసుకోలేదు?"

"పెళ్లిచేసుకోకపోవటమేమిటి? నాకు చిన్నతనంలోనే పెళ్ళి అయింది, ఆవిడ పోయింది."

"మరి మళ్లీ పెళ్ళి యెందుకు చేసుకోలేదూ?"

"ఆ ... ఒక ఆడదానికి పెళ్ళామంటూ పుస్తెకడితే యెక్కడాలేని అధికారంచలాయించి ప్రాణంతీసేస్తుంది."

"ఆ మాటకొస్తే మొగాడూ అంతే"

"అదే నాకు నచ్చదు. పెళ్ళికాగానే సర్వభారాలూ ఈ అభాగ్యుడినెత్తిన వేసేసి,నాకోరిబ్బనుముక్క తెచ్చిపెట్టరూ. చెయ్యి నెప్పిగావుంది. కట్టుకట్టరూ. అని కళ్ళు తేలేసే ఆడదాన్నిచూస్తే నా కసహ్యం. అర్థంలేకుండా ప్రతిదానికీ మొగుడిమీాద ఆధారపడటం మన ఆడవాళ్ల కలవాటైంది. అలా ఆధారపడని ఆడది ఎవతైనా దొరికితే తప్పకుండా పెండ్లిచేసుకుంటాను" అన్నాడు డాక్టర్.

"అక్కడే మీారు పొరపాటుపడుతున్నారు. అలా ఆధారపడినట్లు నటించటంలో ఆడదానికి అపరిమితమయిన తృప్తి కలుగుతుంది. తన సర్వభారాలూ భర్తమీాదవేసేసి నిశ్చింతగా జీవించటంలో ఆమె ఆనందం అనుభవిస్తుంది పోనీ కనీసం అలా నటిస్తుంది" అన్నది కామాక్షి.

"స్త్రీజీవితం అంతా నటించటంతోనే గడిచిపోతుం దంటాన్."

"స్త్రీ యేమిటి, పురుషు డేమిటి! కొన్ని సమయాల్లో యెవరయినా నటించక తప్పదు."

"అందులో దక్షిణనాయకుడయిన పురుషునికి మరీను" అన్నాడు డాక్టర్ కొంటెగాచూస్తూ. ఆ మాటకి అర్థం తెలిసినా తెలియనట్లు నటించింది కామాక్షి.

"అమాయికపు ఆడపిల్లలముందు అలంకారశాస్త్ర పాండిత్యం అంతగా అవసరం వుండదు" అన్నది. తనన్న మాటకి అర్థం ఆమె గ్రహించీ గ్రహించనట్లు నటిస్తున్నదని డాక్టరుకి తెలిసింది.

"నువ్వు రచయిత్రివి ఏమో కానీ, గొప్ప నటివి మాత్రం అవుదు" అన్నాడు.

కామాక్షి మొహం గంభీరంగాపెట్టి "నే నాడుపిల్లని డాక్టరుగారూ! నా కన్నీ తెలిసినా తెలియనట్లు నటించాలి. యిన్నాళ్లూ అలా నటించటం చేతకాకపోవటంవల్ల లోకంలో అపకీర్తిపాలయినాను. ముఖ్యంగా యీ వయస్సులో నాకు వివాహం కావాలంటే కొంత అమాయకత్వం నటించాల్సి వుంటుంది" అన్నది నిట్టూరుస్తూ.

"నీలాగ హాయిగా కల్మషంలేకుండా నిజంచెప్పేవాళ్లను చూస్తే నా కెంతో యిష్టం. నువ్వు యిప్పుడుచెప్పినట్లు నిజం చెప్పటం అంత మంచిదికాదేమో." అన్నాడు డాక్టర్ సాలోచనగా.

"అది సరేగానీ మీ లిల్లీ యెందుకలా తొంగి చూస్తుంది నిమిషనిముషానికి?"

"దానికి నేను వేరే ఆడవాళ్ళతో మాట్లాడితే చచ్చేటంత అసూయ."

"చాలా చిత్రంగావుందే! మధ్యలో దాని కెందుకసూయ? అదేం మీ భార్యా? ప్రియురాలా?"

"మొదటిది కాదుగానీ, రెండోది అయేందుకు దాని కేమీ అభ్యంతరంలేదు. యెటొచ్చీ నాకే యిష్టంలేదు."

"ప్రస్తుతం ఆ రెండూ కాదుగదా! అలాటప్పుడు అసూయ యెందుకూ?" అన్నది కామాక్షి అనుమానంగా.

"స్త్రీజాతిలో ఒక మహాచిత్రం వుంది. అదేమిటంటే ఒక స్త్రీహృదయం మరో స్త్రీ చచ్చినా తెలుసుకోలేక పోవటం."

"నాకర్థం కావటంలేదు."

"సరే అర్థం చెపుతా విను. అది స్త్రీ. నిరంతర సాన్నిహిత్యంవల్ల అంతర్గతంగా దానికి నామీద యిష్టం. నేను యజమానిని గనక తనంతటతానై యిష్టాన్ని తెలియచేసేందుకు భయం. నా అంతట నేనే తనని ఆహ్వానించటంలేదని కోపం. యింత చనువుగా తనుకాని మరో ఆడపిల్లతో మాట్లాడుతున్నానని అసూయ. ఇప్పుడర్థమయిందా?" అన్నాడు డాక్టర్.

"అర్థంఅయితే అయిందిగానీ, అసలిలాటివి యెలా సంభవిస్తాయో అంతుపట్టడంలేదు."

"ఫ్రాయిడ్ కే అంతుపట్టడంలేదు. అవునుకానీ యివాళ ఇంతసేపు కూర్చున్నావేం, రోజూ వెంటనే తుర్రుమనేదానివి" అన్నాడు డాక్టర్.

"మానాన్న వస్తాననాన్నడండీ! మీ డిస్పెన్సరీకి ఆట్టే మంది రోగులు రావటంలేదేం?"

"నేను మంచి డాక్టర్ను గనుక."

"అంటే...?"

"మళ్ళీ రోగంరాదు గనుక, నాదగ్గరకి రావలసిన అవసరం వుండదు. ఇంతకీ మనంచేసేది మూడువంతులు ఉచిత వైద్యమేగా!" అన్నాడు డాక్టర్.

"లోకకల్యాణార్థం భగవంతుడు మీ కాయుర్దాయాన్ని ప్రసాదించుగాక! అడుగో, మానాన్న వస్తున్నాడు" అన్నది కామాక్షి.

కంటకంకాపీలు చేత్తోపుచ్చుకొని వెంకటపతిగారు ప్రవేశించారు. వాటినిచూసి కామాక్షి హడిలిపోయింది.

"ఇవెందుకయ్యా! యిక్కడికికూడా తెచ్చావ్?" అంది విసుగ్గా.

"వుండవే, నాలుగువారాల్నించీ నా వ్యాసాలు డాక్టరుగారికి చూపిద్దామంటే పడిచావటంలేదు. ఈ పత్రిక లెక్కడెక్కడ వున్నాయో వెతికిపట్టుకవచ్చేసరికి యింత ఆలస్యమయింది" అన్నాడు వెంకటపతిగారు కూర్చుంటూ. ఆ తండ్రినీ, కూతుర్నీ చూసి తనలోతాను నవ్వుకున్నాడు డాక్టర్. వెంకటపతిగారు తనువ్రాసిన వ్యాసాలన్నీ డాక్టరుగారికి విని

పించటానికి వుపక్రమించకుండానే రాజు చక్కావచ్చాడు లోపలికి. అతనిచేతిలో ఒక చిత్రం వుంది.

"డాక్టరుగారూ! యిదిగో, యీ చిత్రకారుడి సంగతే నేను చెప్పింది" అంటూ ఆ చిత్రం టేబులుమీద పరిచాడు

అది ఒక మహాచిత్రం. భయంకరమైన యెడారి. ఆ మధ్యలో ఒక చిన్న సరస్సు. ఆ సరస్సుకి యిటూ అటూ మానవులవీ జంతువులవీ అస్థిపంజరాలు. రెండాకులతో ఒక ఖర్జూరపుచెట్టు. ఒక్క-చిక్కిన ఒంటెఒకటి, ఆ ఆకుల్ని అందుకోవటానికి ప్రయత్నంచేస్తూంది. ఆ సరస్సులో రెండేరెండు కలువపూవులు. చిత్రానికి క్రింద యెడారిపూవులు." అని వ్రాసివుంది. దాన్ని చూస్తుంటే నిరాశాతప్తమయిన హృదయానికి ఆశ కలుగుతూంది. ఏదో తెలియరాని విచిత్రమయిన అనుభూతితో మనస్సు నిండిపోతోంది. ఆత్మహత్య చేసుకోబోతున్నవాడు కూడా ఆ చిత్రాన్ని చూస్తే జీవించాలని ప్రయత్నిస్తాడు. తదేకంగా చూస్తున్న ఆ నలుగురూ కొంచెంసేపటికి స్మృతిలోకివచ్చారు.

"డాక్టరుగారూ! ఈ చిత్రానికి భావంయిచ్చింది యెవరో తెలుసా?" అని కామాక్షివయిపు చూశాడు రాజు.

"నేనే యిచ్చాను. ఆ చిత్రకారుడు నా స్నేహితుడు" అన్నది కామాక్షి. తదేకంగా ఆ చిత్రాన్ని పరికిస్తూన్న డాక్టర్ మనస్సులో ఓ మూల అసూయలాంటి భావం తళుక్కుమన్నది. తనలో కలిగిన ఈ వూహాకి తానే ఆశ్చర్యపోయి చిత్రకారుడి పేరుకోసం చిత్రాన్ని చూశాడు. ఒక మూల "మూర్తి" అని కనిపించింది. స్పందన యెరుగని తన

మనస్సులో స్పందనాన్ని రేకెత్తించిన ఆ చిత్రాన్నీ, అది చిత్రించిన చిత్రకారుణ్ణీ, దానికి భావమిచ్చిన కామాక్షినీ తలచుకొని విసుక్కున్నాడు. కామాక్షి చాల చిత్రమయిన స్త్రీమూర్తి. డాక్టర్ మనస్సులో రేగుతున్న కలవరాన్ని గ్రహించి కొద్దిగా గర్వించింది. ఈ డాక్టర్ - ఈ మనస్తత్వవేత్త - ఈ రచయిత ఒక పేదచిత్రకారుణ్ణి చూసి అసూయ పడుతున్నాడు. కొన్ని నిముషాలకిందట యితనే ప్రేమను గురించి వెక్కిరించాడు. తమాషా అనుకుంది.

"అయ్యో! నా వ్యాసాలు వినిపించనా మరి" అని ఆ నిశ్శబ్దాన్ని భంగపరిచాడు వెంకటపతిగారు.

"ఇప్పుడు యీ వ్యాసాల్ని చదివి ప్రాణం తీయటమెందుకు నాన్నా? రేపు చదివి వినిపించకూడదూ"- అన్నది కామాక్షి.

"అలా అంటావా! అయితే పోదాంపద" అంటూ లేచినుంచున్నాడు వెంకటపతిగారు. కామాక్షి వెడుతూ వెడ్తూ తనవంకచూసిన చూపు కొత్తబట్టలో పూచికముల్లులాగుచ్చుకుంది డాక్టరుకి. కామాక్షి రోజూవచ్చి మాట్లాడినా తనెప్పుడూ చలించలేదు. మరి ఇవాళ యీ బొమ్మ చూడగానే యేదో కలవరం బయల్దేరింది. ఈ కలవరానికి కారణం ఆ చిత్రంలోవుండే విచిత్రభావానికా? లేకపోతే ఆ భావమిచ్చిన కామాక్షి చిత్రకారునిస్నేహితురాలని అసూయా? యీ రెండింటిలో తన మనస్సుని వేధిస్తున్నసమస్య ఏమిటో బోధపడలేదు. యీ ఆలోచన్లతో రాజు తన యెదురుగుండా కూర్చున్నాడన్నమాటే మర్చిపోయినాడు డాక్టర్. రాజు

దిగాలుగా ఆ చిత్రాన్ని పరికిస్తూనేవున్నాడు. కొంచెంసేపు చూచి నిట్టూర్చి,

"యీచిత్రంలో మనస్సుకందని మహోన్నతభావం యేదో వున్నట్లనిపిస్తోంది" అన్నాడు.

"ఏదోవున్నట్లే వుంది. లేకపోతే ఒయాసిస్‌లో వాటర్ లిల్లీస్ చిత్రం-యిద్దేదో నన్నూ కలవరపెడుతోంది."

"చిత్రం పేరుకూడా విచిత్రంగానే వుంది- యెడారి పూవులు"

"కామాక్షిహృదయంలో యెడారిపూవులు కొన్ని వున్నాయని దీనర్థం" అన్నాడు డాక్టర్.

* * *

"గుత్తులుగుత్తులుగా నీలిగంటలు విచ్చుకున్నట్లు చీకటి విరబోసుకుంది. చాలామంది చీకటిలో అందాలు గ్రహించలేరు. చీకటికి అందమేమిటీ నామొహం అనుకుంటారు. ఒంటరిగా వెళ్ళటానికి భయపడతారు. కానీ తన సుదీర్ఘమయిన నల్లచీరకొంగు కప్పి మననీ మనభయాల్నీ తనలో దాచుకునే చల్లనిచీకటి మనని భయపెడుతుంది. బహుశా దీనికికారణం చీకటి నల్లటిది కావటంచేత నేమో అనుకుంది కామాక్షి. తనకి డాక్టరంటే యిష్టం. ఇన్నాళ్ళనుంచీ లేని అయిష్టం యిప్పుడు కలుగటానికీ, ఆ కలిగినయిష్టాన్ని పైకిచెప్పుకోవటానికి కారణమూ అవకాశమూ దొరకలే దామెకి. తను అవివాహిత. తన మనస్సులో వచ్చినఊహ తను పయికి చెప్పుకో కూడదు. కామాక్షి కెందుకో చికాకనిపించింది. రాత్రి తొమ్మిది గంటలయింది. తండ్రి యింకా కొంపకి

చేరలేదు. బహుశా యే అభాగ్యునికో తనవ్యాసాలు వినిపిస్తూవుంటాడు. ఆమాటకొస్తే ఆయనకి యిష్టమున్న పనులు రెండే. ఒకటి: తనవ్యాసాలు యెవరికయినా చదివి వినిపించటం. రెండు: కూతురుపెండ్లినిగురించి ప్రతిఅడ్డమయినవాడితోనూ చర్చ ప్రారంభించటం. కామాక్షి నవ్వుకుంది. మధ్యతరగతి కుటుంబాల్లో ఆడపిల్లపెళ్ళి చేయాల్సివస్తే, తలిదండ్రులు యెన్ని అబద్ధాలాడేదీ ఆమెకు తెలుసు. అసలీ మధ్యతరగతికుటుంబాలే చాల విచిత్రమయినవి. నెలాఖరుకి పది రూపాయలు అప్పుచేయాల్సినవాడు పరమదరిద్రుణ్ణి అనుకుంటే, అయిదురూపాయలు వెనుకేయగలిగినవాడు అమిత భాగ్యవంతుణ్ణనుకుంటాడు. అతని దీనతకీ, యితని గర్వానికీ గూడ అర్థంపర్థం వుండదు. తన తండ్రి మధ్యతరగతివాడు కాదు. ఆమాటకొస్తే శాస్త్రోక్తంగా భాగ్యవంతుడే కూడా. అయినా తనకి పెండ్లి చేయలేకపోతున్నాడు. మొదట్లో ఒక్క కూతురే, దీనికి పెండ్లి చేయటం పెద్ద కష్టమేమిటి? అనే అశ్రద్ధ చేశాడు. తరువాత తనకు వయస్సు మిగిలిపోయింది. పాతికేళ్లు వచ్చినపిల్లకి పెళ్ళికాకపోవటమేమిటో అని లోకానికి ఒక కుతూహలం బలిసింది. తన కిన్నాళ్ళనించీ కలుగని ఒక విచిత్ర భావం నిన్న తలెత్తింది. దీన్నేనా ప్రేమ అంటారు అనుకుందామె. ఎందుకో ఆమెకి తోచటంలేదు. యేదో బాధగా వుంది. తండ్రి యింకా యింటికిరాలేదు. నిన్నసాయంత్రం బద్ద కంచేత దండగుచ్చకుండా వదిలిన మల్లెపూలు వాడిపోయినయి. స్త్రీజీవితం కూడా యింతేనా? సకాలంలో సూత్రబంధం కాకపోతే యిలాగే వాడిపోతుందా? తన జీవితమూ

యింతేనా? చెప్పరానిభయం యేదో ఆమెను ముంచివేసింది. పక్కనేపడివున్న నవల తీసింది. అది ఏకవీర. అందులో ఆమె చేతికివచ్చినచోట చదివింది. ఆరంజే రుంబుం, ఆరంజే విరుం బుం; ధర్మంచేయాలి. ధర్మమంటే ఏమిటి? ధర్మాధర్మాలకి మధ్య గీతగీసిన దెవ్వరు? దేశానికొక ధర్మం, కాలానికొక న్యాయం, వ్యక్తి కొక నీతి, అమల్లోవున్నట్లు ప్రపంచచరిత్ర చూస్తే కనిపిస్తోంది. ఏది నీతి? యేది అవినీతి? యే ప్రశ్నకీ సరియైన జవాబులేని ఈ సృష్టిలో ఈ ప్రశ్నకిమాత్రం జవాబివ్వటానికి ప్రతివాడికి హక్కున్నట్లు భావిస్తాడు. ఆమెకి చిత్రకారుడు శంకరావుగారు జ్ఞాపకమొచ్చారు. ఆయన తన స్నేహితుడని చెప్పిందేమిటీ యిందాక డాక్టరుతో? తనకన్న పాతికేళ్ళు పెద్దవాడాయన. ఆయనజీవితమే విచిత్రమయినది. లోకంచేత పరిహసింపబడుతున్న యీ దురదృష్టవంతుడయిన చిత్రకారుడు తన స్నేహితుడవటమే ఒకచిత్రం. తనస్నేహితులందరూ యిలాటివాళ్ళే. ఆమెకు నవ్వొచ్చింది. లోకంచేత అపహాసింపబడేవాళ్ళు, వెలివేయబడినవాళ్లు, సంఘువిదూరులై అపనిందలపాలు కాబడిన స్త్రీలు తన స్నేహితులు. తప్పితే పార్వతక్కయ్యలాటి దేవతలూ, డాక్టరుగారిలాటి......''

డాక్టరుగారిలాటి ... ఏమిటి డాక్టరుగారిలాటి ఆయన తనకు స్నేహితుడా? చిత్రంగా వుంది అనుకుంది. యేదో విపరీతభావం తన్ని ఆవేశించగా ఏమీాతోచక రేడియో తిప్పింది. అప్పుడు ఒక మహారచయిత నాటకం ప్రసారమవుతూంది. అదివింటే ఆమెకి మరీ భయమేసింది. ఆ కథలో ఒకయువతి వివాహంకాకపోవటంవల్ల తను ప్రేమించినవాడికి గర్వంతో

తన ప్రేమ స్వీకరించకపోవటంవల్ల చివరకి పిచ్చెత్తి చని పోతుంది. తన కథకీ ఆ యువతికథకీ ఏదో సంబంధం వున్న ట్లనిపించింది కామాక్షికి. ఇంతలో వెంకటపతిగారొచ్చారు.

"ఇంత పొద్దుపోయేదాక ఎక్కడికెళ్లావు నాన్నా?" అన్నది కోప్పడుతున్నట్లు కామాక్షి.

"నావ్యాసాలు చదివి వినిపించటానికి డాక్టరుగారిదగ్గర కెళ్ళానమ్మా!" అన్నాడాయన చొక్కావిప్పుతూ.

ఆదుర్దాగా"యేమన్నారేమిటి" అని ప్రశ్నించి మళ్ళీ తన ఆతురతకి తనే సిగ్గుపడిం దామె.

"చెయ్యివాపు తగ్గిందా అని అడిగి, రేపొకసారి రమ్మ న్నారు" అన్నాడాయన.

రేపెందుకు వెళ్ళాలి? ఏమయినాసరే వెళ్లకూడదు. తను స్త్రీ. తనలో కొన్ని బలహీనతలున్నాయి. అవి బయట పెట్టుకునే ధైర్యమూ అదృష్టమూ రెండూ తనకు లేవు.

కానీ ఆమరునాడు తెల్లవారినదగ్గర్నుంచి వెడదామా వద్దా అని ఆలోచిస్తూనేవుందామె. యెటూ తెగలేదు. సాయంత్రపుడ్రెస్ చేసుకొని వీధిలో కెళ్ళగానే, దేముడళ్లే చిత్రకారుడు శంకర్రావుగారు యెదురొచ్చారు. ఆయన వస్తూనే,

"ఏమ్మా! యెడారిపూవులు సరీగ్గా నువ్విచ్చిన వూహకి సరిపోయిందా?" అన్నాడు.

ఆయన్ని కూర్చోమని చెప్పి కాఫీకోసం గ్లాసుయిచ్చి పనిమనిషిని హోటల్ కి పంపి,శంకర్రావుగారికి యెదురుగుండా కుర్చీలో కూర్చుం దామె.

"ఏమి"టన్నారు. "బొమ్మ నా ఊహకి సరీగ్గా వచ్చిందా లేదా అనా? అంతకు వెయ్యిరెట్లు యెక్కువగా వుంది" అన్నది.

శంకర్రావుగారు సంతోషించారు.

"మరింకో బొమ్మకి భావంకావాలి." అన్నాడాయన.

కొంచెంసేపు కళ్ళుమూసుకొని ఆలోచించి స్కెచ్చి వేసుకోండి అని చెప్పటం ప్రారంభించిం దామె.

"పోషణలేని ఒక పూలతోట. ఆ పూలతోటలో ఒక వయిపు ఒత్తుగా రాలి వాడిపోయిన మల్లెపూలు. వాటిపక్కని ఒక తాచుపాము, మరోవేపు యవ్వనం అప్పుడే జారిపోబోతున్న యువతి. ఆమెవెనక దుర్మార్గుడనిపించే ఒకమగవాడు" అన్నదామె.

శంకర్రావుగారు "యేమిటమ్మా! యేమిటి దీనిఅర్థం?" అన్నాడు.

"మీరు వెయ్యండి, శంకర్రావుగారూ! సూత్రవిహీనులు" అని పేరుపెట్టండి. అన్నట్లు మీరు వేసిన బొమ్మను చూసి డాక్టరుగారు చాలా మెచ్చుకొన్నారు. దానిమీద "మూర్తి" అని వ్రాశారేమిటి? అన్నదామె.

"యెందుకో నా పేరుతో వేయటం యిష్టంలేదమ్మా. ఆ బొమ్మలువేసింది నేనని తెలిస్తే అవి యెంత బాగున్నా యెవ్వరూ కొనరు."అని తలవంచుకున్నాడు శంకర్రావుగారు.

ఆయనమీద లోకంచెప్పుకునే కథలుచాలావున్నాయి. అవిఅన్నీ వరసగా జ్ఞాపకమొచ్చినై కామాక్షికి. శంకర్రావుగారు యిప్పుడు యాభయియేండ్లమనిషి. పదిసంవత్సరాల

నాడు ఆయన ఒక పొరపాటుపని చేశారు. అప్పుడాయన పేరు పొందిన చిత్రకారుడుగా లోకానికి సుపరిచితుడు. ఆయన చెల్లెలు చనిపోతూ ఆయన చేతిలోపెట్టిన మేనకోడలు పదు నెనిమిదేండ్ల పిల్లయింది. శంకర్రావుగారు తన యిద్దరుకొడు కుల్తోపాటు పెంచిన మేనకోడలు ఒక చిన్న పొరపాటుపని చేసింది. తత్ఫలితంగా గర్భవతిఅయింది. కొన్ని బలహీనసమ యాల్లో మనిషి తప్పులుచేస్తాడు. వాటిని వెక్కిరించకుండా సరిదిద్దుకోవటమే వృత్తమమానవుడి ధర్మం అని నమ్మే శంక ర్రావుగారు మేనకోడల్నితీసుకొని విజయవాడ వచ్చాడు. ఆమెను తిట్టలేదు. కొప్పడలేదు. సృష్టి ఆమెకుచేసిన అన్యాయాన్ని, ఒక లేడీడాక్టరుదగ్గర దిగవిడచి తమ వూరికి వెళ్ళేసరికి వీళ్ళిద్దరికీ యేదోవుందని లోకం కోడై కూస్తూన్నది. యీ పరిస్థితిలో ఆవూళ్లోవుండటం యిష్టంలేక విజయవాడలో కాపురంపెట్టాలనుకున్నా డాయన. యీ పుకారుని భార్యా కొడుకులిద్దరుకూడా నమ్మారు. వాళ్ళు బస్తీకాపురానికి రామని మొరాయించటంతో చెల్లెలుకిచ్చిన వాగ్దానం భంగంకాకుండా మేనకోడల్ని చదివించి, పెండ్లి చేయాలని బస్తీలో కాపురంపెట్టా డాయన. ఆ అమ్మాయి బియ్యే ప్యాసయింది. పెళ్ళిచేసుకోటాని కెవ్వరూ ముందుకు రాలేదు. శంకర్రావుగారు దిగులుపడుతుంటే ఆమె ఓనాటి సాయంత్రం దగ్గరకొచ్చి,

"నేను పెండ్లిచేసుకోను మామయ్యా! నీకు సేవచేస్తూ వుండిపోతాను" అన్నది.

శంకరావుగారు బాధపడ్డారు. చివరి కెలాగో ఒక పెండ్లికొడుకును తీసుకొచ్చేసరికి ఆ అమ్మాయి కుండబద్దలుకొట్టినట్లు చెప్పింది.

"మరోడికి భార్యగా వుండేకన్న నీకు వుంపుడుగత్తెగా వుండటమే నా కిష్ట"మని.

శంకరావుగారు నిర్ఘాంతపోయినారు. యేదెలాగున్నా ఆయన పురుషుడు. జారిపోతున్న ఆయనయవ్వనం పునర్వికసించింది. చాలా ఆలోచించినమీదట, అప్పటికి బహుభార్యాత్వనిషేధం లేదుగనక రిజిస్ట్రారాఫీసులో వివాహంచేసుకున్నారు. అయినా లోకంమాత్రం మేనకోడల్ని లేవతీసుకవచ్చాడని వాదువేసింది. మొదటిభార్యకీ కొడుకులకి రాకపోకలు లేవు. యిదీ ఆయనకథ. యిప్పు డాయనకు యాభై సంవత్సరాలు. యిది జరిగి పదేండ్లయింది. తనకున్న ఆస్తిపాస్తులన్నీ తనకురావాలని ఆయ నెన్నడూ అనుకోలేదు. అంతా మొదటిభార్యకీ కొడుకులకీ వదిలేయటంవల్ల ఆయన సంపాదించితీరాల్సివచ్చింది. ఈ పదేండ్లలో ఆయన నాలు గయిదు వుద్యోగాలు చేశాడు. యిప్పుడు శక్తివుడుగుతూరావటంవల్ల తిరిగి తన చిత్రకళనే జీవనాధారంచేసుకోవాలని వుద్దేశం. ఆయనమేనగోడలూ, కామాక్షి క్లాసుమేట్సు. తద్వారా ఆయనచిత్రాల్ని కామాక్షిచూడటంతటస్థించింది. యెండి బీటలువారిన నేల మోడయిపోయినచెట్టు, రోడ్డు, పక్క గుడ్డిముసలమ్మ అతను చిత్రించాడు. ఆ బొమ్మల్ని చూస్తుంటే ఆయనలో యెంతనిరాశ నిస్పృహ గూడుకట్టుకున్నాయో అనిపిస్తుంది. ఒకప్పుడాయన పంటకోతకు సిద్ధంగా

వున్నపొలాలు, ఆకులతో కాయలతో కలకలలాడుతున్న చెట్లు, యవ్వనంతో మిసమిసలాడుతున్న యువతులు, చిత్రిం చేవాడు అప్పుడంతా ఆశ. యిప్పుడంతా నిరాశ. తనకి వయ స్సైలయిపోతోంది. ఆస్తిలేదు. పోనీ ఆదర్శమన్నా మిగులు తుందా అంటే తనుచేసినపని ఆదర్శమని తనకే నమ్మకంలేదు యీమధ్య నాలుగయిదు తడవలు పొరపాటుచేశానేమో అనిపించిం దాయనకి. తనుచేసిన త్యాగానికి కనీసం తనయినా సుఖపడటంలేదు. కథల్లో యిలాటివాటిని చదివి అంత సుల భంగా జీవితంలోకూడా అలాటివి చేయగలమని భ్రమి స్తే పొరపాటుపడతారని చెప్పకతప్పదు. అందులో ఆంధ్రదేశం లో రచనమీాద చిత్రకళమీాద బ్రతకటంఅనేది ఒక బ్రహ్మాండమయిన సర్కస్‌ఫీట్ అని చెప్పచ్చును. మంచి పుష్టిగావున్న ఆడవాళ్ళబొమ్మలు చిత్రించిన రవివర్మకున్న ప్రోత్సాహం దామెర్ల రామారావుకీ, అడవి బాపిరాజుకీ ఆంధ్రదేశంలో లేదంటే అతిశయోక్తికాదు. అందులో మామూలుమానవుడి కర్థంకాని నిరాశనీ భయాన్నీ చిత్రాల్లో చిత్రించటం బ్రతుకుతెరువుకి పద్ధతికాదు. తన చిత్రాల్ని జీవనాధారంగాచేసుకోవటంవలన కాలంగడవదని ఆయనకు తెలుసు. ఇటీవల ఆ మహాచిత్రకారుడు సినిమాబొమ్మలు వ్రాస్తున్నాడు.

ఆయన వివాహమాడిన మేనగోడలిపేరు అన్నపూర్ణ తన మేనమామలో వున్న కోరికని రేగగొట్టి వివాహంచేసు కున్నది తను. కాని ప్రస్తుతంలో తనకు కావలసిన చీరలూ నగలూ యివ్వలేకపోవటమే కాకుండా, దైహికంగాకూడ తనకి

ఆశ్ళే తృప్తినివ్వలేని శంకర్రావుగారు తన గొంతుకోశాడని ఆమెవుద్దేశం. శంకర్రావుగారితత్వం యిందుకు పూర్తిగా భిన్నం. ఆ అమ్మాయిని పెండ్లిచేసుకోకముందు ఆమెమీద పుత్రికావాత్సల్యం వుండేది. ఆమె తనని వివాహంచేసుకున్నాక నిజంగానే ఆమెను ప్రేమించటం ప్రారంభించాడు. ఆమెను సుఖపెట్టటానికి యీ వయస్సులో ఆయనపడే తాపత్రయాన్ని చూసి కామాక్షి యెంతో బాధపడేది. జీవితంలో ట్రాజెడీ ఏమిటంటే మగవాడు తనకు అందడు అనుకున్నంత కాలం స్త్రీ అతన్ని గాఢంగా ప్రేమిస్తుంది. ఎప్పుడయితే అతనిని అందుకోగలుగుతుందో ఆ మరుక్షణంనుంచి అతనంటే నిర్లక్ష్యంచేస్తుంది. సరిగ్గా అదేపని చేసింది అన్నపూర్ణ. తను మొదటచేసిన పొరపాటుని క్షమించి, తనను కడుపులోపెట్టుకున్న మేనమామమహోన్నతవ్యక్తిత్వం ఆమెను ముగ్ధురాలిని చేసేసింది. ఎప్పుడయితే ఆమె కృతజ్ఞత అపరిమితమయిపోయిందో అప్పుడు ఆయనను భర్తగా వాంఛించింది. భర్తఅయినతరువాత ఆయనగొప్పగుణాలన్నీ అలవాటయిపోయి మామూలుగా కనిపించటం ప్రారంభించినాయి. ఇక యిప్పుడు మామూలుస్త్రీ అయిపోయిందామె. చీరలూ, నగలూ కావల్సివచ్చినాయి. అవన్నీ సమకూర్చే స్థితిలో లేడు ఆయన. ఈ విషయం గ్రహించినకామాక్షి వెంకటపతిగారికి చెప్పి కంటకంపత్రికకి బొమ్మలూ, కార్టూన్సు వేయటానికి నెలకొక అరవయిరూపాయలు జీతంమీద వేయించింది. శంకర్రావుగారికి కామాక్షిఅంటే చాలా అభిమానం. ఆమె చిత్రమయిన వ్యక్తిత్వం ఆయనకు చాలా ఆశ్చర్యంకలి

గిస్తుంది. సామాన్యంగా కంటకంపత్రికలోపడే చిత్రాలన్ని టికీ ఆమె వ్యూహాయిస్తుంది. కిందటివారం ఎడారిపువ్వులు చిత్రం చాలామందిని ఆకర్షించింది. వచ్చేవారం చిత్రానికి వ్యూహంకోసం కామాక్షిదగ్గరకొచ్చిన శంకర్రావుగారు మరో విషయం ప్రస్తావించాడు. అన్నపూర్ణ అప్పుడప్పుడు యేదన్నా వ్రాస్తూవుంటుందని వీలయితే అవి పత్రికలో వేయించమనీను. కామాక్షి నవ్వుకుంది.

"ఈకాలంలో రచయితకాని దెవరు శంకర్రావుగారూ, ఒక్క నేనుతప్ప. మానాన్నకి నన్ను గొప్పరైటర్ని చేయాలనే మహత్తరాశయం ఒకటున్నది. రచయితలు సృష్టింపబడరు, స్వయంసృష్టి పొందుతారు. అని చెప్పినా వినిపించుకోడు."

ఈమాటల్లోవుండే అంతరార్థం శంకర్రావుగారికి బోధ పడలేదు. యింతకీ అన్నపూర్ణకథలు వేసుకునేటట్లా? వేసు కోనట్లా? ఆ సంగతి తేల్చుకోవాలనే అనుకున్నా డాయన. తనచిత్రాలు కంటకంలో పడినదానికంటే అన్నపూర్ణకథ ఒకటి అందులోపడితే అపరిమితంగా సంతోషిస్తా డాయన, కామాక్షి గ్రహించింది. అర్హతలేని అన్నపూర్ణమీద ఆయనకున్న వెఱ్ఱిఅభిమానం చూసి ఆమె చాలా జాలిపడ్డది.

"రేపొకతడవ ఆ కథలుతీసుకొని అన్నపూర్ణను రమ్మని చెప్పండి" అన్నది.

* * *

సత్యవతి రోజురోజుకీ చిక్కిపోతున్నది. ఆధారశూన్య మయిన ఆమెజీవితం ఆమెకే అసహ్యాన్ని కలిగిస్తోంది. భోజనం

చేయటం, స్టుడియోకివెళ్ళి యాంత్రికంగా తనపని తాను చేసుకోవటం తప్ప మరేవిధమయిన చైతన్యం ఆమెలో లేదు. ఎప్పుడయినా నల్లపిల్ల లీల కనిపిస్తేమాత్రం ఆమె కేదో నూతనోత్సాహం తన రక్తనాళాల్లో ప్రవహించినట్లుం టుంది. ఏవిధమైన ప్రత్యేకతా లేని ఈ పిల్ల యింతహాయిగా ఎలా వుండగలుగుతోందా అన్నది ఆమెకు సమస్య. జీవితంలో అన్నీ తెలిసినవాళ్లు హాయిగా బ్రతికేస్తారు. ఏమీ తెలియనివాళ్ళు హాయిగా బ్రతికేస్తారు. ఎటొచ్చీ తనలాటి వాళ్ళే బ్రతకలేకపోతున్నారు. సాధ్యమయినంతవరకూ శర్మకి దూరంగావుండాలనే ఆమె ప్రయత్నిస్తోంది. ఇదివరకు పొరపాటుచేసిన ఒకతప్పుకి యిప్పుడు శిక్ష అనుభవిస్తోంది. మళ్ళీ అలాంటిపొరపాటే చేసి జీవితాంతం శిక్ష అనుభవించ కుండా వుండాలని ఆమెప్రయత్నం. ఈ వ్యర్థప్రయత్నాన్ని యెంతమటుకు తను సవ్యంగా నిర్వహించగలదో ఆమెకే తెలి యదు. ఆ స్టుడియోవాతావరణం; రంగురంగు లైట్లు, మేకప్ మీదవున్న అందమయిన సినిమాతారలూ, ఆమెకు జీవితం మీద ఆశకాని ఆనందాన్నికాన్ని కలిగించలేకపోతున్నాయి. నైతికంగా ఆట్టే విలువలులేని వాతావరణంలో ఆమెకు అసంతృప్తిమాత్రమే మిగులుతుంది. ఉద్యోగంచేయకుండా వుంటే గడిచేయెత్తు కనబడటంలేదు. నెలాఖరుకి ఆమె జీతం తీసుకెళ్ళి యిచ్చినప్పుడు అన్నగారు నిజంగా సంతోషించా డనే చెప్పవచ్చును. ఆర్థికంగా యాతనపడుతున్న తనకి చెల్లెలు తీసుకవచ్చిన జీతం వేడినీళ్ళకి చన్నీళ్ళని అతను గ్రహించాడు అంతర్గతంగా అతనిలోవున్న యీ స్వార్థం

రాజుకి యేం జరిగిందని వుత్తరంకూడ వ్రాయనివ్వలేదు. అతనేకాంతంలో భార్యతో "దాన్ని చిన్నమాట పెద్దమాట అనేవు. ఈనెల ఆ జీతంవల్ల ప్రాణం హాయిగావుంది ఏదో మన బాధ్యతకొద్దీ పెండ్లిచేశాం. దాని అదృష్టం బాగుండక వాళ్ళిద్దరికీ పడలేదు. అయినా తీగకు కాయ బరువా యేమిటి?" అన్నాడు. అతని స్వార్థానికి ఆమె అసహ్యించుకున్నాగాని ఆర్థికంగా తాముపడే యిబ్బందులు తెలుసుగనుక మెదలకుండా వూరుకుంది. నిజంగా ఒకప్పుడు చూస్తే అన్నివిధాలయిన అవగుణాలకీ దరిద్రమే కారణమనిపిస్తుంది. ఏదేమయినా యింట్లో సత్యవతికి శాంతిదొరికింది. ఇంట్లోవున్న కాసేపు ఆమెను ఒక్కపని చేయనీయదు వదినెగారు. కానీ పరాయిదానికి చేసినట్లు చేస్తున్న యీ మర్యాదచూస్తుంటే ఆమెకు చికాకుగావుండేది. పైగా తను వచ్చేసినదగ్గరనుంచి తను యేమయిందోకూడ కనుక్కోని రాజుని తలచుకుంటే ఆమెకు అసహ్యంవేస్తున్నది. ఇందులో తనతప్పు కొంచెముండవచ్చును. కానీ ఎక్కువతప్పు తనదే. రాజుమీద కలిగిన యీ అసహ్యంతోపాటు, తనని ఆపదలో ఆదుకున్న శర్మమీద యిష్టంకూడా కలుగుతూంది. లోకదృష్ట్యా యీ రెండూ తప్పే. వీలయినంతమటుకు శర్మకి దూరంగా నిర్లిప్తంగా వుండాలనే ఆమె ప్రయత్నిస్తోంది. శర్మకూడా యిది గ్రహించి ఆమెప్రయత్నానికి తను అడ్డురావటమెందుకని దూరంగానే వుంటున్నాడు. అతను నటుడు. రంగంమీదే కాకుండా జీవనరంగంలోకూడా నటించాల్సిన పరిస్థితి యేర్పడిందిప్పుడు. నిజానికి సత్యవతంటే అతనికి అపరిమిత

మయిన యిష్టం. ఒకప్పుడు లేడిపిల్లలాగ నోటికొచ్చిందేదో అనేస్తూ నిర్లక్ష్యంగా గంతులేస్తున్న ఆమెనుచూసి అత నామెను ప్రేమించాడు. ఆ సంగతి వ్యక్తీకరించివుంటే యేమయేదో మరి. అత నాపని చేయకుండానే వెళ్ళిపోయాడు. తిరిగి తను నటుడుగా మారి మద్రాసు వచ్చేసరికి ఆమెకు పెండ్లయి అది విఫలంకూడా అయింది. ఇప్పటి సత్యవతి గంభీరజీవితంలో యెంతో బరువుమోస్తున్న దురదృష్టవంతురాలు. ఇప్పు డామెను చూస్తుంటే గంతులేస్తున్న సెలయేరు జ్ఞాపకంరాదు. నిశ్చలంగావున్న సరోవరం జ్ఞాపకమొస్తుంది. అధీర, అబల అయిన ఈ స్త్రీమూర్తిని తనదిగా చేసుకోవాలని అతను ప్రయత్నించలేకపోతున్నాడు. తరతరాలుగా ధర్మాన్ని యెదుర్కోలేని అతని మనస్తత్వం ఆమెను ధర్మచ్యుతురాలిని చేయటానికి యిష్టపడటంలేదు. అయితే ఆమెకోసం సర్వధర్మాల్నీ సర్వప్రపంచాన్నీ కూడ యెదిరించగల స్థైర్యం అతనికి లేకపోలేదు. అతను ఒకటి నిశ్చయించుకున్నాడు. రాజునీ, సత్యవతినీ కలపటానికి అతను చేతయిన ప్రయత్నం చేస్తాడు. ఒకవేళ దురదృష్టవశం చేత అది సఫలంకాకపోతే ఆమెని తను స్వీకరించటానికి యెన్నాడూ భయపడడు. కొన్నికొన్ని సమయాల్లో మానవుడి స్వార్థం చాల చిత్రంగావుంటుంది. అతనిలో ఈ ప్రయత్నం ఫలించకూడదనే వాంఛ అంతర్గతంగా లేకపోలేదు. ఏమాత్రం స్వార్థలేశంలేని మానవుడు దివ్యుడవుతాడు కాని మానవుడు కాడు. అందులో నటుడు అసలేకాడు. తననితాను ఓదార్చుకున్నాడు శర్మ. ఈ రోజుసాయంత్రం సినిమాకు రమ్మని సత్య

వతిని పిలుద్దామని ఆమెదగ్గరకు వెళ్లాడు. ఒంటరిగా కూర్చున్న సత్యవతి యెందుకో దుఃఖిస్తున్నది. శర్మ ఆమెదగ్గరగా వెళ్ళి,

"చివరిచివరికి నీయేడుపుచూస్తుంటే అసహ్యంవేస్తోంది. నీకంటే ఎక్కువ కష్టాలుపడినవాళ్ళు యింకా యెంత మందో ప్రపంచంలో వున్నారు. వాళ్లందరూ ఇలా యేడుస్తూ కూర్చుంటే ప్రపంచగమనమే ఆగిపోతుంది" అన్నాడు. ఆమె యేడుపు నిజంగా అతనికి విసుగుకలిగించింది. సత్యవతి తలెత్తి చూసి కళ్ళుతుడుచుకుంది. శర్మ మళ్ళీ ప్రారంభించాడు.

"ప్రతీవాళ్ళకీ యేవో కష్టాలు వుంటూనేవుంటాయి. అంతమాత్రంచేత యిలాకుంగిపోవటం యెక్కడా చూడలేదు. అయినా నీకిప్పుడు యేడవాల్సినంత అవసరం యేమీరాలే దనుకుంటాను. నీభర్తకీ నీకూ ఏవో మనస్పర్థలు వచ్చినై. అలావచ్చినవాళ్లు కొన్ని వందలమంది వున్నారు. ఈ నవ నాగరికవాతావరణంలో యీ తప్పుల్ని తప్పులనికూడ యెవరూ భావించరు. నీకు గౌరవలోపంగాని ధనలోపంగానీ ఏమీలేదు.సిగ్గుపడాల్సినంత తప్పు నువ్వేమీ చేయటంలేదు. అనవసరంగాయేడుస్తూకూర్చునిచూసేవాళ్లకి లోకువకాబోకు. అదేపనిగా అంధకారాన్ని తిట్టిపోస్తూ కూర్చునేకన్నా, ఆ అంధకారంలో ఒక చిన్న దీపం వెలిగించటం మంచిది" అన్నాడు. సత్యవతి ఆలోచించుకోటం ప్రారంభించింది. నిజంగా తనున్న స్థితికి తనిప్పుడు పడుతున్నంత విచారపడవల సిన అవసరం లేదేమో అనిపిస్తోంది. ఒకవేళ తను లోకం కోసం విచారం నటించటంలేదుగదా అనుకుంది. ఆమె వూహకి ఆమెకే నవ్వువచ్చింది. కన్నీటితో చారికలుకట్టిన

ఆమెఅందమయిన మొహంమీదికి చిరునవ్వు వచ్చింది. వానకి తడిసిన కొండచరియమీద వెన్నెలపడినట్లుంది. ఆ చిరునవ్వు యిది చూసి ముగ్ధుడయిపోయినాడు శర్మ. సత్యవతిని ప్రేమించకుండావుండటం యెలా సాధ్యం అనుకున్నాడతడు. చాలామంది ఉత్తప్పుడు యేమాత్రం అందంగా కనిపించరు కాని,తలంటిపోసుకున్నప్పుడో నవ్వుతున్నప్పుడో వారి అందం చూసిన యితరులు ముగ్ధులయిపోతారు. సత్యవతి అందంమాత్రం వుత్తప్పుడు లేతయెండలాగ వుంటుంది. నవ్వుతున్నప్పుడు లేతయెండ రేయెండ కల్నెత నేసినట్లుంటుంది. యీమె అందాన్ని చూసి రాజు పెండ్లి చేసుకున్నాడు. కాని చంచలహృదయుడయిన అతనికి ఆమెలోనిఅందం కనిపించటం మానేసి అవగుణాలే కనిపించటం ప్రారంభించినవి. పాతబడిన ఆమెసౌందర్యం అతనికి అయిష్టతే కలిగించింది. తత్ఫలితం వాళ్ళు విడిపోవటం. కొంతమటుకు సత్యవతిఅతిశయోక్తులు కూడా కారణమే కావచ్చును. ఏదియేమయినా సత్యవతి నిస్సంశయంగా సౌందర్యవతి. ముగ్ధుడయిపోయిచూస్తూ నిల్చున్న శర్మనుచూసి ఆమె నవ్వుకుంది. తనంటే అతనికున్న అభిమానానికి, ప్రేమకి గర్వించింది కూడా. నిరాశతో కుంగిపోతున్న, లేదా కుంగిపోతుంది అనుకున్న తన హృదయానికి కొద్దిగా మార్పు అవుసరమే అనిపించిందామెకు. శర్మతో సినిమాకెళ్ళటానికి ఆమెకి అభ్యంతరంలేకపోయింది. ఆ సాయంత్రం ఓడియన్‌లో శర్మతో కూర్చున్న సత్యవతి నిజంగానే ఆనందించింది. ఆ సినిమా కొంచెం శృంగారం పాళ్ళు యెక్కువున్న యింగ్లీషుసినిమా. అప్రియత్నంగా

సత్యవతిలోని స్త్రీత్వం రెచ్చకొట్టబడింది. నిర్దిష్టమయిన నిర్ణయాలు లేని ఆ బలహీనురాలు కుర్చీ చేతిమీదవున్న శర్మ చేతిని అప్రియత్నంగా స్పృశించింది. ఇది గ్రహించినశర్మ నవ్వుకున్నాడు. ఈ బలహీన క్షణాన్ని ఆధారంచేసుకొని ముందుకు పోయేంత నీచుడు కాడతను. ఇంటరువల్లో లైట్లు వెలిగినై. డిమ్‌గావుండే ఆ లైట్లవెలుతురూ, విచిత్రంగా వినిపిస్తున్న ఆ యింగ్లీషు సంగీతమూ ప్రతివాడి మనస్సుని ఒక విధంగా వుత్తేజపరుస్తాయి. సత్యవతిని గూడ ఆ సంగీతం కాస్తో కూస్తో వుత్తేజపరిచింది. ఆమె యెంతబలహీనురాలో అంత పిరికిది. అనుక్షణమూ పక్కనవుండి పురుషుడు తనని కాపాడుతూంటే గుహలోంచి బయటికిరాని ఆదిమస్త్రీవారసుల్లో యీామె ఒకతె. లైట్లు ఆరిపోయినాయి. తన వుద్రేకాన్ని ఆపుకోటం చేతకాక యేడవటం ప్రారంభించిందామె. ఆమె నిజంగా దుఃఖంవచ్చి దుఃఖించటంలేదు. శర్మఓదార్పుకోసమే ఆమె దుఃఖిస్తున్నది. ఆ సంగతి గ్రహించాడతను. ఆమెను దగ్గరగా తీసుకొని,

"ఎందుకేడుస్తావ్! మరీ యింత బలహీనం పనికిరాదు. అకారణంగా యేడవటం హిస్టీరియాకిందికి దించుతుంది" అన్నాడు.

సత్యవతి అతనిచేతిలో మొహంపెట్టుకుని నిశ్శబ్దంగా వుండిపోయింది.

కొన్నిక్షణాలు వూరుకొని "నేనున్నానుగా, నీకేం భయంలేదు. సినిమా చూడు" అన్నాడు శర్మ.

నేనున్నానుగా అనే పురుషుడు ఏ స్త్రీకయినా దొరికితే ఆ స్త్రీ మహాఅదృష్టవంతురాలని చెప్పవచ్చు. తన సర్వభారాలు అతనెత్తిన వేసి నిశ్చింతగా జీవించటమే ఆమె వాంఛిస్తుంది. పురుషుడుకూడా స్త్రీ తాలూకు యీ మహాభారాన్ని మోయటానికి సంసిద్ధుడయివుండటమే కాకుండా సంతోషంకూడా పొందుతాడు. గుహలో స్త్రీని వుంచి రాయి అడ్డంపెట్టి వేటకువెళ్ళిన రాతియుగపు పురుషుడు దగ్గరనుంచి అయిదంతస్తులమేడ యెక్కటానికి స్త్రీకి తనచెయ్యి ఆసరా యిచ్చే ఆధునికమానవుడివరకూ పురుషుడిమనస్తత్వం ఒక మాదిరిగానే వుంది. స్త్రీమనస్తత్వంలో కూడా అట్టేమార్పు లేదు, యెక్కడో ఝాన్సీలాటి స్త్రీ తప్ప.

సామాన్యంగా ఉద్వేగప్రకృతి అయిన స్త్రీ సత్యవతి. వంట చేతగాదన్నమాత్రంచేత ఒంటరిగా భర్తనివదిలిపెట్టి రావటం, ఆ తరువాత తనుచేసిన పనికి నిరంతరం యేడుస్తూ కూర్చోవడం, మళ్ళీమళ్ళీ క్షణికావేశాలకి లొంగిపోవడం’ ఉద్వేగప్రకృతిగల స్త్రీ తప్ప మామూలుస్త్రీ చెయ్యదు. ఆమె ప్రకృతిని అర్థంచేసుకోలేని చాలామంది అపార్థంచేసుకోటానికి అవకాశం వున్నది. సినిమాలో ఒకవిధమయిన నిరాశ, నిస్పృహలూ, దైహికమయిన వుద్రేకమూ ప్రకోపించి ఆమెను దుఃఖపెట్టినై. సినిమా వదలగానే వచ్చి కార్లో కూర్చున్నారు ఇద్దరూ. శర్మ ఆమెపరిస్థితిని అర్థంచేసుకున్నాడు. ఏ అఘాయిత్యమయినా చేసేస్థితిలో ఉన్నదామె ఇప్పుడు. విశ్రాంతి అవసరం. యేవిధంగానయినా ఆమెను నిద్రపుచ్చటం తప్ప, మరోమార్గంలేదు. ఆమెను తనయింటికి

తీసుకొనివెళ్ళాడు. మహోద్రేకస్థితిలో వున్న సత్యవతికి శర్మ తన్ని యేదోచేయటానికి యింటికి తీసుకువెడుతున్నాడనే వూహ కొంత ఆనందాన్నిచ్చింది. పతనమయిపోతానేమో అన్న భయంకన్న ఆమెలోని వాంఛ అధికతరంగా వుంది. యీ పరిస్థితిలో అతనితో వెళ్ళటానికి ఆమె అంగీకారాన్ని తెలిపింది. కానీ, శర్మ అలాటిపని చేయాలన్న వూహకూడ లేని విచిత్రవ్యక్తి. యీ పరిస్థితిలో ఆమెను ఒంటరిగా వదిత్తే యేదోచేస్తుందని అతను భయపడ్డాడు. అందుకనే సోడాలో కాస్త సురామిశ్రమం కలిపి ఆమెకు అందించాడు. మొదట కొంచెం వెగటనిపించినా చివరికి తాగగలిగిం దామె. మధుర మయిన వాతావరణం, మందంగావచ్చే ఫాన్‌గాలి, మదిరతో మత్తెక్కిన మానిని అతనిని విచలితుణ్ణిచేయలేదంటే ఆశ్చ ర్యంలేదు. సత్యవతికి చాలా హాయిగావుందిప్పుడు. మదిరా పానంలో యింత ఆనందం వుంటే దీన్నెందుకు నిషేధిం చారో ఆమెకు అంతుపట్టలేదు. కళ్ళు కొద్దిగా ఎర్రబడ్డాయి. మాటలు తడబడుతున్నాయి మెదడు మహోజ్వలంగా పని చేస్తోంది. ఒకఅరగంటలో ఆమె తననితాను నిగ్రహించుకో లేనిస్థితికి వచ్చేసింది. శర్మ యిక్కడే పొరపాటుపడ్డాడు. ఆమెకు విశ్రాంతియివ్వాలని అతడు తాగించాడు. కానీ ఆమెలోవుండే మృగాన్ని తాను రెచ్చకొట్టున్నానని అతడు వూహించలేకపోయినాడు. సత్యవతి నతడు ప్రేమిస్తున్నాడు. ఆమెను పతితురాలినిచేయటానికి అతడు యిష్టపడడు. ఆమె పవిత్రంగానే వుండాలి. రాజు కాదంటే తనభార్యగా చేసుకుం టాడు కానీ వుంపుడుగత్తెగా చేసుకోడు. శర్మగాకుండా

మహాపురుషు డెవరయినా అయితే సత్యవతి ఆ రాత్రి పతన మయిపోయివుండేది. ఉత్తమకులజురాలయిన స్త్రీఅభిమానానికి దేవతలు పూటకాపులుగా వుంటారంటే అతిశయోక్తి కాదేమో మరి!

* * * * *

కామాక్షిదగ్గరికి తను వ్రాసినకథలు తీసుకొని అచ్చు వేయించమని వెళ్ళటం చాలా నామోషీగా కనిపించింది అన్నపూర్ణకి.

"కామాక్షితండ్రి పత్రిక్కి పెట్టుబడి పెట్టినంతమాత్రం చేత ఆమెదగ్గరకు వెళ్ళి కాళ్ళుపుచ్చుకోటానికి నా ఖర్మం కాలిందాఏం? సరాసరి శివరావుగారికే ఇస్తాను" అన్నది శంకరరావుగారితో.

శంకరావుగారిప్రాణం చివుక్కుమంది. అన్నపూర్ణ మీాద ఎంతప్రేమవున్నా కామాక్షిని చులకనచేయడం ఆయనకు బాధఅనిపించింది. తనకి కాస్తోకూస్తో ప్రోత్సాహాన్నిస్తున్నదీ, తద్వారా ఆర్థికలాభం కల్గిస్తున్నదీ కామాక్షే. ఆమె అంటే శివరావుకీ, వెంకటపతిగారికీ కూడ గౌరవం, భయము వున్నాయన్నసంగతి శంకరావుగారికి తెలుసు. అన్నపూర్ణ అన్నంతపనీ చేస్తుందని కూడ ఆయనకు తెలుసు. అందుకే ఎందుకయినా మంచిదని తనవెంట పెట్టుకొనే కంటకం కార్యాలయానికి తీసుకువెళ్ళాడు. కామాక్షిఇప్పుడు శివరావు వద్ద రచనలు నేర్చుకోవడానికి కాదు, సబ్ ఎడిటరుగా వెడుతోంది. ఆఫీసులోవుండే స్టాఫ్ అయిదారుగురికి ఆమెఅంటే భయం,

గౌరవమూను. కామాక్షి సబ్ ఎడిటరుగా చేరినతరువాత చేస్తున్న మంచిపని యేమిటంటే వెంకటపతిగారి వ్యాసాల్ని యెడిట్ చేయటం. రెండో మంచిపని: పత్రిక పెద్దదిచేసి మంచి గెటప్ తో ఆకర్షణీయంగా వుంచటం. బాగావ్రాయగల రచయితలకి తృణమో పణమో యిచ్చి గౌరవించటమూను. చెప్పవచ్చే దేమిటంటే యిప్పుడు పత్రిక తన కాళ్ళమీద తను నిలబడుతూంది. శంకర్రావుగారూ అన్నపూర్ణా వెళ్ళే సరికి శివరావు సంపాదకీయం వ్రాస్తూవున్నాడు కామాక్షి రాజుతో మాట్లాడుతూ ప్రూఫ్లులుదిద్దుతూంది. నల్లగా, ఆకర్షణీయంగా వుండే ఆమెముఖంమీద నీలికలువమీద వాలిన తుమ్మెదల్లాగ ముంగురులు అటూఇటూ ఆడుతున్నాయి. శివరావు ప్రయోగించిన విశేషణం ఇది. అన్నపూర్ణ లోపల కొచ్చేసరికి ఆమె ఎందుకువచ్చిందో తెలియని శివరావు ఆశ్చర్యపోయినాడు. ఆమెచేతిలో కాయితాలు చూసి ఎందుకు వచ్చిందీ గ్రహించిన కామాక్షి ఆమెను కూర్చోమన్నది. కామాక్షికివ్వటం అవమానంగా భావిస్తున్న అన్నపూర్ణ సరాసరి శివరావుటేబులుదగ్గర కెళ్ళింది.

'ఇవి నా రచనలు; మీ పత్రికలో వేస్తారని తీసుకొచ్చాను' అన్నది.

శివరావు కాస్త ఖంగారుపడి "స్త్రీలపేజీని కామాక్షిగారు నిర్వహిస్తున్నారు" అన్నాడు.

యీ తెలివితక్కువప్రవర్తన చూస్తున్న శంకర్రావుగారికి సిగ్గనిపించింది. కామాక్షికికూడ కొంచెం కోపంవచ్చి

నది. అధికారపూర్వకమయిన కంఠస్వరంతో 'శివరావు గారూ! ఆ స్క్రిప్ట్ ఇలా యివ్వండి " అని ఆజ్ఞాపించింది.

శివరావు యాంత్రికంగా ఆమె చెప్పినట్లు చేశాడు. స్నేహమయి అయిన కామాక్షీ కంఠస్వరంలో ధ్వనించిన అధికారానికి అన్నపూర్ణతోసహా అందరూ ఆశ్చర్యపోయి నారు ఆమె ఆజ్ఞాపించనే ఆజ్ఞాపించదు. ఒకవేళ ఆజ్ఞాపిస్తే అది యెంత బలవత్తరమైనదో గ్రహించాడు శివరావు. కామాక్షి ఆ కాయితాలు డ్రాయరులో పెట్టి,

" ఇకమీరు వెళ్ళవచ్చును. ఇవి చదివి బాగున్నా యని తోస్తే తప్పక ప్రచురిస్తాను " అని తిరిగి ప్రూఫులు దిద్దటం ప్రారంభించింది.

అన్నపూర్ణ యింతటి అవమానాన్ని సహించవలసి వస్తుందనుకోలేదు. మొదట తను యెంతఅసభ్యంగా ప్రవర్తిం చిందీ ఆమెకు గుర్తురాలేదు. విసవిసా నడిచి వెళ్ళిపోయింది. శంకర్రావుగారు మామూలుగా తన సీటులో కూర్చుని పని ప్రారంభించాడు. కామాక్షి తలెత్తిచూసి,

" మీకు గుర్తుందా శంకర్రావుగారూ! తలిశెట్టి రామారావుగారు ఒక కార్టూను వేశారు. అదేమిటంటే ప్రబంధసుందరి కాబోలు, పేరు సరిగా జ్ఞాపకంలేదు. మీరు కూడ, అలాటి కార్టూను ఒకటి వేసిపెట్టకూడదూ, ఆధునిక సుందరిని " అంది.

శంకర్రావుగారికి ఆ మాటల్లోవుండే అర్థం బోధ పడింది.

" ఏక్షణంలో ఏంచేస్తారో తెలియని ఆధునికసుంద
రుల బొమ్మలు గీయటం అంత తేలికపని కాదనుకుంటాను "
అన్నాడు శంకరావు.

యీమాటకు శివరావు తలెత్తిచూశాడు రాజు
వెనక్కుతిరిగి చూశాడు. వాళ్ళిద్దరికీ ఒక్కసారే సునందన,
సత్యవతి జ్ఞాపకంవచ్చారు. ప్రూఫులు దిద్దటం పూర్తిచేసి
టేబుల్లో కాయితాలు తీస్తూ వీళ్ళిద్దర్నీ చూసి కామాక్షి
నవ్వుకుంది. ఆమె యెందుకు నవ్వుతోందో గ్రహించిన శివ
రావు తిరిగి నవ్వాడు. ఆమె తనను అపహాస్యంచేసిందను
కొన్న రాజు అన్నపూర్ణమీద సానుభూతి కురిపిస్తూ,

" ఏం! ఆధునికయువతిచిత్రం తగినంత అసహ్యంగా
వుండదే. తలిశెట్టి రామారావు ప్రబంధసుందరిని వెక్కిరిస్తూ
చిత్రించాడు కానీ, మీరు ఆధునికసుందరిని అద్భుతంగా
చిత్రించవచ్చు " అన్నాడు

" చిత్రించటానికి సృష్టిలో ఏది అనర్హమయిందో
దాన్నే చిత్రించమని సలహాయిస్తున్నారు తమరు" అన్నాడు
శంకరావుగారు.

రాజుమొహం మాడిపోయింది. వాతావరణం కలు
షితమయిందని గ్రహించిన కామాక్షి

" ఏమిటండోయ్ శివరావుగారూ! రమణీప్రియదూ
తిక తెచ్చియిచ్చే కప్పురవిడెం వుంటేనేగాని ఈ వారం
సంపాదకీయం బయటపడేటట్టులేదే!" అన్నది నవ్వుతూను.

అందరూ పకపకా నవ్వేశారు. కాని శివరావుమనసు
చివుక్కుమన్నది. సౌందర్యాని కాశపడి వివాహంచేసుకున్న

సునందన మెడకు గుదిబండలాగ తయారయింది. ఆమెతో ఏవిధమయిన సుఖమూ తనకి లభించటంలేదు. ఒకవిధమయిన కలుషిత వాతావరణములో పెరిగిన సునందన భార్యగా కట్టుబాట్లతో జీవించలేకపోవటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. అనుక్షణం యే మగాడయినా అనుమానించి చంపుతుంటే యెంత పతివ్రితయినా ప్రాణంవిసిగి నా యిష్టం పొమ్మంటుంది. శివరావు పరిస్థితుల్ని ఇంతవరకు దిగలాగాడు. అది ఆమెయిల్లు. అందులో యితను పరదేశిగా బ్రితుకుతున్నాడు. జీవితమంటే ఏమిటో తెలియనిరోజుల్లోనూ ఒకతప్పుచేశాడు. దాని కర్థం తెలుసుకున్నాననుకున్న యీ రోజుల్లోనూ ఇంకో తప్పుచేశాడు. చిత్రిం ఏమిటంటే, ఇతని ఇద్దరుభార్యల్లోనూ పతివ్రితగావున్న భార్యకన్న పతితగావున్న భార్య యెక్కువ సుఖపడుతూంది. దీన్నిబట్టి చూస్తుంటే నీతిగా బ్రితకటంకన్న అవినీతిగా బ్రితకటమే సుఖమేమో అనిపిస్తుందప్పుడప్పుడు. ఇంకోచిత్రిం యేమిటంటే పతివ్రితగా వున్న భార్యకన్న పతితకే యితను భయపడుతున్నాడు. కాకపోతే పతితే సుఖపడుతుందిగనుక ఆమెను ఆదర్శస్త్రీగా తీసుకోటానికి లోకం అంగీకరించదు. ఒకచోట సుఖం, మరొకచోట గౌరవం. గౌరవం సుఖాన్నివ్వలేదు గనుక, సుఖాన్నే మానవుడు అధికంగా వాంఛిస్తాడు. గనుక అవినీతినే ఎక్కువగా యిష్టపడుతున్నాడు. అక్కడక్కడమాత్రిం అవినీతిలో సుఖం, గౌరవం పొందగలిగిన లీలలు, నీతితో గౌరవంతోపాటు సుఖం కూడ పొందగలిగిన పార్వతులూ అరుదుగా కనిపిస్తారు. ఇంతలో ఫోన్ మోగింది. ఆలోచనల కట్లు విడిపించుకొని

ఫోనుతీశాడు శివరావు. వెంటనే మౌత్‌పీస్‌కి చెయ్యి అడ్డం పెట్టి "డాక్టరుగారు పిలుస్తున్నారు" అని ఫోన్ కామాక్షి కిచ్చాడు. డాక్టరుగారితో మాట్లాడుతున్న కామాక్షికంఠం కొద్దిగా వణకటం చూచి శివరావు ఆశ్చర్యపోయి చివరికి కామాక్షికికూడ ఈ మహాగ్నితాలూకు వేడి సోకిందా అని నవ్వుకున్నాడు. కామాక్షి డాక్టరుగారు చెప్పిందంతా విని సరే అని ఫోనుపెట్టేసింది.

* *

మానవుణ్ణి నశింపచేయవచ్చును గాని జయించడం మాత్రం చాలాకష్టం. యేనాటికయినా మానవుడిని జయించ గలిగినవి అతని అంతరింద్రియాలే. ప్రకృతినీ, భగవంతుడి మహోన్నత సృష్టినీ మామూలుగాచూసే మానవుడు తన లోని అంతరింద్రియాల్ని చూసి భయపడి వాటికి లొంగిపో తాడు. ఆలొంగిపోవటంలో అతన్నిచూసి జీవితం పరిహాసిస్తుంది జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించాలంటే ఉత్సాహం అవ సరం. దానికి వ్యక్తిలో ఆత్మవిశ్వాసం, ప్రగాఢమయిన వాంఛ, జీవితంపట్ల అనురాగం అవసరం. ప్రత్యేకం ఒక వ్యక్తితో చైతన్యం ముడిపెట్టుకొని వుండదు. ఏ మహా వ్యక్తయినా మానవజాతిని సమీకరించగలిగితే ఒక మహా చైతన్యం ఉజ్వలంగా ప్రకాశిస్తుంది. ఆ సమీకరించిన వ్యక్తి ఒక నియమంతో మహాపురుషు డవుతాడు, కృష్ణుడు లాంటి మహావ్యక్తి. అంతేగాని నువ్వనుకున్నట్లు భగవంతుడు కాదు, జీలకర్ర గాడు" అన్నాడు డాక్టర్. కామాక్షి ఆలో చించటం ప్రారంభించింది. సాయంత్రం ఆరుగంట లయింది.

పక్క కిటికీలోంచి గాలి వీచినప్పుడల్లా మాలతీపూలవాసన గుప్పుమంటోంది.

"ఓ మల్లెపందిరన్నా వేయక పక్కింటి మాలతీపూల వాసనతో తృప్తిపడుతున్నారేమిటీ ఖర్మం" అన్నది. డాక్టరు నవ్వాడు. కామాక్షి మళ్ళీ ఆలోచనగా,

"అవును. మల్లెపూలెందుకు? వాటి కెంత సువాసన వున్నా యెవరితల్లో చూసినా అవే కనకాంబరాలతోనో, దవనంతోనో కలిపి కట్టుకట్టుకొని కనిపిస్తాయి. అందుకే అవంటే ఆకర్షణ పోతూంది. ఎంత విలువగల వస్తువయినా అతిగా లభిస్తే వెగటనిపిస్తుంది వివాహాబంధం కూడ అంతే నేమో!" అన్నది.

"అయితే కొంపతీసి పెండ్లి చేసుకోవా యేమిటి?" అన్నాడు డాక్టర్.

ఆమె ఆ మాట వినిపించుకోలేదు. తిరిగి ప్రారంభించింది.

"అప్పుడప్పుడు ముసో ఆవరణలోంచి మెల్లమెల్లగా వచ్చే మాలతీసుగంధాన్ని మనిషి కోరతాడు. ఇది చాలా చిత్రం" అన్నది.

"స్టోలెన్ ఫ్రూట్స్ ఆల్వేజ్ స్వీటెస్ట్" అన్నాడు డాక్టరు.

పకపకా నవ్వింది కామాక్షి.

"నువ్వు చాలా చిత్రమయినదానివి కామాక్షీ! వివాహం చవకయిందంటావు. కృష్ణుడు భగవంతుడంటావు. ఈ రెంటికీ లంగరందటంలేదు. కృష్ణుడు భగవంతుడన్న నమ్మకం వున్నప్పుడు వివాహం పవిత్రమయినదిగా భావించాలి. లేదా షెల్లీగిల్లీ వుత్త నాన్సెన్స్ అన్నప్పుడు దేవుడూ లేడు,

దెయ్యమూ లేదు అని అన్నా అనాలి. ఒకదాంట్లో ఆధునిక వాదం, మరొకదాంట్లో పూర్వాచారపరాయణత, అర్థంలేదు" అన్నాడు డాక్టర్.

"ఏం?... యెందు కర్థంలేదు. కృష్ణుడు భగవంతుడు కాకూడదని యెక్కడుంది? పెళ్ళనేది పవిత్రమయినదీ అని నమ్మితీరాలనిమాత్రం సిద్ధాంత మేముంది? పెళ్లనేది ప్రస్తుతం గాలివానలో పూరిగుడిసెలాగ తయారయింది. లోపలివాళ్ళు బయటికి రావాలనీ, బయటివాళ్ళు లోపలికి పోవాలనీ ప్రయత్నిస్తున్నారు" అన్నది.

"అయితే నువ్విప్పుడు లోపలికి పోవాలని ప్రయత్నిస్తున్నా వన్నమాట" అని నోరుజారి చప్పున పుస్తకం పేజీలు తిరగవేయసాగాడు డాక్టర్. ఆయనఅవస్థ చూసి నవ్వుకుంది కామాక్షి. కొన్ని క్షణాలయినతరువాత,

"డాక్టరుగారూ!" అని పిలిచింది. ఆయన తలెత్తాడు.

"ఇందాక మీ ప్రశ్నకి సమాధానం ఇవ్వమంటారా?" అన్నది.

డాక్టరు తలూపాడు.

"నేను పూరిగుడిసెలోకి వెళ్లను డాక్టరుగారూ! మహా సౌధమయితే ప్రవేశిస్తాను. అయితే అది నా ఆత్మగౌరవానికి తాజమహల్ అయితేనే!" అన్నది.

"ధైర్యంచేసి మరోప్రశ్న అడుగుతున్నాను.దయచేసి, దానిక్కూడా సమాధానం చెపితే..."

"అడగండి.".

"నువ్వు వెళ్ళాలనుకున్న మహాసౌధం కనిపించిందా?"

"యీ ప్రశ్నకి సమాధానం చెప్పటానికి కొంతకాలం తీసుకుంటుంది. అదుగో మీ లిల్లీ తొంగిచూస్తోంది. నేను వచ్చినప్పుడల్లా దీనికిదేం జబ్బు" అన్నది కామాక్షి.

డాక్టర్ నవ్వాడు. "ఇక్కడ మనం సేఫ్‌గా వున్నామో లేమోనని దానికిభయం" అని తనమాటలో అశ్లీలం ధ్వనిం చేట్లు అనిపించి కామాక్షి యేమనుకుంటూందో అని ఆమె వయిపు చూశాడు. ఆమె ఆమాట వినిపించుకోలేదు. డాక్టరెందు కింత కుతూహలంతో తన విషయాలు తెలుసుకోవాలనుకుంటున్నాడో ఆమెకు అర్థమయీ, అర్థమవకుండా వుంది. పల్చని తెరచాటున యేదయినా వస్తువువుంటే, అక్కడ వస్తువు వున్నదన్న సంగతి తప్ప ఆ వస్తువు ఆకారవిశేషాలు యెలాటివో స్పష్టంగా తెలియదు. అలాగే డాక్టర్ మనస్సులో తననుగురించి యేదో అనుకుంటున్నాడని మాత్రం తెలుసుగాని, యేమనుకుంటున్నాడో తెలియటంలేదు. తెలియటం అంత మంచిదికూడా కాదేమో!

"ఏమిటాలోచిస్తున్నావు కామాక్షీ! 'నారీ స్తనభర నాభీదేశం దృష్ట్వామాగా మోహావేశం' అన్న శ్లోకం జ్ఞాపకం వస్తోంది నిన్నుచూస్తే..."

"తరువాత భజగోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే" కామాక్షి ఆ మాటనేసరికి యేదో అపశ్రుతిగా వినిపించింది.

"అంతేనంటావ్?" అన్నాడు డాక్టర్. ఇంతలో యెవరో పేషెంటు వచ్చినట్లు లిల్లీ చెప్తే కన్సల్టింగ్ రూములోకి

వెళ్ళాడాయన. కామాక్షి ఏదో ఆలోచిస్తూవుండగానే కళ్ళు మూతలుబడ్డాయి.

ఆమె ఆలోచనలు హైడ్రోజన్ గాలిబుడగల్లాగ అంతకంతకు యెత్తుగా పోతున్నాయి. ఒక బెలూనుచివర తనూ, మిగతా బెలూనులమీద శివరావూ, రాజూ, శంకర్రావుగారూ, డాక్టరూ కూర్చుని తనవెంబడే వస్తున్నారు. తను అంతకంతకు యెత్తుగా వెళ్ళిపోతూంది. కిందకు చూసింది, కింద ఇండ్లన్నీ కుండలుబోర్లించినట్లున్నవి. ఇంకా యెత్తుగా పోతూంది. కిందకు చూస్తే యిళ్ళన్నీ బంతుల్లాగ కనిపించినయి. ఇంకా యెత్తుకి యెగిరింది. ఈ తడవ అన్నీ గోళీకాయల్లా కనిపిస్తున్నాయి. ఆ నిశ్శబ్ద నీరవ వాతావరణంలో ఆమెకు భయంవేసింది. బెలూను అటూయిటూ వూగిపోతూంది. తన కింకా భయమేసింది. తనుకూర్చున్న బెలూనుగా మారింది, తన ఆలోచనే అనేసరికి ఆమెభయం మరీ యెక్కువయింది. ఈ ఆలోచనే తన్నింత యెత్తుకు తీసుకొచ్చి నిరాధార స్థితిలో నిలబెట్టింది. ఈ వూహావచ్చేసరికి బెలూనుగామారిన ఆలోచన పగిలిపూరుకుంది. కామాక్షి కెవ్వున అరచింది. మరోబెలూనుమీద తనకు కిందుగా యెగిరివస్తూన్న డాక్టర్ పడకుండా పట్టుకున్నాడు.

కామాక్షి కళ్ళుతెరచి చూసేసరికి, నిజంగానే కుర్చీలోంచి కిందపడివుంది. ఆమెవళ్ళంతా చెమటలుపట్టిపోయినయి. డాక్టర్ ఆశ్చర్యంగా ఆమెవంక చూస్తూ,

"అదేమిటీ! కుర్చీలోంచి అలాపడిపోయావ్?" అన్నాడు. కామాక్షికి తన విచిత్రమయిన కల జ్ఞాపకంవచ్చింది.

చివరికి తనని పడకుండా పట్టుకునేది, ఇతడేనా అనుకుంది. కానీ ఆ మాట మార్చివేస్తూ "ఇంతకీ మీరు ఫోనెందుకుచేశారో చెప్పలేదు" అన్నది.

"చెపుదామనుకున్నవిషయానికి ఇది సమయంకాదు".

"ఎందుకు సమయంకాదు, మధుసూదనరావుగారూ?"

"అదంతే కంచికామాక్షమ్మా!" అన్నాడు డాక్టర్ నవ్వుతూ. దూరానెక్కడో జోలపాట వినిపిస్తూన్నది. రోడ్డు మీదనుంచి చావుబాజా వెడుతూంది. కామాక్షి నవ్వింది.

"ఏం? యెందు కంత నవ్వువస్తూంది?" అన్నాడు డాక్టర్ చిత్రంగా చూస్తూ.

"అదికాదు డాక్టర్! అటు వినండీ! జోలపాట- పాపాయికి వాళ్ళమ్మ పాడే చిచ్చి. ఇటు చూడండీ! యిక్కడ మనం నవ్వుతున్నాము. ఇది యవ్వనంలోని చైతన్యస్రవంతి. అటు విన్నారా! రోడ్డుమీద చావుబాజా. మరణం మానవుడి చరమగీతం. మొదట జోల, జీవితానికి ప్రారంభం. మధ్య యువతినవ్వులో ప్రణయగీతం. అంత్యదశ అదుగో! ఆ చావు బాజా. వీటిని చూస్తుంటే చివరికి మిగిలేది ఆ చావుబాజాయే కదా అనిపించి నవ్వువస్తోంది" అన్నది. యింతలోకే కరెంటు పోయింది. నీరవమయిన అంధకారం నిశ్శబ్దంగా అలుముకుంది. గడియారం మానవహృదయంలాగ లయతప్పకుండా చేసే ఆ శబ్దంలోంచి ఒక మహానాదం వినిపిస్తోంది. ఆది మధ్య అంతాలు! ఆదిమధ్యాంతాలు.

* * *

"జీవితంలో అన్నిదశలకంటే యవ్వనం చాలా బాధా మధురమైన ఒక విలక్షణ దశ. ఆ దశలో కళ్ళల్లో ఒకవిధమైన కాంతి స్త్రీ పురుషుల్ని జ్యోతిర్మయులుగా జేస్తుంది. రక్త నాళాల్లో విద్యుచ్ఛక్తిలా రక్తం ప్రవహిస్తూ యెదటివారిని వెలిగిస్తుంది. మాటలలో మాధుర్యం, వూహాలలో మోహావేశం, ఆలోచనలలో చంచలత. ఇది ఆ దశ ప్రత్యేకత.రక్త నాళాల్లో దాక్షరసం ప్రవహిస్తున్న ఆ మధురదశలో సత్యవతికి మదిరకూడ తోడయింది. చివరిచివరికి ఆమె యెలా తయారయిందంటే మదిరలేనిది నాలుగురోజులు గడపలేని స్థితికివచ్చింది. శర్మకూ్కడ పార్టీల్లోఅక్కడా తాగే అలవాటుంది. కానీ, అదిలేకపోతే బ్రతకలేనస్థితికి అతను రాలేదు. అయినా యెవరయినా వచ్చినప్పుడు మరియాద కోసం రెండుమూడు సీసాలు నిలవవుంచుతాడు. ఇప్పుడతనికి సత్యవతి ఓ సమస్యగా పరిణమించింది. ఆ రోజు నేదో ఆమె వికృతమన స్తత్వానికి కొంచెం విశ్రాంతికలిపిద్దామని అతను చేసినపని సత్యవతికి అలవాటుక్రింద పరిణమించింది. నాలుగు రోజులకీ, అయిదురోజులకీ అదిలేకపోతే ఆమె వుండలేనిస్థితికి వచ్చింది. ఇది రహస్యంగావుంచటానికి శర్మ చాలా అవస్థ పడుతున్నాడు. పురుషుడు తాగితే లోకం పరిహసిస్తుంది గానీ మరేం చేయలేదు. స్త్రీ తాగితే లోకం ఆమెను వెలివేస్తుంది. అందుకనే సత్యవతి రహస్యంగా తాగుతున్నది మత్తుమందు యిచ్చి ఆపరేషన్ చేస్తూవున్నట్లు.

రాత్రి ఎనిమిదయింది. శర్మయింట్లో సత్యవతీ, శర్మ సోఫాల్లో కూర్చున్నారు. మధ్య టీపాయిమీద ఒకసీసా,

రెండుగ్లాసులూ, సోడాసీసా ఒకటీ వున్నాయి. సత్యవతి తాగుతున్నది. కొండశిఖరాన్నించి కిందపడుతున్న గొర్రెపిల్లని గొర్రెలకాపరి చూస్తున్నట్లు జాలిగా ఆమెవంక చూస్తున్నాడు శర్మ. సత్యవతి మళ్ళీ సీసాలోనిద్రవం గ్లాసులో మూడు వంతులు వంపుకొని, ఆ మిగతా పావు సోడాపోసింది. అది చూసి శర్మ బాధపడ్డాడు.

"పోనీ మాంసమన్నా తింటే ఆరోగ్యం చెడిపోదు. మళ్లీ మాంసం తింటానికి నిషిద్ధం. ఆడది తాగితే తప్పులేదు కాని, మాంసంతింటే తప్పేమిటో నా కర్థంకావటంలేదు" అన్నాడు.

"మాంసం అంటే నాకు అసహ్యం" అన్నది మత్తుగా సత్యవతి.

"నీ మొహం. మంచివన్నీ నీ కసహ్యం."

"పోవయ్యా! మాంసం మంచి దేమిటి?మనిషిని మనిషి పీక్కు-తినేస్థితినుంచి ఈ స్థితికి వచ్చినా మనిషికి మాంసమంటే ప్రీతిపోలేదు."

"ఆడదానివికాదూ? నీ కీ తాగుడేమిటి?"

"బ్రాహ్మడివికాదూ! మాంసం తినటమేమిటి?" అన్నది సత్యవతి తడబడుతూ. ఆమెకు మత్తు తలకెక్కింది. మామూలుస్థితినుంచి ఆమెయిందిృయాలు స్వాధీనం తప్పుతున్నాయి. తెరపిమరపుల మహానందస్థితిలో, లోకం ఆమెకు పంచరంగుల ఫౌంటెన్‌లా కనిపించటం ప్రారంభమయింది శర్మమాత్రం తాగలేదు. తనుచేసిన పనివల్ల దిగజారిన సత్యవతిని చూసి అతను యమయాతనపడుతున్నాడు.

"పోవయ్యా పిచ్చివాడ! తాగటం తప్పేమిటి? తాగటమే తప్పయితే లోకంలో ఆనందాన్నే నిషేధించా రన వచ్చును. నా మనస్సులో కొన్ని బాధలున్నాయి. అవి పోవాలంటే తాగుతాను. తాగితే ఆరోగ్యం పాడవుతుందీ! పోతే పోనీ, హాయిగా చచ్చిపోతాను." అని ఏడుపు ప్రారంభించిం దామె. శర్మ నిస్సహాయంగా చూస్తూ వూరుకున్నాడు. కొంచెంసేపయాక కళ్ళు తుడుచుకుని

"అవును. హాయిగా చచ్చిపోతాను. అది మరోలోకం. అక్కడ ఆకలి వుండదు, సమస్య లుండవు. అందమయిన స్త్రీపురుషులు నగ్నంగా విహరిస్తూవుంటారు. రష్యాలో మెట్రో నగరంలా వుంటుందిట స్వర్గం – మొన్నెవరో అనుకుంటు న్నారు. అక్కడ నువు నన్ను కోప్పడవు. తాగితే తప్పో, ఆరోగ్యం చెడిపోతుందో, అని నువుపెట్టేనస ఒదిలిపోతుంది. ఆ లోకంలో స్నానంకూడా వైన్‌లోనే చేస్తారట. అప్పుడింకా మత్తుగావుంటుంది.'' అని ఉమర్‌కవి రుబాయత్ ఒకటి సంకరంచేసేసి పాడటం ప్రారంభించింది సత్యవతి. ''మధుపాత్రే నా చేతికియిస్తే మధురమైన మృదుఅధరమ్ముండే స్వర్గం అయినా నరకమే అయినా సమానమవునని చాటేస్తానోయ్."

శర్మ చాలా నిగ్రహించుకుంటున్నాడు. సత్యవతి అసలే సౌందర్యవతి. మదిరవల్ల ఆమె మత్తెక్కితే, ఆమె సౌందర్యం మొగవాడిమీద బ్రాందీలా పనిచేస్తోంది. అందులో తాగినప్పుడు ఆమె ఇంకా అందంగా వుంటుంది. కట్టుకున్న షిఫాన్‌చీర తీసి అవతల పారేసిం దామె. లోపల

సాటిన్ లంగాకి అద్దాలు, తళుకులూ కుట్టివున్నాయి. వయ్యా
రంగా సోఫాలో వాలి ఆమె నిద్రపోయింది. ఎప్పటికప్పుడు
ఇహ తాగను. ఈ ఒక్కసారికీ యివ్వు అని బ్రతిమాలుతుంది.
ఈ తడవ శర్మ ఏమైనాసరే యివ్వనన్నాడు. "ఏం, నేను
కొనుక్కోలేననుకున్నావా?" అని సవాలుచేసిం దామె.
శర్మ భయపడ్డాడు. ఆ వ్యసనంకొద్దీ యెవరినైనా పోయి అడి
గితే కొంపమునుగుతుంది. అల్లరికెవరైనా బయటపెట్టారంటే
ముందు అప్రదిష్ట భరించాలి. ఇవన్నీ ఆలోచించి గత్యంతరం
లేక తనే యిచ్చాడు.

మానవుడు మనోవ్యధ మర్చిపోటానికి మధుపానం
చేస్తాడంటే నమ్మటానికి వీల్లేదు. తాత్కాలికంగా మనోవ్యధ
శమించినా మత్తుదిగిపోయినతరువాత మరింత యెక్కువవు
తుంది. అయితే మరెందుకు తాగుతాడంటే అది సమాధా
నంలేని ప్రశ్న. నాలుగయిదు గంటలన్నా యీ బాధ
ల్నించి తప్పించుకోటానికి ప్రయత్నిస్తున్నానని తాగే ప్రతి
మనిషీ జవాబుచెపుతాడు. మదిర, మధురాధరం ఒకేవిధంగా
మత్తుకలిగించే పదార్థాలు. ఆ రెండిటినీ అతిగా అనుభవించ
టం నిషేధం. అందుకే రహస్యంగా తాగటం, రహస్యంగా
వ్యభిచరించటమూను.

శర్మ తలచుకుంటే మదిర, మధురాధరం కూడా అత
నికి అందుబాటులోనే వున్నాయి. కానీ ఆ కొన్నిగంటల
ఆనందానికి అతడు చెల్లించాల్సిన మూల్యం చాలాయెక్కువ.
అందుకే అతడు భయపడుతున్నాడు. కాలం చాలా చిత్ర
మయింది. యెడారిల్లో నిప్పుకోడిలా పరిగెత్తే యీ కాలం

శర్మచేత సత్యవతి పెదవుల్ని స్పృశింపజేసింది. అగ్నిలా మండి పోయే ఆమె పెదవుల్ని అతని పెదవులు స్పృశించగానే సత్యవతికి మత్తుదిగిపోయింది. మదిరామత్తతతో అగ్నికణాల్లాగ మండిపోయే ఆమె కళ్ళు మరింత తీక్షణమయినవి. తనేంచేస్తున్నాడో అప్పటి కర్థమయింది శర్మకి.

నువ్వు నన్నే మేంచేశావో చెప్పు" అని యేడవటం ప్రారంభించింది సత్యవతి. ఆమెను ఒక అయిదు నిముషాలు ఏడ్వనిచ్చి యేడుపులో మొదటిపొంగు అణగిపోయినాక.

"నేను చేయకూడనిదేదీ చెయ్యలేదు సత్యవతీ! నన్ను నమ్మ" అన్నాడు.

"అవునా ? నువు నన్ను యేంచేయలేదా?" అని తిరిగి యేడవటం ప్రారంభించిందామె.

"ఒట్టు, నామాట నమ్మ. నేను నిన్నేంచేయలేదు" అన్నాడు శర్మ సత్యవతి రెండుచేతులూ పట్టుకొని.

"కానీ... కానీ... నువు నన్ను యేదయినా చేసుంటేనే బాగుండేదేమో!" అని రెండుచేతుల్తో మొగంకప్పుకొని నిశ్శబ్దంగా రోదించసాగిందామె.

శర్మ స్తబ్ధుడయిపోయినాడు.

* * *

చిత్రకళాప్రదర్శనంలో 'యెడారిపువ్వులు' చిత్రానికి మొదటిబహుమానం వచ్చింది. ఆ విషయం పేపరులోచూసి ఆయన్ని అభినందించటానికి వెళ్ళినవారిలో రాజు ఒకడు. నిజంగా ఆయనచిత్రాన్ని అభినందించటానికి అతను వెళ్లాడా అంటే అందుకుకాదు, అన్నపూర్ణని చూడటానికనే చెప్పాల్సి

వస్తుంది. అసలు స్త్రీ పురుష సమస్యే చాలా చిత్రమయినది. దీనికి సంఘనిర్మాతలు యెన్నికట్టబాట్లు పెట్టారో అదంత విశృంఖలంగా పరిణమించింది. ఎవరెవరిమధ్య యేయే సమయాల్లో యిది ప్రారంభమవుతూందో వారి అంతర్యాలకే ఆ సర్వాంతర్యామికే తప్ప యింకెవరికీ తెలియదు. తనకు సరిపడిన భర్త శంకర్రావుగారు కాదని అన్నపూర్ణ కెప్పుడయితే కలిగిందో అప్పుడే ఆయనతప్పులు ఆమె కంటికి గుమ్మడికాయల్లా కనిపించటం ప్రారంభించినవి. కంటకంపత్రికాఫీస్‌లో కామాక్షి చేత తన కవమానం కలిగితే చూస్తూవూరుకున్నాడని శంకర్రావుగారిమీద విరుచుకపడిం దామె. ఆరోజునుంచీ యిద్దరిమధ్యా పోగరాజుతూనేవుంది. అతను అసమర్థుడయిన భర్త. అందులో వయస్సు మళ్ళినవాడు. తనకి కావలసిన వేమీ తేలేని దద్దమ్మ. ఈ కారణాలు ఆయన్ని తప్ప మరో కణ్ణి చేసుకోనని చెప్పినప్పుడు అన్నపూర్ణకు కనిపించలేదు. అప్పు డాయన మహాత్యాగి. తనని కడుపులో పెట్టుకొని ఆదరించిన మేనమామ. తనుచేసిన పనిని కప్పిపుచ్చి తన్ని పెండ్లిచేసుకొని సంఘంలో తన కొక స్థానాన్ని కల్పించిన వుత్తముడు. అలాంటి శంకర్రావుగారు యీరోజున యిలా మారిపోయినాడంటే కుటిలమయినది కాలమో, లేక కామినీ హృదయమో అంతుపట్టదు. ఇంతకూ చెప్పవచ్చేది యేమిటంటే భర్తకీ తనకీ మనస్పర్థలు వచ్చినప్పుడు రాజు చూపిన సానుభూతి అన్నపూర్ణకు రోహిణీకార్తెలో రావిచెట్టునీడలా కనిపించింది. డాక్టర్ మధుసూదనరావుడిస్పెన్సరీలో అయిదారుసార్లు కలుసుకున్న అన్నపూర్ణ రాజు త్వరలోనే స్నేహి

తులవటంలో ఆట్టే ఆశ్చర్యంలేదు. భార్యచేత వదిలివేయబడ్డా ననుకున్న రాజూ, వదిలివేస్తే బాగుండుననుకుంటున్న అన్న పూర్ణ దగ్గరకు రావటంలో చిత్రం యేమీలేదు. కాక పోతే ఇదంతా ఒక పెద్ద భ్రాంతి అని తెలుసుకునేస్థితిలో వాళ్ళు లేరు. ఏతావాతా జరుగుతున్న దేమిటంటే శంక రావుగారిని అభినందించటానికి అనే వంకతో రాజు వచ్చి అన్నపూర్ణతో కబుర్లుచెపుతున్నాడు. యాదృచ్ఛికంగా వాళ్ళు కిలకిలా నవ్వుతున్న సమయంలో పిల్ల పుట్టినరోజుకి పేరంటం పిలవటంకోసం వచ్చిన పార్వతి మరదిని ఆ స్థితిలో చూసి ఆశ్చర్యపోయింది. అయినా ఆ ఆశ్చర్యాన్ని కప్పి పుచ్చుకొని అప్పు డేమీ మాట్లాడకుండా అన్నపూర్ణకి బొట్టు పెట్టి వెళ్ళిపోయింది. వదినెగారిని చూసి గతుక్కుమన్నాడు రాజు. తాను చెయ్యకూడని ఘోరాపరాధం యేదో చేస్తూ ఆ పవిత్రమూర్తికి పట్టుపడినట్లు అనిపించింది. అయినా తనేం చేశాడు? ఊరికే మాట్లాడుతున్నాడు. అంతకన్నా తనేం చేశాడని భయపడాలి? నిజంగా తనేమీ చెయ్యలేదా? రాజు తెల్లబోవటం అన్నపూర్ణ చూసింది. అతనికున్న చిత్తసంస్కా రం ఆమెకు లేకపోవటంవల్ల

"అదేమిటీ! మీ వదిన మరీ అంత పాతకాలపు ముత్త యిదువులా వుంటుంది. మోస్ట్ అన్‌కల్చర్డ్ వుమన్" అన్నది. రాజుమనస్సు చివుక్కుమన్నది. తన వదినెగారు సంస్కారం లేని స్త్రీయా? తను చెప్పకుండా చేయకుండా ఆలోచించకుండా సత్యవతిని పెండ్లాడి యింటికి తీసుకునివస్తే కడుపులో పెట్టుకుని ఆదరించిన వుత్తమురాలికి సంస్కారంలేదా? తల్లి చనిపోయిన

తన్ని మరోతల్లిలా చూసిన తన వదినెగారికి సంస్కారంలేదని అనటానికి దీనికేం హక్కుంది?

"మిష్టర్ రాజూ! కాఫీ తీసుకోండి!" అన్న అన్నపూర్ణ మాటలకీ ఆమె చిరునవ్వుకీ లొంగిపోయి పార్వతిని ఆమె యేమన్నదో కూడా మర్చిపోయినాడు. ఇంతలో శంకర్రావు గారు లోపలికి వచ్చారు. ఆయన్నిచూసి రాజు మళ్లీ తడబడ్డాడు.

కొన్నిక్షణాలకు తేరుకొని "కంగ్రాచ్యులేషన్సండీ! అఖిల భారత చిత్రకళాప్రదర్శనంలో మీ చిత్రానికి మొదటిబహుమతి వచ్చినందుకు చాలా ఆనందం" అన్నాడు.

శంకర్రావుగారు అల్పసంతోషి. ఆమాత్రం పొగడ్తకే వుబ్బితబ్బిబ్బయిపోయి "నిజంగా చెప్పాలంటే ఈ ఘనతంతా కామాక్షిది. ఐడియా యిచ్చింది ఆమె. దీనిని చిత్రకళాప్రదర్శనానికి పంపమని సలహాయిచ్చింది కూడా తనే" అన్నాడు.

అన్నపూర్ణ మొహం నల్లగా మాడిపోయింది. అది గమనించిన రాజు ఆమెను తృప్తిపరచాలనే వుద్దేశ్యంతో "సలహా చేముందిలెద్దురూ! వినేవాడే దొరకాలిగానీ, సలహా చెప్పే ఛాన్సు యెవడూ వదులుకోడు" అన్నాడు.

శంకర్రావుగారు రాజుమాట పట్టించుకోకుండా "అదిగాదోయ్! కామాక్షిలాంటి ప్రోత్సాహమిచ్చే స్త్రీయే దొరికితే పురుషుడు చెయ్యలేనిపనంటూ ఈ సృష్టిలో వుండదు." అన్నాడు.

అన్నపూర్ణ మొహం చూసి వాతావరణం యుద్ధోన్ముఖంగా వున్నదని గ్రహించిన రాజు వారిదగ్గర శలవుతీసుకొని బయటికి వచ్చాడు.

రాత్రి తొమ్మిదయింది. సందుగొందులలో తన నగ్న శిశువుని రొమ్మునచేర్చుకొని అరుగుపక్క అలసినిద్రిస్తున్న బిచ్చుకత్తెలావున్న పట్నం గవర్నరుపేటసెంటర్‌లో లైట్ల వెలుతురులో అలంకరించుకొని అసభ్యనాట్యంచేస్తున్న పడుపుకత్తెలా వున్నది. ఎవరో వ్రాసిన యీ మాటలు రాజుకి జ్ఞాపకమొచ్చినయి. అతను యిల్లు చేరుకొనేసరికి తొమ్మిదిన్నర కొట్టింది. పార్వతి పిల్లకు గోరుముద్దలు తిని పిస్తూ చందమామని చూపిస్తూ వుంది. రాజు రావటంచూసి కూడా తలెత్తిచూడలేదు. నిజంగా తను తప్పుచేశాడు. అందుకే ఆమె శిక్షించాలనుకుంటూంది. చపలచిత్తుడూ, నిర్దిష్టమైన వూహాలులేనివాడు అయిన ఆ యువకుడు పార్వతికి భయపడతాడు. అది ఆమెను చూస్తే కలిగే భయమో, లేక ధర్మాన్ని చూస్తే కలిగే భయమో, దేవతలు చెపితేగాని మనకి తెలియదు. పిల్లిలా లోపలకు వెడుతున్న రాజుని పార్వతి వెనక్కుపిలిచింది. "మీ అన్నయ్య వచ్చేసరికి ఆలస్యమవుతుందట. మనిద్దరం భోంచేద్దాం. త్వరగా బట్టలు మార్చుకొని రా" అన్నది.

రాజు బ్రతుకుజీవుడా అనుకున్నాడు. వంటింట్లో రెండు పీటలువేసి యెదురెదురుగా రెండు వెండికంచాలు అమర్చి వున్నాయి. వాటిపక్కన కూరా పులుసు వేసుకునేందుకు మరాఠీకులాగా చేసిన వెండిపళ్ళాలు పెట్టివున్నాయి. అంత

వరకూ గుమ్మంమీద తలపెట్టుకొని పడుకున్న వంటమనిషి అచ్చాయమ్మగారు! పార్వతిని చూసి "వడ్డించమంటారా పార్వతమ్మా!" అన్నది లేస్తూను.

"అక్కర్లేదు పిన్నిగారూ! నేను వడ్డిస్తాలెండి. ఏముంది, అన్నీ చేతికందేలా పెట్టుకొని యిద్దరం కూర్చుంటాము" అన్నది పార్వతి.

రాజు పట్టుబట్ట కట్టుకొని వంటయింట్లోకి వచ్చాడు. ఇవాళ వదినని సంతోషపెట్టాలనిపించింది యెందుకనో. పట్టు బట్ట కట్టుకుంటేనూ, సంధ్యవార్చి నేనూ, పార్వతి సంతోషిస్తుం దని అతనికి తెలుసు. పట్టుబట్టతో లోపలకు వచ్చిన మరిదిని చూసి తనలోతనే నవ్వుకుంది పార్వతి. కూరకలుపుకున్న రాజుకి మరికొంచెం నెయ్యివేసి తనుకూడా కంచంలో అన్నం పెట్టుకుంటూ యథాలాపంగా అడిగినట్లు "సరేకాని రాజూ! శంకర్రావుగారింటికి నువ్వు రోజూ వెడుతూనేవుంటావేమిటి?" అన్నది.

గతుక్కుమన్నాడు రాజు. ఏం జవాబుచెప్పాలో అతనికి తెలియలేదు. పార్వతి మళ్ళీ "అమ్మాయి యెందాక చదువుకుందేమిటీ?" అన్నది మరికొంచెం కూరవేస్తూ.

"మన కామాక్షితోపాటు బియ్యే చదివిందిట. పార్టు యేదో పోయినట్లుంది" అన్నాడు. కొంచెంసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా భోజనంచేశారు. పార్వతి సూటిగా రాజుమొఖంవంక చూస్తూ "నామాట ఒకటివింటావా?" అన్నది. ఒక మహా రాణి తన సేవకుణ్ణి ఆజ్ఞాపిస్తున్నట్లుంది... కానీ పందొమ్మిదో శతాబ్దంలో ఒక మధ్యతరగతికుటుంబంలో వదినెగారు మర

దితో మాట్లాడుతున్నదని యెవ్వరూ అనుకోరు. కంఠస్వరంతో శాసించగల యీ నేర్పు ఆమెకు జన్మగతమైనది. ఇతరులకు యేదైనా చెప్పాలనుకున్నప్పుడు కామాక్షికూడా పార్వతికంఠస్వరాన్ని అనుకరిస్తుంది. పార్వతిని చూసి యీ విద్య ఆమె నేర్చుకుంది. ఈ కంఠస్వరం రాజువినటం యిది రెండోసారి. మొదటితడవ తనతండ్రికి జబ్బుగావున్నప్పుడు మందు తేకుండా టెన్నిస్‌కి వెళ్ళాలని ప్రయాణమయాడు తను. అప్పుడుకూడ యిదే కంఠస్వరం. "ముందు మందు తెచ్చి వెళ్ళు" అన్నది. తనకోసం వీధిలో యెదురుచూస్తూన్న నలుగురు స్నేహితులకీ రానని చెప్పి మందు తేవటానికి వెళ్లాడు. తరువాత ఇన్నాళ్ళకి మళ్ళీ అదే కంఠస్వరం. రాజు భయపడ్డాడు. ఈ తడవ ఆమె యేం ఆజ్ఞాపిస్తుందో!

"ఎల్లుండి మంచిది. మద్రాసువెళ్ళి సత్యవతిని తీసుకొని రా. వెళ్లి చాలాకాలమవుతున్నది" అన్నది. సత్యవతి పోట్లాడివెళ్ళిన సంగతి పార్వతికి తెలియనివ్వలేదు రాజు. సత్యవతిదగ్గర్నుంచి అప్పుడప్పుడు వస్తున్న ఉత్తరాలద్వారా కూడా ఆమెకేమీ తెలియలేదు. సత్యవతి ఇన్నాళ్లు పుట్టింట్లో వుండటం ఆమె కేమీ ఆశ్చర్యమనిపించలేదు. గారాబంగా పెరిగినపిల్ల కావటంచేత వుండిపోయిందని అనుకుంది. సాయంత్రం పేరంటానికి పిలవటానికి వెళ్ళినప్పుడు అన్నపూర్ణ రాజు నవ్వుకుంటూండగాచూచి మరది సత్యవతి లేకపోవటంవల్ల స్త్రీ స్నేహాన్ని కోరటం పొరపాటువల్ల జరిగిందేమో అనుకుంది. అదే ఉద్దేశ్యంతో వెంటనే వెళ్ళి సత్యవతిని తీసుకురమ్మని రాజు నాజ్ఞాపించింది. న్యాయంగా సత్యవతికి చెందాల్సిన

ఆ స్త్రీ యేదో అన్యాక్రాంతమవుతున్నట్లు ఆమె బాధపడింది. ఇంగ్లీషులో ఒక సామెతవుంది పెండ్లిండ్లు స్వర్గంలోనే అవుతున్నాయని, పార్వతినమ్మకంకూడ అంతే. భార్యాభర్తృ సంబంధం యీ జన్మలోది కాదనీ,జన్మజన్మలనుంచి వస్తున్న ఒక మహత్తరమైన అనుబంధమనీ పార్వతి విశ్వసిస్తుంది. ఒక తడవ యిదేమాటంటే కామాక్షి ఆమెను ప్రశ్నించింది. "అయితే పార్వతక్కయ్యా! పెండ్లిండ్లు నిజంగా అంత దృఢతరమైనవే అయితే యిప్పుడీ విడాకులవిషమేయమంటావు? అందులో ముఖ్యంగా ప్రేమించి చేసుకున్న పెండ్లిండ్లు అసలే అధ్వాన్నమవుతున్నవి" అని.

పార్వతి కొంచెంసేపు ఆలోచించింది. ఆమెకూడా ఆ ప్రశ్నకి అంత తేలిగ్గా సమాధానం దొరకలేదు.

"అసలిప్పుడు ఆ ప్రేమే యింత కొంపముంచుతున్నది. వివాహమనేది చాలా తేలిగ్గా జరుగుతున్నది. కనుకనే చాలా తేలిగ్గా కూడా విచ్ఛిన్నమవుతూంది. నేను చెప్పేది ఆ వివాహంసంగతి కాదు!" అన్నది.

"అయితే యిప్పుడు జరిగే పెళ్ళిళ్ళలో పెద్దలు జరిపే పెండ్లిండ్లకన్నా ప్రేమవివాహాలతోనే ప్రమాదంగావుంది అంటావు" అన్నది కామాక్షి.

"ఆ సంభాషణంతా యిప్పుడు జ్ఞాపకమొచ్చిందామెకు. నిజంగా వివాహాలు స్వర్గంలోనే జరిగితే విడాకుల ప్రస్తావనే వుండదు. మరి యిదేమిటి? చెయ్యికడుక్కొని వెడుతున్నరాజుని వెనక్కి పిలిచి," యెల్లుండి మంచిది. మద్రాసు వెళ్లు"అన్నది.

రాజు తలూపాడు. తలయితే వూపాడుకానీ యేం మొహంపెట్టుకొని మద్రాసు వెళ్ళాలో అతని కర్థంకాలేదు. చిన్న మాటపట్టింపుమీద గర్వంగా వెళ్ళిన ఆడదాన్ని మగ వాడయుండి తనెలా బ్రతిమాలగలడు. యింకో సంగతేమి టంటే, సత్యవతి వుద్యోగంచేస్తున్నట్లు రాజుకి తెలియదు. వదినెమాటకి యెదురుచెప్పే ధైర్యం తనకిలేదు. యిప్పు డేం చేయాలి? అన్నపూర్ణతో తన నవ్వుల్ని వదినె అపార్థం చేసుకున్నట్లుంది. రాజు నిట్టూర్చాడు. అన్నపూర్ణలాటి స్త్రీ యే దొరికితే తన దాంపత్యజీవనం యెంతో సుఖప్రదమయి వుండేది. సత్యవతిని చూసినప్పుడు తనకలాగే అనిపించిందన్న సంగతి అతడు మర్చిపోయాడు. చాలాసేపు ఆలోచించిన తరువాత ఒకతడవ వెళ్ళిరావటమే మంచిదని నిశ్చయించు కున్నాడు. నిశ్చయించుకోక చేసేది యేమీ లేదు. పార్వతి మాటకు అతడే కాదు, ఎవరూ ఎదురు చెప్పలేరు."

*　　*　　*　　*　　*

పొద్దున్నే మెయిల్ దిగిన రాజు సరాసరి సత్యవతిగారి యింటికి వెళ్ళాడు. వుత్తరం లేకుండా అర్థాంతరంగా వచ్చిన రాజుని చూసి గతుక్కుమన్నాడు సత్యవతిఅన్నగారు. కాని వెంటనే తమాయించుకొని రాజుని పలకరించి సత్యవతికి చెప్ప టానికి ఒక్కగంతులో యింటిలోకి వెళ్ళాడు. సత్యవతి కూడా చాలా కంగారుపడింది. రాజుని పలకరించాలో, పలకరించ కుండావుండాలో ఆమె నిర్ణయించుకోలేకపోయింది. నిజం చెప్పాలంటే అతని కెదురుపట్టానికే ఆమెకు మొహంచెల్లటం లేదు. సత్యవతివదినెగారు కుంపటిమీదనుంచి పాలుదింపి

చేతులు కొంగుకుతుడుచుకుంటూ సావిట్లోకివచ్చి "యేం నాయనా! యిదేనా రావటం. మీ అన్నగారు, వదినెగారు కులాసాగా వున్నారా? సత్యవతి స్నానంచేస్తున్నట్టుంది. పిలుస్తాను" అంటూ ఫ్లాస్కులోకాఫీ గ్లాసులోకి వంపి అతని చేతికిచ్చి వెళ్ళింది. అన్న చెల్లెలు దొడ్లో గుసగుసలాడు తున్నారు. సత్యవతిని రాజుతో పంపేస్తే తను మళ్ళీ డబ్బు చాలక యిబ్బందిపడతానేమోనని అతని భయం. సత్యవతికి రెండుభయాలున్నాయి. ఒకటి: తనీమధ్య స్వేచ్ఛాజీవ నానికి అలవాటుపడ్డది. అది విజయవాడలో కుదరదు. రెండో అలవాటు తాగటం. యిక్కడయితే అన్నకీ వదినకీ కూడా తెలియకుండా తాగగలుగుతూంది. అక్కడ దొరకదు. ఒకవేళ దొరికినా తాగలేదు. ఆమెఆలోచన అదీ. వీళ్ళిద్దరి గుసగుసలుచూసి సత్యవతివదినెగారికి చాలా అసహ్యమేసింది.

"భర్తవచ్చి సావిట్లోకూర్చుంటే యిక్కడీ గుసగుస లేమిటి? పోయి పలుకరించు" అని సత్యవతిని పంపి, భర్తతో "సత్యవతిని పంపటమే చాలా మంచిది. మీ రేమీ యెదురు చెప్పబోకండి" అన్నది. సావిట్లోకి వెళ్ళిన సత్యవతి రాజుని యెలా పలుకరించాలో తెలియక కాలిబొటనవేలుతో నేల రాస్తూ నిల్చున్నది. రాజుకూ్కడ యేంమాట్లాడాలో తెలియ టంలేదు. తలెత్తి ఆమెవంక చూశాడు. ఆ క్షణంలోనే ఆమె కూడా అతనివంక చూసింది. క్షణకాలంచూసిన ఆ చూపు తో వాళ్ళిద్దరూ దగ్గరయిపోయినారు.

"సాయంత్రం ప్రయాణం. సిద్ధంగా వుండు. నే నలా వూళ్లోకి వెళ్లొస్తాను" అని లేచాడు రాజు.

అసలేమీ జరగనట్లుగా "భోజనానికి పెందరాళే వచ్చే యండి" అన్నది సత్యవతి. అతను వెళ్ళిపోయాక ఆమెకే చిత్రమనిపించింది. తను యెలా అతన్తో వెళ్ళటానికి ఒప్పుకున్నదో అర్థంకాలేదు. గబగబా డ్రెస్ చేసుకొని, స్టూడియోకి వెళ్ళి శర్మకి చెప్పింది ఆ విషయం. అంతా విని "నువ్వు వెళ్లాలనుకుంటున్నావా?" అన్నాడు.

"వెళ్ళొద్దంటావా? నువ్వు చెప్తే వెళ్లను" అన్నది.

"నువ్వు స్త్రీవి. అసలు మీ జీవితమే తీగలాంటిది. యే ఆలంబనాన్ని కల్పిస్తే ఆ ఆలంబనాన్నే ఆధారం చేసుకొని జీవించటం మీకలవాటు. నువ్వు యిప్పుడు వెళ్లటమే మంచిది యిప్పటికే నీకు స్వేచ్ఛ అనే మత్తుమందు తలకెక్కింది. పైగా నువ్వు తాగుడలవాటు చేసుకున్నావు. అది తగ్గుతుంది. యిక అన్నిటికంటె ముఖ్యమయింది మనిద్దరం దైహికంగా యింతవరకూ పవిత్రంగానే వున్నాము. యేక్షణంలో యేం జరుగుతుందో నీకూ తెలియదు, నాకూ తెలియదు. యీ పరిస్థితుల్లో నువ్వు వెళ్లటమే అన్నివిధాలా మంచిది" అన్నాడు నిట్టూరుస్తూ శర్మ. సత్యవతికి పట్టరాని దుఃఖ మొచ్చింది. యుగయుగాలుగా హృదయానికీ, ధర్మానికీ మధ్య జరుగుతున్న యీ నిరంతర సంఘర్షణల మధ్య యెప్పుడూ ధర్మానికే విజయం. సత్యవతి కళ్లుమూసుకుంది. లైలా, జ్యూలియట్! షిరీన్, ఏకవీర, అనార్కలీ- వీళ్లందరూ గబగబా వచ్చి ధర్మానికే జయం. మేమందరం ఓడిపోయినాం. అలాగే నువ్వూ ఓడిపోయినావు అన్నారు. ధర్మానికే జయం... జయం. లేదు. లేదు. హృదయానికే!

విజయం. నేను జయిస్తాను. నేను జయించితీరుతాను. ఇప్పుడు కాదు. కొన్నాళ్ళతరువాత అనుకుందామె.

ఆరాత్రి రాజు, సత్యవతి విజయవాడ వెళ్ళిపోయినారు.

* * *

ఏటిమీద నాలుగురోజులకి తిరిగి విజయవాడవచ్చిన సత్యవతికి అంతా కొత్తగా వుంది. ఇంట్లోకివస్తూనే బావగారికీ నమస్కరించి పార్వతిదగ్గర కెళ్ళింది. పార్వతి సత్యవతితల నిమురుతూ "ఇన్నాళ్ళు మద్రాసులో వుండిపోతే యిక్కడ యిల్లూ వాకిలీ బరువు నేను ఒక్కదాన్నే యెలా మోస్తాననుకున్నావమ్మా!" అన్నది. సత్యవతికి ఎంతో దుఃఖమొచ్చింది. ఆ దుఃఖాన్ని దాచుకునేందుకు పాపను ముద్దాడి "అంతా బావగారిపోలికే నక్కయ్యా! ఆడపిల్లకి తండ్రిపోలికొస్తే అదృష్ట వంతురాలంటారు" అన్నది. పార్వతి తనభర్తను తలచుకొని ఆ రూపం తన చిన్నిబిడ్డలో ప్రతిఫలించగా,ఎంతో తృప్తితో బిడ్డను ముద్దాడింది.

సత్యవతి విజయవాడవచ్చి నెలరోజులు గడిచిపోయినాయి. పదిహేనురోజులనుంచీ ఆమెకు యీ జీవితమంటే వెగటుగా వున్నది. పొద్దున్నే లేవటం, కాఫీకాచి భర్తకీ బావగారికీ యివ్వటం, కూర తరిగి పార్వతికి వంటలో సహాయం చేయటంతప్ప పనేమీలేదు. ఈవిధమయిన గానుగెద్దుజీవితం ఆమెకు తృప్తికలిగించటంలేదు. ఏదో చెయ్యాలి. యింతకన్న విభిన్నమయిన దేదయినా తన కనుభవంలోకి రావాలి. దీనికన్న యేడవటమే కొంత హాయిగా తృప్తిగా వుంటుంది. రాజు పొద్దుటినుంచీ రాత్రి పదింటిదాక భోజనసమయాల్లో

తప్ప యింట్లో వుండనేవుండడు. ఆ వున్నప్పుడుకూడ అత నితో యేం మాట్లాడాలో తెలియటంలేదు. అన్నిటికన్న ముఖ్యం ఒక పదిరోజులు మనస్సు బిగపట్టుకుంది గానీ ఆ తరు వాతనించి తొ్రగుడుమీద మనస్సుపోతూంది. ఈ కోరికను అణచుకోవటం ఆమెకు సాధ్యంకావటంలేదు. అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆమెకు మతిపోతున్నది ఈ పరిస్థితిలో ఒక రోజు కామాక్షి పార్వతిని చూట్టానికి వచ్చింది. ఇదివరకు సత్యవతిని ఒకటిరెండుసార్లు చూసింది. ద్విగుణీకృతమయిన యిప్పటి ఆమెసౌందర్యం చూసి విస్తుపోయింది కామాక్షి. ముగ్గురూ మాట్లాడుకుంటూ సావిట్లో ఉయ్యాలబల్లమీద కూర్చున్నారు.

కామాక్షికి యిప్పట్లో ఒక మహాసమస్య ఎదురయింది. అది డాక్టర్ని చేసుకోవటమా చేసుకోకపోవటమా అన్నది. వెంకటపతిగారికి యీ పెళ్ళి యెంతమాత్రం యిష్టంలేదు. ఎవడో కానివాణ్ణి కూతురు పెండ్లిచేసుకోవటం మనసొప్పు కోటంలేదు. నువ్వు అతన్ని పెండ్లిచేసుకోవటం నాకిష్టంలేదు. అతనితో స్నేహంమాను, అని కామాక్షితో చెప్పేటంత ధైర్యమూ లేదు. ఇన్నాళ్ళనుంచి కూతురు పెళ్లిచేసుకోక పోవటం యెంత సమస్యగా వుందో, యిప్పుడు పెళ్లిచేసుకుంటా ననటంకూడా అంతే సమస్యకింద తయారయికూర్చుంది. ఇందులో చిత్రమేమిటంటే, నేను డాక్టర్ని ప్రేమిస్తున్నానని కాని, పెళ్ళిచేసుకుంటాననిగాని, తండ్రితో యెన్నడూ అన లేదు కామాక్షి. కానీ, అది పీకలమీదికొచ్చినట్లే భావించి నానా ఖంగారుపడుతున్నాడు. ఈ తండ్రీకూతుళ్ళలో

తమాషా యేమిటంటే కూతురుకి తండ్రి భయపడటం. కామాక్షివ్యక్తిత్వం అంత కఠినతరమయినది. అందుకే అందరితోపాటు తండ్రి భయపడతాడు. డాక్టర్ని పెండ్లిచేసుకుంటే అది యెంతమటుకు సక్సెస్ అవుతుందో ఆమెకే అర్థం కావటంలేదు. ప్రేమ, పెండ్లి, యీ రెండింటికి ముడిపెట్టటమే మానవజాతి చేస్తున్న ఘోరాపరాధం. ప్రేమ మనచేతిలో లేని వెన్నెల. పెండ్లి స్విచ్ వేస్తే వెలిగే విద్యుద్దీపం. వెన్నెలనీ విద్యుద్దీపాన్నీ, ఒక్కతడవే అనుభవిద్దామని మానవుడు ఆశిస్తాడు. కానీ ఆ రెండిటిలో అతనికి యేదోఒకటే మిగులుతుంది. వెన్నెలకాంతిని ఇంట్లోకి తేవటం యెంత అసాధ్యమో ప్రేమనుకూడ యింట్లోకి తేవటం అంతేఅసాధ్యం. అందుకే కామాక్షి భయపడుతూవుంది. మొన్న అదే డాక్టరుతో అందికూడ. ప్రేమ అనేవస్తువు పెండ్లికాగానే కాలుతున్న చిమ్నీమీద నీళ్లబొట్టు పడితే పేలినట్లు టప్పున పేలి పూరుకుంటే యేందారి అని అప్పుడు డాక్టరిచ్చిన సమాధానం జ్ఞాపకానికొచ్చి తనలోతనే నవ్వుకుంది. "ఒకవేళ అలా పగిల్తే జీవనమధుభాండమే పగిలి తునాతునకలయి అనే శీర్షికలో స్త్రీలపేజీలో ఒక వ్యాసం రాద్దువుగాని" అన్నాడు. తనలో తనే నవ్వుకుంటున్న కామాక్షిని చూసి

"ఏమిటండోయ్! మీలోమీరే నవ్వుకుంటున్నారు" అన్నది సత్యవతి.

"ఈ ప్రపంచమే ఒక వెకిలినవ్వు. అందులో ప్రయత్నించి యెవరయినా చిరునవ్వు నవ్వితే మూగవాళ్లంటారు" అన్నది కామాక్షి.

"మీ నాన్న నిన్ను రైటర్ని చెయ్యాలని దిక్కుమాలిన ప్రయత్నమంతా చేశాడు. కానీ, అసలు నువ్వు జన్మతహా రైటరువి" అన్నది పార్వతి.

"నా భయమూ అదే నక్కయ్యా! నేను రైటర్నని లోకం గుర్తిస్తే, మా నాన్నకోరిక యెక్కడ తీరిపోతుందోనని నాభయం. ఒకవేళ నేనేదైనా వ్రాసినా నా మొహంలాగానే అదికూడా అతిసామాన్యంగా తయారవుతుందేమోనని నా రెండోభయం " అన్నది పకపకానవ్వుతూ కామాక్షి.

"ఈవారం మీరు 'దాంపత్యం- దాని ధర్మాలు' అనే పేరుతో వ్రాశారే- ఆ వ్యాసం నా కర్థంకాలేదండీ" అన్నది సత్యవతి.

"ఆమాటకొస్తే నాకు మాత్రం అర్థమయిందా యేమిటి"అన్నది మరింత నవ్వుతూ కామాక్షి.

"మరి అర్థంకాకపోతే ఎలా వ్రాయగలిగారు ?" అని మళ్ళీ అడిగింది సత్యవతి.

"నాలుగుపుస్తకాలు ముందేసుకొని నాలుగుపేరాలు కాపీకొట్టి మొత్తం వాక్యాలు మార్చేసి పత్రికనింపాలి గనుక ఏదో వ్రాసేస్తాం. మీరలా వ్రాశారూ, ఎందుకు వ్రాశారూ అని అడిగితే ఏదోజవాబు చెప్పాలిగనుక జవాబుచెబుతాం గానీ ఆజవాబుకర్థం మాకూ బోధపడదు, మీకూ బోధపడదు" అన్నది కామాక్షి.

"దాంపత్యం దానిధర్మాలు అనే శీర్షికలో నువ్వు వ్రాయటమేమిటి నీ మొహం!" అంది పార్వతి నవ్వుతూ.

"లేదక్కయ్యా! శివరావు శంకరావుగార్ల పర్యవేక్షణకింద వ్రాశాను." ఈమాట గంభీరంగా మొహం పెట్టి అన్నది కామాక్షి. ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు.

"అన్నపూర్ణ మీ క్లాస్‌మేట్ కాబోలు. మీఇద్దరూ యెప్పుడూ కలిసి తిరిగినట్లుగా వుండరేమిటే?" అన్నది పార్వతి. కామాక్షి కొంచెంసేపు మాట్లాడలేదు. సత్యవతికి అర్థమయీ కాకుండావుండటంచేత కాఫీపెట్టటానికి లోపలకు వెళ్ళింది. నే నడిగిన ప్రశ్నకి సమాధానంచెప్పవేమిటే అన్నట్లుగా కామాక్షివంక చూసింది పార్వతి.

"దానితో తిరగటం పెద్దగా అలవాటులేదు. పెనమ్మీద పడ్డ నీటిబొట్టులా 'దానిహృదయం క్షణక్షణానికి సంకుచిత మయిపోతూవుంది. మొన్న ఆఫీసులో కూర్చునివుండగా తనువ్రాసిన కథలు తీసుకొచ్చింది. సరాసరి నా కివ్వటానికి ఆవిడకి నామోషీ'అనిపించింది. అయినా మా ఇద్దరికీ అట్టే దోస్తీ లేదు" అన్నది కామాక్షి పాపబుగ్గమీద చిటికె వేస్తూ.

"మరి ఆ కథ లెలావున్నాయి' అని కుతూహలంతో అడిగింది పార్వతి.

"కథల కేముంది. సీతా, సావిత్రీ, దమయంతుల్ని పందొమ్మిదోశతాబ్దపు కథానాయికలుగా మార్చి వ్రాసింది. అదేంచిత్రమో నా కర్థంకాలేదు. ఆవిడవ్రాసిన కథల్లో పాతివ్రత్యంతప్ప మరో పదార్థంలేదు" అన్నది కథల్లో అన్న మాటను వత్తిపలుకుతూ కామాక్షి. ఆ మాటలో అర్థం పార్వతి అర్థంచేసుకుంది. "అయితే కామాక్షీ! సామాన్య

ముగా మీ రచయితలు వాళ్ళవాళ్ళ అనుభవాలను గురించి ఎక్కువగా వ్రాసుకుంటారట కదూ? అది నిజమేనా?" అన్నది.

"పూర్తిగా అలా అని చెప్పలేము. కాదనీ చెప్పలేము. తనచుట్టుపక్కలుండే మనుషుల్నీ, సంఘటనల్నీ, తన కథల్లోకి తీసుకున్నా, వున్నది వున్నట్లు ఏ రచయితా చెప్పడు. అలా చెప్పకూడదు కూడ తన నవలల్లో కాని, కథల్లో కాని నిర్ణయాలేకరువుపెట్టకుండా చదివేవాడి ఆలోచనకే వదిలిపెట్టినవాడే ఉత్తమరచయిత. జుగుప్సాకరంగా వున్న కొన్ని అనుభవాల్ని చిత్రించాల్సివచ్చినప్పుడు ఆ పరిస్థితుల్లో వున్న వ్యక్తులెవరో అతిసన్నిహితులకుకూడ తెలియకుండా వుండేటట్లు వ్రాయటమే మంచిది" అన్నది కామాక్షి. ఇంతలో సత్యవతి మూడుగ్లాసులతో కాఫీతీసుకొచ్చి వాళ్ళిద్దరికీ చెరోగ్లాసు యిచ్చి తనొకగ్లాసు తీసుకొని అక్కడే కుర్చీలో కూర్చున్నది.

ఇంతలో సత్యవతినీ, పార్వతినీ పరమాశ్చర్యంలో ముంచుతూ లీల ప్రవేశించింది. లీల పార్వతినిచూస్తూనే ఒక నమస్కారం పడేసి, యింతలో కామాక్షిని చూసి "పట్నం వెళ్ళేరోజున మీతో చెబుదామనే అనుకున్నాను. మళ్ళీ పడలేదు" అని, సత్యవతితో మీరెళ్ళిపోయాక, శర్మగారిని అయిదారుమార్లు అడిగాను. ఇప్పుడు మీరు కూర్చునేచోట రెడ్డిగారిభార్యాగారి వూరునుంచి ఎవరో అమ్మాయి వస్తే ఆ అమ్మాయినేశారు. బంగారమంటి ఉద్యోగం. అటువంటిది నా కిస్తేనా!" అని, "పార్వతమ్మగారూ! పాపాయి నివ్వరూ,

ఎత్తుకుంటాను.'' అన్నది. పార్వతి మాట్లాడకుండా బిడ్డ నిచ్చింది. ఈమాటలన్నీ అనేసి నిమిషంలో పాపతో ఆడు కోవడంలో మునిగిపోయింది లీల. తనన్న యీ మాటలవల్ల ఆ ముగ్గురిమనసుల్లో యెంత తుఫాను ప్రారంభమైందో ఆ అమాయికప్రాణికి తెలియదు. పార్వతిమనస్సులో యెంత్రా యిడరీ దారాలు చిక్కుపడినట్లు రకరకాల ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నవి. సత్యవతి యెందుకు ఉద్యోగంచేయాల్సి వచ్చిందో, ఆ విషయం తనదగ్గర యెందుకు దాయాల్సి వచ్చిందో, అందులోను నీతి,నియమాలులేని సినిమాప్రపంచా నికి సంబంధించినపని యెందుకు చేసిందో అంతా అయో మయం. కామాక్షిమనస్సులో యింకోరకం ఆలోచనలు ముసిరినయి. సత్యవతి ఉద్యోగంకూడ చేసిందన్నమాట. ఈ యువతి కనిపిస్తున్నంత ముగ్ధకాదు ఏదో నాటకం ఆడు తున్నట్లుంది. అందరికన్న భయపడిపోయింది సత్యవతి. ఉద్యోగంచేసిన విషయం వాగితే వాగింది కాని, శర్మ తను క్లోజ్‌గా తిరిగినవిషయం వాగలేదు. అదే పదివేలు అనుకున్నది.

ఈ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ పార్వతి ''యేమే లీలా! పట్నంనుంచి యిప్పు డెందుకొచ్చినట్లు నీవు? మీ ఆయన సంగతి యేమైనా తెలిసిందా?'' అన్నది.

''రాజమండ్రిజయిల్లో వున్నాడట అమ్మగారూ! ఇవ్వాళరాత్రి నాటకం వుంది. అందుకొచ్చాను'' అన్నది రెండుజడలూ సర్దుకుంటూ లీల.

"నువ్వు నాటకాలు కూడా వేస్తావేమిటే ?" అన్నది ఆశ్చర్యంగా పార్వతి.

"వేస్తానండీ ! ఇవిగో, రెండుటిక్కెట్లు పట్టుకొచ్చాను మీకూ, సత్యవతమ్మగారికీ ఇద్దామని. తరువాత కామాక్షమ్మ గారికి పంపిస్తాను" అన్నది దర్జాగా లీల.

దానిదర్జాకి కామాక్షి తనలో తానే నవ్వుకుంది. "వచ్చేమాటుంటే నేను టిక్కెట్టు కొనుక్కొస్తాలే. ఇంతకూ నాటకమేమిటీ ?" అన్నది.

"ఎడారిపూవులు. యీమధ్య ఆ పేరుతో వున్న బొమ్మకి ప్రయిజువచ్చిందట. అందుకని ఆ పేరుతోనే శర్మ గారు వ్రాశారు" అన్నది సత్యవతివంక చూస్తూను.

సత్యవతి మాట్లాడలేదు. శర్మ నటుడేకాకుండా రచ యితకూడానా అనుకుంది. అతను జ్ఞాపకమొచ్చేసరికి ఆమె కేదో విచిత్రమైన మాధుర్యం నరాల్లోకి ఇంజక్షన్ చేసినట్లని పించింది. శర్మని తను నిజంగానే ప్రేమిస్తున్నది. అందులో యేం సందేహంలేదు. కామాక్షికూడా కొద్దిగా ఆశ్చర్య పోయింది. అఖిలభారత చిత్రకళాప్రదర్శనంలో బహుమతి నందుకున్న శంకర్రావుగారి చిత్రం ఎడారిపువ్వులకీ, సినిమా నటుడు శర్మవ్రాసిన ఎడారిపువ్వులు నాటకానికీ ఏమైనా సంబంధంవున్నదా ? లేకపోతే ఆ పేరులో వుండే ఆకర్షణే అతనిచేత నాటకం వ్రాయించిందా ? ఇంతకూ అసలు సంగ తేమిటంటే తను పెట్టినపేరు కాస్తోకూస్తో జనాన్ని ఆకర్షించిం దన్నమాట. నల్లగా, పొట్టిగా, అందవికారంగా వున్న లీల

యీ నాటకంలో వేషంవేయటం తమాషాగానే వుంది అనుకొని, పార్వతితో,

“అక్కయ్యా! వెళదామంటావా నాటకానికి? పోయి చూద్దాం” అన్నది. పార్వతి సరేనని తలవూపింది. సత్యవతికి లీలతో ఒంటరిగా మాట్లాడాలని వుంది. అది యెలా కుదురుతుందో అర్థంకాలేదు. లీలమాత్రం పాపాయితో ఆడుకుంటూనే వుంది. దిక్కులేక వంటమనిషిగా కొన్నాళ్ళు బ్రతికిన లీలకు యింత నాగరికత అబ్బటం చూసి పార్వతీ, కామాక్షీ కూడా విస్తుపోయినారు. అందులో ముఖ్యంగా లీల హీరోయిన్‌గా నటించటం అంటేనే నవ్వొచ్చింది కామాక్షికి. ఏదేమైనా నాటకం చూడాలనే నిశ్చయంతో “ఆరింటికి మళ్ళీ వస్తాను. సిద్ధంగా వుండ”మని పార్వతికీ, సత్యవతికీ చెప్పి కామాక్షి వెళ్ళిపోయింది. “కూర్చోవే, లీలా! ఇప్పుడే వస్తాను” అని పార్వతి లోపలికి వెళ్ళింది.

ఈ సమయంకోసమే యెదురుచూస్తున్న లీల జాకెట్లోంచి ఒక నీలంరంగుకవరు తీసి “శర్మగారు మీకిమ్మని యిచ్చారు” అని సత్యవతిముందు పడేసింది. సత్యవతికి చెమటలుపోసినయి. ఒణుకు ప్రారంభమైంది. ఆ పరిస్థితి గ్రహించిన లీల “అలా వణికిపోతారేమండీ! ఆ కవరు తీసి జాకెట్లో పెట్టుకోండి ముందు” అని సలహా చెప్పింది. సత్యవతి వెంటనే ఆ పని చేసింది.

లీల మెల్లిగా “ఆయనకూడా వచ్చారు. వీలయితే మిమ్మల్ని నాటకందగ్గర కలుసుకుంటామన్నారు” అంది. సత్యవతి వణికిపోసాగింది. ఏదో తప్పుచేసినట్లనిపించిందామెకు.

''సరే'' అని మాత్రం యెలాగో అనగలిగింది. ఇంతలో బ
టికి వచ్చిన పార్వతికి వెళ్ళివస్తానని చెప్పి, నాటకానికి సంద
మరోసారి హెచ్చరించి వెళ్ళిపోయింది లీల. ఆమె వెళ్ళగ
పార్వతి త్వరగా వంటచేయాలనే ఉద్దేశ్యంతో వంటింట్లో
వెళ్ళింది. సత్యవతి గదిలోకి పోయి తలుపులేసుకొని వణ
కుతున్న చేతుల్తో ఉత్తరాన్ని తీసింది.

* * * * *

దుర్గాకళామందిరందగ్గర జనం కిటకిటలాడుతున్నా.
ఆ నాటకం వ్రాసింది సినిమానటుడు. ఆ నాటకం వే
వాళ్ళు సినిమానటులు. ఇహ జనానికేం తక్కువ. స్టేజీ
గులో నిలబడి శర్మ ప్రేక్షకులవంక చూస్తున్నాడు. అత
కళ్ళు సత్యవతిరాకకోసం ఆతురతగా యెదురుచూస్తున్నాయి
తను సత్యవతిని యింతగా ప్రేమిస్తున్నాడని అనుకోలేద
అసలీ నాటకం వ్రాసింది, అది విజయవాడలో ప్రదర్శించా
లని అనుకున్నదీ- అంతా సత్యవతికోసమే. ఒక్కతడవ ఆమె
చూడటంకోసం అతను యేం చేయటానికైనా వెనుతీయ
పరిస్థితిలో వున్నాడు. ఇంతలో సత్యవతీ, పార్వతీ, కామా
ఒకళ్ళతరువాత ఒకళ్లు ఫ్రంటురోలోకి వచ్చి కూర్చున్నార
ఇంతలో లీల అతనిలాల్చీపట్టుకొని లాగి ''లోపలికి పిల్చు
రానా ?'' అన్నది. ముగ్గురుస్త్రీలతో వచ్చిన సత్యవతిని లో
లికి పిలవటం అంత క్షేమంకాదు. అందులో తను వచ్చా
డన్నసంగతి యేమాత్రమైనా బయటికి పొక్కితే జనంచుట్టే
గోలగోల చేస్తారు. ఇవన్నీ ఆలోచించిన శర్మ ఆమెను లో
పలకు పిలవటం మంచిదికాదనుకున్నాడు. సత్యవతికళ్ళు కూ

శర్మకోసమే వెదుకుతున్నవి. ఇంతలో యెందుకో వెనక్కు తిరిగి చూసిన పార్వతి గతుక్కుమన్నది. పార్వతిచూపులో ఆశ్చర్యం పసికట్టిన కామాక్షి యేమిటా అని తనూ వెనక్కు తిరిగి చూసింది. అప్పుడే ప్రవేశిస్తున్న అన్నపూర్ణ, రాజూ కనిపించారు.

హాలంతా హోరుమంటోంది. పార్వతీ, కామాక్షీ కూడా యెవరికివారే తలవంచుకొని కూర్చున్నారు. వాళ్ళని సత్యవతి చూస్తుందేమోనని పార్వతికి భయంవేసింది. కానీ సత్యవతిదృష్టిమాత్రం మరొకరికోసం వెతుకుతూంది. ఇంతలో లోపలకు వస్తున్న డాక్టర్ మధుసూదనరావు కామాక్షి ప్రక్కన ఖాళీగావున్న కుర్చీలో చతికిలబడి "ఏం కంచి కామాక్షమ్మా! నిన్న రాలేదు?" అన్నాడు

కామాక్షికి సిగ్గనిపించింది. భయంవేసింది. ఈ పరిస్థితిలో పార్వతిని మధుసూదనరావుకి పరిచయంచేయకపోతే ప్రమాదంకింద పరిణమించేటట్లుంది అనుకుని ఒకళ్ళకొకళ్ళని పరిచయంచేసింది.

పవిత్రత కొట్టవచ్చినట్లున్న పార్వతిమొహం చూసి మధుసూదనరావు చాలా ఆశ్చర్యపోయినాడు. స్త్రీముఖంలో పవిత్రతఅనేది ఇంతస్పష్టంగా కనిపించటం అతడెక్కడా చూడలేదు. అదేసమయంలో స్టైడ్వింగ్ లోంచి పార్వతినిచూసిన శర్మ కూడ అదే అనుకున్నాడు. సత్యవతి సౌందర్యవతి. ఆమెలో పవిత్రత లేదు. పార్వతి సౌందర్యవతీ, పవిత్రమూర్తి కూడా. కామాక్షిలో సౌందర్యమూ లేదు. పవిత్రతా లేదు. కానీ, మహోన్నతమయిన వ్యక్తిత్వం వున్నది. శాసించగల

నేర్పు వున్నది. వరసగా కూర్చున్న యీ ముగ్గురి హృదయాలూ కూడా విభిన్నమయిన మూడుపరిస్థితులలోవున్నాయి.

పార్వతి ధర్మపత్నిగా భర్తనితప్ప మరొకళ్లని తలచని వుత్తమస్త్రీ. ఆ వుత్తమం అనే పదముకన్న వుపయోగించటానికి మరొకపదం లేదు. అది వుత్తమమో కాదో నిర్ణయించటం కష్టం.

రెండోది: కామాక్షి అవివాహిత. ఆమె డాక్టర్ని వివాహంచేసుకోవాలనుకుంటున్నది. లేదా డాక్టరే ఆమెను వివాహంచేసుకోవాలనుకొంటున్నాడు. ఆమె మధ్యమ స్త్రీ.

యిహ సత్యవతి మిగిలింది. యుగయుగాలుగా ఆమె పరిస్థితిలోవున్న స్త్రీలే పతితలుగా భావించబడ్డారు. వివాహంచేసుకున్నది ఒకళ్లనయితే హృదయం మరొకళ్ళది. తారా, అహల్యా, సత్యవతీ– వీళ్ళకి రచయితలు సానుభూతి చూపించవలసిందే కానీ, సంఘం సానుభూతి చూపించదు. ఒకప్పుడు రచయితా చూపించడు. అలాటప్పుడే వారి జీవితం చరిత్రకందని పుటల్లో శిధిలమయిపోతుంది. చరిత్రకందిన పవిత్రజీవితాలకంటే చరిత్రకందని నీచజీవితాల్ని కథావస్తువులుగా తీసుకుంటాడు వుత్తమరచయిత.

సత్యవతి సైడ్వింగ్‌లోకి వెళ్ళి శర్మని చూడాలనుకొంది. కాని సాహసించటం ఆమెకు చేతకాదు. డాక్టర్ మధుసూదనరావు కామాక్షితో స్వేచ్ఛగా మాట్లాడటానికి భయపడుతున్నాడు. అందుకు కారణం పార్వతి పక్కనుండటం.

ప్రస్తుతంలో స్త్రీ స్వతంత్రిస్తోంది. అయితే ఆ స్వాతంత్ర్యాన్ని ఆమె సరిగ్గా వినియోగించుకుంటోందా అని సందేహం. యీ సృష్టిలో చేతనాచేతనమయిన సమస్తవస్తువులకూ స్వతహా స్వాతంత్ర్యకాంక్ష వున్నది. అగ్నిపర్వత గర్భంలో స్థలం లేనప్పుడు మహాభయంకరంగా పైకి లేచి విలయతాండవం చేస్తుంది లావా. సాగరుడు డిప్రెషన్ భరించలేనప్పుడు సైక్లోన్ తెచ్చి నానాభీభత్సమూ చేస్తాడు. నీటిని బాయిలర్లో బంధించి అగ్నిరగిలిస్తే అనేక వందల యేనుగుల బలం ప్రవేశిస్తుంది. ప్లూటోనియంను నిర్ణీతపరిమాణాన్ని మించి ఒకచోట పెడితే ఆటంబాంబై పేలుతుంది. జడపదార్థాలే యిలా ప్రవర్తిస్తుంటే చైతన్య మానవమూర్తి- స్త్రీ స్వాతంత్ర్యం కోరటంలో తప్పులేదు. కానిపోతే అది యెంతమాత్రం సద్వినియోగం అవుతుందో నూతనంగా స్వాతంత్ర్యాలయిన స్త్రీకి తెలియటంలేదు. స్వాతంత్ర్యప్రదాత, మిగతా మానవుడికీ అర్థంకావటంలేదు. ఆ నాటకశాలలో కూర్చున్న రకరకాల స్త్రీలందరిలో అదృష్టవంతులు యిద్దరే- పార్వతీ, లీలా.

యింతలో తెరయెత్తారు. పార్వతి ఆలోచనా స్రవంతి నుంచి తేరుకొని తెరవయిపు చూసింది. లీల స్టేజీమీదికి ప్రవేశించింది. ఆమెనుచూసి అందరూ ఆశ్చర్యపోయినారు. చాలా అందగత్తెగా మంచినటిగా కనిపించింది.

ఆ నాటిక పేరు యెడారిపుష్పాలు. యీజిప్టునించి వెళ్ళగొట్టబడ్డ మోసెస్ మహాభయంకరమయిన యెడారిలో త్రాగటానికి ఒక్కచుక్క నీరయినా లేకుండా తినటానికి

యేవిధమయిన తిండీలేకుండా ఒక్క మానవప్రాణి తనలాగ వూపిరిపీల్చి జీవించే మరొక్క మానవప్రాణి కనిపిస్తుందేమో నన్న ఆశతో ముందుకు పోతున్నాడు చుట్టూ చీకటి. గుండెలు బద్దలుచేసే మహాభయంకరమయిన నిశ్శబ్దం! మిగిలి వున్నది ఒక్కటే. అదే ఆశ. మానవుడి పురోగమనానికీ,పతనానికీ గూడ ఆశే ముఖ్యకారణం. ప్రతి ఒక్కక్షణం నిరాశ చీకటిలా ఆవరించివేస్తున్నది. దీపకణికలా అతనిలో వెలుగుతున్న ఆశాలేశం ఆఖరిక్షణంలో వుజ్వలంగా ప్రకాశించింది. అతను జయించాడు. దూరాన ఒక ఖర్జూరపు చెట్టు. ఒక చిన్న ఒయాసిస్. అందులో కొన్ని నీటిపువ్వులు. యెడారిలో పువ్వులు. ఘోరజీమూతంలో నక్షత్రకాంతి. అతనిని వుత్తమమానవుణ్ణి చేసినయి. అక్కడే అతను ఒక స్త్రీని కలుసుకుంటాడు. ఆమెతో తన జీవితాన్ని జోడిస్తాడు. బైబుల్‌కథ ఆధారంగా యీ నాటకం వ్రాశాడు శర్మ. మోసెస్‌గా మరొకతను నటించాడు. మోసెస్‌ప్రియురాలిగా లీలవేసింది. ఆ నాటకం మొత్తంమీద నిరాశతో కుమిలి పోతున్న మానవుడు ప్రగతిలో మహాపురుషుడై చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోటానికి కొన్ని ఎడారిపువ్వులు కారణం అన్నది స్పష్టంచేయబడింది.

నాటకం జరుగుతూవుండగా సత్యవతి బాత్‌రూమ్‌కని చెప్పి లేచివెళ్ళింది. యిదిచూసిన శర్మ సైడ్వింగ్‌లోంచి హాలువెనకవైపుకు వెళ్ళాడు. అక్కడంతా నిశ్శబ్దంగా వుంది. నిద్రగన్నేరుచెట్ల నీడలో వాళ్ళిద్దరూ తీవ్రమయిన తృష్ణతో ఒకరిలో ఒకరు లయించిపోయినారు. కౌగలింతలో

కోడతాౄచులు పడగలిప్పకముందే శర్మకి వళ్ళు తెలిసింది. కావలసినంత స్వేచ్ఛ, అవకాశమూ వున్న మద్రాసులోనే ఒకరినొకరు స్పృశించలేదు వారు. యీ ప్రమాదకరమయిన పరిస్థితిలో యింద్రియచాపల్యానికి లొంగిపోయినారు.

"శర్మా! నువ్వు లేకుండా నేను వుండలేనోయ్! తీసుకెళ్ళు వచ్చేస్తాను. యేమయితే అదే అవుతుంది" అన్నదామె వణుకుతున్న కంఠస్వరంతో. "నాపరిస్థితీ అలాగేవుంది. అనవసరమయిన ధర్మపన్నాలు వల్లించి నా ఆనందాన్ని ఒదులుకునేటంత త్యాగం నాలో లేదు." అని ఆమెను దగ్గరకు తీసుకున్నాడు శర్మ. యింతలో యెవరో వస్తున్న అలికిడయింది. "నువ్వు లోపలికి వెళ్ళు. లీలతో మళ్ళీకబురంపిస్తాను" అన్నాడు. సత్యవతి లోపలికి వస్తూ శివరావు తన కెదురుగుండా రావటం చూసింది. శివరావుకాని మమ్మల్ని చూడలేదు కదా అనుకుందామె.

శివరావు కొంతమటుకు చూశాడు. యిద్దరు స్త్రీపురుషులు రహస్యంగా మాట్లాడుకోవటం చూశాడు ఆ స్త్రీ సత్యవతి అని తెలిసింది గానీ, పురుషు డెవరయిందీ తెలియ లేదు. అంతకుముందే అన్నపూర్ణని రాజుని చూశాడు. అతనికి చాలా నవ్వొచ్చింది. సునందన్ని వేశ్యగనక తను అనుమానిస్తున్నాడు. శంకర్రావుగారు తనభార్య నింకా అనుమానించటంలేదు మరో వ్యక్తిభార్యతో నాటకాని కొచ్చిన రాజుకి తనభార్య యేమవుతుందోఅన్న భయం, యేకోశానా లేదు. నిరంతరం స్వేచ్ఛగా ప్రవహించిపోతున్న యీ జీవన స్రవంతిలో సుడిగుండా లేవో సమానస్థలా లేవో అతనికి

బోధపడలేదు. నేను వేశ్యని అనేకదా అనుమానిస్తున్నారు? యిప్పుడు మీ కులస్త్రీలు చేసే పనేమిటి? అని సునందను నిలువతీసి అడిగినట్లయింది. కులస్త్రీలంటే వీళ్ళుకాదు, సునందనా! అటుచూడు, ఆ పవిత్రమూర్తి పార్వతిని, అనుకున్నాడు సమాధానంగా తన మనస్సులో శివరావు.

నాటకం అయిపోయింది. ఒక్కొక్కరిమీద ఒక్కొక్కవిధంగా తన ప్రభావాన్ని ప్రదర్శించింది. మోసెస్‌కి భగవంతుడు ప్రసాదించిన పది పవిత్రసూత్రాలు చాలామందికి నమ్మకం కలిగించలేకపోయినా పార్వతికి మాత్రం ఆ దివ్యసూత్రాలు పరమ పవిత్రంగా కనిపించివయ్. నాటకాంతాన బయటికి వెడుతున్నపుడు రాజుని,అన్నపూర్ణనీ సత్యవతి చూస్తుందేమోనని చాలా భయపడింది పార్వతి. రాజూ, అన్నపూర్ణ ఎప్పుడెళ్ళిపోయారో యెవరికీ కనిపించ లేదు. కామాక్షి పార్వతితో చెప్పి యింటికి బయల్దేరింది. డాక్టర్ మధుసూదనరావు కారుతలుపు తీసి "యెక్కు, యింటిదగ్గర దిగపెడతాను" అన్నాడు. కామాక్షి కొంచెం సేపు సందేహించింది. రాత్రి పదింటికి ఒంటరిగా డాక్టరు కారులో యెక్కటం యెవరన్నా చూస్తే యీ విజయవాడ నగరంలో తన గతేమిటి? తన ఆలోచనకు తనకే నవ్వు వచ్చింది. యీవరకెప్పుడూ ఈపద్ధతిలో ఆలోచించలేదు. తను మెదలకుండా పోయి కారులోకూర్చుంది. ఆ విషయం డాక్టర్ గ్రహించాడు. కారు స్లోగా డ్రైవ్ చేస్తూ-

"ఏం, కంచి కామాక్షమ్మా! ఇటీవల మొగాళ్ళంటే కొంచెం బెదురుపట్టుకున్నట్లుందే!" అన్నాడు. "ఆడపిల్లను

కదటండీ! ఆమాత్రం బెదురునటించాలి" అని "మీా లిల్లీ యేమంటూంది?' అన్నది. డాక్టర్ షడన్ బ్రేక్ వేసి "అన్యాయం–" జలసీ! అని మళ్ళీ స్టార్ట్ చేశాడు కారు. కామాక్షి గతుక్కుమంది. జలసీ! నిజంగానే తన మనస్సులో జలసీ ప్రవేశించిందా అనుకుంది.

" నీపక్కన కూర్చున్నఆమె రాజు వదినగారు కదూ? అంటే ఆనందరావుగారి భార్య " అన్నాడు డాక్టరు.

"అవును.మా పార్వతక్కయ్యఅనిమాత్రమే పరిచయం చేశానుకదూ ఇందాక. ఎందుకని అలా అడుగుతున్నారూ?" అన్నది కామాక్షి.

" మానవనిర్మితమయిన అలంకారాలకి అందని సౌందర్యం డాక్టర్ల మేధాశక్తికి దొరకని దివ్యకాంతి ఆమెలో వున్నాయి. అదే ఆశ్చర్యంగా వున్నది " అన్నాడు డాక్టర్.

" అందరికీ అంత పవిత్రంగా వుండటం సాధ్యంకాదు అనిపిస్తోంది. అదేదో దైవదత్తమయిన ఒక మహానుభూతి " అన్నది కామాక్షి నిట్టూరుస్తూ.

" అవును. డాక్టర్ల మేధకీ, శాస్త్రజ్ఞుల పరిశోధనకీ అందని ఒక విచిత్ర పవిత్రత. కామాక్షీ ! మనదేశంలో ప్రతిస్త్రీ పార్వతి అయితే యెంతబాగుంటుంది!" అన్నాడు మలుపుతిప్పటానికి సైడుయిస్తూ డాక్టర్.

" ప్రతిరోజూ వెన్నెలే అయితే యెంతబాగుంటుంది? ప్రపంచంలో వెలుగుతప్ప చీకటి లేకపోతే యెంతబావుంటుంది! దుఃఖమనేది నశించిపోతే! యీా ప్రపంచ మొక గులాబీతోటగా మారిపోతే, పురుషులందరూ శ్రీరామచం

దురైతే అయితే యెంత బాగుంటుంది! కానీ, అసంభవా లెప్పుడు ఆశాజనకంగానే వుంటాయి" అన్నది కామాక్షి.

"పురుషులందరూ శ్రీరామచంద్రులైతే అనేమాట ఉపసంహరించుకొని పురుషులందరూ ఆనందరావులే అయితే అను" అన్నాడు డాక్టర్.

"ఆవిషయం నేను ఒప్పుకోను. యెందుకంటే, మా శంకర్రావుగారుకూడా చాలా మంచివాడు. కానీ, జీవితంలో పొందింది, పొందుతున్నది, పొందగలిగేది ఏమీ కనిపించ డంలేదు. దీన్నిబట్టి చూస్తుంటే స్త్రీలందరూ పార్వతులయి తేనే మంచిది అన్నమాటే సరిఅయింది" అన్నది చిలిపిగా కామాక్షి.

డాక్టర్ ఆలోచిస్తున్నాడు. చరిత్రకందని పార్వతు లెంతమందో యీ ప్రపంచంలో! శరత్‌బాబు వ్రాసిన 'అన్నదా' జ్ఞాపకమొచ్చింది. డాక్టరుకి. "శ్రీకాంత్ చది వావా కామాక్షీ?" అన్నాడు డాక్టర్.

"చదివాను. అందులో అన్నదా దీదీ గురించి ఆలో చిస్తున్నాను."

"చిత్రం! సరిగ్గా నేనూ ఆమెను గురించే ఆలోచిస్తు న్నాను. మనిద్దరం ఒకేసమయంలో ఒకేవిషయాన్ని గురించి ఆలోచించటం చిత్రంగాలేదూ!"

"అంతేగాదు. నామనస్సులో అభయ కూడా ఆడు తున్నది డాక్టర్! అభయకానీ, అన్నదాదీదీగాని స్త్రీలుగా యేం పొందగలిగారో నాకేమీ అర్థంకావటంలేదు. వాళ్ళ పంగ తలావుంచు. పురాణేతిహాసాల్లో పవిత్రమూర్తిగా చిత్రిం

చబడ్డ సీత చివరికి యేం పొందగలిగింది? పరమపవిత్రురాలు, యిద్దరుబిడ్డలతల్లీ అయిన జానకి అన్యాయంగా అపనిందల పాలయి జీవితాన్ని తృణప్రాయంగా వదిలేసింది. యీరోజున సీతని మనం దేవతగా పూజిస్తున్నాం. కానీ ఆ చరిత్రే నిజమయితే ఆనాడు ఆమెహృదయం యెంతగా విలపించిందో యెంతటి దారుణవ్యథకి గురిఅయిందో మనం వూహించలేం. యిప్పుడు ఆ సీతా లేదు. ఆ రాముడూ లేడు. ఒకప్పుడు కురిసిన ఆ వర్షబిందువులు కాలమనే అగ్నిలో ఆవిరయిపోయినయి. యిప్పుడు మనం సీతను పూజిస్తున్నాం, ఆనాడు యిదే లోకం, యిదే మానవజాతి, ఆమెను పరిభవించారు. దీనివల్ల యే పరిస్థితిలోను స్త్రీ సుఖించలేదు. నీతి అనే మత్తుమందు స్త్రీ రక్తనాళాలలో యింజక్షన్ చేసి నిశ్చేతనంగా ఆమె పడివుండటమే సుఖనిద్ర అని పిక్చర్ పెయింట్ చేసి ప్రదర్శిస్తుంది లోకం. యీ నీతి అనే పదార్థంవల్లా ఆ నీతికి కట్టుబడి వుండటంవల్లా స్త్రీ సుఖిస్తుందని భ్రమించటమంత అజ్ఞానం మరిలేదు.'' అన్నది కామాక్షి ఉద్రేకంగా.

"నువ్వలా వాదిస్తే నేనేం చెప్పలేను. కానీ అవినీతిలో స్త్రీ ఎప్పుడూ సుఖపడదు. కొంతమంది వ్యక్తులమీద కలిగిన కోపాన్ని నీతిమీద చూపిస్తే నష్టపోయేది స్త్రీయే.

"అసలు నీతి అంటే యేమిటి? అవినీతి అంటే యేమిటి? ముందాసంగతి చెప్పు'' అన్నది కామాక్షి.

"ఆ మాటకువస్తే సృష్ట్యాదినుంచి యింతవరకు యే ప్రశ్నకూ జవాబురాలేదు. కొన్నిప్రశ్నలకు జవాబులొస్తే

భరించలేము. అవిరాకుండా వుండటమే మంచిది" అన్నాడు డాక్టర్.

"అలా అని వూరుకోలేము. మానవజాతిలో చైతన్య స్రవంతి ప్రవహిస్తున్నంతకాలం ప్రశ్నిస్తూనే వుంటాడు మానవుడు. ఆ సంగతి గ్రహించండి డాక్టరుగారూ!"

"కానీ, యేనాటికీ మనిషి వాటికి జవాబులు పొందలేడు కంచికామాక్షమ్మా! అన్నాడు డాక్టర్. కారు వెంకటపతిగారియింటిముందు ఆగింది. డాక్టరుకి థేంక్సుచెప్పి ఆమె లోపలకు వెళ్ళింది.

ఆ రాత్రి సత్యవతికి నిద్రపట్టలేదు. తెల్లగా పక్కవేసి వున్న పందిరిమంచంమీద ఆమె ఇటూఅటూ దొర్లుతూంది. ఈ సమయంలో ఒక బాటిల్ విస్కీ వుంటే యెంత బాగుండును అనుకుందామె. రాజు ఇంటికి రాలేదు. ఈమధ్య కొన్ని రాత్రులనుంచి అతను ఆలస్యంగానే ఇంటికి వస్తున్నాడు. ఆ ఆలస్యానికి కారణం యేమిటో అనుకుం దామె. బహుశా అతనికికూడా ....... . ఆమె ఆలోచనలకు ఆమెకే నవ్వు వచ్చింది. ఏం? ఎందుకుండకూడదూ? అతనేమైనా దేవుడైన మానవుడా ....... . అసంభవం. అందరూ అంతే. అనుకుందామె. అర్థరాత్రి దాటటంచేత చల్లటిగాలి కిటికీలోంచి వస్తూవుంది. ఏదో దేవదూతల సందేశం మోసుకొస్తున్నట్లు ఆ గాలి చల్లచల్లగా ఆమెనుదిటిని తాకింది. తిరిగి సత్యవతికి మెళుకువవచ్చేసరికి ఉదయం ఆరుగంటలైంది. పడమటింట్లో పాప కేరింతలూ, పార్వతి పడబోస్తున్న కాఫీవాసనా ఆమెకు వుల్లాసాన్ని కలిగించినయి. గొడ్లపాకకి వెళ్ళి తన్ను ఆలస్యంగా

లేచినందుకు సిగ్గుపడుతూ గబగబా మొహంకడిగేసుకొని పడమటింట్లోకి వచ్చి పీటవాల్చుకొ కూర్చుంది.

కాఫీతోనిండిన కప్పుని తోటికోడలి కిస్తూ "రాత్రి రాజు రాలేదా?" అని అడిగింది పార్వతి. ఆమె యీ ప్రశ్న అడుగుతుందని సత్యవతి అనుకోలేదు మెల్లిగా "రాలేదు" అని జవాబు చెప్పింది. ఏవిధమైన అసూయకానీ, బాధకానీ లేకుండా అతిమామూలుగా రాలేదు అని జవాబుచెప్పిన సత్యవతిని చూసి చాలా ఆశ్చర్యపోయింది పార్వతి. ఈమెకు అనుభూతులు లేవా? భర్త యింటికి రాకపోతే, కించిత్తు కూడ బాధపడని యీమె మనస్తత్వం చాలా విచిత్రంగా వుంది. తను కాపురానికి వచ్చిన కొత్తలో ఒకరోజు యేదో కారణంచేత ఆలస్యంగా ఇంటికి వచ్చాడు ఆనందరావు. ఆ రోజు తనెంత బాధపడ్డది? చివరి కిహ ఆపుకోలేక వెక్కి-వెక్కి-యేడుస్తూకూర్చుంది. ఆనందరావు యింటికివచ్చి యెర్రబడ్డ తనకళ్ళు, తనవాలకమూ చూసి చాలా బాధపడి తన్నెంతో ఓదార్చాడు. ఆ రోజునుంచి ఈరోజుదాక ఆయన ఎప్పుడూ ఆలస్యంగా యింటికి రాలేదు. అలాంటిది రాత్రల్లా భర్త యింటికి రాకపోతే తోడికోడలు చీమకుట్టినట్లు కూడా అనుకోవటం లేదు. వీళ్ళు యెంతో ప్రేమించి పెళ్ళిచేసుకున్నారన్నమాట అబద్ధమేనా అనుకుంది పార్వతి.

ఇంతలో రాజు ఇంట్లోకివచ్చి పిల్లిలా పైకివెళ్ళాడు. తోడికోడళ్లు యిద్దరూ అది చూశారు.

"చూడమ్మా! కాఫీకప్పులు రెండూ కడిగి సత్తెమ్మ కంట్లుపడేయి. ఈలోగా నేను కాస్త మేడమీద కెళ్లొస్తాను" అని మేడమీది కెళ్ళింది పార్వతి.

అనుకోకుండా తన యెదురుగుండా నిలబడ్డ వదిన గారిని చూసి హడలిపోయినాడు రాజు. రాత్రింతా అతను అన్నపూర్ణగారింట్లోనే వున్నాడు. శంకరావుగారు రాత్రి వూరికెళ్ళటంచేత అన్నపూర్ణ నాటకానికి తోడురమ్మంటే వెళ్లి, ఆ రాత్రి అక్కడే భోంచేసి పొద్దుపోవటంచేత వుండి పోయినాడు. అర్ధరాత్రిదాకా యేదో మాట్లాడుకొంటూనే వున్నారు. అనుచితమైన పని అతనేమీ చేయలేదు. అలా టప్పుడు యేమి టీవిడ దాష్టీకం అనిపించింది. అయిందానికీ, కానిదానికీ తన్ని కంట్రోల్ చేయాలని ప్రయత్నించే వదిన గారిని చూస్తే చిరాకేసుకవచ్చింది. నిర్లక్ష్యంగా చొక్కా విప్పి వంకెకు తగిలించి స్నానంచేయటానికి కిందకు వెళ్ళి పోయినాడు.

పార్వతికి చాలా బాధనిపించింది. తన మరిది ఏనాడూ యిలా ప్రవర్తించలేదు. తప్పుచేయకుండానే తనంటే భయ పడేవాడు. ఇప్పుడు తప్పుచేసీ తనంటే భయపడలేదు. ఏమిటీ మార్పు? మెల్లిగా కిందకు వస్తున్న పార్వతికి సత్యవతీ, లీలా మెల్లిగా మాట్లాడుకోటం వినిపించింది. వీళ్లిద్దరికీ రహస్యా లేమిటి అనుకొని కూడ పార్వతి అనుమానించలేదు. స్త్రీ మరోవిధంగా ప్రవర్తిస్తుందనే వూహకూడ పార్వతికి రాదు. ఏ స్త్రీ అయినా భర్తను తప్ప మరోపురుషుణ్ణి కోరుతుందని కలలోకూడా అనుకోదామె. అది వూహక్కూడ అందని

విషయం పార్వతికి. ఇప్పటికే అన్నపూర్ణని చూసి చాలా సిగ్గుపడుతూం దామె. అలా ఎలా చేయగలుగుతూందో కూడ ఆశ్చర్యంకలిగించే విషయం. పార్వతికి రాజు నేదో అడుగుదామని వెళ్లిన తను మొదలకుండా వంటింట్లోకి వెళ్లి కత్తిపీట, నీళ్లగిన్నె ముందుపెట్టుకొని వంకాయలు తరగటం ప్రారంభించింది.

పార్వతి పైకివెళ్లి వచ్చేలోపల సత్యవతి రెండు ఘన కార్యాలు సాధించింది. ఒకటి: పనిమనిషి ఆదెమ్మతో తాగుడువిషయం మాట్లాడింది. రెండు: లీలదగ్గరనుంచి శర్మ పంపిన మెసేజ్ అందుకోవటం. సాయంత్రం అయిదింటికి కనకదుర్గగుడికని చెప్పి క్రిష్ణపాతబ్రిడ్జిదగ్గర శర్మను కలుసుకోవాలి. అక్కడనుంచి తొమ్మిదింటికి వచ్చి ఆదెమ్మ తెచ్చిన నీళ్ళు గొంతులో పోసుకొని గదితలుపు గడియవేసుకుపడుకోవటం. ఈ రెండూ నిర్విఘ్నంగా జరగాలని దుర్గను ప్రార్థించింది. తెలివితక్కువ సత్యవతికి పనిమషిచేతిలో తను యిరుక్కుందని గ్రహింపులేదు. అది యెంత ప్రమాదకరమైనపనో ఆమెకు తెలియలేదు. స్పిరిటులో సోడా కలిపి అమ్ముతున్న ఆ విషం శరీరానికి యెంత చేటో కూడ ఆమెకు తెలియలేదు.

పార్వతి తనను పలుకరించకుండా లోపలికి వెళ్లినందుకు యేమాత్రం లీల బాధపడలేదు. కూర తరుగుతున్న పార్వతికెదురుగుండా పోయి కూర్చుని "అమ్మగారూ! ఆ కత్తిపీటిలా యివ్వండి. నేను తరుగుతాను" అన్నది. ఏదో లోకంలోకి చూస్తున్నట్లు పరధ్యానంగా లీలవంక చూసింది పార్వతి. పాపాయి గిన్నెలో నీళ్ళు చిందగొడ్తూ వంకాయ

మనస్సులో అనుకుంటోంది. పార్వతి చూసిన చూపుకి లీల భయపడింది. తానేదన్నా తప్పుగాని చేయలేదుకదా అనుకుంది. ఇంతలో రాజు స్నానంచేసి లోపలకు వెళుతూ లీలను చూసి "రాత్రి బాగా యాక్టుచేశావు సుమా" అని వెళ్ళిపోయినాడు. మేడమీద తను వెళ్ళేసరికి కూనిరాగాలు తీస్తూ తలదువ్వుకుంటోంది సత్యవతి. ఈమధ్య ఆమె యింత ఆనందంగా వుండటం అతను చూడలేదు. ఉషారుగా యీలవేసి "ఏమిటీ కథ!" అన్నాడు. ఈమధ్య రాజు అంత సరదాగా మాట్లాడటం ఆమె యెరుగదు. ఒకర్నిచూసి ఒకరు ఆశ్చర్యపోయినారు. గబగబా డ్రెస్ చేసుకొని వెళ్ళిపోయినా డతను. ఆ వెళ్ళటం వెళ్ళటం సరాసరి అన్నపూర్ణ గారింటికి పోయినాడు. నిశ్శబ్దంగా టేబులుమీదవున్న టెలిగ్రాంతీసి అతని చేతికిచ్చింది అన్నపూర్ణ. శంకరావుగారిభార్య చనిపోయింది. చిన్నప్పటినుంచి తనని కష్టమో సుఖమో పెంచి పెద్దచేసిన మేనత్త చనిపోతే ఒక్క కన్నీటిబొట్టుకూడా రాల్చని అన్నపూర్ణని చూసి ఆశ్చర్యపోయినాడు రాజు. కొన్నిక్షణాలు ఆగి "అయితే శంకరావుగారు ఇప్పుడప్పుడే రాడన్నమాట" అన్నాడు. "రారు" అన్నది కొంటెగా ఆమె. కొంటెగా అన్న ఆ 'రారు' అనేమాటలో అర్థం గ్రీష్మ ఋతువులో పన్నీటిజల్లులా ప్రవహించింది అతనిమీద. రాత్రి భయంవల్ల అతను ఆమెతో గట్టిగా కూడా మాట్లాడలేకపోయాడు. ఇప్పుడతనికి భయపడాల్సిన అవసరంలేదు. శంకరావుగారు యిప్పుడప్పుడే రారు. అతనికి యీ వూహా చక్కిలిగింతలా వుంది. కాని తను చెయ్యబోయేది తనకి సుఖాన్ని

కలిగిస్తోందో, దుఃఖాన్ని కలిగిస్తోందో అతను ఊహించటం లేదు. ప్రతీ మానవుడు తప్పుచేయబోయేముందు ఒకవిధమైన మత్తులో పడతాడు.

ఆ రాత్రి రాజు తప్పు చేయాలని నిర్ణయించుకున్నాడు. సత్యవతి తప్పుచేయటానికి ప్రయత్నిస్తోంది. అయితే వీరు చేసేది తప్పేనా? తప్పనే అంటారు. అని తీరాలి కూడా. హోరుగాలిలో దీపశిఖ నిలువదు. ఎలక్ట్రిసిటీదీపం మాత్రమే నిలుస్తుంది. ఇప్పుడు నీతిని దీపశిఖతో పోల్చాలో, విద్యుద్దీపంతో పోల్చాలో తోచటంలేదు. ప్రపంచాన్ని పరిశీలించటం అలవాటయితే నీతి అవినీతులు ధర్మాధర్మాలు చాలా అల్పవిషయాలుగా కనిపిస్తాయి. ఒకవిధమైన విశాలదృక్పథం అలవాటైనరోజున సంకుచితమైన ఆలోచనలు రావు. చిన్న విషయాలకి ప్రాధాన్యత యివ్వరు. ముఖ్యంగా సెక్సుకి ప్రాధాన్యతయివ్వటం అనేది పూర్తిగా నశించిపోయిననాడు గాని యీ లోకం సుఖపడదు. సెక్సు అనే దెప్పుడూ జీవితానికి గార్డుపెట్టె. ఇంజన్ కాకూడదు. ఆ రోజునే మనిషి సుఖపడతాడు. పరిస్థితులు బాగుపడతాయి.

ఎక్కడో చదివిన యీ విషయాలు గుర్తువచ్చినయి రాజుకి. తనిప్పు డేమి చేయబోతున్నాడో ఆలోచించుకునేసరికి ఒకవిధమయిన సుఖానుభూతితోపాటు భయంకూడా కలిగిం దాతడికి. సత్యవతి కూడా నిస్సంశయమయిన అందగత్తె. కాస్తోకూస్తో ఆమెను ప్రేమించి పెండ్లిచేసుకున్నాడు. అలాటప్పుడు మళ్ళీ యీ చంచలత్వం దేనికో అతనికే బోధపడటంలేదు. రాజు యిక్కడ మధనపడుతున్న అదే సమయానికి

శివరావూ, సునందన ఒకవిధమయిన ఘర్షణపడుతున్నారు. ఆ ఘర్షణకి బొత్తిగా అర్థంకూడా లేదు. "తమలపాకు బీడీ యెంతచక్కగా ఈనలుతీశానో చూశావా" అన్నది సునందన సుతారంగా ఆకులతో చిలుకలుచుట్టి శివరావు కిస్తూ. శివరావు ఆమెవేపు కొంటెగాచూస్తూ "మనవృత్తే అదిగదా!" అన్నాడు.

ఛరుక్రుమంది ఆ మాటతో సునందనకు. "నా చెటు వంటి కులమయినా అనుక్షణం మీ రిట్లు దెప్పిచంపటానికి హక్కెవరిచ్చారు" అన్నది. వీళ్ళ సంభాషణ పక్కగది లోంచి వింటున్న మోహనాంగి "నాయన ! నాయన ! దాని కులాన్ని గురించి యెద్దేవచేయకు. అలాచేస్తే నిన్నునువ్వే యెక్కిరించుకున్నట్లు. అది బ్రాహ్మణపిల్ల" అన్నది. శివరావు చాలా ఆశ్చర్యపోయినాడు. సునందనకి తన చిన్నతనం నుంచి యీనాటివరకు జరిగిన సంగతులన్నీ సినిమారీలులా బుర్రలో తిరిగినవి.

* * * * *

తూర్పుగోదావరిజిల్లాలో ఒక పల్లెటూరిలో ఒక సోమయాజులుగా రున్నారు. ఆయన కేవలం తనకి యాభై యేళ్లున్నప్పుడు సంతానాభివృద్ధికోసరం పన్నెండేండ్లవయస్సున్న కనకమ్మను తృతీయవివాహం చేసుకున్నాడు. ఆ అమ్మాయిపుట్టిల్లు కూడా అదే. పదమూడోయేడే కాపరానికి వచ్చినకనకమ్మ పదిహేనోఏడువచ్చేసరికల్లా పట్టితల్లి అయింది. ఆసమయంలోనే ఆమెలో యవ్వనం పడగవిప్పి బుసకొట్టింది. తత్ఫలితంగా ప్రపంచమంటే యేమీయెరుగని కనకమ్మ పిల్ల

తోనూ, పక్కింటిఅబ్బాయితోనూ బెజవాడ వచ్చేసింది. నగలతో వున్న కనకమ్మను పల్లెవీధిలో గది తీసుకొని వుంచాడు పక్కింటిఅబ్బాయి.

విజయవాడలో పల్లెవీథంటే ప్రతి యువకుడికీ చిన్న యాత్రాస్థలంగా వుండేది. సన్ననివీధి. ఆ వీధికియిటూఅటూ కిక్కిరిసివున్న ఇండ్లలో అలంకరించుకొని నిలబడ్డ అంగనామణులూ కన్నులపండుగచేసేవారు. ఆ రోజుల్లో యిదంతా చూస్తుంటే కనకమ్మకు చాలా విచిత్రంగా వుండేది. తా నద్దెకు తీసుకున్న గదిపక్కనే మోహనాంగియిల్లు వుండేది. ఆ వాతావరణం, ఆ చవకబారుసంగీతం, ఆ అలంకరణలు, యీలలువేస్తూ వచ్చే ఆ జనం, ఇదంతా చూసి కనకమ్మ భయపడింది. అసహ్యించుకుంది కూడా. కనకమ్మకోసం గాకుండా కనకమ్మనగలకోసం మాత్రమే ప్రేమిస్తున్న పక్కింటి అబ్బాయికి ఆమె సహ్యాసహ్యాలసంగతి యేమీ పట్టలేదు.

ఒకరోజు పిలవకుండానే లోపలకు వచ్చింది మోహనాంగి "పిచ్చిపిల్లా! యేమిటిలా విచారిస్తూ కూర్చుంటావు? ఆ అబ్బాయి నీ బ్రతుకు పాడుజేశాడు. వెనకాముందూ చూసుకోకుండా అతనితో వచ్చేశావు. పోనీ, ఇప్పుడిక విచారించకూడదు. ధైర్యంగా బ్రతుకు. జీవితాన్ని నువ్వు లొంగతీసుకోలేకపోతే జీవితమే నిన్ను లొంగతీస్తుంది. లే, లేచి జడ వేసుకో. ఆ మిగిలిన ఒకటో రెండో నగలు ఆ అబ్బాయికి యివ్వవద్దు." అని చెప్పి ఒకమూల లక్కపిడతలతో ఆడుకుంటున్న పిల్ల నెత్తుకెళ్ళింది మోహనాంగి.

కనకమ్మ చాలాసేపు ఆలోచించింది. జీవితాన్ని నువ్వు లొంగతీసుకోలేకపోతే జీవితమే నిన్ను లొంగతీస్తుంది అనే మాటలు పదేపదే ఆమెచెవుల్లో గందరగోళంగా వినిపిస్తున్నాయి. తనుచాలాపొరపాటు చేసింది. ఇంద్రియచాపల్యంతో చేసిన యీ పొరపాటుకి తను జీవితాంతం యింత భయంకరమైన శిక్ష అనుభవించితీరాలి. తను చెడిపోయింది. తిరిగీ తనకి మిగిలిన హిందూకుటుంబంలో యే మాత్రిమూ స్థానం దొరకదు. ఏవిధంగానైనా తనూ యీ వాతావరణంలోనే బ్రితికితీరాలి. తను విచారిస్తూ కూర్చుని యేమీ లాభం లేదు. అగ్నిహోత్రింలాంటి బ్రాహ్మణకులంలో జన్మించిన తనకి చివరి కీగతి పట్టిందా! వలవలా యేడ్చిం దామె.

ఆమె యేడుస్తుండగానే గళ్ళలుంగీతో తాగుడుకంపు కొట్టుకుంటూ ఒక గేదెకాఫింగురాడీ లోపలికివచ్చి "ఓహో చిలుకా! పల్లీథిలో నీలాంటి అంతగత్తె యింతమటుకు కానరాలేదు" అని మీదకు వచ్చాడు. ఆమె కెవ్వున అరచి ఏడవటం ప్రారంభించింది. "నిన్ను లెగతీసుకవచ్చినోడు పొద్దున రైలెక్కుతుండగా చూసినాను వాడు నిన్నెప్పుడో ఒగ్గేసిండు. అయినా నాకు తెలవకడుగుతాను? లేసొచ్చిందానికి పాతివ్రిత్యం యేమిటే?" అంటూ యింకా మీదికివచ్చాడు. కనకమ్మ ఒక వెర్రికేక పెట్టింది. యుగయుగాలుగా తననితాను రక్షించుకోలేని స్త్రీహృదయావేదనంతా ఆ కేకలో ధ్వనించింది. అది విని మోహనాంగి గబగబా పరిగెత్తుకొనివచ్చింది. "ఏంయ్! నీకు బుద్ధిలేదూ!" అని గదమాయించింది. అంత పెద్దరాడీ ఆ కేకతో తలవంచుకొని వెళ్ళిపోయినాడు. మోహ

నాంగి అంటే ఆ వీధికంతటికీ నాయకురాలు. ఇది జరిగిన రాత్రే కనకమ్మ నూతిలోపడింది. ఆమెకోసం రెండు కన్నీటి బొట్లు రాల్చేవాళ్ళుకూడా యెవరూ లేకపోయినారు. దిక్కులేని ఆ పిల్లని మోహనాంగి పెంచి పెద్దచేసింది. ఆ పిల్లే సునందన.

ఈ కథ విని శివరావు ఆశ్చర్యంనుంచి తేరుకోక మునుపే మోహనాంగి మళ్ళీ ప్రారంభించింది.

"అది బ్రాహ్మణపిల్ల. దానిచేత అంట్లు తోమించ లేదు. కసువు యెత్తించలేదు. కుండ కడిగించలేదు. గౌరవంగా పెంచాను. పొట్టకి జరక్క రెండుమూడు పొరపాట్లు నేనే చేయించాను. అది అంతా జరిగిపోయింది. మీరు పెండ్లి చేసుకుంటానన్న రోజున కొండెక్కాం. మా కులంలో ముసలితనం వచ్చాక సామాన్యంగా యెవరికీ కూడు వుండదు. చాలా నికృష్టంగా చచ్చిపోతాం. సునందన మా జాతిపిల్ల కాదు. మా జాతిపిల్లనే పెంచుకుంటే యీనాడు నన్నిట్లా చూడదు. మేము పడే యీబాధలు అది పడకుండా వుండాలనే పెళ్ళిచేశాను. మీ రిప్పుడు ఆ కులాన్ని యెత్తి పొడవటం ధర్మంకాదు. ఎందుకంటే అది బ్రాహ్మణపిల్ల" అని బొడ్లోంచి చుట్టతీసి ముట్టించి తన గదిలోకి వెళ్ళి పడుకుంది మోహనాంగి.

శివరావు సునందనవంక చూశాడు. ఆమెపరిస్థితి చాలా విచారం కలిగించిం దాతనికి. తలవంచుక దుఃఖిస్తున్న ఆమె గడ్డాన్ని మునివేళ్ళతో పయికెత్తి కన్నీళ్ళు తుడిచాడు. సునందన అతనిఒళ్ళో తలపెట్టుకొని చాలాసేపు

యేడ్చింది. "ఏడవకు సునందనా! ఒక్కతడవ తప్పుచేస్తే ఉత్తమకులస్తులనుకునేవాళ్ళకు మరోగతి లేదు. తప్పుచేసిన వాళ్ళను కూడ క్షమించి ఆదరించే అధమకులాలే యెంతో నయం" అని ఓదార్చాడు శివరావు. సునందన లేచి మొహం కడుక్కుని ఫ్లాస్కులోకాఫీ రెండుకప్పుల్లోకి వంచి భర్తకు ఒకటిచ్చి తనొకటి తీసుకుంది. ఏడవటంచేత కొద్దిగా యెర్ర బడ్డవి ఆమెకళ్ళు. వాటిని చూస్తుంటే యెర్రికాయితాలు చుట్టిన యెలక్ట్రిసిటీబల్బులా అనిపిస్తోంది. సునందన యేదో లోకంలోదానిలా మాట్లాడటం ప్రారంభించింది.

"నా కులం మంచిది కాదేమోనన్న భ్రమతో మీ రనుక్షణం అనుమానిస్తూనేవుంటారు నన్ను. నా కులం అది కాదు కనుక నేను చాలా బాధపడ్డాను. ఈ ప్రపంచంలోకి వస్తూనే దురదృష్టవంతురాలుగా వచ్చాను నేను. నా అదృష్టం కొద్ది మిమ్మల్ని పెండ్లిచేసుకోగలిగాను. కానీ నా దురదృష్టం తోడై యిల్లా వెంబడిస్తే నా అదృష్టం లేడిపిల్లలా పారి తోందేమోననేభయం బాధిస్తూంది నన్ను. నేను వేశ్యను కాను. అలా అని బ్రాహ్మణపిల్లనీ కాదు. ఈ రెండుకులాల వాళ్లూ నన్ను వెలివేశారు" అన్నది.

ఉత్తమకులంలో జన్మించిన మీ తల్లిమాత్రం యేం సుఖపడ్డది. వృద్ధుణ్ణి వివాహంచేసుకుంది. అతనివల్ల యే విధమైన సుఖమూ పొందలేకపోయింది. ఆ సుఖంకోసం తప్పు దారినపడి చివరికి తగలేసేవాళ్ళన్నా లేకుండా నికృష్టంగా చనిపోయింది. ఆ ఉత్తమకులం ఆమెకు యేమాత్రమూ సాను భూతి యివ్వలేదు సరిగదా, నువ్వేం పాపంచేశావని నిన్ను

కుండా వెళ్ళగొట్టింది? నువ్వు అపవిత్రతలో పెరిగావు కానీ అది నీతికి అంటలేదు. దీనికి పూర్వీకులు చెప్పే ఉపమానం ఒకటున్నది. బురదలోపుట్టిన కలువపూవుకి బురద అంటదు. ఆ విధంగానే నువ్వూనూ. విచారించకు సునందనా! మోహనాంగి మీ అమ్మకు చెప్పిందే, జీవితాన్ని నువ్వు లొంగతీసుకోలేకపోతే జీవితమే నిన్ను లొంగతీసుకుంటుందని - అది చాలా నిజం. ఇప్పుడు నీకేం తక్కువైంది? నిన్ను అనవసరంగా అప్పుడప్పుడు అనుమానిస్తూవచ్చాను" అన్నాడు శివరావు. సునందన కృతజ్ఞతాపూర్వకంగా అతనివంక చూసింది.

మరునాడు ఆఫీసులో శివరావు చాలా ఉషారుగా వుండటంచూసి కారణం అడిగింది కామాక్షి.

"నిన్న నేను ఒక విచిత్రవిషయం తెలుసుకున్నాను కామాక్షీ!" అన్నాడతడు ఫైళ్ళుతీస్తూ.

కామాక్షి ప్రశ్నార్థకంగా అతనివంక చూసింది. కొన్ని నిముషాల తరువాత శివరావు జవాబు యిచ్చాడు. సునందన బ్రాహ్మణపిల్ల. ఈసారి నిజంగా విస్తుపోయింది కామాక్షి. వాల్టరు స్కాట్ నవలల్లోలాగ యీమాట ఆమెను చాలా ఆశ్చర్యపరచింది.

కామాక్షి ఈమధ్య వనితలశ్రీకోసం షెల్టర్ హోమ్ వాళ్ళని ఇంటర్‌వ్యూ చేసింది. రకరకాల జీవితాలు ఒక జీవితాన్ని పరిశీలిస్తే మరో జీవితం దానికి ప్రతిబింబం కాదు. అన్నీ అన్నిరకాలు. ఒకపిల్లని అప్పుతీర్చటంకోసం స్వయంగా తల్లే వ్యభిచారగృహంలో ప్రవేశపెట్టింది. అప్పు తీరకుండానే తల్లి చనిపోయింది. ఆపిల్ల మంచికుటుంబంపిల్ల కావటంచేత దయ

తలచి ఎవరో షెల్టర్ హోమ్‌లో ప్రవేశపెట్టారు. మరోపిల్ల ఉన్నది. అప్పుడే విచ్చిన రోజామొగ్గలాటి ఆ పదిహేనేళ్ళ పిల్లకి గర్భస్రావంకావటంవలన అవివాహిత అయిన ఆ పిల్ల పరిస్థితికన్న అనుమానభయంవల్ల తండ్రి స్వయంగా అన్ని రక్తసంబంధాలకీ అంతర్యానికీ స్వస్తిచెప్పి షెల్టర్ హోమ్‌లో ఆ పిల్లని వదిలివేసి చేతులు కడుక్కున్నాడు.

ఇంకో యువతి ఉన్నది. ఆమె వివాహిత, ఒకబిడ్డతల్లి. స్వయంగా అపనిందమోపి, బిడ్డను లాక్కుని ఇంట్లోంచి వెళ్ళ కొట్టించాడు. దానికి కారణం అతని తుచ్ఛవాంఛ తీరక పోవటమే. ఆ హోమ్‌లో తప్పుచేసినవాళ్ళున్నారు తప్పు చేయకుండానే అపనిందలపాలైనవాళ్లున్నారు. ఈ రెండు రకాలవాళ్ళు మాత్రమే కాదు, కేవలం దరిద్రంవలన చేరిన వాళ్ళున్నారు. ఈ దేశంలో - స్త్రీని పూజిస్తున్నామనే ఈ దేశంలో స్త్రీ బ్రతుకలేదు. ఈ దేశస్థులు ఆమెని పూజి స్తారు కాని జీవించనీయరు. ఇక్కడ స్త్రీ తల్లిగా మాత్రమే బ్రతగ్గలదు, స్త్రీగా జీవించలేదు. దిక్కులేని స్త్రీ తనంతటతాను జీవించాలంటే ఒకటే మార్గం. తనని తను అమ్ముకోవటం.

కామాక్షి బుర్రలో ఆలోచనలు సుళ్ళుతిరుగుతున్నాయి. ఇదేవిషయంమీద కొన్ని వ్యాసాలు వ్రాయాలని నిశ్చ యించుకుంది. తనుచెప్పిన ఆశ్చర్యకరమైన విషయానికి జవాబుచెప్పకుండా ఆలోచిస్తున్న కామాక్షిని కుతూహలంగా పరీక్షిస్తున్నాడు శివరావు. ఆ యువతి ఉత్తమసంస్కారానికి అతడు అభినందించాడు. తనలో తనే సునందనవిషయం చెప్పగానే అనాథలైన అనేకమంది స్త్రీలచరిత్రలు వరుసగా

ఆమెకు జ్ఞాపకంవస్తున్నాయని అతడు గ్రహించాడు. యుగ యుగాలనుంచీ స్త్రీ కూడా మనిషిలాగా ఎందుచేత బ్రతకలేకపోతోందో ఎవరికీ అర్థంకాని విషయం. పతనంలోనూ పాతివ్రత్యంలోనూ కూడా పురుషుడిమీదే ఆధారపడుతుంది. ఈ ఆలోచనకి అతనిలోని మానవత్వం జాలిపడితే పురుషత్వం గర్వించింది. కామాక్షి తలెత్తి శివరావునంక చూసింది. ఆ చూపు 'సునంధన బ్రాహ్మణయువతి. ఇకనైనా నిముష నిముషానికీ ఆమెను అవమానించబోకు' అన్నట్లుంది. శివరావు తలవంచుకున్నాడు. కొన్ని క్షణాలాగి "అర్థశాస్త్రవిమర్శ-మార్క్స్, పూర్తిచేశాను. ఒకసారి చూస్తావా?" అన్నాడు.

కామాక్షి తలయెత్తి చూసి "మార్క్స్... నాకేం అంతుబట్టని విషయం. అయినా చదువు. వింటాను" అని కాలింగ్ బెల్ మోగించింది. ఎవరూ రాలేదు. ఉన్న ఒక్క ప్యూనూ జ్వరంవచ్చి సెలవుపెట్టాడు. కాలింగ్ బెల్‌ని చూసి యెంత ఉపయోగహీనమైనవస్తువు అనుకుంది.

శివరావు చదవటం ప్రారంభించాడు.

"జీవితావసరవస్తువులకొరకైన సామాజికోత్పత్తిలో నిశ్చితమైన పరస్పర సంబంధాలు మనిషికీ మనిషికీ మధ్య యేర్పడుతాయి. ఈ సంబంధాలని వుంచుకోటానికి గాని, తెంచుకోటానికిగాని వ్యక్తుల యిష్టానిష్టాలతో సంబంధం వుండదు. ఈ ఉత్పత్తి బంధాలు ఆయా కాలాల్లోని వుత్పత్తి శక్తుల అభివృద్ధిమీదే ఆధారపడి నిర్ణీతములవుతూంటాయి. అదే అప్పటి ఆర్థికనిర్మాణశక్తిని యేర్పరుస్తూ వుంటుంది. దానిమీదే ఆ కాలపు న్యాయశాస్త్రాలు, రాజకీయసంస్థలూ

నిర్మింపబడతాయి. సామాజిక చైతన్యం చాలామటుకు దీని కనుగుణంగానే వుంటుంది. అంటే సాధారణంగా జీవితా వసరవస్తువుల ఉత్పత్తినిబట్టే ఆయా కాలాల్లో రాజకీయ సాంఘిక మానసిక పరిస్థితులువుంటాయి. దీన్నిబట్టి చూస్తుంటే ఆ యా కాలాల్లోని సామాజికపరిస్థితులే మానవుడికి చైత న్యాన్ని కలిగిస్తాయి కాని మానవుడి చైతన్యం భౌతికపరిస్థి తులను నిర్ణయించటంలేదని తెలుస్తున్నది.''

"నాకు జాస్తిగా అర్థకావటంలేదు." అన్నది కామాక్షి.

శివరావు పకపకానవ్వి "నాకుమాత్రం అర్థంఅయి యేడిసింది కనుకనా! అందులో ఇంగ్లీషునుంచి ఇలాటివి అను వదించేటప్పుడు తెలుగులో పదాలు కుదరక అయోమయ ముగా తయారవుతున్నది. 'ఎనాలిసిస్' అన్న పదమే కఠి నము అనుకుంటే తెలుగులో వివరణ అని వ్రాయాల్సి వస్తోంది. సరే, ఏదో ఒకటి- ఈవారం ఇది అచ్చవుతుంది. అందరూ చదువుతారు. ఎంత అర్థంకాకపోతే అంత బాగుం దనుకుంటారు" అన్నాడు.

కామాక్షికూడా నవ్వింది. "సరే కానీ,పాఠకుల ఖర్మం మనమేం చేస్తాం? ఇంకా చదవమంటావా?" అన్నాడు శివరావు. అతని ఆనందానికి ఇవాళ పట్టపగ్గాలు లేకుండా వున్నాయి.

"హతోస్మి! ఆ యినపభాషవిని శ్రవణహింస భరిం చటం నావల్లకాదు" అని ఖచ్చితంగా చెప్పివేసింది కామాక్షి. ఇద్దరూ పకపక నవ్వుకున్నారు. ఆ సమయంలో

గిరీశం బొంకులదిబ్బమీద ప్రవేశం అన్నట్లు వెంకటపతిగారు రంగంలోకి ప్రవేశించారు.

ఇటీవల ఆయనకి కూతురినిచూస్తే భయం జాస్తి అయింది. కోపంకూడా ఎక్కువయిందనే చెప్పాలి. మధ్యలో ఈ డాక్టరుగాడవోటి. ప్రాక్టీసులేని ఆ డాక్టర్ని కట్టుకుంటే ఇదేం సుఖపడిచస్తుంది? ఇదీ ఆయన బెంగ. ఈ బెంగతో ఆయన ఈమధ్య వ్యాసాలు వ్రాయటంకూడా మానివేశాడు. మొన్న ఒంటరిగా రాత్రి 10 గంటలు దాటినతరువాత డాక్టరుకారులోంచి దిగితే ఎలా చావటం. ఏమిటమ్మా ఇది అని అడిగితే 'అలా అడిగేహక్కు నీకేమాత్రం లేదు నాన్నా! అయినా ఇన్నాళ్లూ నాపెళ్ళికోసం నానా కుంభకోణాలూ చేసినవాడివి పెళ్ళిఅవబోయేవేళకి ఇలా ప్రారంభించావేమిటి?' అన్నది.

ఇదేం పెళ్ళో! అర్థంకావటం లేదు. ఆ డాక్టరుకి మంచిపేరు ఏమాత్రం లేదు, అన్నా డక్కడికీ ధైర్యంచేసి. కామాక్షి వెంటనే టఫీమని సమాధానంఇచ్చింది – నీ వెర్రి కాని, నాకుమాత్రం మంచిపేరు ఉండేడిసిందా ఏమిటి? అని.

దాంతో వెంకటపతిగారికి నషాళంఅంటింది. నిజమే. తనకూతురికి ఎంతమాత్రం మంచిపేరులేదు. ఆమెకు రెండు రకాలపేరే ఉంది. కొందరు చాలామంచిది, గొప్పది అంటారు. మరికొందరు చెడ్డది, స్వభావం మంచిదికాదు అంటారు. ఈ రెండురకాల అభిప్రాయాలు తప్ప మధ్యగాఉండే

అభిప్రాయంలేదు లోకానికి. ఈ సంభాషణతో వారిద్దరి మధ్యా తిరిగి పెళ్ళిప్రస్తావన రాలేదు.

ఇప్పుడు వెంకటపతిగారు ఆఫీసులో ప్రవేశించిన విష యం కామాక్షి పెళ్ళికి సంబధంకలిగిఉన్నదే. — అంటే డాక్టరు మధుసూదనరావు లేడీడాక్టరు గోజావతితో లీలా మహల్లో కనిపించాడనేవార్త అన్నమాట.

ఆ వార్త అంతఆనందంతో మోసుకువచ్చిన తండ్రిని చూస్తుంటే కామాక్షికి ఎక్కడలేని అసహ్యమూ పుట్టు కొచ్చింది. చివరకి తనతండ్రి ఇంతగా దిగజారిపోయినాడా అనిపించింది. అందులో శివరావుఎదుట ఈ వార్త చెప్పి తనని అవమానించినందువల్ల ఆయనకి కలిసివచ్చేదేమీ లేదు. సిగ్గుతో ప్రాణంచచ్చిపోయింది కామాక్షికి.

కూతురుముఖం చూసేసరికి తను ఎంత తెలివితక్కువ పని చేశాడో అర్థంఅయింది వెంకటపతిగారికి. అక్కడ తన్ని ఎవరూ పలకరించకపోయేసరికి సిగ్గుచచ్చి వెళ్ళిపోయాడు. శివరావువంక చూసింది కామాక్షి.

అతనుకూడా అదేసమయానికి తలయెత్తి చూశాడు. కామాక్షికళ్ళల్లో నీళ్ళు, కావేరీజలపాతంలా దుఃఖం. ఆమె రెండుచేతులతోనూ ముఖంకప్పుకుని ఏడుస్తోంది. ఎలా అను నయించాలో శివరావుకి అర్థంకాలేదు అయిదునిముషాల తరువాత తనంతటికి తనే ఏడుపుమాని కాగితాలుచూడటం ప్రారంభించింది. అరగంటతరువాత తనలోతను అనుకుంటు న్నట్లుగా శివరావుతో,

"నేను ఏడిచానుకదూ ! ఉత్త ఆడదానిలా ఏడిచాను. నన్నిలా అవమానిస్తే మా నాన్నకి ఏం కలిసివస్తుందో నా కర్థంకావటంలేదు. డాక్టర్‌ని పెళ్ళిచేసుకుంటానో చేసుకోనో నేనే నిర్ణయించుకోలేదు. ఈ పరిస్థితిలో నా మనసువిరిచెయ్యాలని మా నాన్న ప్రయత్నించటంఅంత నీచం అదే గాని మరోటిలేదు......ఏమిటో లే శివరావు ! నా బ్రతుకు నాకే.అసహ్యంగా ఉంది !" అని నిట్టూర్చింది. ఆ నిట్టూర్పు వాసుకివిషజ్వాలలా ఉంది. ఆ నిట్టూర్పు పరమశివునికంఠంలో ఉన్న హాలాహాలంలా ఉన్నది.

శివరావుకి ఏం జవాబుచెప్పాలో అర్థంకావటం లేదు. తెల్లబోయి కామాక్షీవంక చూస్తూ ఊరుకున్నాడు.

"నే నతన్ని నిజంగా ప్రేమించానా ? లేదా ? అన్నది కూడా అంతుబట్టని మరోవిషయం. అతనంటే నా కిష్టం. అంతమాత్రమే నాకు తెలుసు. ఆ ఇష్టాన్ని ప్రేమ అనుకుంటే అభ్యంతరంలేదు. ఇన్నాళ్ళకి నేను స్త్రీగా మరోవ్యక్తి ముందు వున్నప్పుడు అనుకుంటున్నాను ...నిజంగా.ఈ దేశంలో స్త్రీగా పుట్టటంఅంత శాపం మరోటిలేదు. నాఫుటుకు నాకు స్వేచ్ఛ,డబ్బు,చదువు అన్నీఉన్నాయి.కాని నాకులేనిదీ,ప్రపంచానికి ఉన్నట్లు కనిపించేదీ శాంతి. అదిమాత్రం నాకులేదు. ఉండు, శివరావ్ ! నామాటలకి అడ్డురాకు. ఈ రోజయినా నా వ్యథనంతటినీ చెప్పుకోనీ - ఏమిటి అంటున్నాను? శాంతి నాకులేనిది. అదే. అమ్మ చనిపోయింది. ఆరేళ్ళవరకూ మాత్రమే అమ్మా ! అని పిలువగలిగాను, అసలు అన్నిటి కంటె జీవితంలో నాకు శాపం మా నాన్నకడుపున పుట్టటం,

చిన్నప్పటినుంచీ నాన్న నన్ను మామూలుపిల్లని పెంచినట్లు పెంచలేదు. రుద్రమదేవినో, లేకపోతే కనీసం సరోజినీనాయుడునో చెయ్యాలని ఉద్దేశ్యం. అందుకే ఆ రెండూ కాకూడదని నా పట్టుదల...నిజం చెప్పాలంటే నాలో ఉరకలు వేస్తున్న .భావాలను కాగితంమీద పెట్టలేక కాదు. నేను వ్రాయంది వ్రాస్తే, ఎక్కడ నాన్నఆశయం నెరవేరుతుందో అని వ్రాయను. అనుక్షణం ఏవ్యక్తినయితే అసహ్యించుకుంటున్నానో ఆవ్యక్తినే ప్రేమిస్తున్నట్లు నటిస్తూ గడుపుకొస్తున్నాను. నిజంచెప్పాలంటే నేను పెళ్లి చేసుకోవటం ఆయనకి ఎంతమాత్రం ఇష్టంలేదు. ఇదంతా నా ఆస్తి. మా అమ్మ ద్వారా నాకు వచ్చింది. నేను పెళ్ళిచేసుకుంటే ఇదిపోతుంది. అందుకే నీలాంటివాడికి ఇవ్వాలని ప్రయత్నంచేశాడు. ఉండుండి నీవు మగాడనిపించుకున్నావు. హీరో చేసేపని చేసి కూర్చున్నావు. ఇప్పుడు డాక్టర్ ని నేను పెళ్లిచేసుకుంటే ప్రమాదంలో పడతాడు నాన్న. సూశావుగా! ఇందాక ఇక్కడ ఏన్నది! నువ్వుగనుక సరిపోయింది. అదే మరొకళ్ళయితే ఎంత అసహ్యంగా ఉండేది. ఛీఛీ! మనవి బ్రతుకులేనా? అదృష్టవంతులకి బ్రతకటం ఒకవరం. అదేబ్రతుకు నాలాంటి వాళ్ళకి శాపం. కొందరు ఆడవాళ్ళబ్రతుకులు నకిలీనగలు. శివరావ్! వాళ్ళకి విలువలులేవు. వాళ్లఖర్మం అంతే... ఏమిటో వాగేశాను ఇంతసేపూ. నాన్నను పూజించటానికి ప్రయత్నిస్తాను. పెళ్లి మానేస్తాను. అతన్ని ప్రేమించటం కూడా మానేయమంటే మానేస్తాను."

కామాక్షిమాటలు నిర్ఘాంతుడై వింటున్న శివరావు ఈ ఆఖరిమాటకి అదిరిపడ్డాడు. కామాక్షి అది గమనించ కుండా తిరిగి ప్రారంభించింది.

"ఇది సరే. నేను తండ్రిని తిరస్కరించానంటే ఇది యెంత అసహజమైన కూతురురా అని లోకం అనుకుంటుంది. నాన్నని వదల్టమా? డాక్టర్‌ని వదల్టమా? అని ప్రశ్నవస్తే సమాధానం తెలియటంలేదు"...

"ఆమాటకొస్తే మీ నాన్నని వదల్టమే మంచిది" అని సమాధానం ఇచ్చాడు శివరావు.

"సరే. ఒప్పుకుంటాను. మరి డాక్టర్ రోజాతో సినిమా కెళ్ళటం ఏమిటి?...అలా నవ్వకు. నేను స్త్రీని. నాకు కూడా అసూయఅనేది ఉన్నది. నా మగవాడనుకొంటున్న వ్యక్తి మరో స్త్రీతో సినిమా కెళ్ళటంఅనేది అవమానంగా భావిస్తాను. అది నా స్త్రీత్వానికే సవాల్......అయినా శివరావు! నువ్వు ఒకందుకుపోస్తే నేను ఒకందుకు తాగుతున్నానని— ఈ ప్రేమ అనేది ఎవడిసుఖంకోసం వాడు విసురుకునే ఒక విసనకఱ్ఱ. అంతకంటె నాకేం ప్రత్యేకత కనిపించటంలేదు దీంట్లో" అన్నది.

అప్పు డర్థమయింది డాక్టర్ మరో స్త్రీతో సినిమా కెళ్ళటం కామాక్షికి ఎంతబాధకలిగించిందో. శివరావుకి ఏం సమాధానం ఇవ్వాలో తెలియలేదు. ఎలా ఓదార్చాలో అంతకంటె అర్థంకాలేదు. అయినా—

"నీవు తొందరపడుతున్నావ్ కామాక్షీ! వూరికే సరదాగా సినిమాకెళ్లటం అంత తప్పుకాదేమో! లేదా ధ్యా

దృచ్ఛికంగా హాలులో కలుసుకునిఉండవచ్చును. ఏది ఏమ యినా ఈ చిన్నవిషయానికి నీవు ఇంత బాధపడటం శుద్ధ అనవసరం. పైగా నాకింకో అనుమానంకూడా ఉన్నది. ఒక వేళ మీనాన్న అబద్ధంఆడినా ఆడవచ్చును. ఈ విషయానికి నువ్వు అనవసరంగా డాక్టరుని అనుమానించి మనసుపాడు చేసుకోటం చాలా తెలివితక్కువ" అన్నాడు.

కామాక్షి ఆలోచించటం ప్రారంభించింది. నిజంగా తను పొరపాటుపడుతోందా? నాన్నమూలంగా ప్రతి మగ వాడినీ అనుమానిస్తోంది. ఆయనమూలంగానే తనమనస్సులో మగజాతంటే అసహ్యం కలిగింది. పోనీ ఇన్నాళ్ళూ ఎలాగా పెళ్లి చేసుకోలేదు. ఇప్పుడుమాత్రం నాన్నని ఎందుకు బాధ పెట్టాలి? జన్మంతా ఇలాగే కూతురుపెళ్ళికోసం నానా హడా విడి చేస్తున్నట్లు నటిస్తూఉంటాడు. నేనూ ఇలాగే పెళ్ళి కోసం అమాయకత్వం నటిస్తూఉంటాను. ఛీ ఛీ, ఏం జీవితం! అనిపించింది ఆమెకు.

సాయంత్రం అయిపోయింది. ఎక్కడికాగితా లక్కడ పారేసి కామాక్షి లేచింది. ఇంటికి వెళ్లాలనిపించటంలేదు. కాసేపు ఎక్కడికన్నా వెడితే! డాక్టరుని ఈరోజు చూడాలని పించటంలేదు......నిజంగా అనిపించటంలేదా? నిజంగా హృదయం అటువేపు మొగ్గటంలేదా? అతన్ని పెళ్ళిచేసు కోకుండా ఉండటమేగా నాన్నకి కావలసింది. స్నేహితుడుగా ఉండటానికి ఆయనఆజ్ఞ అక్కరలేదుగా! కామాక్షి తెలియ కుండానే డాక్టరుడిస్పెన్సరీవైపు నడిచింది. ఆమె వరండాలో అడుగుపెట్టగానే గడియారం ఆరుగంటలు కొట్టింది. లోపల

నుంచి పకపకా నవ్వులు వినిపించినయి. ఆ కంఠస్వరం డాక్టరు రోజావతిది. మనసు బిగపట్టుకుని నాలుగడుగులు ముందుకు వేసింది కామాక్షి. మామూలుప్రకారం లిల్లీ స్పై చేస్తూంది తలుపుచాటున నిలబడి.తన హృదయం ఇప్పుడెంత బాధపడుతూందో లిల్లీ హృదయం కూడా అంతే బాధపడుతూఉండవచ్చును. కామాక్షి సరాసరి లోపలికి వెళ్ళింది. లోపల ఎలాటిదృశ్యం చూస్తానని ఆమె భయపడిందో అలాంటి దృశ్యం కనిపించలేదు. ఇద్దరూ దూరంగానే కూర్చుని ఏదో కబుర్లు చెప్పుకుంటున్నారు. కామాక్షిని చూడగానే డాక్టరు ముఖం- కవులు వర్ణిస్తారే వసంతకాలపద్యంలా అని - అలా వికసించింది.

''హలో కామాక్షీ! ఇలా రా'' అని సోఫాలో ఒకపక్కకి జరిగాడు. కామాక్షి అతనిపక్కన కూర్చుంది. డాక్టరు రోజావతిముఖం వెంటనే ముడుచుకుపోయింది.

''ఇబా నల్లసిల్ల కామాక్షిని మీకు చూశాగా డాక్టర్! కంటకంపత్రికకి వ్యవస్థాపకురాలూ, సహాయసంపాదకురాలూను. కామాక్షీ! వీరు తెలుసుగా డాక్టరు రోజావతి'' అని ఒకరికొకర్ని పరిచయం చేశాడు మధుసూదనరావు.

''మా మధూ, మీరూ క్లాస్‌మేట్సా?'' అని ప్రశ్నించింది కామాక్షి. ఇదివరకెప్పుడూ అలా పిలవలేదు డాక్టర్ని. రోజావతిఎదుట డాక్టరుమీద తనకున్న అధికారాన్ని వ్యక్తపరచటానికే కామాక్షి అలా అన్నది.

ఆ మాట బాణంవిసిరినట్లు తాగా రోజావతిముఖం నల్లబడిపోయింది. "అవును" అని మాత్రం అనగలిగింది ఎలాగో పెగుల్చుకొని.

రోజావతి చాలా అందమైన యువతి. విజయవాడలో కొత్తగా ప్రాక్టీసుపెట్టిన లేడీడాక్టర్లలో ఆమె ఒకర్తె. ఆస్తి అంతో యింతో వుండటంచేత ప్రాక్టీసుమీదే ఆధారపడ నక్కరలేదు. అందమైన ఆ క్రిస్టియన్ యువతికి మధుసూదన రావు అంటే చాలా యిష్టం. కామాక్షి విసిరిన 'మా మధు' అనేవాక్యం రోజావతిని యెంత గాయపరచిందో తలుపుచాటు నుంచి వింటున్న లిల్లీని అంతే గాయపరచింది. డాక్టర్ మధు సూదనరావు వీళ్ళ ముగ్గురిహృదయాలనీ చదవగల జీనియస్. స్థంభీకరించిన యీ వాతావరణానికి చలనం కలిగించాలనే దృష్టితో,

"హలో రోజావతీ! మాట్లాడరేమిటి? మా కంచి కామాక్షమ్మ యెలాగా బిగుసుకుపోయింది అనుకోండి" అన్నాడు ఆ మాటకి సమాధానమా అన్నట్లు.

"రాత్రి టెన్ కమాండ్ మెంట్స్ గురించి మీ అభి ప్రాయం? చివరిసీనులో మీ మొహం చూడటానికి ప్రయ త్నించాను. కనిపించలేదు చీకట్లో" అన్నది రోజావతి.

చూశావా? మేం రాత్రి సినిమాకెళ్ళాం అనే అర్థం కామాక్షికి స్ఫురించి షాక్ అవాలని రోజావతి ఉద్దేశ్యం. ఈవార్త అదివరకే వినివుండటంవల్ల రోజావతి ఆశించినంతగా కామాక్షి షాక్ తినలేదు, కాని తలుపుచాటునుంచి వింటున్న

లిల్లీకి బ్రహ్మాండమైన షాక్ తగిలింది పాపం. గబగబా వెళ్ళి కూజాలో మంచినీళ్ళు తాగి మళ్ళీవచ్చి నిలబడింది.

ఈ యిద్దరుస్త్రీలూ ఆడుతున్న చదరంగానికి డాక్టర్ కి నవ్వొవస్తోంది. స్త్రీ తన హృదయవ్యథని సుస్పష్టంగా ప్రకటించటానికి భాషవాడదు. కన్నీటిని వాడుతుంది. కామాక్షి ఆ స్థితికి వచ్చేస్తూంది.

ఆ సమయంలో లిల్లీకూడా అదేస్థితిలో వుండటంచేత రేడియోట్యూన్ చేసింది. దూరాన్నుంచి వస్తున్న విపంచీ స్వరంలాగా వేసవివెన్నెలలో విరగపూసిన మల్లెపూలలాగా అప్సరస యెవతో హమ్మీ చేస్తున్నట్లుగా ఒక మధురగీతం వస్తోంది.

ఆ గీతమాధుర్యాన్ని గురించి చెప్పటానికి భాషలో సరియైన పదజాలం లేదు. ఐంద్రజాలికుని స్వాప్నికజగత్తులో కూడా యీ భ్రమలేదు. ఈ ఆనందం రాదు. ఆ పాటతో అందరికీ యేదో రిలీఫ్ వచ్చేసింది. దాంతో రోజావతి లేచి వెళ్ళివస్తానని చెప్పి వెళ్ళిపోయింది. డాక్టర్ కామాక్షి వంక చూశాడు. ఆమె కనుకొలుకుల్లో ఇందుపగింజలంత బాష్ప బిందువులు నిలిచివున్నాయి.

"పదిలక్షల వాక్యాలకన్నా పదునుగా మాట్లాడే కన్నీరు స్త్రీకి ఆయుధం, అంతేనా? కామాక్షీ!" అన్నాడు.

కామాక్షికి కోపం వచ్చింది. తప్పుచేసి పైగా ఇలా మాట్లాడ తాడేమిటి? అనిపించిందామెకి. కన్నీరు ఒక స్త్రీకేనా ఆయుధం?

"అది ఒక ఆయుధంమాత్రమే కాదు డాక్టర్! అవ్య క్తమైన అనుభవానికీ, అగోచరమైన అనుతాపానికి కూడా

అది చిహ్నం'' అన్నది. కొంచెంసేపు డాక్టర్ మాట్లాడలేదు. తరువాత....

''నీవు నన్ను అనుమానించావ్ కదూ! దీనివల్ల నాకు యెంతో తృప్తిగావున్నది. నీవు స్త్రీవే'' అన్నాడు.

''అడ్డతిరుగుడు సమాధానాలు మానెయ్ డాక్టర్! నేను స్త్రీనైనంతమాత్రంచేత నువ్వు పొందగలిగేదేమీ లేదు. నేను స్త్రీని కానందువల్ల నువ్వు నష్టపోయేదీ లేదు'' అన్నది కామాక్షి.

''మరి అలాటప్పుడు కళ్ళల్లో ఆ కన్నీరెందుకు? కంఠంలో ఆ జీర యెందుకు? దుఃఖాన్ని ఆపకు కామాక్షీ! దానివలన ప్రయోజనం లేదు. నావల్ల నీకేదైనా అపచారం జరిగితే ఆ మలినాన్ని నీ కన్నీళ్ళతో కడిగివేయి. తిరిగి పరిశుభ్రమైన మనస్సులతో మాట్లాడుకుంటాము'' అని డాక్టర్ అన్న మాటలకి కామాక్షి ఏడవటానికిబదులు నవ్వింది. అది చూసి,

''నీవు చాలా చిత్రమైన స్త్రీవి కామాక్షీ! అందుకే నువ్వంటే నాకెంతో యిష్టం. ఈ చిన్నవిషయాలు నిన్ను అంటవు'' అన్నాడు.

''మీరు రోజావతితో యెందుకు సినిమాకి వెళ్ళాల్సి వచ్చింది?'' అని సూటిగా ప్రశ్నించింది కామాక్షి.

''సినిమాకి వెళ్ళినాక కనిపించింది. మాట్లాడకపోతే బాగుంటుందా చెప్పు?'' అన్నాడు అనునయంగా డాక్టర్.

కామాక్షి యెలా అనుకున్నా తలుపుచాటున వున్న లిల్లీ మాత్రం చాలా హాయిపొందగలిగింది. కామాక్షికి కూడా కొంత వుపశమనం కలిగిందనే చెప్పవచ్చును.

"మొన్న చూశామే నాటకం - ఎడారిపువ్వులు - బహుశా టెన్‌కమాండ్ మెంట్స్‌కి కాపీ యేమో అనిపిస్తోంది. సినిమా చాలా బాగుంది కామాక్షీ! తిరిగి మనిద్దరం చూద్దాం." అన్నాడు డాక్టర్.

"నిన్న నాకు ఫోనుచేయకపోయినారా?" అన్నది తేలికపడ్డ మనసుతో కామాక్షి.

"చేశాను నల్లపిల్లా! మీ నాయన తీశాడు. టకీమని మళ్ళీ పెట్టేశాను" అన్నాడు అభినయపూర్వకంగా డాక్టర్. ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు. తలుపుచాటున లిల్లీ చిన్న నిట్టూర్పు విడిచింది.

* * * * *

ఎవరంటారు ప్రేమ మంచిదని? సౌఖ్యపడతాను గదా అని ప్రేమించాను. కాని బ్రతుకంతా దుఃఖిస్తూనే వున్నాను. చండీదాసు వాక్యాలు గుర్తువచ్చాయి శంకరావుగారికి. ఆయనభార్య చనిపోయింది. చిన్ననాటి తన సహచరి, తన పిల్లలతల్లి తనని విడిచిపెట్టిపోయింది. తన బ్రతుకుని ఖాళీచేసి వెళ్ళిపోయింది. ఆ యేర్పడిన ఖాళీ యెంతపెద్దదో పన్నెండవ రోజున బంధువులందరూ వెళ్ళిపోయినతరువాతగాని ఆయనకు తెలియలేదు. గతంలో ఒక్కొక్క తెర తొలిగిపోతుంటే మొదటి తెరదగ్గర ఆయనమనస్సు నిలిచింది.

లోకంలో అందరు మనుష్యులూ దుఃఖించినట్లుగా కళాకారుడు దుఃఖించడు. అతనిదుఃఖం మామూలు మనుష్యుల దుఃఖానికి విభిన్నమైనది. కొన్నివేళల ఆ దుఃఖం ఉత్తమకళాఖండంగా మారుతుంది. తాజ్‌మహల్ మొదలు ఊర్వశి దాకా అలా మారినవేనంటే అతిశయోక్తి కాదు.

శంకరావుగారు చిత్రించటం మొదలుపెట్టారు. భార్య చనిపోయిన పన్నెండవరోజు అర్ధరాత్రివేళ మృతపత్ని యవ్వన రూపాన్ని మనస్సులో భావిస్తూ తెల్లవారుఝామునకి ఆచిత్రం పూర్తిచేశాడు. ఆ చిత్రంకింద "ఎవరంటారు ప్రేమమంచిదని? సౌఖ్యపడతాను గదా అని ప్రేమించాను కాని, బ్రతుకంతా దుఃఖిస్తూనే వున్నాను"అన్న వాక్యాలు చిత్రించారు.

ఆమెని చివరిరోజులలో తను వదిలివేశాడు. దానివలన ఆమెసంగతి అలావుంచి తనుకూడా సుఖపడలేకపోయినాడు. అన్నపూర్ణని బిడ్డలాగ పెంచింది తన భార్య. మహాలక్ష్మి అన్న తనపేరు సార్థకంచేసుకుంది. అన్నివిధాలా అనుకూలవతి అయిన భార్యతో ఇరవైయేళ్లు సుఖించాడు తను. ఇప్పుడనిపిస్తున్నది- ధర్మంలో సుఖం వున్నది. అధర్మంలో అసౌఖ్యం, అశాంతీ తప్ప మరేమీ లేదు అని. అన్నపూర్ణ పెరిగి పెద్దదయింది. తన చెల్లెలు చనిపోతూ తన కప్పగించిన పాపని పెంచి పెద్దచేశారు.

కాని ఆ పాపే పామై మహాలక్ష్మిసౌఖ్యాన్ని కాటువేసింది. ఆమె చివరిరోజులలో శాంతిలేకుండాచేసింది. చివరికి అవసానసమయంలో కూడా సుఖంగా కన్నుమూయలేకపోయింది ఆ పాపవల్లనే.

గతంలో ఒక్కొక్క తెర దాటుకుంటూ వెడితే ఒక అనుభవం. అది ఈనాటికీ శంకరావుగారిహృదయంలో పెళ్ళిబట్టలమధ్య బొగడపూల పరిమళంలా నిండిపోయివుంది. మహాలక్ష్మిని తను కొత్తగా కాపురానికి తీసుకొస్తున్నాడు. భర్తతో సరిగా మాట్లాడటానికే సిగ్గుపడే ఆ ముద్దరాలు మల్లెపూలవంక చూసి మనసుపడింది. భర్తని అడగటానికి సిగ్గు. ముగలిరేకులవంటి కనురెప్పలు మెల్లిగా యెత్తి భర్త వంక చూసింది. అది గ్రహించిన శంకరావుగారు మల్లె పూలు కొని ఆ ముద్దరాలికి యిచ్చారు. భర్త తనమనస్సు గ్రహించినందుకు పరమానందంపడిపోయింది ఆమె. కాని యిప్పుడింకో కొత్తసమస్య యెదురైంది. ఆ పూలు తలలో పెట్టుకోవాలి. యెలా ?

మాలకట్టటానికి దారం కావాలి. నడుస్తున్న రైల్లో దారాన్ని పుట్టించటం అంత తేలికపనికాదు. ఆమె మళ్ళీ తలయెత్తి భర్తవంక చూసింది. ఆ చూపులో కట్టిన మాల కొంటే బాగుండేది, ఇప్పుడీ విడిపూలు ఎలాకూర్చను? నిష్కారణంగా పూలు వాడిపోతున్నయ్యే అనేవ్యథ స్పష్టంగా కనిపించింది. శంకరావుగారికి యేంచేయటానికీ తోచలేదు. కొంచెంసేపైనాక యజ్ఞోపవీతంలోపోగుఒకటి తీసియిచ్చాడు. అది చూడగానే మహాలక్ష్మి ఆనందం పట్టలేకపోయింది. గబ గబా ఆ పూలు మాలకట్టి తలలో పెట్టుకొంది.

తరువాత తను చీరలూ కొన్నాడు. నగలూ చేయించాడు. కాని ఆ దారంముక్క ఆమెకిచ్చిన సంతోషం యివేవీ యివ్వలేకపోయినాయి. ఎప్పుడు మల్లెపూలు చూసినా

మహాలక్ష్మి ఆనాటి అనుభవాన్ని జ్ఞాపకం తెచ్చుకునేది. శవం మీద కోడళ్ళు మల్లెపూలు చల్లారు. అప్పుడు కూడా ఆ మృతదేహంలో మరొక్కసారి యవ్వనరక్తం ప్రవహించింది దేమో! అప్పుడు కూడా చైతన్యహీనమైన ఆ మొగుండెలో ఆ తొలినాటి మధురానుభవం గుర్తుకివచ్చిందేమో! ఏమో యెవరు చెప్పగలరు?

తెల్లవారింది. ఆ ఇంటితోనూ, మహాలక్ష్మితోనూ కొంతకాలం క్రిందటే సంబంధం తెంచుకున్నాడు శంకరావు గారు. ఈనాడు పూర్తిగా తెంచుకుని తను చిత్రించిన మహాలక్ష్మిచిత్రాన్ని చేతిలో పుచ్చుకొని రైలెక్కాడు. ఆయనని ఎవరూ ఆపలేదు.

* * *

సావిడిలో ఫ్రేముకట్టి తగిలించిన తన మేనత్త చిత్రాన్ని చూస్తుంటే ఎందుకో భయంవేస్తోంది అన్నపూర్ణకి. ఆ చిత్రం గాలికి కదిలినప్పుడల్లా మేనత్త ఆత్మ తనని శపిస్తోందా అనిపిస్తున్న దామెకి. ముఖ్యంగా తను రాజుతో మాట్లాడుతున్నప్పుడు మరీని. శంకరావుగారిని ఆ పటం అక్కడినించి తీసివేయమని అడిగింది. ప్రాణంపోయినా అది క్కడినుంచి తీసివేయటానికి వీలులేదని జవాబుచెప్పాడాయన. అన్నపూర్ణఅహంకారం దెబ్బతిన్నది. ఎలాఅయినా అది అక్కడినుంచి తీసివేయించాలనే పట్టుదలకూడా పెరిగింది.

ఆ సాయంత్రం పనిమనిషిని పిలిచి దాన్నితీసి అవతల పారేయమని చెప్పింది పనిమనిషి కుర్చీవేసుకుని పటం తీయ బోయేసరికి కుర్చీకాలువిరిగి క్రిందపడి నడుము విరగగొట్టు

కుని వారంరోజులు పనిలోకి రాలేదు. అన్నపూర్ణభయం మరీ యెక్కువయింది. దాంతోబాటు పట్టుచలకూడా ఎక్కువవటంచేత ఆ రోజుసాయంత్రం రాజుని ఆ పటం తీయమంది. రాజు పటంతీయడానికి వెడుతుంటే తివాచీ కాలికి అడ్డంతగిలి బొక్కబోర్లా పడ్డాడు. ఈ సంఘటనతో అన్నపూర్ణకి భయం మరీ జాస్తిఅయింది. ఆమెకు దయ్యాలన్నా భూతాలన్నా ఏమాత్రమూ నమ్మకంలేదు.

ఆరాత్రి శంకరావుగారికీ, ఆమెకీ ఆవిషయంమీద హోరాహోరీ తగూఅయింది. కొంపలో దెయ్యాన్ని తీసుకొచ్చిపెట్టావు అంది. ఆ మాటతో శంకరావుగారికి విపరీతమయిన కోపంవచ్చి లాగి లెంపకాయకొట్టారు.

అన్నపూర్ణ ఇంతవయసులోనూ ఏనాడూ దెబ్బపడలేదు. తను బ్రహ్మాండమయిన తప్పుచేసిన రోజునే తనని ఒక్కమాట అనని మేనమామ ఈనాడు తనని కొట్టాడు. ఆమె అభిమానము దెబ్బతిన్నది. వృద్ధుడూ, అసమర్థుడూ అయిన ఈ వ్యక్తికి తననికొట్టే అధికారాన్ని యెవరిచ్చారు?

"దయ్యం! ఎవరే దయ్యం! నువ్వా దయ్యం. నీలాంటి తుచ్ఛురాలికోసం ఆ మహాయిల్లాల్ని ఉసురుపెట్టాను. అది దేవత. నన్నువదిలి వెళ్ళిపోయింది. పళ్ళు పారవేసుకుని తొక్కలుతినే పిచ్చివాడితంతు అయింది నా బ్రతుకు" అని దుఃఖించటం ప్రారంభించాడు. కొంచెంసేపయినాక "నన్ను క్షమించు అన్నపూర్ణా! ఇంకెప్పుడూ కొట్టను" అని లేచిపోయినాడు.

అన్నపూర్ణ దిగ్భ్రాంతురాలైపోయింది. నిజమే తనని చిన్నప్పటినుంచీ పెంచిన మేనత్తనేనా తను దెయ్యంఅన్నది! తప్పు తనదే అయినా ఆయనే క్షమించమని ప్రార్థించాడు. ఈ ఊహ మరుక్షణంలోనే ఫేడౌట్ అయిపోయి మొదట వచ్చిన కోపమే మిగిలిం దామెకి.

అజ్ఞానపూరితమయిన మనసులో జ్ఞానదీపం వెలిగీ వెలగకపూర్వమే విధి కంబళీ కప్పేస్తుంది. దాని కాంతి లేశంకూడా బయటికి కనిపించదు, సరిగదా ఒకప్పుడు జ్ఞాన దీపం అక్కడ వుందన్న చిహ్నంకూడా కంటికి కనిపించదు. అన్నపూర్ణమనసులోకూడా అదేజరిగింది. బయటా లోపలా కూడా అంధకారం వ్యాపించటంతో ఆమెకు నిద్రరావటం లేదు. అవ్యక్తమయిన భయమేదో ఆమెను పీడిస్తోంది.

నిశాదేవి నల్లచీరెకొంగు కప్పుకొని ఇటూ అటూ తిరుగుతోంది ఫ్యాక్టరీపక్క ఊకరాశిలాగా చుట్టూ చీకటి రాశి. దూరాన కృష్ణబ్రిడ్జిమీద రైలు వెడుతున్నధ్వని బాధతోమూలుగుతున్న ఏనుగుచేసే శబ్దంలా ఉంది. అన్న పూర్ణభయం క్షణక్షణానికీ అధికమవుతోంది. చెమటతో ఒళ్ళంతా తడిసిపోయింది. తనచుట్టూ ఎవరో తిరుగుతున్న ట్లనిపించి ఒకవేళ దయ్యంకాదుగదా అనుకుంది. అత్తయ్యకి తను చేసిన ద్రోహానికి ఇప్పుడు కక్షతీర్చుకోటానికి రాలేదు గదా! అన్నపూర్ణ భయంతో బిగుసుపోయింది. లేచి భర్త దగ్గరికి పరుగెత్తుదామంటే అభిమానం అడ్డువచ్చింది. ఆమె తిరిగీ మంచంమీద పడుకుని గట్టిగా ముసుగుతన్ని ముడు చుకు పడుకుంది. అయినా వణుకు తగ్గలేదు.

తూర్పురేకలు తెలవారుతుండగా ఆమెకి నిద్రపట్టింది. శంకర్రావుగారు లేచి స్నానపానాలు ముగించి భోజనంచేయకుండానే ఆఫీసుకు వెళ్ళిపోయినారు. పదకొండుగంటల ప్రాంతంలో రాజు వచ్చి అన్నపూర్ణని నిద్రలేపాడు. తెల్లవార్లూ అనుమానాలతోనూ, భయంతోనూ, అలమటించటంచేత ఆమెమొగాన ప్రేతకళ పడింది. ఒక్కఉదుటున లేచి కూర్చుని రాజుని కౌగలించుకుని బావురుమని ఏడ్చింది. రాజు యెంతఓదార్చినా అరగంటదాకా ఆమెయేడుపు ఆగలేదు. తరువాతయినా అరగంటదాకా ఒకటేమాట - ఈ దయ్యాల కొంపలోంచి బయటపడాలి. ఇక్కడ ఒక్క క్షణం ఉండను, అని.

భార్యావియోగం తరువాత శంకర్రావుగారు ఇదే ఆఫీసుకు రావటంవలన, ఎలా పలకరించాలో అర్థంకాలేదు కామాక్షికి. పాలిపోయిన ఆయనఆకారం చూస్తే ఆరునెల్లు మంచంమీదుండి ఇప్పుడే పత్యంతీసుకున్నాడా అనిపిస్తోంది. అయినా అతిమామూలుగా తన సీట్లో కూర్చుని పనిచూడటం ప్రారంభించాడు.

ఆయనమనసు కేదో చావుదెబ్బ తగిలిందని కామాక్షి గ్రహించింది. వదిలివేసిన భార్య చనిపోవటంవలన ఈయన ఇంత కృంగిపోయినాడంటే ఆశ్చర్యంగానే ఉంది. ఆమె మీద అంతప్రేమే ఉంటే అన్నపూర్ణని పెళ్ళిచేసుకోవటం అసంభవం.

మెల్లిగా తన టేబిలుదగ్గరకు వచ్చి నిలబడిన కామాక్షిని ఆయనే కూర్చోమన్నారు. కొంచెంసేపు ఏం పలకరిం

చాలో ఎలా పలకరించాలో తెలియలేదు కామాక్షికి. చివ రకి "మీకు కష్టం వచ్చింది." అనగలిగింది. శంకరాన్రావుగారు తలయెత్తి చూశారు. ఏనాడో చనిపోయిన తనతల్లి తిరిగి తన కళ్ళఎదుట సాక్షాత్కరించినట్లు ఉంది. ఆయన యెంతో ప్రయత్నంమీద దుఃఖాన్ని ఆపుకున్నారు.

"నేను చిన్నదాన్ని – ఎలా మిమ్మల్ని ఓదార్చాలో నాకు తెలియటంలేదు... ..." అని అర్ధోక్తిలో ఆపేసింది కామాక్షి.

'నువ్వు నన్ను ఓదారుస్తావా అమ్మా! నా కాడపిల్లలు లేరు. నీవు నా బిడ్డవి. నేను పోగొట్టుకున్న నష్టం ఓదార్పు లతో తీరదు. నే చేసిన పొరపాటు తిరిగి ఈ జీవితంలో సర్దు కోటానికి వీలులేనిది. పాపంఅనేది నిప్పువంటిది. తెలిసి ముట్టుకున్నా కాలుతుంది, తెలియక ముట్టుకున్నా కాలుతుంది. పసిపిల్లవాడిని కూడా దయతల్చదది. ఆ అగ్ని నన్నిప్పుడు నిలువునా దహించివేస్తోంది. ఈ మంటలు ఇప్పుడే చల్లారవు. నన్ను ఓదార్చవద్దు. ఈ అగ్నిలో ఇలాగే మండి మసిఅవ టం నాకు శిక్ష– నా మహాలక్ష్మి నాకు విధించిన శిక్ష..." ఆయన ఉత్తరీయం మొగానికి అడ్డుపెట్టుకున్నాడు.

"మీరు అంతకుంగిపోవటం మంచిదికాదు. ధైర్యం తెచ్చుకోండి! మీరుచేసిన పాపమూ ఏమంత పెద్దదికాదు. పైగా పుణ్యంకూడా నేమో!" అన్నది మెల్లిగా కామాక్షి. శంకరాన్రావుగారిఉద్వేగంకూడా కొంత తగ్గింది. కామాక్షి మళ్ళీ,

"మనవి అసంపూర్తి బ్రతుకులు శంకర్రావుగారూ! వాటిని చూసి, మనం జాలిపడాలిగాని విసుక్కొని ప్రయోజనంలేదు. రచయితకీ, చిత్రకారుడుకీ కూడా పనికిరావు ఈ బ్రతుకులు. కనక మనమీద మనమే జాలిపడి సానుభూతి చూపుకోవాలి. లేకపోతే తల్లిచనిపోయిన బిచ్చగత్తె శిశువులా దిక్కులేకుండా రోడ్డుమీద పొరాడుతుంది మనబ్రతుకు" అని నిట్టూర్చింది.

"అందుకు కాదమ్మా! ఇప్పుడు నేను విచారిస్తున్నది. మహాలక్ష్మి నా మూలంగా చనిపోయినా నేను విచారించను. కాని త్యాగం అనే పవిత్రమైన మాటకు విలువలేకుండా పోయిందే అని నా దుఃఖం" అని జవాబిచ్చారు శంకర్రావు.

"త్యాగానికి ఎప్పుడైతే ప్రతిఫలం ఆశిస్తామో దాని విలువ అప్పుడే తగ్గుముఖంపడుతుంది. నిఘంటువులో ప్రతిఫలం లేనిదాన్ని త్యాగం అంటారు. అలా ప్రతిఫలమున్న దాన్ని త్యాగం అనరు. వ్యాపారం అంటారు. మీకు కోపం రాకుండా ఉంటే ఒక్కముక్క చెపుతాను శంకర్రావుగారూ!" అన్న కామాక్షి ముఖంవంక చెప్పు అన్నట్లు చూశాడు ఆయన.

"నిజం చెప్పాలంటే మీరు త్యాగంచెయ్యలేదు. వ్యాపారమే చేశారు... క్షమించాలి ఇలా అంటున్నందుకు. ఆ మాటకొస్తే కొంతలో కొంత అన్నపూర్ణే త్యాగం చేసింది. ఆమెకన్న మీరు చాలా పెద్దవారు. మిమ్మల్ని వివాహానికి ప్రోత్సహించింది ఆమె. ఆ క్షణంలో మీ రూప

యవ్వనాల్ని ఆమె ప్రేమించలేదు. మీలో సహృదయతని ఆరాధించింది. బహుశా అలాఅని భ్రాంతిపడ్డదేమో ! అదీ చెప్పలేం. ఇందులో మీ త్యాగం ఆట్టేలేదు. ఆమె యవ్వనం మిమ్మల్ని వ్యామోహపరచింది. అలాకాకుండా మీరు గట్టిగా ఆమెను మందలించిఉంటే తప్పకుండా ఆమె మరొకర్ని పెళ్లిచేసుకొనిఉండేది. నా కింకో అనుమానంకూడా ఉంది. మీరు మందలిస్తారు అనే ధోరణిలోనే, మిమ్మల్ని సంతృప్తిపరుద్దామనే ఉద్దేశ్యంతో ఆమె మిమ్మల్ని చేసుకుంటాననన్నదేమో! ఒకవేళ మీరు సరేననటంతో ఆమె ఆశలు దెబ్బతినిఉండవచ్చును. పరిస్థితి ఇలా ఉన్నప్పుడు మీరుచేసిన త్యాగానికి విలువలేదని మీరు బాధపడ్డం అనవసరం. అసలీ లోకంలో ఎవరికోసమూ ఎవ్వరూ త్యాగాలు చెయ్యరు శంకరావుగారూ! ఎవరిపందిరి వాళ్ళేసుకుంటారు. మీరు అదృష్టవంతులయితే ఆ పందిరితాలూకు నీడ మీకూ కొంతవస్తుంది. దురదృష్టవంతులయితే అదే పందిరి విరిగి మీనెత్తినపడుతుంది. నీడ వచ్చినప్పుడు ఆనందించండి. విరిగి నెత్తినపడ్డప్పుడు విదిలించుకొని పొండి. ఇంతకన్న పరమార్థం మరేంలేదు'' అన్నది.

శంకర్రావుగారికి తల దిమ్మెత్తిపోయింది. కామాక్షి చెప్పిన ప్రతిమాటా నిజమే. ఇందులో తనుచేసిన త్యాగం ఏమీలేదు. నిజం చెప్పాలంటే అన్నపూర్ణయవ్వనమే తననింత ప్రలోభపెట్టింది. అవును. గట్టిగా మందలించిఉంటే తప్పకుండా తనుచెప్పినట్లే వినేది ఆమె. ఎంత పొరపాటు

పడ్డాను? మహాలక్ష్మికి యెంత వ్యథకలిగించాను. ఇప్పుడీ పాశంనుంచి ఎలా విముక్తి పొందటం?

శంకర్రావుగారు మాట్లాడకుండా ఆలోచించటం చూసి తన సీటులోకి వెళ్ళిపోయింది కామాక్షి. శివరావు మెల్లిగా "ఆ మాటలని ఆయన్ని బాధపెట్టటంవలన ప్రయోజనంలేదు కామాక్షీ!" అన్నాడు.

"అనాలి శివరావు! ఆయన మహావ్యక్తి. ధగద్ధగితమైన ఆయన హృదయదర్పణంమీాద దుమ్ము పేరుకుపోయింది. దాన్ని కొంచెం దులిపానంతే" అన్నది.

శంకర్రావుగారికి మహాలక్ష్మి చరమయాత్ర జ్ఞాపకం వస్తున్నది. ఆమె సుకుమార నృద్ధశరీరం శ్మశానంలో కట్టెలమీాద వుంచాడు పెద్దకొడుకు. మెల్లిమెల్లిగా చితాగ్ని ఆమెను తనలో లయింపచేసుకుంటోంది.

ఇక్కడ అంతా సమానులే. బ్రాహ్మణుడికీ పంచముడికీ భేదంలేదు. పరమసుందరికీ వికృతాంగికీ భేదంలేదు. మహమ్మద్, క్రీస్తు, శంకరాచార్యుడు మతవైషమ్యాలన్నీ మరచి యీా ముగ్గురూ యిక్కడే చిరవిశ్రాంతి తీసుకుంటున్నారు. జగజ్జేత చంఘీజ్‌ఖాను, మహాకవి కాళిదాసు, విశ్వసుందరి నూర్జహాన్ అందరూ ఒకటే యిక్కడ. ఆ మాటకొస్తే యీా ప్రపంచమే ఒక మహాస్మశానం.

నిద్రలోలాగా గబగబా చిత్రిస్తున్న శంకర్రావుగార్ని కామాక్షీ, శివరావూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

అవును. ఈ ప్రపంచమే ఒక మహాశ్మశానం. దీంట్లో కూడా సర్వత్రా మహాగ్ని జ్వలిస్తూనేవుంటుంది. చరాచర

వస్తువుల్లో ప్రతిదీ అగ్నిమయమే. నిర్మలమైన కౌముదీ కాంతిలో అంతర్గతమైనసూర్యాగ్నిసుందరనారీహృదయంలో విఫలప్రేమతో విరహాగ్నిధూర్తుడైన మానవుడిలో అసమర్థతచేత కలిగిన కోపాగ్ని అంతా అగ్నిమయం. నిజం చెప్పాలంటే అన్నిటికన్న పవిత్రమైనది చితాగ్ని.

ప్రతియామమూ, ప్రతి నిముసమూ అందరూ వచ్చి యీ చితాగ్నిలో చేరుతారు. క్షణంక్రింద జీవించినవాడు యీ క్షణంలో నశించిపోతాడు. నీ ప్రాణం అర్పిస్తానన్నా అలాగే నిదురిస్తాడు. ఎక్కడికి పోయాడో, యెక్కడికి పోతున్నాడో యెవరికీ తెలియదు. అందరూ పోతారు. యెవరూ మిగలరు !

చకచకా చిత్రిస్తున్న శంకరాప్రుగార్ని చూసి మహాశ్చర్యపడి ఊపిరికూడా బిగపట్టి చూస్తున్నారు కామాక్షి, శివరావుగారు. ఆయనకుంచె మహారచయితభావంలాగా చకచకా సాగిపోతున్నది.

అది మహాశ్మశానం. మహేశ్వరుని నాట్యరంగం. ఇచట జ్వలిస్తున్న మహాగ్ని యేనాటికీ ఆరిపోనిది. దీనిలో సౌందర్యం, ప్రేమ, అభిమానం అన్నీ మసిఅయిపోతాయి. మసిఅవటానికి వీలులేనిది కూడా మసిఅయిపోతుంది. మానవులు మాత్రమేకాదు,సమస్తజీవరాసులూ లయించిపోతాయి. ప్రాకృతిక సంబంధాలన్నీ గడ్డిపోచలు కాగా సర్వజీవులూ, చరమయాత్రికులుగా యేనాటికైనా మారిపోయేది యిక్కడే. అసలు దేహి కావటమే దుఃఖాలన్నిటిలోనూ మహాదుఃఖం. దేహంతోపాటు దుఃఖాన్నికూడా విదిలించేసి చిరవిశ్రాంతి

పొందే పవిత్రస్థానం యీ శ్మశానం. ఈ అనంతజీవరాశి అస్థిమజ్జాసహితంగా యీ అగ్నిలో మండి మాడిపోతున్నది.

శంకరావుగారికుంచె నాట్యమూర్తి నటరాజస్వామి కాలిగజ్జెలాగా చకచకా నర్తిస్తున్నది.

మహాలక్ష్మీ! నీకోసం నేను దుఃఖిస్తున్నాను. పశ్చాత్తాపంతో నీకోసం దుఃఖిస్తున్నాను. దుఃఖనిరోధం వల్లనేమీ ప్రయోజనంలేదు. నేను మానవుడిని నాకోసం నేనే దుఃఖిస్తాను. ఇతరులకోసం దుఃఖించేవారు దేవతలు. ఒకప్పుడు ఈ ప్రపంచం ఆనందమయం అనుకున్నాను. ఇప్పు డర్థమైంది. ఈ జగమెంత దుఃఖపూరితమో! యీప్రపంచ సంబంధీకుడను కనుక నేనూ దుఃఖిస్తాను. అజ్ఞానం శాంతినిస్తుంది. ఈ ప్రపంచాన్ని గుర్తించిన ఆలోచనాపరుడు దుఃఖితుడవుతాడు.

శంకరావుగారి కుంచె మహాశిల్పి ఉలిలాగా విపరీత భంగిమలుపోతున్నది.

అన్ని ఆశ్చర్యాలలోకీ అత్యాశ్చర్యమైనది మరణం. దీనిని ప్రతిదినం చూస్తూనేవుంటాం. కాని దీని అంతు తేల్చుకోలేం. అది శేషప్రశ్న.

జీవించివున్నప్పుడు నీ వెవరవో ముందు తెలుసుకుంటే మరణానంతరం నువ్వేమవుతావో ఆలోచించవచ్చును. జనన మరణాలు లేని మహాచైతన్యమే నీవు. మనోనాశనమైతే ఆత్మసాక్షాత్కారం లభిస్తుంది. మనిషి చేయవలసిన కార్యకలాపాలన్నిటినీ అదే నిర్దేశిస్తుంది. జ్ఞానాన్ని వెదుకుతూ అన్వేషణ ప్రారంభించనవసరంలేదు. ఆంతర్యంలో అది

జ్యోతిగా జ్వలిస్తూనేవుంటుంది. దానిని గుర్తించాలంటే ఏకాగ్రత అవసరం. నిన్ను నీవు గుర్తుపడితే ఈశ్వరుడిని గుర్తుపట్టటం తేలిక. ఈ నా విషాదయోగంలో నీ వియోగమే నాకు ఈశ్వరసాక్షాత్కారం. ప్రపంచంలోని ఆనందాలన్నిటిలోనూ చరమానందమే ఈశ్వరుడు.

శంకరావుగారికుంచె మహాగాయకుడి సంగీతంలా విశ్వమంతా అలుముకుపోతున్నది.

దీనిలోనూ ఒక బాధ వున్నది. మహాలక్ష్మీ! సృష్టికర్త అవయవాలను దైహికానందం కోసం సృష్టించి ఆ జ్ఞాపకం మనిషిలోంచి తీసివేశాడు. అందుకే నేను పొరపాటు చేశాను. జన్మలన్నిటిలోకీ నరజన్మ మహోత్తమమైంది. ఈశ్వరాన్వేషణకు తగిన జ్ఞానం యీ జన్మలోనే దొరుకుతుంది. అజ్ఞాని అయిన మానవుడు ఆ అవకాశాన్ని విడిచిపెడతాడు. ఆ అవకాశాన్ని నేను వదులుకోను. జయిస్తాను. కనీసం జయించాలనే ప్రయత్నంలోనైనా వుంటాను."

చేతిలో కుంచె జారిపోయింది. దానితోపాటు ఆయన కూడా ముందుబల్లమీదికి ఒరిగాడు. శంకరావుగారిపరిస్థితి చూసి శివరావు ఖంగారుపడుతూ డాక్టర్ మధుసూధనరావుకి ఫోనుచేశాడు.

కామాక్షి శివరావువంక చూసి "శివరావ్! యీ టైములో నాకు చలంగారివాక్యం జ్ఞాపకంవస్తున్నది. దేవుడు లేడు గాని, ఆ దేవుడిని కల్పించిన మనస్సూ, దేవుణ్ణి నిరాకరించిన మనస్సూ దైవత్వాన్ని అందుకోలేకపోతే యెందుకు బ్రతికి? ఎప్పుడూ అల్పసంతోషంతోనూ, సౌంద

ర్యావేశాలతోనూ తృప్తిపడుతూ యెందుకు కాలంగడపడం? అన్నారు తమ మ్యూజింగ్స్‌లో," అని కళ్ళు తుడుచుకుంది. శివరావు ఆశ్చర్యపోయినాడు. ప్రొద్దుటినుంచీ అతడు ఆశ్చర్య పోతూనే వున్నాడు.

డాక్టర్ మధుసూదనరావు కారు దిగి హడావిడిగా లోపలికి ప్రవేశించాడు. బల్లమీదికి ఒరిగిన శంకరావుగారి కన్న ఆయన చిత్రించిన చిత్రం యెక్కువగా ఆకర్షించింది డాక్టరుని. శంకరావుగార్ని పరీక్షచేసి ఉద్రేకం జాస్తీ అవటంవలన నరాలు పట్టుతప్పాయి అని స్మెల్లింగుసాల్టు వాసనచూపించాడు. శంకరావుగారు కళ్లు తెరిచి మహా శూన్యంలోకి చూస్తున్నట్లు డాక్టరువంక చూశాడు. డాక్టరు ఆయనవేసిన చిత్రాన్ని తదేకదృష్టితో చూస్తున్నాడు.

ఆ చిత్రంలో గీతలుతప్ప రంగులు లేవు. అది ఒక శ్మశానం. ఒక పక్క ఒక పుట్ట, రెండు బొమికలూ వున్నయి. వాటిపక్క మోడైపోయిన చెట్టు. దానికి కొంచెం అవతలగా రెండు సమాధులు. ఇంకోవైపున చితి మండుతున్నది. ఆ చితికి ఒక గజంఅవతల తడిబట్టలతో ఒక పురుషుడు భావహీనమైన నేత్రాలతో ఆ చితివంక చూస్తు న్నాడు. ఇదీ చిత్రం. దాన్ని చూస్తుంటే చెప్పలేనినిరాశతో బాధపడుతోంది డాక్టరు హృదయం. ఈ చిత్రంవేయటంలో యీ చిత్రకారునిఉద్దేశ్యం చివరకి మిగిలేది ఏమీ లేద నేనా ?

శంకరావుగారు కొద్దిగా తేరుకొని కామాక్షివంక చూస్తూ "ఆ చిత్రానికి పేరు?" అన్నాడు.

కామాక్షికి కూడా ఆ చిత్రం చూస్తుంటే మనసంతా ఖాళీఅయినట్లయింది. శరీరంలో జామికలూ, నెత్తురూ, నరాలూ అన్నీ కరిగిపోయి గాలిమాత్రమే వున్నట్లు అని పిస్తోంది. శివరావుకూడా అలాగే అనుకున్నాడు. ఆ చిత్రా నికి ఏం పేరుపెట్టాలి? బ్రతుకు పరమార్థాన్నంతా నాలుగు గీతలలో చెబుతున్న ఆ మహాచిత్రానికి ఏంపేరు పెట్టాలి? తన సర్వస్వాన్ని అ చితిలో తగలవేసుకొని ఒంటిరిగా నిలబడ్డ ఆ మార్గవిహీనుడు- అత డెవరు?

కామాక్షి యాంత్రికంగా కలంతీసుకొని ఆ చిత్రం క్రింద మార్గవిహీనుడు అని వ్రాసింది. అనుకోకుండావ్రాసిన ఆ పేరు చిత్రానికి సరిగా సరిపోయింది. శంకర్రావుగారు అదిచదివి మెప్పుదలగా కామాక్షివంక చూసి " అవును తల్లీ ! మార్గవిహీనుడు' పేరు సరిగా వుంది చిత్రానికి. ఇంత కాలానికి నా పరిస్థితిని సరిగా చిత్రించే చిత్రాన్ని వేసుకో గలిగాను. ఇది మహాలక్ష్మి ఫొటోపక్క తగిలిస్తాను " అంటూ ఆ బొమ్మని పసికూనని తొలుచూలుతల్లి యెత్తుకున్నంత జాగ్రత్తగా తీసి ఇంటికి వెళ్ళిపోయినాడు శంకరరావుగారు.

అంతవరకూ నిశ్శబ్దంగా నిలబడ్డ ముగ్గురూ గట్టిగా ఊపిరిపీల్చి ఈ లోకంలోపడ్డారు. శివరావు మెల్లిగా తనసీటు లోకి పోయి కూర్చుని పనిచూచుకోటం ప్రారంభించాడు. డాక్టరు స్టెతస్కోపు తీసి మెళ్ళోవేసుకుంటూ కామాక్షివంక చూచాడు. కామాక్షికూడా అదేసమయంలో అతనివంక చూసింది. శివరావుచూడకుండా రమ్మని సౌంజ్ఞచేసి ముందుకు

సాగాడు డాక్టరు. శివరావు యిదిచూచి తనలోతను నవ్వు కున్నాడు.

కారుదగ్గరకు వచ్చిన కామాక్షిని చూసి కొంటెగా నవ్వుతూ "పిల్లా! సాయంత్రం అయిదింటికి వస్తాను. ఉండ వల్లి వెడదాం" అన్నాడు. కొన్ని క్షణాలు ఆలోచించి "ఆఫీసుకు రాకండి. నేనే కలుసుకుంటాను" అని జవాబిచ్చింది కామాక్షి.

మెల్లిగా లోపలికివచ్చిన కామాక్షివంక చూసి శివ రావు నవ్వేసరికి కామాక్షికికూడా నవ్వువచ్చింది. ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు.

" డాక్టర్ని ప్రేమించడం మానేస్తానన్నావుగా కామాక్షమ్మా! అంతలో ఆడదాన్ని అనిపించావే " అని వెటకారంగా అన్న శివరావుమాటలకి జవాబివ్వలేదు కామాక్షి.

" ప్రేమఅంటే అందాలజాబిల్లిని చూస్తూ నడవటం. వివాహంఅంటే అలా పైకిచూస్తూ నడవటంవలన బొక్క బోర్లాపడటం. కాబట్టి జాబిల్లినిచూస్తూ నడవటమే మంచిది" అన్న శివరావుమాటలకి " నాన్నలాగానే నేను పెళ్ళిచేసు కోటం నీకూ ఇష్టంలేదన్నమాట. అంతేనా ? " అన్నది కామాక్షి.

శివరావు గతుక్కుమన్నాడు. తనన్న మాటలలో ఈ అర్థం ఉన్నదని అతను అనుకోలేదు. ఖంగారుపడి " రామ రామ; నేనలా అనుకోలేదు. ఛ. ఛ. అలాఎప్పుడూ అనుకోను " అన్నాడు.

అతని ఖంగారుచూచి నవ్వుకుంది కామాక్షి. "అంటే మాత్రం ఏం మునిగిపోయిందయ్యా, అంతఖంగారుపడతావు? అది సరేగాని; సాయంత్రం ఉండవల్లి వెడుతున్నాను. ఎవరితోనో తెలుసా?" అన్నది.

ఎవరితో వెడుతోందో శివరావు ఎప్పుడో గ్రహించేశాడు. అయినా ఇందాకటిలాగ ఏంఅంటే, ఏం కొంపమునుగుతుందో అని మెదలకుండా వూరుకున్నాడు.

కామాక్షి కూడా తను యెవరితో ఉండవల్లి వెడుతోందో చెప్పటానికి సిగ్గుపడుతున్నది. ఇన్నాళ్లకు తను స్త్రీలాగా సిగ్గుపడుతున్నందుకు ఆమెకే నవ్వువచ్చింది.

"నే నెవరితో వెడుతున్నానో నీకు తెలుసు పొద్దుపోయిగాని రాను. నాన్నతో సర్దిచెప్పేసేయి" అన్నది.

"ఏమనిచెప్పాలోకూడా నువ్వే చెప్పివెళ్ళు. మళ్ళీ నువ్వోటి, నేనోటి చెబితే ముసలాడు కనిపెట్టేస్తాడు. నాఉద్యోగంకాస్తా వూడి చక్కాపోతుంది" అన్నాడు శివరావు.

"నీకు ఉద్యోగం యిచ్చింది మానాన్న. ఒకవేళ వూడగొట్టాల్సివస్తే ఆపని చేసేది నేను. ఈ పత్రికతాలూకు సర్వహక్కులూ, పెట్టుబడి నావి. కాబట్టి ఇందులో మా నాన్న ప్రమేయం యేమీ లేదు. కనుక నీవు ఎంతమాత్రం భయపడాల్సిన అవసరం లేదు" అన్నది కామాక్షి.

"బాగుంది. అందుకని అబద్ధంఆడమంటావా? ఏం చెప్పమంటావో చెబుదూ? నన్ను చంపక" అన్నాడు.

"స్నేహితులయింటికి వెడుతున్నాను, రెండోఆట సినిమా చూసి వస్తాను" అని చెప్పు" అన్నది కామాక్షి.

శివరావు ఆశ్చర్యంగా మొగంపెట్టి "పెళ్ళిగానిపిల్ల! అర్ధరాత్రిదాకా షికార్లుకొడితే వెంకటపతిగారు గుండెపగిలి ప్రాణంవిడుస్తాడు" అన్నాడు.

"పీడ వదిలిపోతుంది. కొందరుమనుషులు బ్రతకటం అనవసరం. మానాన్ననిగురించి ఇలా అన్నానని అనుకోకు. ఆయనమీద నాకు ప్రేమావుంది. గౌరవమూ వుంది. అంత మాత్రంచేత లిమిట్స్‌దాటితే నేను సహించను నిజంచెప్పా లంటే ఆయనే నాకు భయపడాలి" అన్నది కామాక్షి ఫోను తీస్తూ.

శివరావుకి కామాక్షినిచూస్తే యెప్పుడూ భయమే. ఆ భయం యిప్పుడు మరీ యెక్కువయింది. తలవంచుకుని యెడిటోరియల్ వ్రాయటం మొదలుపెట్టాడు. వీక్లీలో ప్రతి వారం అతను ఒక వ్యాసం వ్రాస్తాడు. దానినే కామాక్షి యెడిటోరియల్ అని వెక్కిరింపుగా అంటుంది.

"యిదిగో చూడు; నీ యెడిటోరియల్ పూర్తి అయి నాక అన్నపూర్ణమ్మ కథల్ని ఒకసారి తిరగవేయి. ఏదన్నా బాగుంటే ఎడిట్‌చేసి ఈవారం వేద్దాం" అంటూ డ్రాయరులో వున్న కాగితాలకట్ట తీసి శివరావుముందు పడేసింది.

ఆ కట్టలో మూడుకథలున్నాయి. మొదటిది తీసి చదవటం ప్రారంభించాడు శివరావు. అది ఒక ప్రేమకథ.

ఒక అబ్బాయీ అమ్మాయీ ప్రేమించుకున్నారు. వాళ్ళనాన్నేమో పెళ్ళికి అంగీకరించడు. ఆ తరువాత మామూలే. ఇద్దరూ చచ్చిపోతారు.

ఇక రెండో కథ. అది ఒక మహాపతివ్రత కథ. పక్క యింటి దుర్మార్గుడు బలవంతంచేస్తే ఇరుగూ పొరుగూవచ్చి రక్షిస్తారు.

మూడో కథకి అసత్యమాడరాదు అనేది నీతి.

"యీ మూడింటిలో ఏ ఒకటీ నచ్చలేదు కామాక్షీ" అన్నాడు శివరావు తిరిగి ఆ కాగితాలు కట్టగడుతూ.

" అయితే మళ్ళీ కట్టకడతావెందుకు? చెత్తబుటలో పారేయక "

" అలా కాదులే. కేవలం నీ స్వహస్తాలతో అన్న పూర్ణమ్మగారికి అందచేస్తావేమోనని కట్టకడుతున్నాను"

" నీ కంత సరదాగావుంటే అలాగేయిస్తాను. ఇంతలో నా కేంపోతుందిగనుక "

" ఏదోఒకటి అచ్చుపడేదానికి పెద్ద సాహిత్యప్రయోజనం అంటకట్టటంకూడా దేనికి ?'

" బొత్తిగా అలా అనకు మరి. నీకువెయ్యాలనివుంటే వెయ్యి. అంతేగాని, సాహిత్యానికి ప్రయోజనంలేదనిమాత్రం అనకు. నీకు పుణ్యంవుంటుంది "

" మనసుకు తృప్తినివ్వటమే సాహిత్యప్రయోజనం అని మీరంతా అంటారే అది శుద్ధ అబద్ధం. ఆత్మను నిద్రలేపి చైతన్యవంతంచేయడమే ఈ సాహిత్యం అనే పదార్థం కనీసం చేయగలిగింది " అన్నాడు శివరావు.

" నువ్వు చెప్పింది నాకు అర్థమైయేడవలేదు. సరిగ్గ చెప్పు మరి " అన్నది కామాక్షి.

శివరావు నీకర్థమయేటట్లు చెప్పటం నావల్లకాదు బాబూ అన్నట్లు ఒక్కచూపుచూసి, కాగితాలు చూడటం ప్రారంభించాడు. తన టేబులుమీద కాగితాలు ఒకపక్కకి సర్ది కుర్చీలో వెనక్కి జార్లాపడి "సాహిత్యప్రయోజనం ఏమిటో నేను చెపుతాను విను."

" అధర్మం అంటే అసహ్యం, దౌర్జన్యాన్ని సహించలేకపోవటం, న్యాయరక్షణకి ఆత్మవిశ్వాసం, సౌందర్యపిపాస వీటిని మానవుడిలో పెంపొందింపచేసేదే ఉత్తమ సాహిత్యం" అన్నది కామాక్షి.

"అంటే?"

" అంటే సాహిత్యం మానవుడిని ఉన్మత్తుడుగా చేస్తుంది. తననితను తెలుసుకొని ఆత్మవిశ్వాసాన్ని అభివృద్ధి పరచుకుని సత్యంకోసం, న్యాయంకోసంపోట్లాడేట్టుచేసి మనిషిలోని నైచ్యతను నిర్మూలించేదే ఉత్తమసాహిత్యం. ఏమిటలా చూస్తున్నావు ? జీవితంలోని దౌర్భాగ్యాన్నంతటినీ కళ్ళముందు పరచటం, నవజీవనాన్ని నవ్యాతినవ్యమయిన మనస్తత్వాన్ని సృష్టించటానికి ప్రయత్నించడం సాహిత్యం చేయవలసిన నిరంతరకృషి. నేనేమీ పుస్తకాలకబుర్లు చెప్పటంలేదు. శ్రీశ్రీ అన్నట్లు కళావేత్తకి కుక్కపిల్లా, అగ్గిపుల్లా కూడా కావ్యవస్తువులే " నన్నది కామాక్షి.

"అలా నడుచుకోండర్రా అని ఏ సాహిత్యవేత్తయినా ప్రజలకు చెబితే వాళ్ళు వింటారని నమ్మకం ఏమిటి ? అయినా మోదయినా చేయండని మొనటివాళ్ళని శాసించడం

వట్టి దగా. సామాన్య మానవుడే యెక్కువగా సాహిత్య పర్యాలోకనచేస్తాడు, అతను చేసేదేమిటి మట్టి."

"చేసేదేముంది మట్టి అని నీళ్ళుకారిపోయే రకం ఉన్నారే వాళ్ళు లోకానికి మహా ప్రమాదకరమయిన వ్యక్తులు. ఈ స్వభావాన్ని నిర్మూలించనిదే కొత్తదాన్ని నిర్మించడం చాలాకష్టం. ఈ బాపతు సోమరితనంలో సంతోషము, సంతృప్తి, ఆనందం మచ్చుకైనా దొరకవు. కొన్ని ఆశయాలకోసం, మరికొన్ని ఆదర్శాలకోసం– అవి మంచివి కానీ, చెడ్డవికానీ, పోట్లాడటంలోనే హాయి ఉన్నది"

"భేష్! చాలాబాగుంది కామాక్షమ్మా! 'నిన్ను నువ్వు యెంత ప్రేమించుకుంటున్నావో నీ పొరుగువాడినీ అలా ప్రేమించు' అని క్రీస్తు చెప్పినట్లు వర్ణించేశావు"

"పొరుగువాడిని ప్రేమించడం యేమోగాని తాట వాయగొట్టాల్సిన సమయాలే అధికంగా సంభవపడతాయి నాబోటిదానికి"

"నీకు కామాక్షి పేరుకన్న గయ్యాళిగారి అనిపెడితే బాగుండేది. మీ నాన్నకి తోచలేదు ఆ విషయం"

"నిజమే. నే నీ నాగరికప్రపంచంలోకి దేనితోనూ రాజీపడడానికి రాలేదు. ప్రతిదాంతోనూ ఆజీ చేయడానికే వచ్చాను."

"ఆజి ఏమిటి?"

"బహుశా యుద్ధమయిఉంటుంది. కాకపోతే దాని కర్థం ఏదయితే అదే చేయటానికి వచ్చాననుకుందూ తీరిపో

తుంది.'' అన్నది కామాక్షి నిర్లిప్తంగా.

శివరావు పకపకానవ్వి,

"నా కెందుకొచ్చిన గొడవ! ఈ వారం న్యాసం మొత్తంమీద నాలుగు చిలకలూ, రెండు కోయిలలూ, మూడు తుమ్మెదలూ అంటే భ్రమరాలు-తొమ్మిదిపద్యాలూ మొత్తం పద్ధెనిమిది శాస్త్రీలు ప్రవేశపెట్టేశాను'' అన్నాడు.

"అవన్నీ ఇంకా ఉన్నాయా? వాటన్నిటినీ తిరుపతి వెంకటకవుల శిష్యులే బందెలదొడ్లో పెట్టేశారనుకుంటాను''

"అక్కడినుంచే తోలుకువచ్చాను.''

"కవీ! నీ కాలాన్ని వృథాగా తగలెడుతున్నావు. లిఖించడమే నీ పని లిఖించు, లిఖించు.''

"ఇవ్వాల్టికి ఈ లిఖించింది చాల్లే. ఇందాక చెప్పింది మళ్ళీ ఓ తడవ చెప్పు. మీ నాన్నతో రెండోఆట సినిమాకి వెళ్ళావని చెప్పాలి. ఓ తడవ రిహార్సలుచేద్దాం పట్టు.''

"ఖంగారుపడకుండా మాత్రం చెప్పు. మా నాన్న దేవాంతకుడు. పట్టేస్తాడు. మరిక నేను పోనా?''

"శంకర్రావుగా రేమయినారో చూడక్కరలేదా?''

"ఏమీ అవరు. బాగానే ఉంటారు. మరి నేను పోనా? నాలుగయింది అప్పుడే'' అన్నది వాచీ చూసుకుంటూ కామాక్షి. శివరావు తల ఊపాడు.

* * * * *

కొత్తగా కట్టిన కృష్ణాబారేజిమీద డాక్టరుకారు జారిపోతోంది. టాపు మడిచేసిన ఆ చిన్నకారు కాలంతో పాటు జారుతున్న స్త్రీజీవితంలాగా ఉంది. కృష్ణనీటిమీద

అస్తమిస్తున్న సూర్యుడికాంతి ప్రతిఫలించి ఆ నీటికి కరుగుతున్న బంగారంచాయ వచ్చింది. ఇటు కొండా, అటు కొండా మధ్య కృష్ణానది ప్రవహిస్తున్న తీరు చూస్తే నైలాన్ పమిట కింద జవరాలి యవ్వనశోభ గుర్తుకువస్తున్నది. అంతా సౌందర్యం. కామాక్షి డాక్టరుపక్కనే కూర్చుని ఈ సౌందర్యాన్ని తనలో లయింపచేసుకోటానికి ప్రయత్నిస్తున్నది. మాట్లాడకుండా కారునడుపుతున్న డాక్టర్ మనసులో ఒక చిన్నసైజు యుద్ధం జరుగుతున్నది. అదేమిటంటే వివాహం అంటే నమ్మకంలేని ఈ పిల్లని ఎలా వివాహానికి ఒప్పించటమా అని. తనకీ వివాహమే అవాలని పెద్ద పట్టుదల లేదు. కాని పెళ్లికాకపోతే కలిసి జీవించడానికి ప్రపంచం ఒప్పుకోదు.

కామాక్షి ఇలాగే ఆలోచిస్తోంది. డాక్టరు లేకుండా తను ఉండలేదు. పెళ్లి కానీయకుండా ఉండటానికి ఎన్ని చేయాలో అన్నీ చేస్తాడు నాన్న. వెంకటపతిగారికూతుర్ని డాక్టరు మధుసూదనరావు ఉంచుకున్నాడన్నా ఆయనకి అట్టే అభ్యంతరంఉండదు. పెళ్ళికాకుండాఉండిఆ స్త్రీ,కూతురూ చెయిదాటిపోకుండా ఉంటే ఆయన కంతేచాలు. కూతురు మనసులో ఎప్పుడైతే డాక్టరు తిష్టవేసుకు కూర్చున్నాడని గ్రహించాడో ఆ మరుక్షణంనుంచీ తనజాగ్రతలో తను వుండటం ప్రారంభించా డాయన. ఆ జాగ్రత్తల్లో మొదటిదీ ముఖ్యమైనదీ కూతురూ డాక్టరూ కలుసుకోకుండాచూడటం. అయితే ప్రవహించిపోతున్న యవ్వనప్రవాహానికి ఆనకట్ట కట్టటం సృష్టికర్తకే చేతగానిపని.

కారు సీతానగరంగుడిముందు ఆగింది. డాక్టరు దిగి ఒక కొబ్బరికాయా, రెండుఅరటిపళ్లూ కొనుక్కొచ్చి కామాక్షి వంక చిలిపిగా చూస్తూ, పద భగవంతుడిని అర్చించివద్దాం అన్నాడు. కామాక్షి కారుదిగి డాక్టరుపక్కగా నడవటం ప్రారంభించింది. పుట్టినదగ్గరనుంచి ఏనాడూ దొరకని ఒకానొక సంతృప్తి ఆమె నావరించింది. దానితో సంతోషం పొంగుకురాగా ఇవాళ్టికి ఉండవల్లిసున్నాచుట్టావా ఏమిటి? అని ఏకవచనంతో సంబోధించినందుకు తనలో తనే సిగ్గుపడింది. కాని ఆ ఏకవచనప్రయోగంతో వారిద్దరూ ఎంతో సన్నిహితులయినారు.

"సీతానగరం కొండమీదనుంచి కృష్ణానది మరో కోణంలో కనిపిస్తుంది. అదిచూసి టైముంటే వెళదాం" అన్నాడు డాక్టరు. వాళ్లిద్దరూ కలిసి దైవదర్శనం చేసి అద్దాలగదికివెళ్లబోతుండగా డాక్టరుగారి పాతపేషెంటు ఒకడు ఎదురయి ఓనమస్కారం పారేసి "పప్పన్నానికి మమ్మల్ని పిలిచారే కాదు" అన్నాడు. కామాక్షిసిగ్గుపడింది. "పిలవటానికివ్యవధి తెలియలేదయ్యా" అని ఆ ఆసామీకి జవాబుచెప్పి కామాక్షి వంకతిరిగి "మరీ అలా నిముషనిముషానికీ ఆడదానిలా సిగ్గుపడితే ఎలా?" అని నవ్వాడుడాక్టరు. కామాక్షికూడా తిరిగినవ్వటంతో ఆ నవ్వులే పువ్వులై స్వామి నర్చించాయి. ఇద్దరూ అద్దాల గదిలో ప్రవేశించారు. పూజారిచూడకుండా కామాక్షిబుగ్గ మీద చిటికవేసి అద్దాలవైపు చూపిస్తూ "అలాచూడు, ఒక్క నేనే నీకు, పెక్కునీవులు నాకు" అన్నాడు.

వాంఛతో కూడిన పురుషస్పర్శ ఇదే మొదటిసారి కావటంచేత ఆమెలోని నెత్తుటినాళులన్నిటిలోకీ ఒక్కసారి

చేదవేసినట్లుంది. కాని సంస్కారవంతురాలూ ఉన్నతురాలూ అయిన కామాక్షీ వాంఛని లొంగతీసుకుంది. కొండఅంచున ఉన్న ఆంజనేయవిగ్రహం దగ్గర ఇద్దరూ కూర్చున్నారు. అక్కడినుంచి కృష్ణానది చాలాఅందంగాకనిపిస్తుంది; డాక్టరు కామాక్షీవంక తిరిగి

"ఊ! ఇక చెప్పు. మన భవిష్యత్ ఏమిటి? మనిద్దరికీ సౌందర్యం లేనేలేదు. యవ్వనాన్నికూడా లేకుండా చేసుకుందామంటే నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు.

"నాకెందుకో ఇవ్వాళ సిగ్గుపడాలనిపిస్తున్నది. నన్నేం అడక్కు!"

"మాతల్లికదూ! అడిగినదానికి సరిగాజవాబుచెప్పన్నూ"

"తల్లి ఏమిటి నా మొహం!"

"ఏం? తల్లెందుకు కాకూడదూ! "భుక్తేషు మాతా" అన్నాడు శాస్త్రకారుడు."

"ఏడిశాడు. చాకిరీచేయించుకోటానికి అదోమార్గం."

"సిగ్గుపడ్డదానివి మృదువుగామాట్లాడాలి కాని ఎప్పటి కామాక్షీలాగా కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్లు అనకూడదు."

"సరేడు, ఆ అరటిపండుతొక్కచెట్టునిపట్టుకుని వికారంగా కనిపిస్తోంది. రాయేసి దాన్ని రాల్చేద్దూ"

"భేష్, అర్జునుడు మత్స్యయంత్రం కొట్టినట్లు మనకి ఇదో అగ్నిపరీక్ష. ఏదీ ఆ రాయిలా అందుకో."

"సరిగ్గా కొట్టు. నేను ఇంకోరాయి అందుకోలేను."

"చూశావా మరి. అన్నిట్లో మనగురి సరిగానేఉంది. ఒక్క దాంట్లో తప్ప"

"దాంట్లోనూ సరిగానేఉంది. కాకపోతే మా నాన్న ద్రుపదమహారాజు కావటానికి నిరాకరిస్తున్నాడు"

"అప్పుడు మనం రుక్మిణీకృష్ణులుగా మారి మీనాన్నని కుండిననగరాధిపతిని చేద్దాం."

"ఏడిసినట్లుంది. మనంచేస్తే ఆయన కావద్దూ."

"అందుకని ఇప్పుడేమంటావు?"అని సూటిగాఅడిగాడు డాక్టర్.

కామాక్షి నిరుత్తరురాలయింది. కొన్నినిముషాలు మాట్లాడలేదు. తరువాత చిన్నచిన్న రాళ్ళు పోగుపెడుతూ,

"ఏమంటానో ఏమనాలో నాకేమీ తెలియటంలేదు. నా జీవితం త్రాసులోముల్లులా తయారయింది. ఒకపక్క నాన్న. మరోపక్క మీరు. ఏవైపుమొగ్గాలో విధికివదిలేసి గాలి పాటుకి కొట్టుకుపోతున్నా" అన్నది.

"నాకర్థంకావటం లేదు. మీ నాన్న పెళ్ళిచేసుకో వద్దంటే మానేస్తావన్నమాట."

"మీ రలా సూటిగాప్రశ్నిస్తే నేనేమీ జవాబుచెప్ప లేను. కాని ప్రస్తుతం నా పరిస్థితి చాలాఘోరంగా ఉంది"

"చూడు,నువ్వు చాలా ధైర్యవంతురాలివి. పరిస్థితు లకి నీవు లొంగిపోకూడదు.వాటినే నువ్వు లొంగతీసుకోవాలి. నేను పెళ్లిచేసుకోబోతున్నానని మీ నాన్నతో ధైర్యంగా చెప్పేసెయ్యి."

"ఇప్పుడు నాకు ధైర్యంలేకనేనా చెప్పలేకపోవటం? అదికాదు. మానాన్నసంగతి అలాఉంచి నేనే ఏదీనిర్ణయించుకోలేకపోతున్నాను"

"అందులో అస లర్థంలేదు. మీనాన్నఅంటే భయం లేదు. బాగానేఉంది. నీ వెందుకు నిర్ణయించుకోలేకపోతున్నావో అర్థంకావటంలేదు."

"అదే నాకూ అర్థంకావటంలేదు డాక్టర్! చాలా కాలం అవివాహితగానే ఉండిపోయాను. మిగిలిఉన్న ఈ కొంచెంకాలంకూడా అలాగే ఉండిపోతే బాగుంటుందేమో" అని నిట్టూర్చింది కామాక్షి. డాక్టర్ కొంచంసేపు మాట్లాడలేదు. తరువాత—

"నీ వలా ఉండిపోయినందువల్ల సాధించే ప్రయోజనమేమాత్రంలేదు. కేవలం అపనిందలపాలవటంతప్ప!" అన్నాడు.

"ఏమిటో డాక్టరుగారూ! అన్నివిషయాల్లోనూ ధైర్యస్తురాలినే అయినా యీవిషయంలో మాత్రం నన్ను అపరిమితమైన బలహీనత ఆవరిస్తోంది."

"నీవలా సాగదీసినందువల్లప్రయోజనంలేదు కామాక్షీ! నీమీద ఆశలుపెట్టుకునివున్న నన్ను చూసైనా నీవో నిర్ణయానికిరావాలి."

"చెప్పండి డాక్టర్! మీరేం చెపితే అదిచేయటానికి సిద్ధంగా వున్నాను. ఏం చేయమంటారు?"

"ఇప్పటికి స్త్రీ వనిపించావు. రేపుపొద్దునే మనిద్దరం వివాహంచేసుకోబోతున్నామని మీనాన్నతో చెప్పు. దాంతో ఒక సమస్య తీరిపోతుంది."

"సరే అలాగే చెప్తాను. ఆయన వద్దంటే?"

"నిన్ను లేవతీసుకుపోయి పెళ్ళిచేసుకుంటాను."

"ఉద్ధరించారు. నేను లేచిరావద్దూ?"

"నీవు లేచి రాకపోతే యింతటితో యీ కథ పూర్తి చేసేద్దాం. నేను రేప్పొద్దున్నే లేచి సన్యాసంతీసుకుంటాను."

"అప్పుడే మనప్రేమ శాశ్వతంగా సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది."

"అయితే సన్యాసమే తీసుకోమంటావన్నమాట?"

"అదేంఖర్మ! రోజావతి వున్నదిగా."

"ఉత్త ఆడదానిలా మాట్లాడావు కామాక్షమ్మా!"

"ఈ సీతానగరంకొండ యెక్కినదగ్గరనుంచీ నాలో స్త్రీత్వం ప్రకోపించింది."

"అయితే యిక్కడే వుండిపోదాం."

"వెంటనే మా నాన్న పోలీసురిపోర్టు యిస్తాడు."

"అప్పుడు మనపని తేలిక అవుతుంది. ఇద్దరం మేజర్లం కనుక పెళ్ళిచేసుకున్నాం అని చెప్పుదాం."

"నే నలా చెప్పను. నీవు ... క్షమించాలి, మీరు నన్ను లేవదీసుకొచ్చారనే చెప్తాను."

"అన్యాయం. నువ్వే నన్ను ఎత్తుకొచ్చి అబద్ధచెప్పటం శుద్ధ అన్యాయం."

"ఇన్నాళ్ళూ పురుషుడే స్త్రీని అన్యాయం చేశాడు. ఇప్పుడు పురుషుణ్ణి స్త్రీ అన్యాయంచేసేకాలం వచ్చింది. అది మొదట రుచిచూసేవాడివి నీవే."

"కాసేపు మీరంటావు, కాసేపునువ్వంటావు కారణం?"

"సంపెంగపూలూ పనసతొనలూ ఒకేవాసన వేస్తాయి. కారణం?"

"మాటలు నేర్చావు కామాక్షమ్మా!"

"మరెలా బ్రతకటం వైద్యశేఖరా?"

"చూడు, యీ అల్లరిమాటలు మానేసి భవిష్యత్ గురించి మాట్లాడుకుందాం" అన్నాడు డాక్టర్.

ఈ మాట వినేసరికి కామాక్షిలోని కొంటెతనమంతా అంతర్హితమైపోయింది. జీవితభారాన్ని మోయలేక మోస్తున్న జరాపీడితురాలిలాగా ఆమెను అలసత ఆవరించింది. అంత వరకూ పోగుచేసిన రాళ్ళను ఒక్కొక్కటే విసిరిపారేస్తూ ప్రాణాలన్నిటినీ కళ్ళలోకి తెచ్చుకుని డాక్టరువంక చూసిందామె. ఆ చూపులో నేను అదృష్టహీనురాల్ని డాక్టర్! ఆ విషయం నన్నిక పదేపదే ప్రశ్నించకండి. చూశారా! ఈ రాళ్ళని యెలా పారేశానో! నా కోరికల్ని కూడా యిలా ఒకటొకటే విసిరిపారేయటానికి ప్రయత్నిస్తాను అన్న భావం ధ్వనించింది.

గద్ద తన్నుకుపోతున్న కోడిపిల్లలాగా అతనిమనస్సు గిలగిలలాడింది. కృష్ణానదిలో యేదో పడవచేస్తున్న తపతప ధ్వనులు నిరాశాజీవిఆత్మ పడుతున్న తపనలా వున్నవి.

ఘోరమైన నిస్పృహలా చీకటి ఆవరించింది. డాక్టర్ ఒక నిట్టూర్పు విడిచి,

"భవిష్యత్ అనేది నుయ్యిలాటిది కామాక్షీ! అదృష్టం అందులో నీరు. విధి ఆ నీటిని కదుపుతుంటే తొంగి చూస్తున్న మన ప్రతిబింబాలు మసకవేస్తాయి. ట్రాజెడీ ఏమిటంటే ఆ నీరు అనుక్షణమూ కదులుతూనే వుంటుంది. అది తెలిసీకూడా నాబోటివాడు తన ప్రతిబింబాన్ని చూసుకుందామని నూతిగట్టుదాకా వెడతాడు. కాని యేంలాభం? కలకలైన ఆ బురదనీటిలో అతని ప్రతిబింబం విరిగి ముక్కలైపోతుంది, దానితోపాటు అతని హృదయంకూడా. పద, యిక పోదాం" అని లేచాడు. కామాక్షి కూడా యాంత్రికంగా అతనివెంట నడిచింది. అదృష్టాన్ని జారవిడుచుకుంటున్నావే దౌర్భాగ్యురాలా! అని ఆమె అంతరాత్మ చేసేగోల భరించలేక దాని పీకపిసికి అవతలపారేసి చేతులు దులుపుకుని కార్లో పోయి కూర్చుంది.

* * * * *

మహాలక్ష్మమ్మబొమ్మతోనే మతిపోతుంటే దాని పక్కన వేలాడుతున్న ఆ శ్మశానంచిత్రం యేకంగా పిచ్చెక్కిస్తోంది అన్నపూర్ణకి. మహాలక్ష్మమ్మగారు పోయిన దగ్గరనుంచీ శంకరావుగారి ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. ప్రొద్దున్నే లేవటం, కాలకృత్యాలు తీర్చుకోటం, అక్కడినుంచి మహాలక్ష్మమ్మబొమ్మకి యెదురుగుండా పడకకుర్చీ వేసుకుకూర్చోవటం, అక్కడినుంచి ఆఫీసువేళదాకా శ్మశానాన్ని, మహాలక్ష్మమ్మనీ తిప్పితిప్పి చూస్తూ కూర్చుం

టాడు. తరువాత యేది పెడితే అది తిని ఆఫీసుకు వెడతాడు. అక్కడకూడా ఆయనచేసే పనేం లేదు. వెయ్యాల్సిన రెండు బొమ్మలూ గీకిపారేశి, టేబిలుమీదతలపెట్టుకుని నిద్రిపోతాడు. ఆయనంటే కామాక్షికి చాలా అభిమానం. తనలో తను ఆయనపడుతున్న మహావ్యధనంతటినీ ఆమె గ్రిహించింది. తపించగా తపించగా ఆ తపన ఒక మహాగ్ని అయి ఆయనను లయింపచేస్తుందేమో అని ఆమె అనుమానం.

ఎందుకంటే ఆయన దినదినం క్షీణించిపోతున్నాడు. ప్రిస్తుతం బొమికలమీద చర్మంమాత్రిమే వున్నది. ఒకరోజు కామాక్షి,

"శంకరాప్రిపుగారూ! ఈ తపస్సు దేనికి? ఈ క్షీణించి పోవటం వలన ప్రియోజనం?" అని అడిగింది. కొన్నిక్షణాలు ఆయన సమాధానం యివ్వలేదు. తరువాత మెల్లిగా,

"జీవితంలో సాయంత్రిం అయింది కామాక్షీ! చీకటి పడకముందే దీపాన్ని వెలిగించుకోవాలి గదా!" అన్నారు.

"కాని యిది పద్ధతి కాదు. శరీరాన్ని క్షీణింపచేస్తే ఆరోగ్యం చెడటం తప్ప మిగిలేదేం వుండదు."

"అంతకన్నమరోమార్గం కనిపించటంలేదు కామాక్షీ! దారిచూపించేవారు అంతకన్న లేరు. అందుకని నాకుతోచిన దారెంబడి నడుస్తున్నాను."

"అది నిజమే కావచ్చును. కాని మీరు యెన్నుకున్న మార్గంలో యెంతదూరం పోయినా అంధకారమే తప్ప వెలుగనేది వెతికినా కనిపించదు."

"మరి నన్నేం చేయమంటావో చెప్పిపో తల్లీ! నీ యీ వృద్ధశిశువుకి యింకోదారి యేదన్నా చూపించు."

"ముందు నా యీ వృద్ధశిశువు చిక్కిపోకుండా చూడాలి. అందుకోసం రోజూ పళ్ళూ, పాలూ తినాలి."

" నీ శిశువు అంధుడు తల్లీ! అతనికిప్పుడు కావలసింది దృష్టి."

"ఆ దృష్టి నే నివ్వలేను. కాని అది దొరికేమార్గం చెప్పగలను"

"ఏమిటి"

"మంగళగిరిలో జాలమ్మగారని ఒక వృద్ధవితంతువు వున్నది. ఆవిడ మీకు దృష్టి యిస్తుందని నా నమ్మకం" అని సలహాయిచ్చింది. ఏదో సలహా ఇవ్వాలి కనుక జాలమ్మ గారిపేరు చెప్పింది. కాని ఆ జాలమ్మగారు శంకరావుగారికి యేవిధంగా దృష్టియివ్వగలదో కామాక్షికి తెలియదు.

ఆ జాలమ్మగారికి మంగళగిరి నృసింహస్వామి పిలిస్తే పలుకుతాడని ప్రతీతి. అర్ధరాత్రివేళా, అపరాత్రివేళా యెప్పు డైనా అతిధులు వస్తే ఇంట్లో యేమీ లేకపోతే "నరసింహా! ఇంట్లో యేం లేదురా!" అనేదట. వెంటనే నరసింహస్వామి యే కూలివాడి ఆకారంగానో తయారై కావలసినవి అన్నీ తెచ్చి పడేసేవాడట! ఇలాటి కట్టుకథలే కాకుండా కామాక్షి కళ్ళారాచూసిన సంఘటన ఆమెకి యిప్పటికీ మరపురాదు.

జాలమ్మగారిదగ్గర ఒక చిన్నసంచీ వుంది. ఒక వంద మందికైనా సరే అందులోంచి గుప్పెళ్ళకొద్దీ పటికబెల్లం తీసి పెట్టేస్తుంది, ఆ పటికబెల్లం కామాక్షి కూడా తిన్నది. ఆవిడ

మహాభక్తురాలని అంతకంటే నిదర్శనం అక్కరలేదు. అంతే కాకుండా యెంతమంది యేవేళప్పుడు వెళ్ళినా లేదనకుండా వెన్నపూసా, గోంగూరపచ్చడీ వేసి అన్నం పెడుతుంది. ఈ కథలన్నీ విన్న కామాక్షి శంకర్రావుగారికి జాలమ్మగారు దృష్టియిస్తుందని చెప్పింది. ప్రస్తుతం ఆయనకు కావాల్సిన దృష్టి బాహిరమైనది కాదు.

జీవనసంధ్యలో అడుగుపెట్టిన ఆ కష్టజీవి మిగతా కాలాన్ని సద్వినియోగంచేసి పరానికి మార్గం తయారుచేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ మార్గానికి జాలమ్మగారు మార్గదర్శకదీపం కావాలి కామాక్షి యిచ్చిన యీ సలహా శంకర్రావుగారికి బ్రహ్మానందం కలిగించింది.

*　　*　　*　　*　　*

శంకర్రావుగారు కనీసం రోజువిడిచి రోజుఅయినా మంగళగిరి వెడుతున్నాడు. ఈ సమయంలో రాజుకీ, అన్నపూర్ణకీ సాన్నిహిత్యం యెక్కువైంది. రోజూ సాయంత్రం కోర్టునుంచి సరాసరి అన్నపూర్ణ దగ్గరికి వెడతాడు. రాత్రి పదిగంటలదాకా అక్కడ కబుర్లుచెప్పి కాలక్షేపంచేసిఇంటికి వెడతాడు. ఇతను వెళ్ళేసరికి సత్యవతి నిద్రపోతూవుంటుంది.

రాజు అన్నపూర్ణతో ఆవిధంగా వుంటున్నందుకు సత్యవతి విచారించలేదు సరిగదా కాస్తోకూస్తో ఆనందించింది కూడా పనిమనిషి పుణ్యమా అని నాటుసారా తాగి తొమ్మిదింటికల్లా మంచంమీదకు చేరుతుంది. అక్కడినించి తెల్లవార్లూ ప్రపంచంమునిగిపోయినా మెలుకురానంత గాఢంగా నిద్రపోతుంది.

ఈమధ్య ప్రతిరోజూ యెర్రనికళ్ళతో నిద్రలేస్తున్న తోడికోడల్ని చూసి పార్వతి చాలా జాలిపడుతోంది. రాజు చేసే పాడుపని మూలంగా ఆమె దుఃఖించటంవలన కళ్లు యెర్ర బడుతున్నాయని పార్వతి ఉద్దేశ్యం. అందుకని సత్యవతిని మరీ ప్రేమగా చూడటం ప్రారంభించింది.

సత్యవతిదగ్గరవున్న డబ్బంతా అయిపోయింది. రోజుకు రెండురూపాయల సారా సీసాలో పోయించుకుని యెవరూ చూడకుండా సత్యవతికి యిస్తుంది పనిమనిషి ఆదెమ్మ.

రెండురూపాయలకి అది తెచ్చేది స్పిరిట్‌గాని సారా కాదు. అగ్నిలా మండిపోతూ కంఠందిగే ఆ పదార్థాన్ని ఆప్యాయంగా తాగే సత్యవతిని చూసి తనలోతనే నవ్వు కుంటుంది ఆదెమ్మ. అది ముందే సగంతాగి నీళ్ళుకలిపి తెస్తుంది. అదితెచ్చిన నీళ్ళే సత్యవతికి అమృతంలాగా వుంటాయి. అమ్మగారిపుణ్యమా అని యీమధ్య ఆదెమ్మకి కూడా కాస్త గొంతుతడుస్తోంది.

ఆదెమ్మమొగుడు చంద్రయ్య రిక్షాలాగుతాడు. అద్దె పోగా మిగిలిన డబ్బులతో కాటన్‌మార్కెట్ ఆడతాడు. అందులో ఓడిపోయి యింటికి వస్తాడు. ఆదెమ్మ నాలుగుచిట్టి పాచిపనిచేసితెచ్చిన అన్నం గిన్నెలో పడేస్తుంది. అదిపెట్టిన అన్నాన్ని, తిట్లనీ కూడా కిమ్మనకుండాతిని కుక్కిమంచలో పడి నిద్రపోతాడు. ఇన్నాళ్ళనుంచి బ్రాకెట్లు ఆడుతున్నాగాని ఏనాడూ వాడుగెలవలేదు. ఇవ్వాళ సారా తెమ్మని ఆదెమ్మ డబ్బు యివ్వలేదు. తను అడిగితే అమ్మగారిదగ్గర డబ్బు అయిపోయింది అని సమాధానం చెప్పింది.

అమ్మగారు సారా తెమ్మని యిచ్చిన డబ్బులో తను అర్ధరూపాయి మిగుల్చుకొని రూపాయిన్నర సారా తెచ్చి ఆదెమ్మకిచ్చేవాడు. అందులో కొంత అది తాగేసి కాసిని నీళ్ళు కలిపి అమ్మగారికి యిచ్చేది. ఏమీ తోచక రిక్షా వేసుకుని బయలు దేరాడు చంద్రియ్యా.

*  *  *  *  *

స్టేషనునించి జనం గుంపులుగుంపులుగా వస్తున్నారు. యేదో రైలు వచ్చినట్లుంది. సగం కాల్చిన బీడీముక్క ఆర్పి పదిలంగా చెవులో దోపుకుని బేరం యేమన్నా తగులుతుందే మోనని రిక్షా తొక్కుకుంటూ బయల్దేరాడు చంద్రియ్యా. ఇంతలో ఒకవిగ్రహం చంద్రియ్యాని రాచుకుంటూ నడిచి మళ్ళీవచ్చి రిక్షాలో యెక్కి కూర్చున్నది. చంద్రియ్యా మాట్లాడకుండా రిక్షా తొక్కటం ప్రారంభించాడు. కృష్ణా గారేజీ, సీతానగరం వెనక్కి పోయినయి.

రాత్రి పదకొండు కావస్తోంది. కొద్దిగా చినుకులు రాలుతున్నాయి. రిక్షాలో కూర్చున్న రాజుకి భయంచేత నోరు యెండిపోతున్నది.

సీతానగరం కొండలవెనుక ఒక దయ్యాలమేడ వుంది. దానిముందు రిక్షా ఆగగానే వాన బ్రహ్మాండంగా కురవటం ప్రారంభించింది. ఈ వయస్సులో వున్న అయ్యగారు ఎవరో అమ్మగార్ని కలుసుకోటానికి వచ్చాడు కాబోలు అను కున్న చంద్రియ్యా రిక్షా ఒకపక్కనిలిపి వసారాలో ఓ పక్క కూర్చుని చెవిలోంచి బీడీతీసి ముట్టించాడు. ఆ చుట్టుపక్కల నరసంచారం అంటూ లేదు. ఎంతధైర్యం ఆ ఆడదానికి అను

కుని బీడీని యిస్తున్న వేడిలోని సుఖం అనుభవిస్తూ కునికిపాట్లు పడటం ప్రారంభించాడు చందర్రియ్య. ఇలాటివి అలవాటే వాడికి.

వర్షపునీరూ, కృష్ణానదీ కలిసి చేస్తున్న ఆ హోరు గుండె చెదరగొడుతోంది రాజుకి. తలుపుమీద మెల్లిగా చిటిక వేశాడు. నిశ్శబ్దంగా తెరుచుకున్న ఆ తలుపు అంత నిశ్శబ్దంగానూ మళ్ళీ మూసుకుపోయింది.

అతను ప్రవేశించినగదిలో అదివరకే ఇద్దరు కూర్చుని వున్నారు. బాగా ఖరీదుగల సూట్లలో వున్న ఆ యిద్దరూ రాజుని చూడగానే కరచాలనంచేశారు. కొద్దిగా తగ్గించి వున్న కోడిగుడ్డులాంపు వెలుగులో పెద్దసైజు రేడియో ఒకటి సన్నగా పాడుతోంది. రాజుగొంతుక పొడార్చుకుపోతున్నది. ఆ రేడియోవంక విచిత్రంగా చూస్తూ "ఇదేనా మీరన్నది" అని ఇంగ్లీషులో ప్రశ్నించాడు. అక్కడినుంచీ సంభాషణ అంతా ఇంగ్లీషులోనే ప్రారంభంఅయింది. ఆ యిద్దరిలో లావుగావున్నవ్యక్తి "ఆ! ఇదే! గంటకి నాలుగువేలరూపాయాలు అవలీలగా తయారుచేస్తుంది" అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయినాడు. గంటకి అయిదారువేల దొంగనోట్లు; ప్రపంచంలో ఏ వర్తకుడూ సంపాదించలేనంత మొత్తం. దానిదగ్గరగా వెళ్ళి అటూ యిటూ తిప్పి "ఏదీ, ఒకసారి చూపించండి" అన్నాడు రాజు.

ఆ లావాటివ్యక్తి దానిదగ్గరికి వెళ్ళి పదిరూపాయల కాగితంసైజులో ఉన్న తెల్ల కాగితాన్ని రైపుమిషను పైభాగంలో ఉన్నట్లున్న ఆ యంత్రానికిచుట్టి బ్యాటరీ తగిలిం

చాడు. బజ్ మన్న శబ్దంతో పదిక్షణాల్లో ఆ కాగితం ఇవతలపడింది. అది చూసి రాజుకి ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. తనజేబులోంచి ఇంకో పదిరూపాయిలకాగితం తీసి దాన్ని దీన్ని దగ్గరపెట్టి చూశాడు. ఎంతో నిపుణుడయితే తప్ప భేదం కనుక్కోటం చాలా కష్టం. "అయితే ఇప్పుడేం చేద్దామంటావు ముఖర్జీ!" అన్నాడు రాజు.

ఆ లావాటిఅతనిపేరు ముఖర్జీ. బెంగాలీ. అతను మద్రాసులో రాజుతోపాటు చదువుకున్నాడు. అతనిపక్క నే ఉన్నతను నటేశం అనే తమిళుడు. వీళ్ళిద్దరూ దొంగనోట్ల తయారీలో ఘనులు. మూడురోజులకిందట ముఖర్జీ రాజుకి ఉత్తరంవ్రాశాడు.

ఆ ఉత్తరం చూడగానే మిత్రుడు వస్తున్నందుకు రాజు నిజంగానే ఆనందించాడు. కాని ప్రస్తుతం ఆశ తనని పీడిస్తోంది. ఒక ఏభైలక్షలు వేయించి తీసుకుంటే ఇంతలో కొంపమునిగేదేముంది? న్యాయం, అన్యాయమూను. ప్రపంచంలో ఎవడు బాగా బ్రతికితే వాడే న్యాయవంతుడు.

"రాజూ! నాలుగయిదురోజుల్లో ఒక కోటిరూపాయలు వేసేస్తాను. తీసుకుని మా కో లక్షరూపాయలు మార్పించిఇయ్యి, చాలు. నువ్వు మారిస్తే ఎవరూ అనుమానించరు. కారణం డబ్బుగలవాడివి కనుక. ప్లీజ్! ఈ మాత్రం సహాయంచెయ్యి" అన్నాడు ముఖర్జీ.

రాజుకి ఆశా, భయమూ రెండూకూడా అధికంగానే ఉన్నాయి. చివరకి సరే అనక తప్పిందికాదు రాజుకి. అలా అంటున్నప్పుడు మాత్రం పార్వతిముఖం 'తప్పుచేస్తున్నావు

సుమా' అన్నది. లేదు వదినా! బ్రతకటం నేర్చుకుంటున్నాను. నువ్వేమిటి? ప్రతిదానికీ అడ్డువస్తావు నాకు? అని కసురుకున్నాడు.

అరగంట తరువాత కృష్ణాబారేజీమీద రిక్షా పోతుండగా చంద్రియ్యమనస్సు వుండబట్టలేదు. "అమ్మగారిని కూడా తీసుకురాపోనారా బాబూ! గుప్పుచప్పుంగా యింటి దెగ్గర ఇడిసేటోల్లం" అన్నాడు.

రాజుకి నవ్వు వచ్చింది. "ఆ అమ్మగారికేం భయం లేదులేరా!" అన్నాడు. ఆ సమయంలో అన్నపూర్ణ జ్ఞాపకం వచ్చిం దతనికి.

రాజు సమాధానం ఇవ్వటంతో ఎక్కడలేని ఉషారూ వచ్చింది చంద్రియ్యకి. "అయితే అమ్మగారి పేరేమిటి బాబూ!" అని మరోప్రశ్న వేశాడు.

రాజు యే మాత్రమూ తడుముకోకుండా 'లక్ష్మి... ధనలక్ష్మి' అని జవాబిచ్చాడు. దాంతో సరదాపెరిగిన చంద్రియ్య "పెద్దింటి అమ్మగారేనాఏమిటి బాబూ!" అని అడిగాడు. రాజుకి నవ్వొచ్చి "అవటానికి పెద్దింటిపిల్లే గాని నీతీ జాతీ లేదురా! ఏ క్షణాన ఎవరిని వరిస్తోందో తెలియదు. ఉత్త చపలచిత్తురాలు" అన్నాడు.

"షూ త్తేరి. అలాటిదాన్ని ఒగ్గేసెయ్యండి బాబూ! అదెప్పుడో కొంపతీత్తాది" అన్నాడు చంద్రియ్య చీదరించుకుంటూ.

రాజుకి నసాళంఅంటింది. అవును. అదెప్పుడో కొంప తీస్తుంది. అమాయకంగా అయినా వాడు యిచ్చిన సమా

ఘానం తనకి సూటిగావచ్చి తగిలింది. స్త్రీ అయినా, లక్ష్మి అయినా వున్న నాలుగురోజులే చాలు. ఎంతో సుఖపెడ తారు. నీతిపేరు చెప్పి ఆ సుఖాన్ని ఒదులుకోటమంత తెలివి తక్కువ మరోటిలేదు. చేసిందేదో చేసేశాడు. ఇక దాన్ని గురించి లాభంలేదు. యిప్పుడు తను కోటీశ్వరుడు.

ఆరాత్రి చంద్రియ్య ఆపుకోలేక ఆశాస్త్రా ఆడెమ్మ చెవి నేశాడు. కలతనిద్రలో కునుకుతున్న ఆడెమ్మ చివాలున లేచి కూచ్చుని "నీ జిమ్మదియ్య, యేటిరా అంటున్నావు?" అంది అత్యాశ్చర్యంగా. చంద్రియ్య మళ్ళీ పలికాడు గ్రామఫోను రికార్డులాగా "అవునే! నా కళ్ళారా చూశాను."

"పేరేంది అన్నావు? నువ్వీయాల బ్రాకెట్లకి సావకుండా ఆడకెందుకు సచ్చావురా?"

"అన్నిటికీ తిడతావేటే? ఇయ్యాల మందు పడ నేదుగా!"

"పేరేంవో సెప్పిసావరా అంటే నా మందూసు ఎత్తు తావేంటి?"

"లచ్చిమి! దనలచ్చిమి!"

"దనలచ్చిమా? ఇదేదో మిట్టరీగుంది. అయ్యగారికి వున్న ఒకావిడా ఊళ్లోనే వుంది. మల్లీ ఆ దనలచ్చిమి యెవ రబ్బా?" అంటూ ఆడెమ్మ ఆలోచించసాగింది. అప్పటికే చంద్రియ్య గుర్రుకొట్టి నిద్రపోతున్నాడు. తెల్లారాక యీ విషయం పార్వతమ్మతో చెప్పటమా? సత్యవతితో చెప్ప టమా? ఇదీ అదీ కాకపోతే యేకంగా అన్నపూర్ణమ్మ చెవి లోనే వేయటామా? అని దానికి తహతహ పుట్టింది. చివరికి

అన్నపూర్ణమ్మతో చెపితేనే మంచిది అని నిశ్చయించుకుని అప్పటికే నాలుగున్నర కావటంవలన లేచి గోళ్ళతో గీరి తల ముడేసుకొని గుడిసెకి తలుపుకింద పరిగణింపబడుతున్న చింకి తడిక నులకతాటితో ముడేసి పనికి బయలుదేరింది. పార్వతి గారింటికి చేరి తలుపు కొట్టింది. రాజు తలుపుతీశాడు. రాత్రి నువ్వేం చేశావో నాకు తెలుసులేవయ్యా అన్నట్లు ఒక చూపుపడేసి, చీపురు తీసుకుని బరబరా ఊడవటం ప్రారంభించింది.

సత్యవతి లేచి దొడ్లోకి రాగానే ఆదెమ్మబుర్రలో మరో అయిడియా కుమ్మరిపురుగులాగా దొలవటం ప్రారంభించింది. రాత్రి సంగతి ఈమెతోకూడా చెప్పాలి. అన్నపూర్ణమ్మతో తరువాత చెప్పవచ్చును.

"అమ్మగారూ! అమ్మగారూ! ఒకసారి యిలా వస్తారా?" అని మందారచెట్టుచాటునుంచి ఆదెమ్మ పిలిచిన పిలుపుతో సత్యవతికి మరో ఆశ రేగింది. గబగబా వస్తూనే "ఏమిటే?" అని ప్రశ్నించింది సత్యవతి.

"సారా పూరికే యివ్వనన్నాడండి. అది సరేగాని రాత్రి అయ్యగారు యెన్నింటికి వచ్చారుండీ?"

"రెండో మూడో అయిందేమో? ఏం అలా అడుగు తున్నావు?" అంది సత్యవతి ఆశ్చర్యంగా.

"మరేంలేదు. దనలచ్చిమిగోరెవరో మీాకు తెల్సా?"

"నాకు తెలియదు. ఏం జరిగిందేమిటి?"

"రాత్రి అయ్యగారు ఆ యమ్మగార్ని చీతానగరం కొండకవతల పాడుబడ్డ మేడలో కలుసుకున్నారంట" అని

ఆడెమ్మ చెప్పిన వార్తకి సత్యవతి అట్టే బాధపడలేదు. పైగా సంతోషించిందేమో కూడా! ఇది చూసిన పనిమనిషి ఆడెమ్మ ఆశ్చర్యంతో బిగుసుకుపోయింది. ఈ యమ్మ తాగుతుంది. తనూ తాగుతుంది. ఎంతతాగితేమాత్రం తాళికట్టిన మగోడు మరో ఆడదాంతో కులుకుతున్నాడంటే కూడా నోరుమూసుకు వూరుకోవటం నావల్ల కాదబ్బా! అదే నా సెందిరిగోడయితే మక్కెలిరగ మొడినేదాన్ని అనుకుంది అది. వెంటనే పళ్ళుబిగబట్టి బరబరా వూడవటం ప్రారంభించింది.

సత్యవతి తీరికగా మొగంకడుక్కున్న తరువాత లోపలికి వెళ్ళి రాజుని నిద్రలేపింది. అతను కళ్ళువిప్పి ప్రశ్నార్థకంగా ఆమెమొగంలోకి చూశాడు. "ధనలక్ష్మి ఎవరు?" సూటిగా అడిగేసింది సత్యవతి. రాజు తెల్లబోయినాడు. తను రిక్షా వాడితో అన్నమాటలు యింకా సరిగా తెల్లవారకమునుపే భార్యకు యెలా తెలిసినాయా? అని ఆశ్చర్యంవేసింది అతనికి. ఇక్కడ తమాషా యేమిటంటే చంద్రయ్యకి రాజు యెవరో తెలుసుగాని రాజుకి తనువెళ్ళిన రిక్షావాడెవరో తెలియదు. నిజం చెప్పాలా వద్దా అని రాజు కొన్నిక్షణాలు ఆలోచించి నవ్వుతూ "ఏం? అసూయపడుతున్నావా?" అన్నాడు.

"నేను అసూయపడాలని మీ ఉద్దేశ్యం అయితే అలాగే పడతాను. ఇంతకీ ఆమె యెవరో చెప్పండి!"

"మనిద్దరం ఒకరిమీద ఒకరు అసూయపడే హక్కు యేనాడో వదులుకున్నాం. అది సరేగాని, రాత్రి నన్ను ధన

లక్ష్మి వరించిందనే సంగతి, సరిగా తెల్లవారకముందే నీ కెలా తెలిసిందా అన్నది మహాచిత్రంగా వుంది."

"ఇంతకీ ఆమె యెవరో చెప్పటంలేదు." అని రెట్టించింది సత్యవతి "

"ఎవరైతేనేం ? ఇప్పుడు యేం మునిగలేదు. ఏన్నడూ లేనిది నీకీ కుతూహలమేమిటి ? ఇంతకీ రాత్రి రిక్షావాడు మీ ఆదెమ్మ మొగుడు కాదుగదా !" అని సందేహం వెలిబుచ్చాడు రాజు. సత్యవతి యేమీ మాట్లాడలేదు.

"జాగ్రత్త. ఈ సంగతి యెక్కడా వాగవద్దు. ఎక్కడైనా పొక్కిందంటే పీక తెంపేస్తానని చెప్పు. ధనలక్ష్మి నీకు సవతి కాదులే. భయపడకు" అన్నాడు వెక్కిరింపుగా రాజు.

"అయినా నేనేం అనుకోనని మీకు తెలుసు. మీరు తెల్లవారఝామువరకూ రాకుండావుంటే యే ఆడది ఊరుకుంటుంది ? నేను తప్ప."

"అలా అనకు భార్యామణీ ! మనం ప్రేమించి పెళ్ళి చేసుకున్నామనే సంగతి బొత్తుగా మర్చిపోకు మరి!" అన్నాడు రాజు. ఈ వెక్కిరింపుతో చిన్నబుచ్చుకుని అవతలకి వెళ్ళిపోయింది సత్యవతి.

రాజుకి యిక నిద్రపట్టలేదు. సత్యవతిని అనవసరంగా యెందుకు చిన్నబుచ్చానా ? అనుకున్నాడు కాని ఈ ఆలోచన యెంతోసేపు నిలువలేదు. అతని ఆలోచనంతా యిద్దరే పంచుకున్నారు- అన్నపూర్ణ, ధనలక్ష్మి. లేచి మొగంకడుక్కుని నూతిదగ్గరే నాలుగుచేదల చన్నీళ్లుపోసుకుని డ్రెస్ చేసుకుని తోలుపెట్టె తీసుకొని డాక్టరు మధుసూదనరావు

గారి కారు అడిగితీసుకుని సీతానగరంవైపు వెళ్ళి అరగంటలో తిరిగివచ్చి డాక్టరుగారికి కారు అప్పచెప్పేసి తోలుపెట్టె తీసుకొని అన్నపూర్ణగారిఇంటికి వెళ్ళాడు.

శంకరావుగారు ఆఫీసుకు వెడుతూ తనకెదురైన రాజుని చూసి చిరునవ్వునవ్వి తనదారిన తను వెళ్ళిపోయినారు. ఈయనకి అనుభూతి నశించిపోయింది. అనుకున్నాడు రాజు.

రాజునిచూసి చాటంత మొగం చేసుకుంది అన్నపూర్ణ. "ఏమండి! ఉదయానే దయచేశారు?" అని ప్రశ్నిస్తూ యెదురుగా వచ్చింది. అన్నపూర్ణలో ఆ క్షణందాకా లేని మరికొన్ని అందాల్ని అతడు చూడగలిగాడు. అప్పుడే స్నానం చేసి కంచిపట్టుచీర కట్టుకుని నిరాభరణంగా వున్న ఆమె సౌందర్యం అతనిలో అవ్యక్తమైన వాంఛని రెచ్చగొట్టింది. ఆమెను దగ్గరగాతీసుకోవాలని ముందుకు ఒకఅడుగువేశాడు. అంతవరకూ అతను మోస్తున్న తోలుపెట్టె చెయిజారి కాలు మీదపడి బొటనవేలు చితికింది. అబ్బ! అని కాలివేలు నొక్కిపట్టుకుని పక్కనున్న సోఫాలో కూలబడ్డాడతను.

సరిగ్గా అదేసమయంలో గోడమీదవున్న మహాలక్ష్మి చిత్రం టపటపాకొట్టుకుంది. ఎక్కడా గాలిఅనేది లేకపోయినా ఆ బొమ్మ యెలా కదులుతోందా అని రాజు యెంత ఆశ్చర్యపోయినాడో, అన్నపూర్ణ అంత భయపడిపోయింది. కొంచెం సేపు యిద్దర్లో యెవరూ మాట్లాడలేదు. ముందుగా రాజే తెప్పరిల్లాడు.

"ఈ పెట్టె జాగ్రత్తగా దాచు అన్నపూర్ణా! నేను రేపు మద్రాసుపోయి నాలుగురోజుల్లో వస్తాను" అంటూ లేచాడు రాజు. బొటనవేలినుంచి నెత్తురు కారుతోంది. తేలికగా వున్న తోలుపెట్టె పడ్డంతమాత్రంచేత యింత దెబ్బ యెలా తగిలిందో కూడా అర్థంకానివిషయాల్లో ఒకటి. అన్నపూర్ణ మాట్లాడకుండా ఆ పెట్టె చేతికితీసుకుంది. రాజు కుంటుతూ బయటికి నడిచాడు.

దొంగనోట్లు అన్నపూర్ణదగ్గర దాచి ఆ రోజు సాయంత్రందాకా ముఖర్జీకోసం యెదురుచూశాడు. అవి అలాగే మొత్తంగా తనదగ్గరవుంటే కొంపమునుగుతుందని అతనికి భయమేసింది. కాని అలా భయపడినందువల్ల ప్రయోజనం లేదనీ తెలుసు. ఆ రోజు సాయంత్రం సన్నగా తుప్పరపడుతూనేవుంది. ఆ తుప్పరలోంచి చూస్తూంటే ఢక్కా మజిలిన్ కప్పుకున్న మొగలాయీసుందరిలాగా వుంది విజయవాడ పట్నం. ఉండీవుండి ఒక్కతడవ తెరపి యిచ్చింది. కృష్ణ అవతలనుంచి సూర్యాస్తమానం అవుతోంది. నడుస్తూన్న రాజు ఆగి పక్కనున్న హోటల్లోకి దారితీశాడు.

హోటలంతా విచిత్రమైన వెగటువాసనకొడుతోంది. ప్లేట్లుచప్పుడూ సర్వర్ల కేకలూ, రకరకాల తినుబండారాల వాసనా కలిసి ఆ వాతావరణమే విలక్షణంగావుంది. రాజు, కాఫీ తాగుతున్నవాడు ఉలిక్కిపడి హిందూలో పడ్డవార్త యెవరోచదువుతున్నది ఆసక్తిగా వినటం మొదలెట్టాడు.

"విజయవాడలో దొంగనోట్లతయారు, ముఖర్జీ అనే బెంగాలీఅతని అరెస్టు, దానికి సంబంధించిన యంత్రాన్ని కూడా విజయవాడ సి. ఐ. డి. శాఖవారు వశపర్చుకున్నారు"

ఈవార్త పూర్తిగా వినేసరికి రాజుకి గుండెల్లోంచి దడ ప్రారంభమైంది. తనచుట్టుపక్కల వున్న ప్రతివ్యక్తీ అతనికంటికి సి. ఐ. డి. ల్లాగానే కనిపించసాగారు. అతను గబగబా నడిచి ఆ హోటల్లోంచి బయటపడ్డాడు. రిక్షాయెక్కి సరాసరి అన్నపూర్ణదగ్గరకెళ్ళి ఆ పెట్టె తీసుకుని ఇంటికి, వచ్చాడు వాకిట్లోనే పార్వతి ఎదురైంది. "ఈరాత్రి మద్రాసు వెళ్తున్నానమ్మా ఒక కేసుపనిమీద" అన్నాడు రాజు. పార్వతి నవ్వుతూ "ప్రొద్దుటనించీ బాబాయో అని పిల్ల ఒకటేగోల! దాన్ని కొంచంసేపు యెత్తుకుందూ!" అన్నది.

ఈమె యెంత సరళహృదయినో అంత పవిత్రురాలు. ఈమెకి నేను ఏం చేస్తున్నానో తెలిస్తే యిలా నవ్వుతుందా అనిపించిం దతనికి.

భర్త మద్రాసు వెడుతున్నానని చెప్పగానే తనూ వస్తానంది సత్యవతి. ఆమెమనస్సులో శర్మ మెదిలాడు. అంతకన్న యెక్కువగా మదిర మెదిలింది. రాజు కొన్ని క్షణాలు ఆలోచించి సరే అన్నాడు. ఆ మాటతో కొండ యెక్కినంత సంబరంతో, గబగబా తన చీరలు సర్దివేసుకొంది. ఆమెకు కిందటితడవ తను ఒంటరిగా చేసిన మద్రాసు ప్రయాణం గుర్తుకివచ్చింది. ఆరోజు తను తప్పుచేసిందని తనకీ, లోకానికీ కూడా అనిపించింది. కాని నిజం చెప్పాలంటే అప్పుడే తనమనస్సు తళతళా మెరిసే అద్దంలాగా నిర్మలంగా

వుంది. ఇప్పుడు తను భర్తతో వెడుతోంది. ఆక్షేపణకి యే మాత్రం అవకాశం లేదు. అయినా తన హృదయం బురదకొట్టుకున్నది. తన హృదయంలో మునుపటి నైర్మల్యం లేదు. లోకంమాత్రం తనని ఏమీ అనుకోవటం లేదు. స్టేషన్ రకరకాల జనాలతోనూ, ధ్వనులతోనూ నిండిపోయి వుంది రాజుచేతిలోవున్న సూటుకేసు మహాపర్వతమై అతనిని దిగలాగుతున్నట్లనిపించింది. ఇద్దరూ కలిసి బండిఎక్కుతుంటే బాబాయితోపాటు నేనూ వెడతానని పిల్ల ఏడవటం ప్రారంభించింది. ఆ పసిపిల్లమనస్సుకు యే కష్టంకలిగినా అతనిహృదయం బాధతో గిలగిల్లాడుతుంది. అతను, స్టేషనులో నడుస్తున్నప్పు కూడా బాబాయి అంటూ యేడుస్తున్న ఆ పాపయేడుపు అతనికి వినిపిస్తూనే వుంది.

"త్వరగా వచ్చేయండి. లేకపోతే పిల్ల బెంగపెట్టుకుంటుంది" అని మరీమరీ చెప్పింది పార్వతి. ఆ మహాయిల్లాల్ని తను మోసంచేస్తున్నాడు. తనని తల్లికంటేఅధికంగాపెంచింది. ఆదర్శయువకుడిని చేయాలని ఎన్నో కలలుకన్నది. చివరికి తానిట్లా తయారయ్యాడు. ప్రస్తుతంలో యీ డబ్బుసమస్య కన్న వేధిస్తున్న సమస్య మరొకటి వున్నది. అది అన్నపూర్ణ. ఆమెను చూసిననెంటనే తను ఆకర్షితుడయాడు వివాహిత అయిన స్త్రీస్నేహం నిషిద్ధం అని నిర్ణయించిన నీతివేత్తలు అలాటి స్త్రీమీద కోరిక అనేది కలగకుండా అంతర్యాన్ని ఎందుచేత శాసించలేకపోతున్నారో అర్థంకావటంలేదు. తను దొంగనోట్లు మార్చటానికి ప్రయత్నించి దేశద్రోహంచేయటమే కాకుండా ఆర్థికశాస్త్రంమీద ఆధారపడివున్న దేశ

వ్యవస్థనే పునాదితో పెళ్లగించటానికి ప్రయత్నిస్తున్నాడు. విద్యావంతుడూ, సంస్కారవంతుడూ అయిన తనలాంటి యువకుడు చేయాల్సిన పనికాదు.

రాజుమనస్సులో అగ్నిపర్వతాలూ, భూకంపాలూ, తుఫానుగాలులూ పగిలి పెటిలి విసురుతున్నాయి. ఈపెట్టె తన కెక్కడో దొరికిందని యిచ్చేయవచ్చును. కానిన్నికోటిరూపాయలు యిందులో వున్నాయ్! తను తెలివిగా మారిస్తే యిక ప్రపంచంలో తనకి అందుబాటులోలేని సుఖం అంటూ వుండదు. అనవసరంగా తను భయపడుతున్నాడు... . ఒకవేళ తన అదృష్టం వక్రించి పట్టుబడితే...అమ్మో! రాజు మనస్సులో తిరిగీ చీకటిలాగా భయం ఆవరించింది. ఛీ ఛీ. అన్యాయమార్గంలో బ్రతకటంతప్ప జీవించటానికి మరో మార్గంలేదా? యిచ్చేస్తాను. రాజు రెండు అడుగులు ముందుకు వేశాడు. ఇప్పుడు ఒకవేళ యిస్తేమాత్రం తనని అరెస్టుచేయరని నమ్మకం యేమిటి! యాంత్రికంగా రెండు అడుగులు వెనక్కి వేశాడతను. అతనిమనస్సులో జరుగుతున్న యీ అంతర్యుద్ధం తాలూకు సూచనలేవీ బయటకు కనిపించకుండా జాగ్రత్తపడ్డాడతను.

ఇంతలో అరేబియన్ నైట్సుకథల్లో ఒంటికంటి భూతంలాగా రైలువచ్చి ప్లాట్‌ఫారమ్‌మీద నిలిచింది. ఇద్దరూ సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్‌లో యెక్కి కూర్చున్నారు.

సత్యవతిమనస్సులో మరోమాదిరి ఊహలు సుడి తిరుగుతున్నాయి. శర్మరూపమూ, మాటలూ ఆమెని చుట్టుముట్టి వేసంకాలంలో ఎయిర్‌కండిషన్‌లాగా హాయిగొలుపు

తున్నాయి. ఆమె చేతిలోవున్న పత్రికలో శర్మ రాజకుమారుడివేషంలోవున్న బొమ్మ యేదో సినిమాలోది వున్నది. సత్యవతి తదేకంగా చూస్తున్నది దానివంక. అలా చూడగా చూడగా కొంతసేపటికి ఆ బొమ్మలోంచి శర్మవచ్చి పక్కన కూర్చున్నాడు.

"ఈ తడవ నిన్ను వదలనులే. నా బ్రతుకు వెలితిపరుచుకోనులే" పాటలాగా అన్న శర్మమాటలకి తను ముగ్ధురాలైంది. రెండుచేతులూ చాచి అతన్ని యెదకి హత్తుకొన్నది. చదువుతున్న పుస్తకం గుండెలమీద బోర్లించుకొని [illegible] ఊపుకి హాయిగా నిద్రిస్తున్న సత్యవతిని చూసి ఆమె మనస్సులో యేమీ మలినమూ లేనందువల్లనే యింత హాయిగా నిద్రించగలుగుతోంది కాబోలు అనుకున్నాడు. అతని మనస్సు రైలుచక్రాలకన్నా వేగంగా తిరుగుతోంది. ఏం చేయబోతున్నాను? అందరికీ డబ్బులేకపోవటం సమస్య అయితే తనకి డబ్బువుండటమే పెద్ద సమస్యగా తయారైంది. ఆ పెట్టెలో వీరిద్దరూ కాక రిటైరైన తాతగారు మరో ఆయన నిద్రపోతున్నారు.

మనస్సు చాలా చిత్రమైన వస్తువు. దానిని ఎవరైనా దెబ్బవేస్తే తాబేలు కాళ్ళూ చేతులూ డిప్పలోకి ముడుచుకొన్నట్లుగానే మనసుకూడా తన కోరికల్ని పరిస్థితుల్లోకి ముడుచుకొంటుంది. ప్రస్తుతం రాజుమనసులో అన్నపూర్ణ అంతర్ధానమైపోలేదు గాని, యీ డబ్బు ఇచ్చే సౌఖ్యాలనుగురించి ఆలోచించుకుంటుంటే ఆ కోరిక అంత ప్రాధాన్యమైనదిగా కనిపించటంలేదనే చెప్పవచ్చును. ప్రస్తుతం అతను

చేస్తున్న మహాప్రయత్నం యేమిటంటే, డబ్బుసంగతి మర్చిపోయి అన్నపూర్ణ సంగతే జ్ఞాపకం తెచ్చుకోవాలని... అయితే ఆ ప్రయత్నంలో అతడు కృతకృత్యుడు కాలేకపోతున్నాడు.

డబ్బు కొన్ని సుఖాలను యివ్వబోయేముందు యిలాటి నరకయాతనని కూడా అనుభవించితీరాలనే శాసనం యేమీ లేదుగదా. తను యిప్పుడు సెకండ్ క్లాసులో అందమైన భార్యతో కొందరు భాగ్యవంతులకి మాత్రమే ప్రత్యేకించిన చక్కని తోలుపెట్టెతో ప్రయాణం చేస్తున్నాడు. మూడో వ్యక్తి దృష్టిలో తను అదృష్టవంతుడుగానే చూడబడతాడు. కాని నేతిబీరకాయలో నెయ్యి యెంత వున్నదో తన అదృష్టంలో సుఖం అంత వున్నది. రాజు నిట్టూర్చాడు. అక్రమమూ, అన్యాయమూ అయిన పనిచేసిన మానవుడు ఇంత వ్యథే కనుక పడుతుంటే ప్రపంచంలో జరుగుతున్న యీ అక్రమాలూ, అన్యాయాలూ జరుగక నేపోను. ఆ మాటకొస్తే ఏది న్యాయం? ఏది కాదు? ప్రశ్న మళ్ళీ మొదటికొస్తుంది.

రైలూ, కాలమూ సమానంగా పరుగెత్తుతున్నాయి. జీవితమే ఆ వేగంతో పరుగెత్తలేకపోతున్నది. మన్నుతిన్న బండపురుగులాటిది బ్రతుకు. దానికి ఉద్దేశ్యమూ లేదు, అర్థమూ లేదు. మెల్లిగా పాకటమే పని. ఎంతదూరం అలా పాకుతుందో, గమ్యస్థానం యెక్కడున్నదో దానికి బొత్తిగా తెలియదు. దాని దారిమధ్యలో బంగారుపళ్లెరం దాటవలసి వస్తేమాత్రం కొంచం ఆలస్యంఅవుతుంది. ఎందుకంటే పళ్లెం అంచుచుట్టూ తిరుగుతుందికాని మొదలేదో చివరేదో

కొంచెం సేపటిదాకా, తెలుసుకోలేక అయోమయంలో పడి చివరకి తెలుసుకుంటుంది.

ప్రస్తుతం రాజుకూడా ఆ బండపురుగు అవస్థలోనే వున్నాడు. ఒకవేళ తను పట్టుబడితే' అన్న ఊహ క్షణక్షణానికీ ముల్లులా గుచ్చుకుంటోంది. హాయిగా నిద్రపోతున్న సత్యవతిని చూస్తే అతనికి అసూయ కలిగింది కూడా.

ఆమె ఏ చెడ్డపనీ చేయలేదు. అందుకే హాయిగా నిద్ర పోగలుగుతున్నది. అని సమాధానం చెప్పింది అతని అంతరాత్మ. నేనూ ఏపాపం చేయలేదు. నువ్వు నోరుమూసుకో, అంతరాత్మా! సుఖంగా బ్రతకాలనుకోటమే పాపమైతే నీకేం తెలియదన్నమాటే అన్నాడు. అంతరాత్మ అంతటితో అంతర్ధానమయింది.

* * * * *

చెల్లెలూ, బావమరదీ అనుకోకుండా వచ్చినందుకు ఆటే ఆశ్చర్యపడలేదుగాని బావమరిది బరోడామహారాజులాగా ఖర్చుపెడుతున్నందుకు చాలా ఆశ్చర్యపడుతున్నాడు సత్యవతిఅన్నగారు. ఈ ప్రశ్న చెల్లెల్ని అడిగాడు కూడా. సత్యవతి యేమీ జవాబుచెప్పకుండా గంభీరంగా నవ్వి ఊరుకుంది. నిజం ఆమెకూ తెలియదు. తెలుసుకోవాలని కూడా ఆమె ప్రయత్నించలేదు. మద్రాసు వచ్చినదగ్గరనుంచీ తాగటానికి డబ్బు పుష్కలంగా దొరుకుతోంది ఆమెకు. రాజు సత్యవతికి అడిగినంత డబ్బు యిస్తున్నాడు. ఆమె యేం చేస్తున్నదో అడగడు. ప్రస్తుతం అతనికి ఒక ఐడియా వచ్చింది.

ఇంత డబ్బు తనదగ్గరికి యెలా వచ్చిందని లోకం ప్రశ్నించకమునుపే ఓ ఫిలింకంపెనీ పెట్టాలని ఊహ. ఈ ఫిలింకంపెనీ పెట్టాలనే ఊహకి వెనకాల మరో స్వార్థంకూడా వుంది. తన కంపెనీలో ఆర్టుడైరెక్టరుగా శంకర్రావుగారికి ఉద్యోగం యివ్వాలి. జీతం పన్నెండువందలరూపాయలు యివ్వొచ్చును. కంటకంపత్రికలో అరవై రూపాయలకి పని చేస్తున్న శంకర్రావుగారు తను యీ ఉద్యోగం ఆఫర్ చేస్తే క్షణాలమీద మద్రాసు వస్తాడు. ఇతని యీ ఊహకి సత్యవతి యెగిరి గంతేసి అంగీకరించింది. తను ప్లేబాక్ పాడతాననీ, శర్మ బాక్సాఫీసునటుడు కనుక అతన్ని హీరోగా బుక్ చేయమనీ సిఫారసుచేసిందికూడా. రాజు హాయిగా అంగీకరించేశాడు.

ఇది సెటిలైన మరునాడే వడపళనిలో ఒకయిల్లు రెండు వందలకు అద్దెకితీసుకుని ఫర్నిచరూ అవీ కొనేసి బోర్డు తగిలించేశాడు. ఆ మరుక్షణంనుంచీ మద్రాసులోని జూనియర్ నటీనటులంతా ఆ బోర్డుచుట్టూ పరిభ్రమించటం సాగించారు. రాజుకి యీ అనుభవం చిత్రంగావుంది. పూర్తిగా అలంకరించుకొన్న ఈ స్త్రీ పురుషుల మనస్తత్వంకూడా అతనికి చిత్రం అనిపిస్తున్నది. వాళ్ళకి కొత్తలేదు. మాట్లాడటంలో అరమరిక లేదు. వాళ్ళకి యేం కావాలో స్పష్టంగా అడిగేస్తారు. ఒక విధంగా ఈ జీవితమే నిష్కల్మషం అనిపించింది అతనికి. ఇంకా కథ నిర్ణయంకాలేదు. నటీనటులూ ఇంకా నిర్ణయింపబడలేదు. ఇప్పుడే యింతహాయిగావుంది. ఇకముందు యింకెంత బాగుంటుందో అతని ఊహకు అందలేదు. డబ్బుయిచ్చే సుఖం ప్రపంచంలో మరేదీ ఖువ్వలేదనే నిర్ణయానికివచ్చాడు

రాజు. యెప్పుడైతే ఆ నిర్ణయానికి వచ్చాడో అప్పుడే అతని భయం పోయింది.

శర్మ ఇంటిలో తాగుతున్న సత్యవతికి యిప్పుడు యే బాధలూ లేవు. ఇదివరకులాగా యిప్పుడు నిముష నిముషానికీ యేడవనవసరం లేదు. చేతినిండా కావలసినంత డబ్బువుంది. విశ్రాంతికూడా కావలసినంత వున్నది. ఏ స్టూడియోలో అయితే తాను టెలిఫోన్ గరల్‌గా పనిచేసిందో అదే స్టూడియోలో యిప్పుడు ప్లేబాక్ తారగా, గొప్ప ప్రొడ్యూసరు భార్యగా తిరుగుతున్నది.

ఖరీదుగల చీరతో, రవ్వలనగలతో ఒయ్యారంగా సోఫాలో పడుకుని తాగుతున్న సత్యవతి మొగల్ సామ్రాజ్ఞి నూర్జహాన్‌లాగా వుంది. దీనంగా, జాలిగా అనుక్షణమూ ఏడుస్తూవుండే సత్యవతేనా యీమె అనిపించింది శర్మకు.

ప్రేమ అని మానవుడు భ్రమించి వ్యథపడుతున్న ఈ పదార్థం తుపాకీమందులాటిది. ఇది ఒక్కతడవ పేలి పూరుకుంటుంది. పేలకమునుపు పేలుతుందేమో అని భయంగాని ఆ కాస్తా పేలినతరువాత దాని అంతేవుండదు. ప్రస్తుతం సత్యవతికి ప్రేమ అనేది పెద్ద సమస్యగా కనిపించటం మానేసింది. అనుక్షణమూ, దీనంగా ఏడుస్తూవున్న సత్యవతిని ప్రేమించినంత హృదయపూర్వకంగా, డబ్బుతో తులతూగుతున్న సత్యవతిని ప్రేమించలేకపోతున్నాడు శర్మ. ఒయ్యారంగా తాగుతూ పడుకున్న సత్యవతి శర్మ అక్కడ వున్నాడన్నమాటే మర్చిపోయింది. ఆమెకళ్ళు యెర్రగా మండిపోతున్నయ్యి. చెక్కిళ్ళల్లో గులాబీపూలు విచ్చుకున్నయ్యి.

ఆ క్షణంలో జీవితమంటే షాంపేన్‌మత్తులా కనిపిస్తోంది. ప్రపంచమంతా షాలిమార్ తోటలా విచ్చుకుంటోంది. ఆనందం ఆమెచుట్టూ కరుళ్ళు కరుళ్ళుగా విరిగిపడుతోంది.

ఆ స్థితిలోవున్న సత్యవతిని చూస్తే ఆకర్షణకి బదులు ఒకవిధమైన వెగటు కలుగుతోంది శర్మకి. కూసం విడిచిన శ్వేతనాగినిలాగావున్న ఆమెసౌందర్యం అతనిని ఆశ్చర్యపెడు తోందిగాని ఆకర్షించటంలేదు. కొంచంసేపు అయిన తరువాత నిద్రపోతున్న ఆమెమీదికి ఒక దుప్పటిలాగి లైటుతీసి వెళ్ళి పోయినాడు శర్మ.

* * * * *

విజయవాడనగరం చాలా చిత్రమైనది. మహాపట్టణా నికి వుండే ఆధునిక సౌకర్యాలూ, పల్లెటూరిలో మాత్రమే కనిపించే ఆ సౌకర్యాలు కూడా వున్నయ్యి. సౌందర్యానికి పేరుబడ్డ కాశ్మీరులో కనిపించే సుందరదృశ్యాలూ; మురికీ, పందులూ యీ పట్నంలో వున్నాయి. అంతేకాకుండా పట్నంలోవుండే పట్టించుకోనితనముతోబాటు యే వార్త అయినా అంచీలమీాద వ్యాపింపచేయటానికి కూడా బోలెడు అవకాశం లేకపోలేదు.

ప్రకృతీ ప్రవృత్తీ కూడా పరస్పరవిరుద్ధంగావుండే ఈ పట్టణాన్ని చూస్తుంటే సుప్రసిద్ధ నవలాకారుడు అలెగ్జాండరు డ్యూమా వర్ణించిన ప్యారిస్ జ్ఞాపకంవస్తుంది. ఒకటి మాత్రం నిశ్చయం. యే మద్రాసునుంచో, హైదాబాద్ నించో వచ్చినవాళ్ళకు యీ పట్నం నచ్చకపోవచ్చు గాని యిక్కడివాళ్ళకి మాత్రం మాస్కో-కూడా నచ్చదు.

ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే ఈ మహాపట్నంలో, సినిమా డిస్ట్రిబ్యూటర్లలో శ్రీమహాలక్ష్మి పరకాయప్రవేశం చేయటంచేతనయితేనేమి, కంటకంకార్యాలయానికీ, రాజుకీ కొంత సంబంధం వుండటంవల్లనేమి, రాజు సినిమా తీస్తున్నాడన్న విషయం వూరంతా పాకిపోయింది. ప్రస్తుతం కంటకంకార్యాలయంలో శివరావు, కామాక్షమ్మలకీ, శంకర్రావుగారికీ మధ్య యిదే చర్చ జరుగుతోంది.

"నెలకి పన్నెండువందలరూపాయలజీతంమీద ఆర్టు డైరెక్టరుగా రమ్మన్నప్పుడు మొదలకుండా వెళ్ళటమే మంచిది" అన్నది కామాక్షి. ఆ మాటలకి శంకర్రావుగారు నిట్టూర్చారు. నిశ్శబ్దంగా తనవేళ్ళవంక కొన్నిక్షణాలుచూసి "ఈ వేళ్ళు కళని చిత్రించటంమాత్రమేకాదు. సినిమాలకు కూడా అమ్ముకుంటున్నాయి. ఇక వీటికి ఏంమిగిలింది ? ఏమీ మిగలలేదు.... కాని నేను డబ్బుసంపాదించాలి అన్నపూర్ణ కోసం. నా నరసింహుడికి దూరమవ్వాలి ఈ డబ్బుకోసం" అన్నాడు. ఆయన మనసులో పడుతున్న వ్యథ ఆయన ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది.

ఇటీవల ఆయనకి మంగళగిరిలోనే వుండిపోవాలని పిస్తున్నది. అనశ్వరమూ, జుగుప్సాకరమూ అయిన ఈ సంసారం ఆయనకి అసహ్యాన్ని కలిగిస్తున్నది. దీనినుంచి దూరంగా పోవాలనే ఆతృత క్షణక్షణానికీ అధికమవుతోంది. ఈ సమయంలో రాజు వ్రాసిన ఉత్తరం అందింది. ప్రతివాళ్ళూ వెళ్ళమనే సలహాయిస్తున్నారు. చాటుగా మొహంతిప్పుకుని నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు కూడా.

ఈవిషయంలో అన్నపూర్ణ చాలా పట్టుదల పట్టింది. "నీవు పెద్దవాడివే కాకుండా యిటీవల సన్యాసివికూడా అయి పోతున్నావు. నా గతేమిటి ? ఈ దిక్కుమాలిన ఊరు వదిలి పెట్టి మద్రాసు పోదాం. హాయిగా పన్నెండువందల రూపాయలు నెలతిరిగేసరికి కళ్ళచూస్తాం. నేనుకూడా ఓ ఉద్యోగం చూసుకున్నానంటే మీరు సన్యాసంతీసుకున్నా నాకేం బెంగలేదు" అన్నది.

అన్నిటికన్న యీ చివరిమాట నచ్చింది శంకరావు గారికి. అలాచేస్తే సమస్య తీరిపోతుంది అనుకున్నాడు. ఆంతర్యంలో మాత్రం తిరిగీ వ్యామోహంలో పడిపోవటంలేదు కదా అనిపించింది. నా నరసింహుడే నా రక్ష. నా మృత పత్ని నాకు అంగరక్ష అని ధైర్యంతెచ్చుకుని వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు ఆయన. దానితో అన్నపూర్ణ మొహం చాటంతఅయింది. నీతిదేవత యింకొకసారి తలవంచుకుంది. శంకరావుగారు బాధపడుతూనే చివరకి అంగీకరించటం చూసి అన్నపూర్ణప్రభావం ఆయనమీద యెంతఅధికంగా వున్నది ? అనుకుంది కామాక్షి. ఆయన వెళ్ళిపోయినతరువాత వుండబట్టలేక యీ ముక్కతే శివరావుతో అనేసింది. శివరావు నవ్వి,

"ఏ పెళ్ళాంప్రభావం యే మొగుడిమీద వుండదు కనుక ? అందులో ముసలితనంలో మురిసి చేసుకున్న ఇల్లాలు" అన్నాడు.

"అదికాదు శివరావ్ ! న్యాయాన్నీ ధర్మాన్నీ కూడా లెక్క-చేయని యీ ప్రేమ చాలా తమాషాగావుంది. అందు కనీ..."

"ఇందులో తమాషా ఏం లేదు కామాక్షమ్మా ! ఆయన కళాకారుడైన యోగి. మంచిచెడ్డలతోనూ, నీతి అవి నీతులతోనూ, ఆయనకి ఆట్టే సంబంధంలేదు."

"ఎంత వేదాంతమైనా ఇంత మంచితనాన్ని ఎక్క-డా చూడలేదు. ఈయన మనిషా ? దేవతా? అని అప్పుడప్పుడు సందేహంపుడుతోంది నాకు"

"నీకు యిన్నాళ్ళకి ఒకనిజం చెప్పుతున్నాను. ఇప్పుడు ఆ నిజం చెప్పినందువల్ల ప్రమాదంలేదు. అన్నపూర్ణ ప్రవర్తన సరిగాలేదు కనుక, శంకర్రావుగారు ఆమెని ప్రేమిం చటం అనవసరం అని నీవు అనుకుంటున్నావు..."

"నేను అలా అనుకోటంలేదు శివరావు."

"ఉండు. నామాటకి అడ్డంరాకు. అన్నపూర్ణప్రవ ర్తన సరిగా లేకపోవటానికి ఒక కారణం వున్నది. శంకర్రావు గారు పెద్దవాడు. డబ్బులేనివాడు. ఆమెని యేవిధంగానూ సుఖపెట్టలేకపోతున్నాడు. కనక ఒకవిధంగా ఫరవాలేదన వచ్చును. మనం ఎడారిపువ్వులునాటకానికి వెళ్ళాం, చూడు. ఆ రోజున రాజుభార్య సత్యవతి యెవరితోనో మాట్లాడుతూం డగా చూశాను. దానికేమంటావ్ ?"

కామాక్షి చాలా ఆశ్చర్యపడింది. "చివరికి నీవు పొర పాటుపడలేదుగదా శివరావు ?" అన్నది.

"లేదు. యింతకీ చెప్పవచ్చేదేమిటంటే సత్యవతీ ప్రేమించే పెళ్ళిచేసుకుంది. ఏవిధమైన పొరపాటుపడడానికీ అవకాశంలేదు. రాజు నీచుడే కావచ్చును. అయినా అంద గాడూ, డబ్బున్నవాడూ గద. సత్యవతి యెందుకు చేసింది? కాబట్టి ఈ విషయంలో తుదీ మొదలూ యెక్కడ? యెవరిష్టం వారిది. చెప్పటానికి కూడా ఇతర్లకి అధికారంలేదు. అయినా యెవరుమాత్రం యేం చెపుతారు, చూస్తూ వూరుకోవటం తప్ప. ఇదివరకు అలా చెప్పినవాళ్ళు కొన్ని వేలమందివున్నారు. అంతమంది చెప్పినా రాని పరిణామం యిప్పుడు వస్తుందని గ్యారంటీ యేమిటి? చెప్పి చెడు కావటంకన్న మెదలకుండా వూరుకోటం మేలు" అన్నాడు, ఎంతో ప్రపంచానుభవంవున్న వాడిలాగా. శివరావు అన్న ఈ మాటలు కామాక్షిని మూల మట్టంగా కదిపివేసినయి. అందాలజాబిల్లి సత్యవతి ... మచ్చ లేని ఆ సౌందర్యవతికి విపరీతమైన మచ్చ. ఛీ ఛీ! స్త్రీ! నీ కిక భవిష్యత్తూ లేదు, వర్తమానమూ లేదు అనుకుని నిట్టూ ర్చింది ఆమె.

"నీతి"! ఈ రెండుఅక్షరాలకీ అర్థం ఏమిటి? సౌంద ర్యమూ, నీతీ కూడా రెండుకత్తులలాటివి. ఒక ఒరలో అవి యిముడవు. అలా యెవరైనా యిముడ్చగలిగితే వాడు మహా వ్యక్తి. రాముడూ, సీతా మొదలైనవారు సౌందర్యాన్ని, నీతినీ కలిపే వుంచారు. కనుకనే వాళ్ళు మహావ్యక్తులు.

కామాక్షి ఆలోచనాతరంగాలలో మరో కెరటం కది లింది.

సరే, బాగానేవుంది. మరి లీల? దానికి సౌందర్యమూ లేదు, నీతీ లేదు. సౌందర్యవిహీనులు నీతిమంతులనీ, అధమం లోకం అలా అనుకుంటుందనీ భావి స్తే ఆ సిద్ధాంతమూ తప్పు గానే కనిపిస్తున్నది. ఆమాటకొ స్తే కురూపితనం చెడ్డకి ఒక సింబల్.

క్లియోపాత్రా, నూర్జహాన్, అహల్య వీరు అవినీతిపరు లైన సౌందర్యవతులు. కనుకనే లోకం వాళ్ళపరివ ర్తనను సహించి, సౌందర్యాన్నే జ్ఞాపకంపెట్టుకుంది. ఇప్పుడు సత్యవతిని అలాగే చేస్తుందా? అయితే యెవరికిష్టమైన పద్ధతిలో వాళ్ళని బతకనీయక యీ కట్టుబాట్లు- దారఘపోగుల కన్న బలహీనమైన యీ కట్టుబాట్లెందుకు?

సత్యవతి, లీల, అన్నపూర్ణ వీళ్ళు సుఖపడుతూనే వున్నారు. పవిత్రవ్యక్తి పార్వతీ సుఖపడుతూనేవుంది. ఎటొచ్చీ తనకే యే సుఖంలేదు.

ఆలోచనా కెరటాలమీద చిరునావలా తేలిపోతున్న ఆమెహృదయం ఒక్కసారి ఒడ్డుకు విసరివేయబడ్డది. వాకిట్లో కారు ఆగటమూ, డాక్టరుబూట్లచప్పుడు దగ్గరకావటమూతో ఆమెహృదయం ఇంద్రధనుస్సయింది. సీతానగరం వెళ్ళి వచ్చినదగ్గరనుంచీ డాక్టరుని ఆమె కలుసుకోలేదు. ఇప్పు డతనిరాకకి ఆమె ఆనందించిందనే చెప్పాలి.

సరాసరి లోపలికివచ్చిన డాక్టరు శివరావువునికినే గమనించకుండా కామాక్షిటేబిల్ దగ్గరకెళ్ళి నిలుచున్నాడు. సన్నివేశం యీవిధంగావుండేసరికి, శివరావుకి బయటనిలబడి వెంకటపతిగారు రాకుండా చూడటం విద్యు క్తధర్మ

మయింది. కొన్ని క్షణాలైనతరువాత డాక్టరే ముందు మాట్లాడాడు.

"అనురాగం అనేది నదిలాటిది వల్లపిల్లా! అదెప్పుడూ పల్లానికే ప్రవహిస్తుంది." అన్నాడు పాంటుజేబులో చేతులు పెట్టుకుని ఠీవిగా.

"అంతేకాదు డాక్టర్! ఈకాలంలో దాన్ని మెట్ట మీాదకీ ఎక్కిస్తున్నారు. ఆనకట్టలూ కడుతున్నారు"

"పత్రికభాష మాట్లాడకు మరి! నదికేమోగాని అనురాగస్రవంతికిమాత్రం ఆనకట్టకట్టటం చాలా కష్టం, ఇంజనీరుగా మీా నాన్న అంత తెలివిగలవాడయితే తప్ప."

"ఎప్పుడూ మా నాన్నని ఆడిపోసుకుంటావెందుకు? ఆయనంటే నాకు అపరిమితమైన గౌరవం."

"మరే! శ్రీరామచంద్రుడి చెల్లెలివి. అదలా ఉంచు. ఇప్పుడు నేను ఎందుకువచ్చానో తెలుసా?"

"ఇంకెందుకు? ఉండవల్లికి విహారయాత్ర కాబోలు."

"నీ మొహంకాదూ! డాక్టర్ రోజావతి పుట్టినరోజు పండుగట."

"ఎన్నో ఏడుట?"

"ఛ ఛ. అడగకూడని ప్రశ్న అడక్కు. ఆ కార్డులో పెన్‌తో వేరే వ్రాసింది. డాక్టరు మధుసూదనరావు, కామాక్షీమధుసూదనరావని."

"నా ఖర్మ కాలిపోను!"

"అదేం?"

"నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకున్నాగాని పేరుమాత్రం అలా మార్చుకోను."

"రైటో... నన్ను పెళ్ళిచేసుకోవాలి గాని, నేనే అలా నీపేరుమీద పిలవబడడానికి ఒప్పుకుంటాను."

"ఇంతకీ ఆ రోజావతి ఏడిపించటానికి కాకపోతే ఎందుకు వ్రాసినట్లో కనుక్కున్నారా?"

"ఎందుకు కనుక్కోటం? నా మనసులో ఉన్న బాధని కనీసం ఆమెన్నా అర్థంచేసుకుంది. అదిచూసి పొంగిపోయా ననుకో."

"అసూయపట్టలేక ఏడిపించడానికి అలా వ్రాసింది."

"పోనీ, అసూయే అనుకో! అయితేనేం? నాకు చాలా ఆనందం కలిగించేపని చేసిందిలే. పోదాం పద!" అన్నాడు డాక్టర్.

కామాక్షి కొన్నిక్షణాలు ఆలోచించి నిశ్శబ్దంగా లేచి డాక్టరుతోపాటు కార్లో కూర్చుంది.

డాక్టర్ రోజావతికి మధుసూదనరావంటే అపరిమిత మయిన ఇష్టం. వీలయితే అతనిని వివాహంచేసుకోవాలని కూడా ఆమె ప్రయత్నిస్తుంది. క్రిష్టియన్ సొసైటీలో ఉండే మంచి ఏమిటంటే స్త్రీకి వివాహస్వాతంత్ర్యం ఉండటం. అసలే చక్కదనం చిందే శరీరానికి ఆ తెల్లనిదుస్తులు మరింత సౌం దర్యాన్ని కలిగించగా డాక్టర్ కారుచప్పుడు విని బయటికి వచ్చింది ఆమె. అతనివెంటనే కారుదిగుతున్న కామాక్షిని చూసి గతుక్కుమన్నది.

కామాక్షీమధుసూదనరావు అని కార్డుమీద వ్రాసింది ఎందుకంటే, వీళ్ళిద్దరికీ ప్రేమఉన్నదా? లేదా? అని తెలుసుకోటంకోసం వ్రాసింది. ఇప్పుడు కామాక్షి రావటం చూసి ఆమెహృదయం ఒక్కసారిగా గాలితీసినబెలూనులాఅయింది.

నిరుత్సాహంగా తమని ఆహ్వానించిన రోజావతిని చూసి తనలోతను నవ్వుకుంది కామాక్షి. ఇంతఅందంగా ఉన్న ఈమెని కాదని తననే పట్టుకుపాకులాడుతున్న డాక్టర్ సిన్సియారిటీకి ఆమె ఎంతో గర్వించింది. కాని అతనిని పెళ్ళి చేసుకోలేని తన పరిస్థితులు జ్ఞాపకంవచ్చేసరికి విపరీతమైన నిరుత్సాహం ఆమెని ఆవరించేసింది.

స్పెషల్‌గా డాక్టర్‌ని ఆహ్వానించటంచేత ఆ పార్టీలో మూడుగురాళ్ళుకూడా కదనుతొక్కినయ్యి. సోడాతో కలిసిన ఆ మిశ్రమాన్ని ఆ ఇద్దరుడాక్టర్లూ హాయిగా త్రాగుతున్నారు. కర్టెసీకోసం మెల్లిగా త్రాగుతోంది కామాక్షి.

ఒకొక్కక్కగుక్కచొప్పునా గొంతుజారుతున్నకొద్దీ ఎక్కడలేని ఉషారూ పుట్టుకొచ్చింది వాళ్ళుముగ్గురికీ. రోజావతిఅందం ద్విగుణీకృతంకాగా కామాక్షి ఆశ్చర్యం త్రిగుణీకృతమయింది. అంతకంటే మరో మహాయుద్ధం ఆమెమనసులో జరుగుతోంది—తను స్త్రీత్వంనుంచి పతనమవటంలేదు గదా అని. త్రాగినంతమాత్రంచేతనే పతనమయితే అంతకన్న నిషాగాఉండే ప్రేమకి ఇదివరకే పతనమయిఉండేదాన్ని- అర్థంలేని ఆలోచనలుగాని, అనుకుని గ్లాసు చేతికి తీసుకుంది కామాక్షి.

మొదటితడవ తాగుడంటే ఎలాఉంటుందో ఇప్పుడే చూస్తున్న కామాక్షి ఎంతో అలవాటున్నదానిలాగా తాగటం చూసి ఈ పిల్ల హృదయాన్ని ఎంత అదుపులో పెట్టగలిగిందా? అని ఆశ్చర్యపడ్డాడు డాక్టర్. "ఇంత హాయిగా ఎలా తాగగలుగుతున్నా"వని ప్రశ్నించాడు.

"ఏముంది? కొంచెం వెగటుగాఉందిగాని పెద్ద బాధేం లేదే!" అని జవాబిచ్చింది కామాక్షి.

"ఏదీ? లేచి రెండడుగులు వేయి, చూద్దాం." అని పరీక్ష పెట్టాడు డాక్టర్.

"మై డియర్ మధూ! అదేమంత పెద్ద కష్టంకాదోయి!" అని లేచి నిలుచుంది కామాక్షి. ఆమెకి ఒళ్ళు తూలిపోతున్నది. సోఫాలో కూర్చున్నంతసేపూ ఏమంత మార్పు కనిపించలేదుగాని, లేచినిలబడగానే ప్రపంచమంతా ఒకసారి గిర్రున తిప్పేసింది. తూలబోయి నిలవరించుకుని చెదిరిపోతున్న ఆలోచనల్నీ, శరీరాన్ని అదుపులోకి తెచ్చుకుని, కొంచెం దూరం నడిచి మళ్ళీవచ్చి సోఫాలో కూర్చుంది. తానయితే ఆమెకి ఏదో మాట్లాడాలనిపిస్తున్నది. ఏం మాట్లాడాలనే ఆలోచన రావటంలేదు. ఏదో ఒకటి మాట్లాడాలి.

"మనం వచ్చేవారం పెళ్ళిచేసుకుందాం మధూ! రోజావతిగారు కామాక్షీమధుసూదనరావు అని అన్న శుభముహూర్తం ఉన్నది చూశావూ! చాలా మంచిది" అన్నది.

డాక్టర్ రోజావతి కూడా తాగేఉన్నది కనుక వెంటనే జవాబిచ్చేసింది. "మీరు అదృష్టవంతులు కామాక్షీగారూ!

అందుకే డాక్టరుగారు మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటున్నారు. నాబోటినిర్భాగ్యులు ఈజీవితంలో పొందలేని అదృష్టమది.”

రోజావతి అన్న మాటలతో డాక్టర్ నిజంగా అంత వాంఛనీయమైన పదార్థమా అనిపించింది కామాక్షికి. డాక్టరువంక చూసింది. మత్తుగా సిగరెట్ తాగుతున్న అతని అందం ఆమెని మరింత ఆకర్షించింది. అర్థంలేని భయాలతో ఇతనిని వృథాగా పోగొట్టుకోటంలేదుగదా అనికూడా అనుకుందామె.

డాక్టర్ మధుసూదనరావుమీద తాగుడు ఎక్కువ పనిచేయదు. అతని మేధస్సు చురుకుగా పనిచేస్తుంది గాని స్తంభించిపోవటంగాని, తప్పుదారినపడటంగాని ఎప్పుడూ జరగదు. కామాక్షిఅన్నమాటతో అతని ఆనందం సముద్రమే అయింది.

“దేవత అనుగ్రహించింది రోజావతిగారూ! నిజం చెప్పాలంటే ఇదంతా మీ చలవే అనాలి'' అన్నాడు రోజావతితో.

రోజావతిమనసులో బాధా, అసూయా బ్రాందీ సోడా కలిపి ఇచ్చిన నిషాకన్న కౄరమైన మరోనిషా నెక్కించినవి. ఏవిధంగా అయినా కామాక్షిని ఏడిపించడమే ఆమె కిప్పుడుకావాలి. “కామాక్షిగారికో, మీకో రెండో పెళ్ళి అన్నారెవరో ?'' అని ప్రశ్నించింది. ఈ ప్రశ్నతో కామాక్షికి ఒళ్లుమండుకువచ్చేసింది.

“మీ క్రిష్టియన్లలాగా మాలో ఆడవాళ్ళు అంత తెగించగు లెండి,'' అని జవాబిచ్చింది. ఆ సమాధానంతో

యాసిడ్ పోసినంత వికృతంగా కమిలిపోయింది రోజావతి ముఖం. కొంచం సేపటికి గుక్క-తిప్పుకుని మా క్రిష్టియన్లలో భర్తచాటుబండారం అరుదులెండి'' అన్నది

ఇక మెదలకుండా ఊరుకుంటే ప్రమాదంకిందికి దిగేట్టుందని గ్రహించిన మధుసూదనరావు కామాక్షిని రెక్క-పట్టుకు లేవదీసి రోజావతికి థేంక్స్ చెప్పి కార్లోకి వెళ్లిపడ్డాడు కామాక్షితో సహా.

''ఆ లేడీడాక్టరుకి ఏమాత్రం బుద్ధిలేదేం? ఏమిటా వాగుడు?'' అని రోషంగా ప్రశ్నించింది కామాక్షి.

''ఆడది మరి''

''అయితే ఇష్టంవచ్చినట్లు పేలటానికి హక్కు-ఉన్నదా? ఇదంతా, మీరిచ్చిన లోకువ. ఆమెకు మీమీద హక్కు-ఏదో ఉన్నది?

''అర్థంలేకుండా మాట్లాడకు. ఇంతకూ మన పెళ్లి నిశ్చయంఅయినట్లేనా?''

''నాన్సెన్స్! మీ ఇద్దరిలో రెండోపెళ్లి ఎవరికి? అంటుందా? పొగరు కాకపోతే.''

''నువ్వుమాత్రం తక్కు-వతిన్నావా ఏమిటి?

''మధ్యలో మీరేమిటి సమర్థిస్తారు? ఈ చెంప కొడితే ఆ చెంప ఇవ్వటానికి నేనేం ఏసుక్రీస్తుచెల్లెల్ని కాను.''

''పోనిస్తూ, కామాక్షీ! ఇంతకూ మన పెళ్లిసంగతి? మీ నాన్నతో చెప్తావా? లేకపోతే రిజిష్టరుమ్యారేజి చాలంటావా?''

''నన్ను ఆలోచించుకోనియ్యండి డాక్టర్''

"నీ బ్రతుకూ నా బ్రతుకూ ఆలోచనతోనే గడిచి పోతున్నది. ఇందాకే అనుకున్నాను అది అసూయచేతా, ఛాందీచేతా వాగినవాగుడని. కామాక్షీ! నేనొకమాట చెప్తా విను. మనం మనకోసమే బ్రతుకుతున్నాంగాని ఇతర్లకోసం బ్రతకటంలేదు. ఆ సంగతి గుర్తుపెట్టుకో...... దిగు, మళ్ళీ మీ నాన్న తలుపుతీసి నా కార్లోరావటం చూడకముందే. ఇంకో సంగతి. నీవు ఇవ్వలేనిదాన్ని ఇతర్లు ఇస్తామన్నప్పుడు అసూయమాత్రం పడబోకు" అని కారు తలుపు తీసి కామాక్షి దిగగానే కారు స్టార్టుచేసి వెళ్ళిపో యాడు డాక్టర్.

కామాక్షి కారుదిగిరావటం మేడమీద కిటికీలోంచి వెంకటపతిగారు చూడనేచూశారు. క్రిందికిదిగి "ఇప్పుడు నువ్వుదిగిన కారు ఎవరిదే అమ్మాయ్?" అని అడిగాడు.

కామాక్షి గదిలోకి పోబోతున్నదల్లా ఆగి తండ్రివంక చూసింది. ఆమెకు ఇంకా కొంచెం మత్తు ఉన్నది.

"నిన్నేనే. నువ్వుదిగినకారు ఎవరిదీ? అని అడుగు తున్నాను." అని తిరిగి ప్రశ్నించాడు."

"నీకొచ్చిన పళ్లు ఎవరికొచ్చాయి నాన్నా! నీకు బుద్ధిఅనేది ఉంటే ఈ ప్రశ్న నన్నడగబోకు! నా ఇష్టం వచ్చినవాళ్ళకార్లో నేను వస్తాను. అడగటానికి నీకేవిధమైన హక్కూ లేదు. తెలిసిందా? ఇక ఇంతటితో ఆపు." అంది కాలునేలకేసికొడుతూ.

వెంకటపతిగారికి కామాక్షి చేత చివాట్లుతినటం అల వాటేగాని ఇంతఘాటుగా ఎప్పుడూ తినలేదు. ఈ డాక్టరు

ఏదో మందోమాకో పెట్టేశాడు. నిక్షేపంగా తన చెప్పు చేతల్లో ఉండే శివరావుని వదులుకుని ఆ స్తినీ, పిల్లనీ కూడా ఆ దౌర్భాగ్యుడిచేతిలో పడవేయటానికి వెంకటపతి అంత చేతకానివాడేం కాదు. తను నోరుజారినసంగతి వెంటనే గ్రహించింది కామాక్షి. ఎంతఅయినా తండ్రిగా.

"అదికాదు నాన్నా! నాకూ ఏళ్ళువచ్చినయ్. చిన్న పిల్ల నేం కాదు. ఏ మొగాడికార్లోనయినా వచ్చినంతమాత్రం చేత నే పాతివ్రత్యభంగమవుతుందనే ధోరణిలో నన్ను పెంచ లేదు నువ్వు. అలాటప్పుడు నువ్వు నన్ను ఇలాటిప్రశ్నలడగ టం ఏమంతమర్యాద చెప్పు. అదీగాక, ఇన్వాళ నా మనసేం బాగా లేదు. అలా అన్నందుకు ఏమీ అనుకోకు" అన్నది.

వెంకటపతిగారి పితృహృదయంలో ఏమూలో మార్దవం కదిలింది. "ఒంట్లో బాగాలేకపోతే డాక్టర్ని పిలవ మన్నావా?" అన్నాడు.

"అక్కరలేదు నాన్నా! ఈ డాక్టర్లని నమ్మకూడదు. శరీరాన్ని కోసినంత తేలిగ్గా మనసుకూడా కోసేయటం వాళ్ల కేమంత కష్టంకాదు. సరేలే. నే పోయి పడుకుంటాను. డాక్టరు రోజానతి ఇంట్లో కొత్త మోతాదుపడింది మనకి." అంటూ గదిలోకి వెళ్ళి తలుపువేసుకొంది కామాక్షి.

వెంకటపతిగారికి కామాక్షి అన్నమాటలు కొంత ఆనందాన్ని కలిగించినయ్యనే చెప్పాలి. డాక్టర్లని ఎప్పుడైతే విమర్శించిందో అప్పుడే కూతురుమనసు విరిగిపోయిఉండ వచ్చనే నమ్మకం కలిగింది ఆయనకి. అదట్లాఉంచి కామాక్షి అన్న ఆ రెండోమాటలోని అంతరార్థమే ఆయనకి బోధ

పడలేదు. రోజావతిఇంట్లోగాని ఈ పిల్లది తాగిరాలేదు గదా! ఆ ఊహ వచ్చేసరికి ఆయనబాధ అంతా మబ్బుపింజల్లా మాయమయిపోయింది సరిగదా, పైపెచ్చు ఆనందంకూడా కలిగింది. తాగిఉంది కనుకనే నన్నుతిట్టింది అని వెంబడే మరోసందేహం. డాక్టరుని విమర్శించటం కూడా తాగిఉండ టంవల్లనేనా? ఆయనముఖం నల్లకప్పేసిపోయింది. కామాక్షి తాగటంవలన పాడైపోతుందేమోననే ఊహ ఆయనకి రానేలేదు.

*   *   *   *   *

తలంటిపోసుకుని జుట్టుఆరడానికిగాను విరబోసుకుంది పార్వతి. ఆమెయెదురుగ్గా చిన్న దేవుడిమందిరం ప్రపంచంలో శాంతికీ, పవిత్రతకీ చిహ్నంగా, నిశ్చలంగా ఉంది. ఆ మందిరంలో రెండు దీపారాధనలమధ్య దుర్గావిగ్రహం "ఓయి మానవుడా! నీ సర్వస్వం నీది కాదయ్యా" అంటున్నట్లు అభయముద్రతో అరమోడ్పుకన్నులతో విశ్వాన్ని శాసిస్తూన్నట్లున్నది. ఇటూ అటూ వెలిగిపోతున్న ఆ ఉజ్జ్వల దీపశిఖలకాంతికి పార్వతినుదుటవున్న కుంకుమబొట్టుకూడా మరో దీపకళికలా మెరుస్తున్నది. పసుపుపచ్చని కంచిపట్టు చీరా, అలాటిదే రవికా ఆమెరంగులో కలిసిపోయి ఆ చుట్టుపక్కల వాతావరణాన్ని సౌందర్యపూరితం చేసినయి. ఆమె చేతులకు ఉన్న బంగారుగాజులూ, ఆమెమెడలో ఉన్న గజ్జెల పట్టెడా, దానికి కొంచెంపైగా ఉన్న నల్లపూసలూ సాంసారికమైన ఆమెనిరాడంబరతా, దుర్గకి దగ్గిరదాన్నిగా చేసినయ్యి.

కొంచందూరంలో ఆమెపాప, చక్కంగా బంగారుబొమ్మలా మెరుస్తున్న ఆ చిన్నారితల్లి గిన్నెలతో ఆడుకుంటోంది.

ఆనందరావు పిల్లిలా లోపలికివచ్చి నిశ్చలంగా ధ్యానముద్రలో ఉన్న పార్వతిని పలకరించటానికి ధైర్యం చాలక బయటికి వెళ్ళిపోయినాడు. ఆయనచేతిలో రాజు వ్రాసిన ఉత్తరం ఉన్నది. కొంచంసేపయినాక రెండుకొబ్బరి ముక్కలు "భర్తకిచ్చి భోజనానికి లేస్తారా"అని చిరునవ్వుతో ప్రశ్నించింది పార్వతి. ఈజీచెయిర్ లో పడుకుని ఏదో ఆలోచిస్తున్న భర్తని చూస్తుంటే పార్వతిలోని మాతృత్వం ద్విగుణీకృతమయినది. విద్యావంతుడూ, నెలకి మూడువందల రూపాయిలు సంపాదిస్తున్నవాడూ, అందగాడూ అయిన ఈ మనిషి ఎంతోఅమాయకుడు. ప్రపంచంలోని చెడు ఏయే రూపాలు ధరించి ఎప్పుడెప్పుడు ఏయే కోణాల్లోంచి బహిర్గత మౌతుందో కూడా యెరగని అతిమంచివాడు. అందుకే ఆయనని చూస్తే ప్రేమతోపాటు జాలీ వేస్తూంది పార్వతికి. తనే గనక అండగాలేకపోతే ఈ మంచి అనే మట్టిగోడను ఎప్పుడో కన్నాలు పెట్టేశేవారు లోకులు.

"మిమ్మల్నే! భోజనానికి లేస్తారా?" అని మళ్ళీ హెచ్చరించింది. ఆ హెచ్చరికకి సమాధానమా అన్నట్లు గబగబాలేచి చేతిలోఉత్తరం పార్వతికిచ్చి పట్టుబట్ట చుట్టుకురావడానికి గదిలోకి వెళ్ళాడు ఆనందరావు.

ఆయన తిరిగివచ్చేసరికి అనుపీటా, అడ్డపీటా వేసి వెండి కంచంలో వేడివేడి అన్నం వడ్డించి పక్కనఉన్న చిన్నప్లేటులో కూరా, పచ్చడీ వేసి ఘుమఘుమలాడుతున్న నేతిగిన్నె

పక్కనిపెట్టి పాపాయికి వెండిగిన్నెలో మెత్తటి అన్నం వాము పోచవేసి కలుపుతున్నది పార్వతి.

భార్య చకచక చూస్తే ఆనందరావుకి అపరిమితమైన గర్వం! "నువ్వే గనుక లేకపోతే నేనేమయిపోవాలి పార్వతీ" అని ప్రతిరోజూ ఒకసారిఅయినా అంటాడాయన. భోజనం చేస్తున్నంతసేపూ పక్కనికూర్చుని కొసరికొసరి వడ్డించే ఇల్లాల్ని చూసుకుంటే ఆయనఆనందానికి అవధే ఉండదు.

"ఏమిటా కలుపుకోటం? ఇంకొంచెం పెద్దముద్ద కలపండి. ఎవరన్నా చూస్తే ఈ పెద్దమనిషి కోతికోసం చేస్తున్న ఎత్తనుకుంటారు" అన్నది పార్వతి చిన్నగోరుముద్ద పాపాయి నోట్లో పెడుతూ.

"రామరామ. ఇంతఅభాండం నామీద ఎవరూ వేయరు. కావలిస్తే ఇంకా ఈ పెద్దమనిషి పెళ్ళాంచెప్పిన మాటకి అడుగుదాటడు అనుకుంటారు గాని" అన్నాడు పార్వతిని ఓరగా చూస్తూ.

"ఓయబ్బ! నామాట పాపాయే వినదు. ఇక మీరేం వింటారు?"

"ఛ ఛ. అలా అనకు. దానికీ నాకూ కూడా నువ్వు అంటే అపరిమితమైన భక్తిశ్రద్ధలు ఉన్నాయి."

"బాగానే ఉంది. కాస్త పెద్దముద్ద కలుపమని చెప్పేది మీకు కాదూ" అని గద్దించింది పార్వతి.

ఆ గద్దింపుతో ఉలిక్కిపడి గబగబా అన్నం కూరా ఏకంచేసి అరగిన్నెడు నెయ్యి వంచుకున్నాడాయన.

"నేతిగిన్నె దగ్గరపెడితే ఇంతేనమ్మా! పాపాయికన్న కనాకష్టం.....చచ్చి స్వర్గానఉన్నారు. మామగారెప్పుడూ అంటూ ఉండేవారు. పెద్దాడికి నెయ్యి ఆట్టేపడదే అమ్మాయ్ అని"

అంటూ స్వర్గీయులైన మామగార్ని తలుచుకుని కళ్లు తుడుచుకుంది పార్వతి. వెంటనే తను కాపరానికివచ్చిన కొత్తరోజులూ, రాజు చిన్నతనం, మామగారి ఆప్యాయత సినిమారీలులాగా ఆమెకళ్ళముందు తిరిగిపోయినయి. వెంటనే తెప్పరిలి,

"అయ్యోరామా! చెపుతుంటే మీరాక్కా..దూ. నెయ్యి అలా వంచేసుకోకండి. కావలిస్తే వెన్నపూసవేస్తాను" అన్నది.

"పటాన్ని మరి!"

"అదుగో అలా చెప్పినమాటవింటే మంచిపిల్లవాడని పించుకుంటారు."

"నే నెప్పుడూ అనిపించుకుంటూనే ఉంటాను."

"అవును. మీరెప్పుడూ అనిపించుకుంటూనే ఉంటారు. అది నా అదృష్టం అన్నది నిట్టూరుస్తూ పార్వతి. కొన్ని క్షణాలకి నిశ్శబ్దం నిద్రలేచింది"

"పార్వతీ"

"ఏమండీ"

"రాజు వ్రాసిన ఉత్తరం చదివావా?"

"చదివాను"

"సినిమా తీసేందుకు కావలసినడబ్బు వీడెక్కడ సంపాదించాడో అర్థంకావటంలేదు"

"అర్థంఅయేందుకు దాంట్లో ఏముందికనుక. పది వేలు చేతిలోఉంటే మిగతాడబ్బు డిస్ట్రిబ్యూటర్లే పెట్టుబడి పెడతారు"

"అంతేనంటావా ?"

"అంతకాకపోతే యెంత ? కాకపోతే ఒకటేబెంగ. చూసిచూసి ఈ లాటరీవ్యాపారంలోకి ఎందుకు దిగుతున్నాడో మరిది అర్థంకావటంలేదు"

"ఇంకోసంగతి. పొద్దున ఎవరోచెప్పారు. శంకరాన్నగారు ఆసినిమాకి అస్టడైరెక్టరట"

"అంటే అన్నపూర్ణభర్తేనా ?"

"అవును కాబోలు."

ఆ సమాధానంతో సంగతంతా అర్థమయిపోయినట్లే అనిపించింది పార్వతికి. అధర్మాన్ని చూసి ధర్మరాజు పడ్డ వ్యథ పార్వతీ పడింది. భర్త భోజనంముగించి చెయి కడుక్కోవటంతో ఆయనకి తమలపాకులూ, బట్టలూ అందివ్వటానికి సావిట్లోకి నడిచింది పార్వతి. అక్కడ ఉయ్యాల బల్లమీద కూర్చున్న కామాక్షిని చూసి "నువ్వెంతసేపయింది వమ్మా ఒచ్చి ?" అని ప్రశ్నించింది.

"నువ్వు బావగార్ని కోప్పడుతున్నప్పుడే వచ్చానక్కయ్యా ! ముందు బావగార్ని బయటికి తోలేసిరా. ఆనక దిగ్గా మాట్లాడుకుందాం" అని కామాక్షి బదులుచెప్ప

టంతో పార్వతి నవ్వుకుంటూ భర్తకి తమలపాకు లిచ్చిరావడానికి గదిలోకి వెళ్లింది.

నిజంగా దాంపత్యజీవితంలో సహజంగానే ఇంతఆనందం ఉన్నదా? లేక ఈ చిన్నస్వర్గం పార్వతిఅక్కయ్య సృష్టించినదా? అన్న సమస్య ఇందాకటినుంచీ కామాక్షిని వేధిస్తున్నది. ఆమె భర్తమీద చూపించే ఆ అధికారం, అమృతమయమయిన ఆ అనురాగం అదంతా నిజమేనా? అదంతా ఆనందమేనా? ఈ ఆనందాన్ని తను చేజేతులా జారవిడుచుకుంటున్నదా? అమాయకుడూ, పసిపిల్లవాడిలాగా ఆమెమీద ఆధారపడ్డవాడూ అయిన భర్త, పడమటింటిలో పనసపండులా దోగాడుతున్న ఆ బంగారుతొనల చిన్నారిబిడ్డా, నిత్యజీవితావసరాలకి కొంచెం ఎక్కువగానే డబ్బూ, చక్కనిఇల్లూ, అంతకంటె చక్కని శరీరమూ, అన్నిటికంటె ఇంకాచక్కనైన మనసూ అన్నీ ఉన్నయ్ పార్వతికి. అదృష్టవంతురాలు.

సత్యవతికూడా పార్వతితోడుకోడలే. ఆమెకీ చక్కని భర్త ఉన్నాడు. ఆమెకీ సౌందర్యమున్నది. ఆమెకీ డబ్బు ఉన్నది. అన్నివిధాలా ఆమెకూడా అదృష్టవంతురాలే. కాని ......ఏమి కాని? కానీ లేదు, అర్ధణా లేదు. ఆమె సుఖపడుతూనే ఉంది. పార్వతీ సుఖపడుతూనే ఉంది. భేదమేమీ కనిపించటంలేదు.

పార్వతి భర్తని పంపించివచ్చి కామాక్షిపక్కనే ఉయ్యాలబల్లమీద కూర్చుంది. ఆ రోజున కామాక్షిముఖంలో ఏదో అపవిత్రత గోచరించింది పార్వతికి. ఇలాంటి అపవిత్రతే

అప్పుడప్పుడు సత్యవతిముఖంలో కూడా కనిపిస్తూఉండేది. ఆ మలినరేఖ ఏమిటో పార్వతికి అంతుబట్టలేదు. కొన్ని క్షణాల తరువాత,

"బావ వెళ్ళిపోయాడా? అక్కయ్యా" అని కామాక్షి ప్రశ్నించింది.

"వెళ్లిపోయారమ్మా! కాని నువ్వేమిటి? ఇలా ఉన్నావు? అని ఆప్యాయంగా పార్వతివేసిన ప్రశ్నకీ, ఆ ప్రశ్నలో ధ్వనించిన ఆప్యాయతకీ కామాక్షికి ఎంతో దుఃఖ మొచ్చింది. ఆ వచ్చిన దుఃఖాన్ని కంఠంలో అదిమిపట్టాలనే ప్రయత్నంలో కృతకృత్యురాలు కాలేకపోగా మరింతవేగంగా ఆదుఃఖం బయటపడ్డది. ఎప్పుడూ నవ్వుతూఉండే కామాక్షి-అరడుగుదూరంలో పిడుగుపడినా ఉలిక్కిపడని కామాక్షి వెక్కివెక్కి ఏడవటం చూసి ఆశ్చర్యపడింది పార్వతి. ఆ మొదటిపొంగు చల్లారినాక "ఏమిటమ్మా?" అని అడిగింది.

గబగబా కళ్లుతుడుచుకుని "ఏం లేదక్కయ్యా! ఎందుకో ఏడవాలనిపించింది. ఏడిచేశాను" అంది తేలికగా నవ్వుతూ కామాక్షి.

"పిచ్చిపిల్లా! అనవసరంగా ఏడుస్తారా ఎవరైనా? ఏదో కారణంఉంటుంది."

"లేదక్కయ్యా! అకాలమేఘాలు అనవసరంగానే వర్షిస్తయ్యి."

"కాని ఆ వర్షానికి మాత్రం కొంత ప్రయోజనం ఉండకపోదు."

"ఉంటుంది. అకారణంగా వర్షించిన ఆ మేఘాలు తమని తాము తేలికపరుచుకోడానికే వర్షిస్తాయి."

"నీకు జవాబుచెప్పటం నాబోటివాళ్ళకి ఎలా చేత నవుతుంది చెప్పు."

"ఏమయినా చేతనయితే ఈ ప్రపంచంలో నువ్వొక్క దానివే జవాబు చెప్పగలవక్కయ్యా!"

"నువ్వివాళ ఏదో తమాషాగా మాట్లాడుతున్నావు కామాక్షీ! ఒంట్లో బాగాలేదా?"

"ఒంట్లో బాగానేఉన్నది. నేనో ప్రశ్న అడుగుతాను. జవాబుచెప్పు."

"ప్రశ్నలు తరువాత అడుగుదువుగాని. ముందు ఓవల్టీన్ కలుపుకొస్తానుండు" అని పార్వతి లేచివెళ్ళింది.

నిజంగా పొద్దుటినుంచీ కామాక్షీ ఏమీ తినలేదు. రాత్రినించి ఆమెమనసు ఖాళీగా శూన్యంగా అయిపోయింది. నీవు ఇవ్వలేనిదాన్ని ఇతరులు ఇస్తామన్నప్పుడు అసూయమాత్రం పడబోకు కామాక్షీ! అన్న డాక్టర్ మాటలు పదేపదే ఆమె చెవుల్లో గింగురుమంటున్నయ్యి. అంటే నువ్వు ఇవ్వలేని దాన్ని రోజావతి ఇస్తున్నప్పుడు అసూయపడటం, అనవసరం అని అర్థంఅయిపోయింది. అంతా అయిపోయింది.

"ఏమయిపోయింది నీమొహం. ఇప్పటికయినా మించి పోయింది లేదు. వెంటనే అతన్ని పెళ్ళిచేసుకో" అన్నది అంతర్వాణి.

"నీకేం తెలియదు అంతర్వాణీ! నువ్విలా నిను షానికోసారి హెచ్చరించడానికి ఇది సినిమా కాదు. జీవితం."

"అందుకే జాగ్రత్త పడమంటున్నాను. అతను మగ వాడు. ఏ విధమైన ఆకర్షణాలేని నిన్ను అతను పెళ్ళిచేసు కోవాలనుకుంటున్నాడంటే అది నీ అదృష్టం. ప్రపంచం నీమీద కొన్ని అభాండాలు వేసింది. అదీగాక నీ తండ్రి మీద నీ జీవితభారాన్ని మోపటం ఓటిపడవలో వడ్లబస్తాలు వేసినట్లు. అయినా అది ధర్మమూ కాదు."

"నువ్వు పలికినపలుకులు చిలకల్లాగానే ఉన్నాయి. కానయితే అతనికి రోజావతిని చేసుకోవాలని ఉందేమో."

"అలాఉంటే నీ వెంబడిపడి ఎందుకు పాకులాడతాడు? అదీగాక నీమొహానికి మళ్ళీ ఇంత అదృష్టం పట్టదు. కనక నా మాటవిని వెంటనే వెళ్ళి ఒప్పేసుకో."

"నా కెందుకో భయంగా ఉంది అంతర్వాణీ!"

"వెధవభయం. నాటకం ఆడబోకు. నువ్వేం అప్స రసవీ కాదు. అసూర్యంపశ్యవీ కాదు. ఉద్యోగం చేస్తున్నావు. ఆపైన నానా అవాకులూ చెవాకులూ వాగ్రిస్తావు. నీ బుకా యింపులు నా దగ్గర బుకాయించబోకు."

"మరి నాన్న?"

"నాన్నకి కావాల్సింది ఆస్తి. అది వ్రాసిఇచ్చేయి. నీవు నీ జీవితాన్ని సుఖప్రదం చేసుకో. అదుగో! పార్వతి వస్తున్నది. ఇక నే వెడతాను."

ఓవల్టీను కలుపుకువస్తున్న పార్వతికి కామాక్షి తనలో తనే మాట్లాడుకుంటున్నట్లు వినిపించింది. ఇవ్వాళ కామాక్షి ప్రవర్తన చాలా చిత్రంగా ఉంది అనుకుంది తనలో.

ఓవన్ట్రీనుత్రాగి కప్పు కిందపెట్టి "నా ఆస్తిఅంతా మా నాన్నపేర పెట్టేస్తాను అక్కయ్యా!" అన్నది కామాక్షి.

"అదేమిటి? నీ ఆస్తి ఆయనపేర పెట్టటం ఎందుకు?"

"నాకు ఆస్తికన్న మనిషివిలువ ఎక్కువ. నాన్నకి మనిషికన్న ఆస్తివిలువ ఎక్కువ."

"అందుకని ఇంతఆస్తి ఆయనపేర పెట్టటంలో అర్థం లేదు. అయినా సంగతేమిటో వివరంగా చెప్పు."

"నాన్న పెద్దవాడు. ఆస్తిలేకపోతే ఎలా బ్రతుకుతాడు చెప్పు?"

"ఇది అర్థంలేనిమాట కామాక్షీ! నీరు పల్లానికి పారటంలోనే న్యాయం ఉన్నది. తల్లితండ్రులఆస్తి పిల్లలు అనుభవించాలి కాని బిడ్డలఆస్తి తల్లితండ్రులు వాడుకోవటం చాలాఘోరం.

"కాని జరగబోయే ఘోరంకన్న ఇదే నయం. ఈ ఆస్తికీ, నా హృదయానికి పోటీపడ్డది. అక్కయ్యా! ఇప్పుడు ఈ రెండిటిలో నాకు ఒకటే మిగులుతుంది."

"రెండూ మిగిలితేనే సుఖపడతావు. మీ నాన్న నువ్వు అనుకుంటున్నంత స్వార్థపరుడని నేను అనుకోటంలేదు. ఏతండ్రిఅయినా ఆస్తికోసం బిడ్డలసౌఖ్యాన్ని బలిపెడతాడంటే నమ్మదగని విషయం. నువ్వు అనవసరంగా ఆయన మీద అభాండాలు మోపుతున్నావు."

"లేదక్కయ్యా"

"ఇక మాట్లాడకు. వెంటనే వెళ్లి డాక్టరుగారిదగ్గర ఒప్పేసుకో. లేదా నన్ను చెప్పమంటే నేనే చెపుతాను."

"ఆ పనిచేయి అక్కయ్యా! నేనిక్కడే పాపను చూస్తూఉంటాను. నీ వొకసారి వెళ్ళిరా. భోజనం చేయ లేదుకదూ. పోనీ చేశాకనే వెళ్ళు."

"అక్కర్లేదు. వచ్చాకే చేస్తాను."

"భోజనంచేసే వెళ్లు అక్కయ్యా! నామీద ఒట్టే"

ఆమాటతో పార్వతి భోజనానికి కూర్చున్నది గాని ఆమెమనసులో మాత్రం ఏదో పోయినట్లే అనిపించింది. గబగబా భోజనం పూర్తిచేసి రిక్షాలో కూర్చున్నతరువాత కూడా ఆమెను ఆభావం అలాగే ఉన్నది.

పార్వతి వెళ్లిన మరుక్షణంనుంచీ కామాక్షికి కొం దరపాటు ఎక్కువగా ఉంది. ఘనుడైన ఆ భూసురు డేనో లేదో అనుకుని బాధపడిన రుక్మిణీదేవికీ, తనకీ పోలిక తెచ్చు కుని నవ్వుకుంది. ఇక్కడ రుక్మిణి తన తండ్రే! ఇంచుమించు డాక్టరుకూడా దక్షిణనాయకుడు కాడు గదా. అలాఅయినప్పుడు మాత్రం తను సత్యభామే అవుతుంది. తన తండ్రినికూడా సమాధానపరిచేభారం పార్వతక్కయ్య భుజస్కంధాల మీదనే ఉన్నది. ఆయనమాత్రం ఏమంటాడు?

ఏమంటాడు ? పరిస్థితులు చెయ్యిజారినతరువాత చేయి జారి పగిలిన అద్దంవంక చూసినట్లు చూసి ఒకనిట్టూర్పు విడవ టంతప్ప ఎవరు చేసేదీ ఏమీలేదు.

తనుకూడా పార్వతిఅక్కయ్య అనుభవిస్తున్నంత సుఖమూ అనుభవించగలదా ? వాకిట్లో పోతున్న ఎవడో "లేదులేదు" అన్నాడు బిగ్గరగా. కామాక్షి ఉలిక్కిపడి వాకి ట్లోకివచ్చి చూసింది. వాడేదో పక్కనున్నవాడితో

మాట్లాడుతున్నాడు. అయినా అంతగట్టిగా చెప్పదన్నా దేమిటి? డాక్టర్ ఈ కబురువిని యెంత ఆనందిస్తాడో. "ఇలాంటివి నీవు చెప్పటానికి సిగ్గనిపించిందా నల్లపిల్లా!" అంటాడు. కలకాలం ఈ సుందరస్వప్నాన్ని కరిగిపోకుండా చేయి ప్రభూ! అని చేతులుమోడ్చింది కామాక్షి. అదే సమయంలో వాకిట్లో బిచ్చగాడెవరో మాయాసంసారం తమ్ముడూ! అని పాటపాడటం మొదలుపెట్టాడు. ఆ పాటప్రభావం కామాక్షిమీద ప్రసరించింది. ఆమె దిగాలుగా వెళ్ళి ఉయ్యాలబల్ల మీద కూర్చుంది.

అదేసమయంలో పార్వతి రిక్షాదిగి ఇంట్లోకి ప్రవేశించింది. కామాక్షి ఆమెమొహాన్ని చదవగలిగింది. అందులో ఆశాదేవిఛాయకూడా లేదు. "ఏం జరిగిందక్కయ్యా" అని ప్రశ్నించింది. ఆ ప్రశ్నతో పార్వతిముఖం మరింత కళావిహీనం కాగా,

"డాక్టరుగారు అరగంటక్రితమే ఏదో ఊరు వెళ్లారట! నెలరోజులదాకా రారని నర్సు చెప్పింది. నువ్వు భోజనం చేయమనకుండాఉంటే ఆయన దొరికేవారు." అన్నది.

ఆ జవాబు కామాక్షిగుండెకి పిరమిడ్ అయింది. కొన్నిక్షణాలు దిగాలుగా కూర్చుని "అవు నక్కయ్యా! ఎప్పుడూ నా చేతులారా నా బ్రతుకుని పాడుచేసుకుంటున్నాను. సరే చాలా సమస్యలు తీరిపోయినయి. వస్తా నక్కయ్యా!" అని దిగాలుగా నడిచివెళ్ళిపోయింది.

తన సర్వస్వమూ ఉన్న పెట్టె సముద్రంలో పారవేసుకుని ప్రాణాలుమాత్రం దక్కించుకుని ఒడ్డుచేరుకున్న ప్రాం

పుడు సముద్రింపంగ ఎలా చూస్తాడో ఆవిధంగా పార్వతివంక చూసింది కామాక్షి. పార్వతికి గుండె చెరువయిపోయింది. ఒక నిట్టూర్పు విడిచి అభాగ్యురాలు అనుకుంది మనసులో.

అలా కొంతదూరం నడిచినతరువాతగాని ఎండ తెలియలేదు కామాక్షికి. అప్పుడు రిక్షా చేయించుకుని ఆఫీసు ముందు దిగింది. ఏమాత్రం ప్రాణంలేని శవం మాంత్రిక శక్తివల్ల నడుస్తున్నట్లుగా ఉన్నది ఆమెనడక. వచ్చి కుర్చీలో కూర్చోగానే శివరావు రెండుకవర్లు ఇచ్చాడు. పత్రికలకి సంబంధించిన ఏదో కాన్ఫరెన్స్.

"మరి రాత్రికే బయలుదేరాలి మనం." అన్నాడు శివరావు.

"రాత్రికా? వెళ్లకపోతే ఏమవుతుంది?" అని అర్థం లేని జవాబిచ్చిన కామాక్షిస్థితి అప్పటికి అర్థం అయింది శివరావుకి. "ఏం జరిగింది? అలా ఉన్నావేం?" అంటూ ఆదుర్దాగా తిరుగుప్రశ్న వేశాడు.

"ఎలా వున్నాను? చాలా హాయిగా వున్నాను. సరేలే రాత్రికి బయలుదేరుదాం, పద. జి.టి.కి రెండుటిక్కెట్లు బుక్ చెయ్యి."

"అది సరేలే కామాక్షీ! ఏం జరిగిందసలు?"

"మంచే జరిగింది."

"జరిగింది మంచే అయితే ఇంక బాధ పడటం దేనికి?"

"ఒకప్పుడు మంచికూడా మందులాగా చేదుగా వుంటుంది."

"ఉపమానాలన్నవి కథల్లోనే వుంటాయి. జీవితంలో మాత్రం మామూలుగా మాట్లాడు. మా తల్లి కదూ ఏం జరిగిందో చెప్పమ్మా." ప్రేమగా, లాలనగా అడిగిన యీ ప్రశ్నకి కామాక్షి తట్టుకోలేకపోయింది.

"రేపు చెపుతాను. ఇక నేను వెడతాను. రాత్రికే వెళదాం. టిక్కట్లు తెప్పించు." అని వెళ్ళిపోయింది.

మెర్‌మెయిడ్, మానవరాజకుమారుడిని ప్రేమించి యిద్దరుపిల్లలు పుట్టినతరువాత నీటిలోకి వెళ్ళిపోతుంది. రాజకుమారుడు ప్రతిరోజూ ఆ చిన్నపిల్లలిద్దర్నీ చెరోచేత్తో నడిపించుకుంటూ వచ్చి సముద్రంఒడ్డున దిగాలుగా నిలబడి పిల్లల్ని అమ్మా! అని పిలవమని చెప్తాడు. పిల్లలు పిలిచీ పిలిచీ విసుకొచ్చి ఆఖరిసారిగా అమ్మా అని ఒక కేక పెట్టి తండ్రివంక చూస్తారు అప్పుడు ఆ తండ్రిమొహం బహుశా యిప్పుడు శివరావు మొగంలాగానే వుండి వుంటుంది.

* * * * *

ఆ కాన్ఫరెన్స్ గొడవ తేలిపోయినాక శివరావూ, కామాక్షీ పబ్లిక్ గార్డెన్‌కి వచ్చి కూర్చున్నారు. నీళ్లుచల్లిన పచ్చని ఆ పచ్చికనుంచి చిక్కని వాసనలేవో వస్తున్నాయి.

"మనం కలిసి పనిచేస్తున్నాం కామాక్షీ! కనీసం నీ దగ్గిర స్నేహితుడుగా భావించిఅయినా నాతో చెప్పకూడదా?" అని ప్రశ్నించాడు శివరావు.

ఎదురుగుండా ఫౌంటెన్‌లోంచి ఎగిరి దూకతున్న ఆ సన్నిటి నీటిజల్లులు రక్తధారలు కాకూడదా ? అలాఅయితే

యెలావుంటుంది ? అనిపించింది ఆమెకి. "అలా అయితే ఎలా వుంటుందని" శివరావుని అడిగేసింది కూడా.

"ఈప్రశ్న ఫ్రాయిడ్‌నిగాని, మాఘమ్‌ని గాని చలాన్ని గాని వేయాల్సిన ప్రశ్న. ఇంతకూ జరిగిందేమిటి ॥"

"ఏముంది ? డాక్టరుగారు వెళ్ళిపోయినారు."

"ఏదో పనిమీద వెళుతున్నాను. నెలరోజులదాకా రానని నిన్న నాకన్నిపించిచెప్పాడు."

"నన్నుతప్పించుకోటానికే అతనట్లావెళ్ళిపోయినాడు."

"అర్థంలేకుండా మాట్లాడకు కామాక్షీ! అందువల్ల ఆయనకేం ప్రయోజనం ?"

"అతనెన్నంత ప్రేమిస్తున్నానో అతను వెళ్లిపోయినాక గాని, నాకు తెలియలేదు."

"ఇప్పు డుమున్నూతం యేం మునిగిపోయింది ? ఆయన నెలలో తిరిగివస్తారుగదా !"

"కాని యీ నెలలోపలా నే నేమయిపోతానో అని భయంగా వున్నది ... నా కేనో కావాలనిపిస్తున్నది."

"ఇప్పటికి స్త్రీలాగా మాట్లాడావు. నీకు తెలియదు కామాక్షీ ! మనలో మానసికమైన ప్రేమే కాదు. దైహికమైన వాంఛలుకూడా వుంటయ్యి. అవిలేవని మనని మనం భ్రమపెట్టుకోనటం అంతమంచిదీకాదు, న్యాయమూకాదు."

"నేను అలాయెప్పుడూ నన్ను నేను భ్రమపెట్టుకోలేను. కాని తెగించలేకపోయానంతే."

"అసహజంగా బ్రతకటంవల్ల వచ్చే తిప్పలే యివి. ప్రేమలేనిచోట దైహికసంబంధం వుండవచ్చునుగాని దైహిక సంబంధం లేకుండా ప్రేమవుండదు."

"పుష్పాన్ని విడిచి పరిమళం వుండనట్లు."

"ఎగ్జాట్లీ. ఇప్పుడు నీకు డాక్టర్ పరోక్షంలో వుండటం చేత పదిబెట్టి హెచ్చువేయబడిన ప్రేమ ఉద్రేకంగా మారి ఫౌంటెన్‌లోని నీరు రక్తంగా మారాలనిపిస్తున్నది."

"అంతేనంటావా ? శివరావు !"

"అంతే మరి కామాక్షమ్మా !"

"ఇప్పుడేం చేయాలి ?"

ఆ ప్రశ్నతో శివరావు గతుక్కుమన్నాడు. అతనిమధ్య అనుకోకుండానే కామాక్షిని యిష్టపడుతున్నాడు. ఆమెను మొదట్లో పెళ్లిచేసుకోకుండా పొరపాటు చేశానని కూడా ఈ మధ్య రెండుమూడుసార్లనిపించింది. ఇప్పుడు కామాక్షి ఈ ప్రశ్న వేయగానే అతనికి అదంతా జ్ఞాపకం వచ్చింది.

"ఇప్పుడేం చేయాలి మరి ?" కామాక్షి మళ్లీ రెట్టించింది"

శివరావు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావుకదూ?" తిరిగి ప్రశ్నించిందామె. శివరావు మాట్లాడలేదు.

"వద్దు శివరావు ! మనం స్నేహితులుగానే వుండిపోదాం."

"నీనుంచి అంతకన్న నేనేం ఆశించటంలేదు. కామాక్షీ."

"మరి యిప్పుడేగా అన్నావు. దైహికసంబంధం వున్న చోట ప్రేమ వుండకపోవచ్చును గాని ప్రేమవున్నచోట దైహికసంబంధం వుండి తీరుతుందని. మరి ..."

"కొన్నివిషయాల్ని గురించి ప్రశ్నించటమూ, వాటికి జవాబు పొందాలనుకోవటమూ ఉత్తభ్రమా, తెలివితక్కువా కామాక్షీ! ఇప్పుడు నువ్వు అడిగిన ప్రశ్నకి నేను సరియైన సమాధానం ఇస్తే నువ్వు భరించలేవు."

శివరావు అంత స్పష్టంగా జవాబిచ్చినా కామాక్షికి అర్థంకాలేదు. ఆమెకు కలిగిన ఆశాభంగమూ, ఆ వాతావరణమూ ఆమెని విచిత్రమయిన మానసికస్థితిలో పెట్టేసినయి.

"చెప్పు శివరావు, నేనేమీ అనుకోను."

"నాకా దైహికమయిన వాంఛ లేదని నువ్వు ఎలా అనుకోగలవు?" మెల్లిగా శివరావు యిచ్చిన యీ సమాధానానికి కామాక్షి యేమీ వులిక్కిపడలేదు సరిగదా,

"అయితే యిన్నాళ్లనుంచీ నిగ్రహించుకుంటున్నావన్న మాట" అని మరోప్రశ్న వేసింది.

"కొన్ని విషయాల్ని గురించి మరీఅంత నగ్నంగా ప్రశ్నించటం అంతమంచిపనికాదు."

"చెప్పు శివరావు, ఫరవాలేదు. కనీసం యీ రెండు రోజులైనా మనం మనసువిప్పి మాట్లాడుకుందాం. నీవు సునందనని ప్రేమించి పెళ్ళిచేసుకున్నావు. మళ్ళీ ఇప్పుడు నన్నెలా ప్రేమించగలుగుతున్నావు?"

"నాకు తెలియదు."

"నీకు తెలుసు. తెలియకపోతే నేను కారణం చెప్తా విను. నువ్వు మగవాడివి."

"బొత్తిగా అర్థంలేకుండా మాట్లాడుతున్నావు కామాక్షీ! దైహిక వాంఛ అనేది చాలా విచిత్రమైనది. ఒంటరితనమూ, వాతావరణమూ మనిషిని ప్రలోభపెట్టేస్తయ్యి. సరే, అదలా వుండనీ. ఇప్పుడీ ప్రసంగం యింతటితో ఆపేయటం మనిద్దరికీ కూడా చాలా మంచిది.

"ఉండు శివరావు! నన్నిలా నిముషనిముషానికీ భయపెట్టటానికి ప్రయత్నించకు. ఇందాక మనిద్దరం కలిసి కాఫీ తాగి వచ్చాం. అలాగే..."

"అలా మాట్లాడకు కామాక్షీ! నా ప్రాణం నిలువునా తీసెయ్యబోకు. అయినా నీకేమొచ్చింది. ఇవాళ ఇలా మాట్లాడుతున్నావు?"

"నేను ఊరికే అడుగుతున్నాను. మనం స్నేహితులుగానే వుండిపోదాం. భయపడకు."

"నాకోసం నేను భయపడటం లేను. నీకోసమే నేను భయపడుతున్నాను."

"నాకోసం భయపడేవాడివీ, బాధపడేవాడివీ యీ ప్రపంచంలో నీవొక్కడివన్నా వున్నావు. నాకంతే చాలు."

"కొన్నికొన్ని చాలా విచిత్రంగా వుంటాయి. ఈ మధ్య ఒక నవల చదివాను అందులో నాయిక అన్ని విధాలా గొప్పవాడైన ఒకడిని ప్రేమిస్తుంది. ఆ పిల్లని మాంత్రికుడొకడు తన మంత్రశక్తిచేత ఆకర్షించి పాడు చేస్తాడు. అతన్ని అసహ్యించుకుంటూనే, తిడుతూనే ప్రతి

సాయంత్రం అతనిదగ్గరికి పరుగెత్తుతుంది ఆ పిల్ల. దైహిక వాంఛ కూడా ఆ మాంత్రికుడిలాటిదే.''

"అంటే ?''

"అంటేలేదు గింటేలేదు. పద పోదాం.''

పైన వెన్నెల కాస్తున్నది. లైట్లకాంతీ వెన్నెలకాంతీ కలిసి ఒక చిత్రమైన వెలుగు నిస్తున్నయ్యి. అందమైన ఆ గార్డెన్ వీధులకుండా వాళ్ళిద్దరూ మౌనంగా నడుస్తున్నారు. దూరంనించి ఒకపాట సన్నగా గాలి అలలమీద తేలి తేలి మంచిగంధపు పరిమళం లాగా తాకుతోంది. శివరావు హఠాత్తుగా ఆగి "నిజంగా నిన్ను ప్రేమిస్తున్నాను.'' అని తిరిగి నడపటం ప్రారంభించాడు. కామాక్షి నవ్వి, "ఈ సంగతి చాలాసార్లు చెప్పావు'' అన్నది. "అదికాదు; అదికాదు.'' అని ఖంగారుపడ్డా డతను.

"నాకు తెలుసులే. అట్టే ఖంగారుపడకు. అయినా ఈ మాత్రంలో పోయిందేముంది ?''

"అనవసరంగా నన్ను బాధపెట్టకు కామాక్షీ ! నువ్వు ముందు నడు, చెప్తాను.''

"ఏదన్నా బారులో దూరదామా ?''

"నాకేమీ అభ్యంతరంలేదు. కాని అది అంత భావ్యంగా ఉండదనుకుంటాను.''

"ఈ ప్రపంచంలో నీలాంటివాళ్లకి అభ్యంతరాలు అట్టే ఉండవుగాని భావ్యంగా ఉండదని మానేస్తారు. అవునా ?''

"మనం నాగరికులమై సాంఘికజీవితాన్ని నిర్మించుకున్న మానవులం. అడవిలో జీవిస్తుంటే నీవు అన్నట్లే అభ్యంతరాలు ఉండవు."

"మనం కాసేపు యీ మహానగరంలో అడవివాతావరణాన్ని నిర్మించుకోగల మనుకుంటాను."

"నువ్వనేది ఏమిటి కామాక్షీ?"

"ఏం లేదులే. అంతగా ఆశ్చర్యపడకు. దారి తప్పినట్లున్నామే?"

"ఫరవాలేదులే. ఎక్కడ దారితప్పితే అక్కడ [illegible] యెక్కుదాం. అవును. కొద్దిగా దారితప్పినట్లు ఉన్నాం."

"దారితప్పితే సవ్యమైన మార్గానికి దిక్కుమాలినవాళ్ళు చేరేస్తారులే."

"అయితే మార్గం దారితప్పటం అస్సలు మంచిపని కాదు."

"కాని అప్పుడప్పుడిలా దారితప్పటం మంచిదే. లేకపోతే జీవితం మరీ నెగటేసిపోతుంది."

"ఇవ్వాళ నీకేదో పుట్టింది కామాక్షీ!"

"ఏం లేదు శివరావు! దారితప్పాలని సరదాగా ఉంది అంతే."

"సరదాకోసం దారితప్పటం శుద్ధ తెలివితక్కువ."

"కాదు, సవ్యమైన దారిగుండా నడిచాను కాని గమ్యస్థానం చేరలేకపోయినాను."

"కనీసం ఉన్నచోటనైనా ఉన్నావు. దారితప్పితే అధోగతే."

"ఈ ఊకదంపుడునీతులు చెప్పటం కాసేపు మానేయి బాబూ ! నీకు పుణ్యం ఉంటుంది."

"పూర్తిగా దారితప్పివచ్చినట్లున్నాం. రిక్షాని కేక వేయనా?"

"కేక వెయ్యి" అన్నది కామాక్షి.

"ఇక్కడ ఒక రిక్షాయే ఉన్నదే?"

"ఇంతలో నా పవిత్రత కేం భంగం రాదులే. పిలువు !"

కామాక్షిపక్కన ఇరుకురిక్షాలో కూర్చున్న శివరావుకి నరాలతో యుద్ధం ప్రారంభం అయింది. అతను పడుతున్న అవస్థ ఆమె గ్రహించింది.

"బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" అన్నది.

"అంటె నాకు తెలియటం లేదు."

కామాక్షి జవాబు ఇవ్వలేదు.

"నువ్వు చెప్పకపోతే నాకు యెలా తెలుస్తుంది?"

"ఇందాకటినుంచీ నేను వాగాను కాని ఉద్రేకపడ లేదు. ఇప్పుడు నువ్వు... ?"

"నన్ను క్షమించు కామాక్షీ! అదుగో మరోరిక్షా. అందులో యెక్కుతాను."

"అక్కర్లేదులే, కూర్చో. ఇంతలో మునేమీ కొంప మునగదు."

"నీవు చాలా విచిత్రవ్యక్తివి. అదే నీలో ఆకర్షణ. నాకు నీ స్నేహాంతప్ప మరోదానిమీద వాంఛలేదు కామాక్షీ! కాని మానవమాత్రుడిని చూడు..."

"నీలాంటి వ్యక్తిత్వంకూడా అందరికీ ఉండదు శివరావు! అందుకే నువ్వంటే నాకు చాలా యిష్టం."

"తెలివితక్కువగా నిన్ను పోగొట్టుకున్నాను.

"నన్ను పోగొట్టుకున్నానని నీవు విచారించాల్సిన ఆధిక్యత నాలో లేదు."

"శాక్త గుగాను అదృష్టసంతులు."

"సర్లే. కొంచం రిక్షా త్వరగా పోనిమ్మని చెప్పు. రైలు వెళ్ళిపోతున్నది."

"ఫరవాలేదు. ఇంకా టైముంది. మళ్ళీ ఇదే రిక్షాలో వచ్చేద్దాం."

* * * * *

రైలులో కూడా చోటు లేక పోవటం వలన యిద్దరూ ఆనుకునే కూర్చోవాల్సి వచ్చింది. నాంపల్లిలో బయలుదేరిన ఆ ఫాస్ట్‌ప్యాసింజరు కాలాన్ని వెనక్కుతోస్తూ భవిష్యత్‌ని చీల్చుకుంటూ పోతున్నది.

"నువ్వు కొంచంసేపు నిద్రపో కామాక్షీ!"

"ఎలాగోయ్ పడుకోటం? ఈ యిరుకులో నావల్ల కాదు."

"కాస్త చెప్పినమాట విను మరి! నా తల్లికదూ."

కామాక్షికి పడక కుదరలేదు. మళ్ళీ లేచి కూర్చున్నది. శివరావు ప్రశ్నార్థకంగా ఆమెవంక చూశాడు.

"ఈ ప్రయాణంలో పొందగలిగిందేమిటో, పోగొట్టుకున్నదేమిటో అర్థంకావటం లేదు." అన్నది.

"నేనుమాత్రం యెంతో పొందాననుకుంటాను కామాక్షీ!"

"ఏం పొందగలిగావు? అమూల్యమయిన నీ హృదయాన్ని నాకిచ్చి నానుంచి తిరిగి ఏమీ పొందలేకపోయినావు."

"నాకు కావల్సింది నీ స్నేహంగాని దేహంకాదు."

"ఈమాటమీదనే శాశ్వతంగా ఉండాలంటే అది మహాత్ములకి తప్ప మానవులకి సాధ్యంకాదు."

"ప్రయత్నిస్తాను కామాక్షీ!" అని జవాబుచెప్పాడు శివరావు. సీటుఅంచుమీదనుంచి కామాక్షి వెనగ్గా ఉన్న అతనిచేయి అప్రయత్నంగా ఆమెభుజాన్ని తాకింది. అది గమనించనట్లు కూర్చుందిగాని కామాక్షిహృదయంలో అగ్నిపర్వతాలు మండుతున్నయ్యి. శరీరం ఎదురుతిరుగుతున్నది.

కొంచం సేపయినాక ఇకఊరుకోలేక "దీనివల్ల ప్రయోజనం లేదు" అన్నది.

"ఇంతకన్న ప్రయోజనం నా కక్కరలేదు. ఈమాత్రం చాలు" అన్నాడు.

అతనిచేయి యాంత్రికంగా ఆమెనడుముని చుట్టింది. నిజం చెప్పాలంటే ఆ స్పర్శ ఆమెకి ఆనందాన్ని కలిగించిందనే చెప్పాలి. ఇద్దరూ సంస్కారం ఉన్నవాళ్ళు. తమరికేం కావాలో ఆలోచించకల శక్తికల వాళ్లూనూ. అయినా కూడా ఆ పరిస్థితి వాళ్ళని మార్చివేసింది. అతనిచేయి అనుకోకుండా నొక్కిపట్టిందామె. తన నడుముకీ, చేతికీ మధ్య ఉన్న అతనిచేయి ఆమెకి ఆశనీ, విశ్వాసాన్ని కలిగించింది.

"చెయ్యి తియ్యనియ్యి కామాక్షి! నీచేయి ఇలా ఇయ్యి. నాకు అంతమాత్రం చాలు."

"చాలుతుందా?"

"చాలకపోయినా చేసేదేమీ లేదు."

"నీచేయి పట్టుకుంటే మనస్సుకి చాలా శాంతిగా ఉంది. కాని..."

"నేనూ ఓడిపోయేలాగా ఉన్నాను. కామాక్షీ!"

"నిగ్రహం అనేది మాటలుగాదు శివరావు! స్త్రీ పురుషుల మధ్య స్నేహం చివరకి అక్కడికే దారితీస్తుంది. అందుకే అన్నాచెల్లెళ్ళయినా దూరంగా ఉండాలని పెద్దలంటారు."

"నీవు చాలా నిగ్రహంగా ఉండగలవు."

"అని అనుకుంటున్నావు. దేహం నన్నూ లొంగ దీసుకుంటోంది. ఇంకొంచెంసేపు ఇలాఉంటే నేనూ ఓడిపోతాను."

అతనిచేయి ఆమెనడుమునీ, భుజాన్నీ తాకటం మానలేదు. ఆ కించిత్తు స్పర్శానందాన్ని వదులుకోవటం ఆ ఇద్దర్లో ఎవరికీ ఇష్టంలేదు. అతను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఆమె డాక్టర్ని ప్రాణప్రదంగా ప్రేమిస్తోంది. కాని దేహంఇచ్చే స్పర్శానందాన్ని వారిద్దరూ స్త్రీ పురుషులుగా పొందుతూనే ఉన్నారు.

అతనిచేయి తన నడుముని కాల్చివేస్తున్నది.

"మనం ఒంటరిగా ప్రయాణంచేయటం పొరపాటయింది." అన్నాడు శివరావు.

"అలా అనకు. ఈ ప్రయాణంలో నేను చాలా తెలుసుకున్నా. బ్రతుకు అనేది చాలా సుదీర్ఘమయిన ప్రయాణమనీ, ఆ ప్రయాణంలో మనకి కనిపించే చూపు మేర దూరంమాత్రమే ప్రపంచం కాదని, ఇంకా తెలుసుకోవాల్సింది ఎంతో ఉందనీ తెలుసుకున్నాను."

"అవును కామాక్షీ! ఈ ప్రేమలూ, వాంఛలూ అన్నీ ఉత్తఅర్థంలేనివి. ఈ నాడు మనం చాలా సన్నిహితంగా ఉన్నాం. మనంకావాలనుకుంటే ఇంకా సన్నిహితంగా కూడా ఉండగలం. రేపు ఆఫీసులో మళ్లీ మనిద్దరం మామూలుగా అయిపోతాం".

"ఎంతమామూలుగా అయిపోయినా పూర్వంకన్న సన్నిహితులుగానే ఉంటాం శివరావు!,"

శివరావు ఆమెనడుముమీదనుంచి చెయ్యి తీసివేశాడు. ఆమెకి ఆ చెయ్యి అలాఉండటమే బాగుంది. మెల్లిగా అతని చెయ్యి తనచేతిలోకి తీసుకుంది.

"పరీక్షిస్తున్నావా?"

"లేదు. నన్ను నేను పరీక్షించుకుంటున్నాను."

"ఇదే నేనూ రాజూ అయితే ఇంత ఉద్రేకపడం. మనం స్నేహితులమే కానచ్చు. అయినా స్త్రీ పురుషులం. దేహాలు నాటి నైజాన్ని అవి పోనిచ్చుకోనటంలేదు" అన్నాడు శివరావు.

"స్నేహంఅనేది స్త్రీపురుషులమధ్య పవిత్రంగా ఉండదనే నీ అభిప్రాయమా?"

"చాలామటుకు అంతే కామాక్షీ! ఇప్పుడు మన ఇద్దరిస్థితీ చూడు. ఇది రైలుపెట్టె అయింది కాని అదే ఇల్లు అయితే మనం తప్పకుండా పతనంఅయి వుండేవాళ్ళం."

"దాన్ని పతనం అనక తప్పదా?"

"ఇంకోమాట లేదుమరి."

కామాక్షికి అతనిస్పర్శ చాలా దుస్సహంగా ఉంది. ఇన్నాళ్ళుగడిచింతరువాత ఈ రైలుపెట్టిలో తన కీ అగ్నిపరీక్ష ఏమిటి?

ఎందుకో అకారణంగా ఆమెకు దుఃఖంవచ్చింది. ఇప్పుడు తనేం చేయాలి? ఎలా ఇది తట్టుకోవాలి? అతని వేళ్ల అంచులు ఆమెనడుంమీద కాలిన ఇనపకడ్డీలలాగా బాధిస్తున్నయి.

అతనుకూడా ఆమెనడుంమీదనుంచి చెయ్యి తీసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. కాని ఆ పని అసాధ్యంగా ఉంది. నున్నగా వేడిగా వున్న ఆమెనడుం అతనివేళ్లని కాల్చి వేస్తున్నది.

"మనం చూసే పరిధులూ, మనం ఊహించుకునే పరిస్థితులూ చాలా సంకుచితమైనవి కామాక్షీ! మనకి తెలియనిదీ, మనం తెలుసుకోలేనిదీ ఇంకా ఎంతో ఉన్నది" అన్నాడు శివరావు.

"అవును. ఎప్పుడేవిధంగా జరుగుతుందో, ఈ హృదయాలు ఎప్పుడేవిధంగా మారిపోతాయో కూడా అర్థంకాని విషయాల్లో ఒకటి. అయితే అలా మారటం తప్పా? కాదా? అన్నది సమస్య."

"తప్పుకీ, ఒప్పుకీ మార్జిన్ ఎక్కడ ?"

"మానవుడు నియంత అయి తప్పులకీ, ఒప్పులకీ కొన్ని మార్జిన్స్ ఏర్పరుచుకున్నాడు. కాని చిత్రం ఏమి టంటే, ఏ మార్జిన్ అయినా కూడా పరిస్థితుల్నిపట్టి అతిక్ర మించబడుతూనే ఉంది."

"అలాటప్పుడు తప్పుఅనేది ఉత్తరూక అని అదేమా ర్గంలో నడనటానికి ప్రయత్నిస్తే ఏం జరుగుతుందంటావు కామాక్షీ."

"ఏమీ జరగదు శివరావు! సూర్యుడు ఉదయిస్తూనే ఉంటాడు. గాలి వీస్తూనే ఉంటుంది. కాకపోతే చిన్న చిన్న ఎదురుదెబ్బలు తగులుతాయి."

"నీవు వ్రాస్తావు. ఆ వ్రాసేవాత్రల్లో నీవు నమ్మి వ్రాసేది ఏదన్నా ఉందా ?"

"అలా సూటిగా అడిగితే నేనేమీ చెప్పలేను. అసలు ఏ రచయితఅయినా చూసింది వ్రాస్తాడు గాని నమ్మింది వ్రాయడు."

"అంతే నంటావా ?"

"అంతే శివరావు! నేను మొన్న స్త్రీ పవిత్రతని గురించి సుదీర్ఘమైన వ్యాసాన్ని వ్రాశాను. కాని ఇప్పుడీ జరుగుతున్న దేమిటి చెప్పు ?"

"జరుగకూడనిదేదో జరుగుతున్నదనికాని, జరుగు తుందనిగాని నీవు భయపడొద్దు కామాక్షీ! కొన్నిగంటలు గడిచినతరువాత మనిద్దరం మామూలు మనుష్యులమయి పోతాం."

కొన్ని క్షణాలు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉన్నారు. తన చేతిలో ఉన్న అతని చేతిని కచ్చగా నొక్కి విదిలించేసింది ఆమె.

"కొంచం సేపు నువ్వు నిద్రపో కామాక్షీ.?" అని అవతల బెంచీమీద కూర్చున్నాడు శివరావు.

ఆమెకి నిద్రపట్టలేదు. అరేబియన్ నైట్స్‌లో రాక్షసుడిజుట్టులా గజిబిజిగా ఉన్నాయి ఆమె ఆలోచనలు.

ఈ జీవితానికి గమ్యం ఏమిటి? అర్థంకాని పైశాచిక భాషలో లిఖించిన ఈ జీవనకావ్యంలో మొదటిపేజీ తిప్పుకునేందుకే తనకి ఇన్ని సంవత్సరాలు పట్టింది. తీరా ఇన్నాళ్ళకి తనుచదివితే అందులో ఏమీ కొత్తవిషయం కనుపించలేదు. అంతా మామూలే.

రైలు భయంకరంగా గర్జించింది. చీకటితెర జారిపోయి వెన్నెల వచ్చేసింది. ఆ దక్కనుపీఠభూమిమీద లోయలలోనూ, కొండలమీదా పడి తనని తను వ్యర్థంచేసుకుంటున్నది వెన్నెల. కామాక్షిని ఆలోచనలు ముళ్ళపొదల్లాగా చికాకు పెడుతున్నాయి.

ఈ బ్రతుకు మరీఇంత బరువైపోయిందేమిటి? శాంతి ఇక కనిపించదా? ఆ కనిపించకపోవటం చాలా అపరిధాసమైంది. ఎలాంటి బాధనయినా కాలంపాడే జోలపాటలో మునిగిపోయి మర్చిపోతాడు మానవుడు. తనుకూడా అలాగే మర్చిపోగలుగుతుందా? అది అంత అసాధ్యం కాదేమో! ఎందుకంటే ప్రస్తుతం తనని బాధపెడుతున్న సమస్య నీరు కనుక.

రైలు వేగాన్ని అందుకుంది. కామాక్షికి కలతనిద్ర పట్టింది.

*　　　*　　　*　　　*

మద్రాసునగరంలో ధనం ఉన్నవాళ్ళు పొందగలిగిన అన్ని సుఖాలూ అనుభవంలోకివచ్చినా కూడా శంకరావు గారి మనసు మంగళగిరి నరసింహుడి మీదనే ఉన్నది. ఆయన వేస్తున్న స్కెచెస్ ఫిలింఫీల్డులో హేమాహేమీల ప్రశంసల్ని అందుకుంటున్నాయి. ఒక్క రాజుపిక్చర్‌లోనే కాకుండా ఇంకో రెండుమూడుపిక్చర్లలో కూడా బుక్ అయినాడు. అయినా ఊపిరిపీల్చనివ్వని ఈ జీవితం ఆయనకి ఏమాత్రం శాంతి నివ్వటంలేదు.

అన్నపూర్ణమాత్రం ఈ జీవితానికి అలవాటుపడటమే కాకుండా అత్యంతమైన ఆనందాన్ని అనుభవిస్తున్నది. రాజుకీ, ఆమెకీ మధ్య సాన్నిహిత్యం కొంచెం ఎక్కువయింది. డబ్బు ఇవ్వగలిగిన సుఖాలన్నిటినీ ఆమె పొందగలుగుతోంది.

సత్యవతికూడా అంతేస్థితిలో ఉందని చెప్పవచ్చును. ఆమెపాడిన రెండుమూడుపాటలూ రికార్డింగ్ అయాయి. చాలా బాగున్నాయి కూడా. పగలల్లా స్టూడియోవాతావరణంలో హాయిగా గడపటం, రాత్రి అయేసరికి తాగి నిద్రపోవటం తప్ప మరోవిధమైన ఆలోచనలూ, దిగుళ్ళూ ఆమెకి లేవు. ఇప్పుడామె శర్మఇంట్లో రహస్యంగా తాగటంలేదు. రాజు ఆమెని ఏవిధంగానూ అభ్యంతరపెట్టటం లేదు. స్వర్గ సమానమయిన ఈ జీవితానికి అవతల మరోలోకం ఉందన్న మాటే ఆమె మర్చిపోయింది. శర్మ ఇప్పుడూ సత్యవతిని ఆశ్చ

కలవటంలేదు. ఆమెకూ, తనకూ చాలాదూరం ఉన్నది. ఇప్పుడు తను ఆమెకంపెనీలో డబ్బుతీసుకుని పనిచేస్తున్న ఆర్టిస్టు. ఇదివరకు ఆమెజీవితంలో తను చాలా దగ్గరగా రాగలిగాను నిజమే

సముద్రంలో పడవలు రెండు అలలతాకిడిక దగ్గరగా వచ్చినట్లే వచ్చి మరుక్షణంలో దూరం అయిపోతాయి. తనూ, సత్యవతీ కూడా అలాగే అయిపోతున్నారు. అయిపో తున్నారేమిటి? అయిపోయినారనే చెప్పాలి.

అయినా నిషిద్ధప్రేమలకి ఈ లోకంలో స్థానం లేదు. చిత్రం ఏమిటంటే అంతమాత్రంచేత అవి ఆగిపోనూలేవు. తను ఏ సత్యవతిని చూడటానికి బ్రహ్మప్రయత్నంచేసి ఎడారి పువ్వులు నాటకంవంకతో విజయవాడ వెళ్ళాడో ఆ సత్యవతి ఈ సత్యవతికాదు. ఈ సత్యవతి లక్షాధికారిణి. ఇప్పుడు ఆమెకీ, తనకీ దూరం కొన్ని యోజనాలు.

ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తున్న శర్మ శంకరావు గారు రావటం చూడలేదు.

"ఏమిటి శర్మగారూ! అంతగా ఆలోచిస్తున్నారు?" అని పలకరించారు శంకరావుగారు.

"ఏం లేదండీ! మీ పని అయిపోయిందా? ఇంటికి కెడుతున్నారు లాగుంది?"

"ఇల్లు......ఇల్లు ఇల్లనియేవు, ఇల్లు నాదనియేవు, నీఇల్లు ఎక్కడే చిలుకా? అని నా చిన్నప్పుడు ఓ దాసరి పాడుతూ ఉండేవాడు. అలాగే మనం ఎక్కడుంటే అదే ఇల్లు శర్మగారూ."

"మీరు చక్కని బొమ్మలు ఎలా వేస్తారో, చక్కని మాటలుకూడా అలాగే మాట్లాడతారు. ఇంతకూ ఇప్పుడు ఇంటికి వెళ్ళటం లేదంటారు. అయితే పదండి. ఇద్దరం కాసేపు బీచిలో కూర్చుని వద్దాం" అన్నాడు శర్మ.

"అసలు భగవంతుడిలాంటి చిత్రకారుడు లేడు శర్మ గారూ! ఆ సముద్రాన్ని ఎలా చిత్రించగలిగాడో" అని బీచిలో కూర్చున్నతరువాత శంకరావుగారు అన్నారు. శర్మకూడా ఆ సముద్రంతాలూకు గాంభీర్యాన్ని చిత్రించాలంటే ఎలా? అని ఆలోచిస్తున్నాడు.

"కళలు అనేవి భగవంతుడిని చేరటానికి దగ్గరమార్గాలుగా ఉండేవి ఒకప్పుడు. ఇప్పుడు కళాకారులతోపాటు కళలుకూడా భ్రష్టమైపోయినయి శర్మగారూ."

"మీరు నన్ను శర్మగారూ అనక్కరలేదు. శర్మా అంటే చాలు. పెద్దవారు మీరు అలా అంటుంటే నాకు సిగ్గుగా ఉంది."

"నాకూ అనాలని లేదు. నా పెద్దకొడుకు సరిగ్గా నీ ఈడువాడే......సరే. అదలా ఉండనీ. ఇప్పుడీ సినిమా పూర్తి కావటానికి ఇంకా ఎన్నాళ్ళు పడుతుందో చెప్పగలవా?"

"అదేమిటి? అలా అంటున్నారు. మన జీతాలు మనకి సవ్యంగా ఇస్తున్నంతకాలం అది ఎన్నాళ్ళకి పూర్తయినా మనకి ఇబ్బందిలేదు."

"అదికాదు నాయనా! నేను ఇక్కడ ఉండటం వలన ఎంతో పోగొట్టుకుంటున్నాను. ఎంతో కాలాన్ని వృథా చేసుకుంటున్నాను."

"నా కర్థం కావడంలేదు."

"నీ కర్థంకాదులే బాబూ! అలా అర్థంకాకపోవటమే మంచిది."

"మీరు తమాషాగా మాట్లాడుతారు. క్రిష్ణశాస్త్రి అన్నట్లు నిన్నుబోలి పాడబోవుదు, నిన్నుబోలి నాట్యమాడ బోవుదు, ఇంతదాహమ్ము దహాయింప ఎట్లుమనుగ? అన్నట్లున్నారు మీరు" అన్నాడు శర్మ.

"అదికాదు నాయనా! ఏవో ఆవేశాలు అలుముకొన్న సమయంలో కవి అలాంటి గీతాల్ని ఆలాపిస్తాడు. సర్వభావాలూ, సర్వప్రపంచం యవనికాభ్యంతరంలో అణగిపోయి కేవలం విరాట్స్వరూప మొకటే మనోగోచర మవుతున్న శుభసమయంలో ఆ విశ్వనర్తనానికి సాక్షీభూతుడై నిలబడ్డ ఏకైకమానవుడు వెర్రిఅయిపోయి భగవంతునితో పాడాలనుకుంటాడు."

"అలా పాడినవాడే మహాత్ముడూ, మహాశిల్పి, మహాకవీను."

"మహాత్ముడూ, మహాశిల్పి అయినవాడు తన మనోభావాల్ని వ్యక్తంచేయలేడు శర్మా! ఒక్క మహాకవికే అది సాధ్యం. తనలో జన్మించిన తమోగుణభావనాసుమాల్ని విశ్వవీణ మీద ఆలాపించటం ఒక్క మహాకవికే సాధ్యం."

"మీరు చెప్పినట్లు ఒక మహాయోగికన్నా ఒక మహాకవికి ప్రపంచం పాదాక్రాంతమవటం ఒకవిధంగా నిజమేగాని మానసికంగా ఇద్దరూ ఒకలాగానే ఉంటారని అనుకుంటాను."

ఆ ప్రశ్నకి శంకరావుగారు కొంచంసేపు జవాబు చెప్పలేదు. తరువాత కలలో మాట్లాడినట్లు,

"మొదట్లో పచ్చిమాంసం తింటూ జంతువులాగా జీవించటం ఆరంభించినమనిషి ప్రకృతిని పోల్చి దానిని అనుసరించి నడిచి ఈనాటి నాగరిక స్థితికి వచ్చాడు. అతని అపూర్వమేధాశక్తి పక్షిని చూసి విమానాన్ని, చేపను చూసి పడవనీ నిర్మించింది. మెరుపులో విద్యుత్తునూ, అణువులోని అఖండశక్తినీ, హస్తగతం చేసుకొని ఇంచుమించు భగవత్సమానుడే అయినాడు మానవుడు. కాని నాయనా! ఏదో తెలియరాని ఒక మహాశక్తి అతని గమనానికి అక్కడక్కడ అడ్డుపడుతూనే ఉంది. ఎందుకోసం అలా చేస్తుందో తెలియదు. కంటికి కనిపించని అణువులో జీవశక్తి నిబిడీకృతమైన సంగతినీ, మాతృగర్భంలో అది పోసుకునే ప్రాణశక్తినీ, చివరకి అన్నీ ఉపసంహరించుకొని ఆ చైతన్యం ప్రయాణించే గమ్యాన్నిమాత్రం మనిషి భేదించలేకపోయినాడు. అవి హస్తగతమైననాడు అజేయుడై నమానవుడు భగవత్సమానుడే అవుతాడు. కాని అది అసంభవం" అన్నారు.

ఆయనమనసులో ఏదో మహాయుద్ధం జరుగుతున్నదని గ్రహించాడు శర్మ. ఆ స్త్రీ సమయమూ, సందర్భమూ ఆలోచించకుండా భగవంతుడి అజేయశక్తిని గురించి ఆయనిప్పుడిచ్చిన సుదీర్ఘోపన్యాసం తాలూకు అంతరార్థం ఆమెకే బోధపడలేదు. అయినా అర్థం అయినట్లే తలఊపాడు శర్మ.

"ఇప్పుడు ఈ నాగరికతకి పునాది మనిషి.జ్ఞానపిపాస మీద ఏర్పడింది. కనిపించే దీనికన్న అత్యున్నతమైనది.

మరేదో ఉన్నదనీ దానిని అవగతమూ, హస్తగతమూ చేసుకోవాలనీ, మానవుడు పడే తాపత్రియమే జ్ఞానం. ఇక అనంతమైన దేన్నో చిత్రించాలనీ, వర్ణించాలనీ, పాడాలనీ పడే తీవ్రమైన వాంఛే కళ.''

ఇప్పుడీ ఉపన్యాసం దేనికో! దేన్నిగురించి చెప్పాలని ఆయన తాపత్రియపడుతున్నాడో అని తెలుసుకోటానికే నిర్ణయించుకుని సిద్ధంగా కూర్చున్నాడు శర్మ.

''ఈ ప్రపంచం ఒక మహారంగస్థలం. దానిమీద మనందరం నటీనటులం. కాకపోతే కొందరు హీరోలు అవుతారు. మరికొందరు విలన్‌లు అవుతారు. మరీ చరిత్రహీనులు కొందరు ఎవరిదృష్టినీ ఆకర్షించకుండానే తమ పాత్రలు నటించేసి రంగస్థలంమీదినుంచి తప్పుకుపోతారు.''

''క్షమించాలి మీరు. ఇది అంతా ఎందుకు చెప్తున్నారో నాకు అర్థంకావటం లేదు.''

''ఎందుకు చెప్తున్నానంటే నా పాత్ర నేను నటించేశాను. ఇక అలసట వచ్చింది. రంగస్థలంమీదనుంచి తప్పుకుపోవాలనిపిస్తున్నది. అలా తప్పుకపోయి నా యీ చరమ జీవితాన్ని మంగళగిరి నరసింహుడిపాదాలదగ్గర గడుపుకోవాలనిపిస్తున్నది.''

''మీకు ఇక్కడ శాంతి అనేది దొరకకపోతే అలాగే చేయండి శంకరావుగారూ! అయినా ఒకమాట. మీరేమీ అనుకోకపోతే?''

''అడుగు నాయనా?''

"నిజంగా భగవంతు డనేవాడు ఒకడు ఉన్నాడని మీరు నమ్ముతున్నారా?"

ఆ ప్రశ్నకి శంకరావుగారు కొంచంసేపు మాట్లాడ లేదు.

"నమ్మాలి అంతకంటె గత్యంతరం లేదు. అలసి పోయిన ఈ జీవితంనుంచి తప్పించుకుని సౌఖ్యమార్గాన్ని చేరుకోవాలంటే భగవంతుడినీ, విధినీ నమ్మితీరాలి."

"మన నమ్మకాల్ని. అపనమ్మకాల్ని గురించికాదు నే ప్రశ్నించేది. అసలు నిజమేమిటీ? అని."

"అది తెలుసుకోవాలని మానవుడు యుగయుగాలుగా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఓడిపోతూనే ఉన్నాడు."

"కాని ఆ ఓటమినే విజయం అని భ్రమిస్తున్నాడు."

"భగవంతుడు ఉన్నాడనే నమ్మకం మనకి శాంతి నిస్తుంది. నిజం చెప్పాలంటే అంతకన్న పెద్ద ప్రయోజనం మరేం లేదు."

"అంతే నంటారా?"

"అంతే బాబూ! ఈ ప్రపంచంలో సర్వవాంఛలూ, ఆశలూ అస్తమించినప్పుడు కేవలం నిరాశ ఒకటి అంధకారం లాగా అలుముకొంటుంది. ఏం చేయాలో తోచదు. ఏం జరుగుతోందో అంతకన్న అర్థంకాదు. జీవితం అంటే అస హ్యాం పుడుతుంది. అప్పుడే భగవంతుడికేసి మనసు ప్రవ హిస్తుంది. ఒకప్పుడు నాలాగా వయసుతిరిగిపోయి సర్వ సుఖాలూ అనుభవించేసినతరువాత జీవితానికి అర్థం తెలుసు

కోవాలనే వాంఛ కలుగుతుంది. అప్పుడే భగవంతుడిని చేరా కాలనిపిస్తుంది."

"అంతే?"

"ఉండు నాయనా! నా మాటకి అర్థంరాదు. అప్పుడు ఏ మార్గంలో వెతకాలి అన్న ప్రశ్న ఎదురవుతుంది. వెతికితే కనపడతాడా? లేదా అదే సందేహం కలిగి కనపడతాడేమో అనే ఆశతో అన్వేషణ ప్రారంభిస్తే ఏచోట తేలుతామో ఎవరికీ తెలియదు."

"ఇప్పుడీ సముద్రపు ఒడ్డున కూర్చుని భగవంతుడి ఉనికిని గురించి మాట్లాడుతూఉంటే కాల్‌షీట్ పూర్తవుతోంది పదండి, పోదాం" అని లేచాడు శర్మ. శంకరశాస్త్రి గారు ఒక నిట్టూర్పు విడిచి "పద" అన్నారు.

* * * * *

స్త్రీజీవితం ఒక వర్ష బిందువు. అది ముత్యపుచిప్పలో పడితే ముత్యం అవుతుంది. నళినీదళంమీద నిలిస్తే మౌక్తిక భ్రాంతి కలిగిస్తుంది. చెత్తకుండిలో రాలితే వ్యర్థమవుతుంది.

ఈ వాక్యాలు వ్రాసి కలాన్ని చేత్తో పుచ్చుకుని ఆలోచించటం ప్రారంభించింది కామాక్షి. ఎదురుగుండా ఉన్న టేబిలుదగ్గర కూర్చుని వచ్చిన కథలు చదువుతున్నాడు శివరావు. అతనిని పిలిచి తను వ్రాసిన ఈ వాక్యాలు ఎలా ఉన్నాయి అని ప్రశ్నించింది కామాక్షి.

"అంటే నీ ఉద్దేశ్యం స్త్రీజీవితం కట్టుకున్న భర్తని బట్టి మారుతూఉంటుందనా?"

"కావచ్చును. కాకపోవచ్చును. అలా వ్రాయాలనిపించింది. వ్రాసేశాను. అంతే."

"అలా వ్రాయాలనిపించిన ప్రతిదీ వ్రాసేయకు కామాక్షీ! రచనలో ఎప్పుడూ నిగ్రహం చూపించాలి."

కామాక్షి తిరిగి వ్రాయటం ప్రారంభించింది.

"మనుష్యు లెప్పుడూ పరిసరాలమీద నెపం వేస్తారు. కాని అంత మంచిపని కాదు. బ్రతక నేర్చిన మనుష్యులు తమ కనుకూలంగా పరిసరాల్ని సృష్టించుకోవాలి." ఈ మాటలు వ్రాసి పైకి చదివింది.

"తన కొలతలు టైలరుకిచ్చి కుట్టించుకున్నా ఒకటే లేదా తన కొలతకు సరిపడిన వస్తువులు రెడీమేడ్‌లో కొనుక్కున్నా ఒకటే."

"బొత్తిగా అలా అనకు మరి. ఖరీదులో అన్నా కాస్తంత భేదం ఉండితీరాలి. ఇంతకూ ఇవ్వాళ ఈ వ్యాసం పూర్తి అయ్యేట్లు లేదు."

"పోనిద్దూ! ఇప్పుడేం మునిగిపోయింది కనుక. అది సరేగాని ఈమధ్య నీకుకూడా మంగళగిరి చాదస్తం పట్టినట్లున్నదే?"

"అసలు ఆ చాదస్తం మొదట ప్రారంభమయింది నాలోనే. కాకపోతే ఆ భగవంతుడు హృదయం లేని రాతి బొమ్మ."

"అసలు రాతిబొమ్మనే భగవంతుడనుకోటంతో ఈ జాతిపతనం ప్రారంభమయింది."

"అలా భగవన్నింద చేయకు. కళ్ళు పోతాయి. ఇంతకూ హాస్పటల్లో సునందన ఎలాఉందో ఫోను చేశావా?"

"అదే తెలుస్తుంది లెద్దూ. మహా ఘనకార్యం. కొడుకునో కూతురునో కంటుంది అంతేగా!"

"నీకు తెలియదు శివరావు! అంత తేలికగా తీసిపారేయకు మరి. తన జన్మసాఫల్యం అందులోనే ఉందని స్త్రీ అనుకుంటుంది."

ఒక నిట్టూర్పు విడిచింది కామాక్షి. వెంటనే డాక్టర్ జ్ఞాపకంవచ్చాడామెకు. ఈజీవితంలో తను పొందలేని ఆ ఆనందం ఈ రోజు ఇంతగా ప్రలోభపరుస్తున్న దేమిటి? అసలు తను తెగించి ఏదీ చేయలేదు. కామాక్షిఆలోచనలు ఒకకొసకి చేరుకోకపూర్వమే లీలరాకతో ఫటిక్కున తెగిపోయినయ్యి.

కామాక్షి ఆశ్చర్యంగా లీలవంక చూసింది. లీల గర్భవతిగా ఉంది. "ఏం లీలా! ఎప్పుడొచ్చా వేమిటి?" అని ప్రశ్నించింది.

లీలమొగాన కళాకాంతులు లేవు. పది లంకణాలు చేసినట్లుంది ఆమెమొగం. కామాక్షిప్రశ్నకి జవాబుగా ఏడవటం ప్రారంభించింది లీల. ఏడుస్తూనే తనకథ చెప్పింది. తనభర్త జైలునుంచి వచ్చాడు. అతను వచ్చేసరికి తను గర్భవతిగా ఉంది. భర్త తిరిగిరాడనే ఉద్దేశ్యంతో ఆమె స్త్రైరివకు గోపాలం దగ్గరవుండి చిన్నచిన్న వేషాలువేస్తూ పొట్టగడుపుకొంటోంది. జరిగిందేమిటంటే తనకి భర్తవున్నాడని గోపాలానికి చెప్పలేదు. తీరా ఆ భర్త తిరిగి వచ్చేసరికి గోపాలం అసహ్యించుకొని వదిలేశాడు. గర్భవతిగా ఉన్నది కనుక

భర్తా విడిచిపెట్టేశాడు. గర్భవతిగా ఉన్నది కనుకనే పిక్చర్‌లో దొరికే ఆ ఒకటిరెండు చిన్న వేషాలు దొరకకుండా పోయినయి. ఇక మద్రాసులో ఉండలేక విజయవాడ వచ్చేసింది. పార్వతమ్మగారూ, కామాక్షమ్మగారూ కనికరిస్తే యెలాగో లాగ పొట్టపోసుకుంటుంది.

కథంతా విని "షెల్టర్ హోమ్‌లో చేర్చరాదూ" అన్నాడు శివరావు. ఆ సలహాకి కామాక్షికి నవ్వు వచ్చింది. "సరే లీలా! అలా చేయరాదూ పోనీ" అన్నది.

"రేపో మాపో పురుడునస్తుందమ్మా! ఈ పరిస్థితిలో అక్కడ యెలా?" అన్నది లీల.

"అన్నట్లు పిల్లలతల్లుల్ని అందులో చేర్చుకోరు" అన్నది కామాక్షి.

నిండుగర్భవతిగా ఉన్న లీల మొగంలో గర్వంతో పాటు బాధ్యతకూడా గోచరిస్తోంది. తనేదో సిగ్గుపడాల్సిన పనిచేశానని ఆమె అనుకోటంలేదు. ప్రతి స్త్రీకీ సహజమైన ప్రకృతి తనకీ కలిగిందని ఆమె ఉద్దేశ్యం. తనకీ ఒక బిడ్డ. అదే ఆమెగర్వం. ఆ బిడ్డ అక్రమసంతానమో, సక్రమసంతానమో ఆమెకి అక్కరలేదు. ఏ సంతానమైనా అది తన శిశువు.

"సరే లీలా! సాయంత్రం వస్తాను. నువ్వు యింటికి వెళ్ళు. నాన్న యేమైనా అడిగితే సమాధానం నేనువచ్చి చెపుతానని చెప్పు. ఇదిగో! ఈ చిల్లరడబ్బులు తీసుకుని రిక్షా మీాద వెళ్ళు." అని రిక్షా డబ్బులిచ్చింది కామాక్షి. లీల వెళ్ళిన తరువాత శివరావు,

"తెలివితక్కువపని చేస్తున్నావేమో కామాక్షీ! అది యెలాగైనా బ్రతగ్గలదు. దానికి నీ సహాయం కూడా అనవ సరమని నా ఉద్దేశ్యం."

"పోనీలే శివరావు! ఏదో ఒకపని చేయకపోతే ఎలా కాలంగడుస్తుంది చెప్పు?"

"కేవలం కాలంగడవటానికి యింతంత బాధ్యతలు యెవరూ నెత్తిన వేసుకోరు. కేవలం నీ సొంతవిషయంలో తప్ప అందరి విషయాల్లోనూ అపరిమితమైన ధైర్యంగా ఉంటావు నువ్వు."

కామాక్షిముఖం శివరావు అన్నమాటకి తెల్లగా పాలి పోయింది. అది చూసి యెందుకన్నానా అనవసరంగా? అని బాధపడ్డాడతను.

"నన్ను క్షమించు కామాక్షీ! అనవసరంగా నీ మనసు కష్టపెట్టాను" అని క్షమాపణ చెప్పుకున్నాడతను.

"నువ్వు అన్నదాంట్లో తప్పేం లేదు శివరావు! కేవలం స్వీయమాలిన్యమే నా ముఖంలో ప్రతిఫలిస్తున్నది." అని జవాబిచ్చి తలవంచుకుని వ్రాయటం ప్రారంభించింది కామాక్షి. కాని ఆమె మనసు మాత్రమింకా నిదానం లేదు.

ఇంతలో ఫోను మ్రోగింది. కామాక్షి రిసీవరుతీసి చెవి దగ్గర పెట్టుకుంది. రెండుమూడు నిముషాల్లో ఆ ముఖం అయిదారురంగులు మారింది. శివరావు కేమీ అర్థంకాలేదు. ఫోనుపెట్టేసిన తరువాత "నేనిప్పుడే వస్తాను శివరావు!" అని యెక్కడి కాగితాలక్కడ పారవేసి వెళ్ళిపోయింది. "ఈమె

నాబోటివాళ్ళ కెప్పుడూ ఒక పనే" అనుకుని నిట్టూర్పు విడిచి వ్రాసుకోవటం ప్రారంభించాడు శివరావు.

ఆ బయలుదేరటం బయలుదేరటం సరాసరి హాస్పిటల్‌కి వెళ్ళింది కామాక్షి. సునందన ప్రసవించింది. కాని చాలా ప్రమాదకరస్థితిలో ఉన్నది. వెంటనే భర్తను రమ్మని ఇంటాకి ఫోనువచ్చింది. కాని ఆ సంగతి శివరావుకి తనై చెప్పటం ఇష్టంలేకపోయింది. సునందన యే స్థితిలో ఉన్నదో చూడాలని తనే హాస్పిటల్‌కి బయలుదేరింది.

కామాక్షి వెళ్ళేసరికి సునందన చాలా ప్రమాదకరమైనస్థితిలో ఉన్నది. ఆపరేషన్ చేసి బిడ్డను తీశారు. ప్రస్తుతం ఆమెకి రక్తం ఎక్కించటం చాలా అవసరం. హాస్పిటల్లోనూ, బ్లడ్ బ్యాంక్ లోనూ కూడా ఆమెకి సరియైన రక్తం దొరకలేదు. స్పృహతప్పివున్న ఆమెచుట్టూ డాక్టర్లూ, నర్సులూ నిలబడి ఖంగారుగా ఏదో మాట్లాడుకుంటున్నారు. ఇదిచూసి పరిస్థితి అర్థంచేసుకుంది కామాక్షి. అందులో ఒక డాక్టర్ని యివతలికి పిల్చి "నా రక్తం సరిపోతుందేమో ఒకసారి చూడకూడదూ?" అని అడిగింది. డాక్టర్ చాలా ఆశ్చర్యంగా ఆమెవంక చూసి మిగతా డాక్టర్లతో సంప్రదించడానికి వెళ్ళాడు. ఐదునిముషాలైనా గడవకమునుపే కామాక్షిని లోపలికి తీసుకెళ్ళారు.

"మీ త్యాగం చాలా అపూర్వమైనది" అన్నాడు డాక్టరు కామాక్షి వేలికి సూదిగుచ్చి రక్తం తీస్తూను.

ఆ మాటకి ఆమెకి అంతులేని సంతృప్తి కలిగింది. తను ఇప్పుడు, ఇవ్వగలుగుతున్న యీ రక్తదానం వలన శివరావుకి

కొంత సౌఖ్యాన్ని కలిగించిన దవుతుంది. ఇంతకన్నా తనా జన్మకి మరో ప్రయోజనం యేమున్నది తనకి. కామాక్షి రక్తంతో మెల్లిగా సీసా నిండుతున్నది. తన నరాల్లో ప్రవహిస్తున్న రక్తం ఆ రబ్బరుట్యూబులో నుంచి ప్రవహిస్తుంది. అదే సీసాలో నిండి సునందన నరాల్లోకి ఎక్కించబడుతున్నది. దీనివల్ల ఆమెలో యేమైనా మార్పు కలుగుతుందా ? అర్థం లేని ఆలోచనలు. విచిత్రం యేమిటంటే ఆమె రక్తం, తన రక్తం ఒకటికావటం. ఒకవేళ అవి కలవకపోతే సునందన మరణించి ఉండేదా ? నిజంగా ఆమె చనిపోతే శివరావు ఏమై ఉండేవాడు ? అప్పుడు తను అతన్ని వివాహం చేసుకోవాల్సి వచ్చేది. ఈ ఆలోచన రాగానే కామాక్షి కదిలింది. పక్కనున్న నర్సు కదలవద్దు అని హెచ్చరించింది. ఈ పరిస్థితిలో యింత భయంకరమైన ఆలోచన తనకి యెలా వచ్చిందో!

అక్కడే నిలబడ్డ డాక్టర్లలో రోజావతికూడా ఉన్నది. ఆమె ఆ హాస్పిటల్లో ఆనరరీ సర్జన్. కామాక్షిమీద ఆమెకెంతో అసూయ ఉన్నాగాని ఆ క్షణంలో ఆమె చేస్తున్న త్యాగాన్ని అభినందించకుండా ఉండలేకపోయింది.

సరిపడ్డ రక్తం తీసుకోగానే కామాక్షి చేతిలోంచి రబ్బరు ట్యూబులు విప్పేశారు. వెంటనే ఒక నర్సు నేసవేసి ఓవల్టీన్ యిచ్చింది. అది తాగింది కాని అపరిమితమైన నిస్త్రాణగా ఉన్నట్లనిపించింది డాక్టర్ రోజావతి ఆమె దగ్గరకవచ్చి "మీరు బలమైన ఆహారం తింటే సుమారు నెలరోజుల్లో మీ రక్తాన్ని మీరు పొందగలుగుతారు" అన్నది. రోజావతిని అక్కడ చూడగానే కామాక్షికి యేదో నిరాశ ఆవరించింది. "థేంక్స్

డాక్టర్ !" అని సమాధానం చెప్పింది. ముభావంగా చెప్పిన ఈ సమాధానానికి రోజావతిలో ఆ క్షణందాకావున్న గౌరవ భావం పోయి మామూలు అసూయే మిగిలింది. వెంటనే మరేమీ మాట్లాడకుండా రౌండ్స్‌కి వెళ్ళిపోయింది ఆమె. ఇంతలో సర్జన్ ఆమెదగ్గరికి వచ్చి "మీరు చేసిన యీ పని చాలా ఉత్తమమైన పని.ఇంతకీ ఆమె మీ కేం అవుతుంది?" అని ప్రశ్నించాడు.

"ఏమీ కాదు."

"ఏమీ కాదూ ? బహుశా తెలిసినవాళ్లయివుంటారు. సరే! మీ రిక వెళ్లవచ్చును. కొంచెం బలమైన ఆహారంతింటే అతి త్వరలోనే యీ రక్తాన్ని కూడతీసుకోగలుగుతారు." అని బూట్లు టకటకా చప్పుడుచేసుకుంటూ ఆయన వెళ్లి పోయినాడు.

అందరి అభినందనాల్ని అందుకొని కామాక్షి ఇంటికి వెళ్లింది. ఆమెకు వెంటనే నిద్రపట్టింది.

* * * * *

సునందనకి ఆ తెల్లవార్లూ రక్తం ఎక్కిస్తూనేఉన్నారు. అతిదాహంచేత ఆమె మత్తులోనే నిముషానికి ఒకసారి నోరు తెరుస్తున్నది. అలా తెరిచినప్పుడల్లా సోడా పోస్తున్నది ఒక నర్సు. ఆమెపక్కన మోహనాంగి అలా నిలువుకాళ్ళమీద నిలబడి విసురుతూనే ఉంది. తెల్లవారిన తరువాత కొద్దిగా స్పృహవచ్చింది ఆమెకి. ఏం పిల్ల! అనీ, ఆపరేషన్ అయిందా ? అనీ రెండుప్రశ్నలు వేసి మళ్ళీ మత్తులో పడి పోయింది.

లేదు. నిన్న కామాక్షిగారొచ్చి తన రక్తాన్ని యివ్వకపోతే మీరు చాలా అదృష్టహీనులయ్యేవాళ్ళు."

"ఏమిటి!"

"కామాక్షిగారొచ్చి తన రక్తాన్ని యివ్వకపోతే మీరు చాలా దురదృష్టవంతులయ్యేవారు."

డాక్టర్ రోజావతి అన్నమాట శివరావుకి తుపాకీ దెబ్బలా తగిలింది. కామాక్షి తన భార్యని బ్రతికించింది. తన జీవితంలో మరోసారి అంధకారం వ్యాపించకుండా అడ్డుపడింది.

మేడమీద గదిలో సోఫామీద కూర్చుని ఆలోచిస్తున్న కామాక్షి, శివరావువచ్చి తన రెండుచేతులూ పట్టుకునేసరికి కళ్లు తెరిచి చూసింది. అతను అపరిమితమైన కృతజ్ఞతాభారంతో ఆమెవంక చూస్తున్నాడు.

"చెయ్యి వదులు శివరావు! ఏమిటా వెర్రిచూపు!" అన్నది ఆమె.

"ప్రపంచంలో నీలాంటివ్యక్తిని చూడలేదు కామాక్షీ! ఇంత త్యాగమా?"

"అందులో పెద్ద త్యాగమేదో ఉందని నేను అనుకోవటంలేదు. ఏదో ఆ క్షణంలో చెయ్యాలనిపించింది చేసేశాను. అయినా అదేమంత కష్టంకాదు కూడా."

"నువ్విలా మాట్లాడుతుంటే నాకు ఒళ్ళుమండుతోంది. ఆమె బ్రతికితే బ్రతికేది, లేకపోతే లేదు..."

"ఇక మాట్లాడకు. ఇంతకూ, కొడుకుని చూశావా?"

"అదలా ఉండనీ. నిన్నటికీ, యివ్వాల్టికీ ఎంతగా నీర సించిపోయినావో చూడు. పొద్దున ఆఫీసుకు వెళ్ళిపోతే ఎందుకో రాలేదనుకున్నాను."

"అలా నిలబడటం నాకేం బాగాలేదు. కూర్చో."

అని పక్కకి జరిగింది కామాక్షి. ఆమె పక్కనే కూర్చున్నాడు శివరావు.

ఆమె మనిషో దేవతో అతనికి అర్థంకావటం లేదు. మెల్లిగా ఆమె చెయ్యి తన చేతిలోకి తీసుకుని "నీకు నా కృత జ్ఞత ఎలా తెలియచెయ్యాలో అర్థంకావటంలేదు కామాక్షీ!" అన్నాడు.

అతనిమాట యింకా పూర్తి కాకముందే గుమ్మంలో డాక్టర్ మధుసూదనరావు ప్రత్యక్షమయ్యాడు. ఒకరిచేతిలో ఒకరు చెయ్యివేసుకుని ఆప్యాయంగా మాట్లాడుకుంటున్న ఆ యువతీయువకుల్ని చూసి అతను ఆశ్చర్యపోయినాడు. సరా సరి లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. డాక్టర్ని చూసి ఉలిక్కిపడి లేవబోయినాడు శివరావు. కామాక్షి అతని చేతిని వదిలిపెట్టకుండా అదిమి కూర్చోపెట్టింది. డాక్టరు అదికూడా చూశాడు. కాని ఆ సంఘటనలోని అంతరార్థం అతనికి బోధ పడలేదు.

"నమస్కారం డాక్టరుగారూ! ఊరునుంచి ఎప్పు డొచ్చారు?" అని కుశలప్రశ్న వేసింది కామాక్షి. ఆ స్వరంలో ధ్వనించిన పరాయితనానికి డాక్టరుతోపాటు శివ రావుకూడా ఆశ్చర్యపోయినాడు. ఊరుకోలేక "ఏమిటిది కామాక్షీ?" అన్నాడు కూడా.

"అనవసరంగా ఆశ్చర్యం నటించబోకు శివరావు! డాక్టరుగార్ని పలకరిస్తున్నాను" అన్నది.

"నీకు కోపంవుంటే మాత్రం యింతగా బాధించటం న్యాయం కాదు కామాక్షీ!" అన్నాడు డాక్టరు.

"మిమ్మల్ని బాధించడానికి నాకు హక్కూ లేదు, అవసరమూ లేదు."

"అవసరమేమో గాని హక్కుమాత్రం ఉన్నది కామాక్షీ!"

"అని మేమిలా కూర్చోటం చూసినతరువాత కూడా అనిపిస్తోందా మీకు?" కామాక్షి వేసిన ఈ ప్రశ్నకి శివరావు అదిరిపడ్డాడు. డాక్టరు కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత,

"తప్పకుండా అనిపిస్తోంది కామాక్షీ! నిన్ను నేనెప్పుడూ ద్వేషించను. ఏవిధంగానూ అనుమానించను" అన్నాడు. ఈ విచిత్రవ్యక్తుల సంభాషణ శివరావుకి చాలా చిత్రంగా ఉంది.

"కాని డాక్టరుగారూ, నేనలా అనుకోటంలేదండీ!"

"ఎలా అయినా అనుకో కామాక్షీ! ఇప్పుడు నా నిర్ణయాన్ని మార్చుకున్నాను. నిముషానికోసారి పెళ్ళిమాటెత్తి ఇకమీదట నిన్ను బాధ పెట్టను. మనిద్దరం స్నేహితులుగానే ఉండిపోదాం."

ఈ చివరిమాట అంటున్నప్పుడు డాక్టరుకంఠం కొద్దిగా వణికింది.

"ఈ మార్పు ఊరిప్రయాణంలో వచ్చిందేమో కదూ ?"

"కావచ్చును. కాని నీకుమాత్రం ఇది ఆనందకర మైన మార్పే గదా"

"అలా ఎందుకనుకుంటున్నారు మీరు ? ఈ మార్పు వలన నేను బాధపడుతున్నానేమో అని ఎందుకనుకోరు మీరు ?"

"నువ్వు నన్ను పరీక్షిస్తున్నావా ?"

"అంతమాటనకండి ! ఆ అర్హత నాకు లేదు."

"ఈ సంభాషణ నాకు చాలా విసుగ్గా ఉంది కామాక్షీ ! అసలు నీ ఉద్దేశ్యం నాకేం అంతుబట్టటం లేదు."

"చివరికి మీకూ్కడా నామీద విసుగుపుట్టిందన్న మాట."

"అవును అని చెపితే నీకు సంతోషం కలిగేట్లయితే అలా చెప్పటానికి నాకేం అభ్యంతరం లేదు."

కామాక్షి హటాత్తుగా ఏడవటం ప్రారంభించింది. శివరావూ, డాక్టరూ కూడా తెల్లబోయినారు శివరావు లేచి డాక్టరుదగ్గరికి వెళ్ళి "కామాక్షి చాలా బలహీనంగా ఉంది డాక్టర్ ! నిన్న తన రక్తంఇచ్చి సునందప్రాణాన్ని రక్షించింది. ఆ కృతజ్ఞత చెప్పటానికే నేనిలా వచ్చాను. మీకు చెప్పకుండా వెళ్ళారని ఆమె చాలా బాధపడింది. మీమీద కోపానికి కూడా అదే కారణం" అన్నాడు. పైకి ఎంతో శాంతిగా ఉన్నట్లు నటిస్తున్న డాక్టర్ నిజంగానే శాంతి పొందగలిగాడు.

మొగంమీాద రెండుచేతులూ కప్పుకొని దుఃఖిస్తున్న కామాక్షిదగ్గరకు వెళ్ళి తన చేతులతో ఆమెచేతుల్ని తొలగించాడు డాక్టర్. దాంతో కామాక్షిదుఃఖం మరింత అధికంకాగా, "చెప్పండి! మీరు నాతో చెప్పకుండా ఎందుకు ఊరికెళ్లారు?" అని గుబులుగా ఏడ్చేసింది.

"పొరపాటు చేశాను కామాక్షి! నేనూ శాంతికోసమే వెదుక్కుంటూ వెళ్ళాను. నన్ను క్షమించు."

కామాక్షి కళ్ళుతుడుచుకుని తనలో తను మాట్లాడుకుంటున్నట్లు, "శాంతి? అదెక్కడ దొరుకుతుంది డాక్టర్? గులాబీలు వాడకుండా అలాగే ఉండిపోతే; ప్రతీరోజూ వెన్నెలే అయితే; నక్షత్రాలు మాలకట్టి తలలోపెట్టుకుంటే..."

"కామాక్షి!"

"క్షమించండి డాక్టర్! ఏదో వాగేస్తున్నాను."

"నీలో కనిపించే ఈ తొందరా, నిలకడలేకుండా అనుక్షణమూ చలిస్తూఉండే నీ భావాలూ, ఎలాంటివారికయినా ఆకర్షణ కలిగిస్తాయి..."

డాక్టరుమాట పూర్తిగాకముందే వెంకటపతిగారు తుఫానులా ప్రవేశించి కామాక్షిని కౌగలించుకున్నారు. ఈ సంఘటనకి అర్థం ఏమిటో కామాక్షికి బోధపడలేదు. చివరకి "ఏమిటిది నాన్నా?" అంది.

"నాకొంప నిలువునా తీయదల్చుకున్నావుటే అమ్మా! నీ నెత్తురుఅంతా ఇతర్లకి ధారపోయాల్సిన ఖర్మం ఏమిటే?"

"ఛీ! ఏమిటి నాన్నా! ఊరుకో."

"మీరు చెప్పండి డాక్టరుగారూ! ఇంతకన్నా అన్యాయం ఉందా? ఒక్క బిడ్డమీద ప్రాణంపెట్టుకుని బ్రతుకుతున్నాను గదా నేను!"

"ఇంతలో వచ్చిన ప్రమాదం ఏమీ లేదులెండి" అన్నాడు డాక్టర్.

"అవునండీ! మీ కేం పోయింది? నష్టపోయేది నేను."

"ఇప్పు డీ గొడవంతా దేనికి నాన్నా! నన్ను కొంచం సేపు స్థిమితంగా ఉండనీ"

"అయినా నాకు తెలియక అడుగుతాను. నెత్తురు ఎవరైనా ఇచ్చుకుంటారు టే?"

"అదేమిటో? ఎందు కలా కొందరు మహాత్యాగాలు చేస్తారో ఈ జన్మలో మనబోటివాళ్ళం అర్థంచేసుకోలేం వెంకటపతిగారూ!" అన్నాడు డాక్టర్.

"అవునండీ! నేను స్వార్థపరుడిని. తనకుమాలిన ధర్మం నేను చేయను."

"పోనీలే నాన్నా! ఇప్పు డీ వాదనంతా దేనికి? నువ్వు కిందకివెళ్ళి కొంచం కాఫీ పంపించు" అన్నది కామాక్షి. వెంకటపతిగారు మాట్లాడకుండా వెళ్ళిపోయినారు. ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ అపరాధిలా నిల్చున్నాడు శివరావు.

"డాక్టరుగారూ! వెంకటపతిగారు అన్నదాంట్లో అసత్యమేమీ లేదు. నిజంగా ఈ ప్రపంచంలో తనకుమాలినధర్మం ఉంటుందా?"

"తప్పకుండా ఉంటుంది. మానవత్వం ఇంకిపోనంత కాలం త్యాగధర్మాలు జీవించే ఉంటాయి."

"ఏమో డాక్టరుగారూ! నా కిదంతా చాలా ఆశ్చర్యంగా ఉంది. మీరు అంటే యెంత ఇష్టంలేకపోయినా ఎదుట కనిపిస్తే బాగానే మాట్లాడుతాడుకదూ మా నాన్న ?" అన్నది కామాక్షి.

"మాట్లాడక ఆయనకి నేనుచేసిన ద్రోహం ఏమిటి కామాక్షీ ?"

కామాక్షి మాట్లాడలేదు. ఇంతలో నిండుగర్భవతి లీల కాఫీతీసుకొని పైకి వచ్చింది. ఆమెమొహంలో ఏదో బాధ కనిపిస్తోంది. కాఫీ అక్కడపెట్టి వెళ్ళబోతున్న లీలని వెనక్కి పిలిచి, "కొంచెం మా లీలని పరీక్ష చేయండి డాక్టర్." అన్నది.

"బ్లడ్ ప్రెషర్ అపరేటస్ కింద కార్లో ఉంది" అన్నాడు డాక్టర్. శివరావు ఆ మాట విని తేవడానికి కిందికి వెళ్ళాడు. లీలకి నీరుపట్టి కాళ్ళూ చేతులూ ఉబ్బినాయి. శివరావు అపరేటస్ తీసుకురాగానే డాక్టర్ పరీక్షచేశాడు. అతని సున్నితమైన వేళ్ళు లీలని పరీక్షిస్తుంటే కామాక్షి ఎంతో ముగ్ధురాలయింది. పరీక్ష అయినతరువాత లీల వెళ్ళిపోయింది. కామాక్షి ప్రశ్నార్థకంగా తనవంక చూస్తున్న చూపుకి "పరిస్థితి ఏం బాగాలేదు కామాక్షీ" అని సమాధానం ఇచ్చాడు డాక్టర్.

"అంటే ?"

"బ్లడ్ ప్రెషర్ చాలా ఎక్కువగా ఉంది. నాడ్కూడా బొత్తిగా లేదు."

"నా ఒంట్లో ఇంకా నెప్పుగుంది డాక్టర్."

కామాక్షి అన్న ఈ మాటకి డాక్టరు ఆశ్చర్యంగా ఆమెని అసహ్యించుకున్నాడు. త్యాగం వల్ల వచ్చే కీర్తి అంటే ఇంత వ్యామోహమా ఈమెకి? అనుకున్నాడు డాక్టరు. డాక్టర్ ఏమీ సమాధానం ఇవ్వకపోయేసరికి కామాక్షికి ఆశ్చర్యం వేసింది.

"మాట్లాడరేం డాక్టర్?" అంది.

"మాట్లాడేందుకు ఏమీ లేదు. సునందకి నెత్తురు ఇచ్చినప్పుడు నీ కొచ్చిన కీర్తిలో యిసుమంతు కూడా ఇప్పుడు నువ్వు పొందలేవు."

"అంటే నేనేదో మహా త్యాగం చేశానని మీ అందరి చేతా పొగిడించుకోవాలనే కోరిక నన్ను ప్రలోభపెడుతోం దనేనా?"

"అంత స్పష్టంగా నిన్ను అనలేను కామాక్షీ! ఇంకోళ్ళయితే తప్పకుండా అనిఉండేవాడిని."

"ఒకవేళ అంతేనేమో డాక్టర్!"

డాక్టరుకి కలిగిన అసహ్యభావమంతా ఒక్క దెబ్బన తుడిచిపెట్టుకుపోయింది. కామాక్షి తిరిగి,

"సరే డాక్టర్! ఇప్పు డేం చేద్దామంటారు?"

"వీలయినంత త్వరగా హాస్పిటల్లో చేర్చటం మంచిది. సన్నిపువాతం వచ్చే లక్షణాలు ఉన్నాయి."

"పాపం!"

"ఎవరికి పాపం? ఈ ప్రపంచం ఒక రైలుపెట్టిలాంటిది కామాక్షీ! కొంచంసేపు ఈ పెట్టెలో ఉండి ఎవరి గమ్యంలో వారు దిగిపోతే చాలా సవ్యమైన జీవితం అంటారు. ఏ వంతెనమీదో గొలుసులాగి దూకేస్తే అందరికీ ఇబ్బంది కలిగించినందుకు కొంచంసేపు తిట్టి కొంత సేపటికి మర్చిపోతారు."

"కాని డాక్టర్! టికెట్టులేని నేరానికి దింపివేయబడ్డ వాళ్ళను చూస్తే మాత్రం చాలా జాలివేస్తుంది."

వీళ్ళిద్దరి సంభాషణా విచిత్రంగా ఉంది శివరావుకి. అతని అంతరాంతరాల్లో ఒకమూల అసూయ బల్లిపిల్లలా కదిలింది. కాని వెంటనే తేరుకోగలిగాడు.

"మరి నేను వెళ్ళిరానా కామాక్షీ!" అన్నాడు.

"వెళ్ళిరా శివరావు! ఇవ్వాళా రేపూ కూడా ఆఫీసుకి వచ్చే ఓపిక లేదు. ఆ వచ్చినవ్యాసాల్లో ఏదో ఒకటి ఎడిట్ చేసి స్త్రీలకి వేసెయ్యి" అన్నది కామాక్షి. శివరావు వెళ్ళి పోయినతరువాత కొన్ని నిముషాలు వాళ్ళిద్దరూ మాట్లాడ లేదు. ముందుగా డాక్టరే కామాక్షిని పలకరించాడు.

"కామాక్షీ!"

"ఏం డాక్టర్!"

"నాకూ వివాహమే చేసుకోవాలనే పెద్ద పట్టుదల ఏం లేదు. కాకపోతే అవినీతికరంగా జీవిస్తున్నామనే అప ప్రధ వస్తుందని తప్ప" అన్నాడు.

"అంటే?"

"అంటే నిన్ను మానసికంగా, దైహికంగా పొంద గలగాలంటే ఈ హిందూసమాజంలో వివాహంతప్ప మరో

మార్గం లేదు. ఆ ఉన్న మరోమార్గం చాలా కష్టాన్నమైనదీ, సంకుచితమైనదీ''

''అందుకని ?''

''అందుకని నిన్ను బలవంతపెట్టి వివాహం చేసుకు నేంత మూర్ఖుడిని అనిమాత్రం నీ వనుకోకుండా ఉంటే నాకం తే చాలు. కాని కామాక్షీ! ఎంతకాలం ఈ జీవితం ఇలా అనిర్దిష్టంగా గడపటం ?''

''నేను స్త్రీని అన్నమాట మర్చిపోకండి సార్. నాకూ కొన్నికోరికలూ, వాంఛలూ ఉన్నయ్యి. స్వంతంలాంటి ఇల్లూ, భర్తా, పిల్లలూ అన్నీ కావాలని ఉంది. వాటిని పొందాల నే ఉద్దేశ్యంతోనే పార్వతిఅక్కయ్యను మీ దగ్గరికి పం పాను. కాని మీ రప్పటికే ఊరికి వెళ్ళిపోయినారు.''

డాక్టరు మాట్లాడలేదు.

''కనుక నా సుఖాలబండిని నేను తేలికగా వెళ్ళి పో ట్టుకున్నాను. నా సౌఖ్యాన్ని విధి నిర్దాక్షిణ్యంగా తన ఇనుప చేతితో నలిపి ఉండచుట్టి చిత్తుకాగితాలబుట్టలో పారేసింది. ఇక సుఖపడే గీత నా మొహాన లేదు.''

''అర్థంలేకుండా మాట్లాడుతున్నావు కామాక్షీ! ఈ పుస్తకాల్లో మాటలు జీవితంలో వాడటం మీ రచయితలకు ఒక పెద్ద జబ్బు. ఇంతకూ భవిష్యత్ ఏమిటి ?''

''నన్ను ఆలోచించుకోనియ్యండి డాక్టర్ !''

డాక్టరు లేచి స్టెతస్కోపు చేతికి తీసుకున్నాడు శూన్యంగా కామాక్షివంక చూస్తూ.

"నీ జీవితం అంతా ఆలోచనతోనే గడిపేయటం నీకు సుఖాన్నిచ్చేలాగుంది కామాక్షీ! నే నిదివరకే చెప్పాను. మనం వెళ్ళదలుచుకున్న రైలుని టైముకి అందుకోలేకపోతే అది వెళ్ళిపోతుంది. అదే పట్టాలమీద మరో రైలు వచ్చి నిలబడుతుంది. క్షమించాలి. నీ కర్థమవ్వాలనే ఉద్దేశ్యంతో నేనూ పుస్తకాలభాషే మాట్లాడుతున్నాను. నీ ఇష్టం. ఈ విషయంలో నేను ఇంకేమీ మాట్లాడను. కనీసం స్నేహితులంగానైనా మిగులుతాం కదా! నా కదే చాలు." అని జవాబుకోసం అయినా ఎదురుచూడకుండా వెళ్ళిపోయినాడు.

కామాక్షికి తనస్థితి అర్థంకాలేదు. డాక్టరుఎదట తనని ఏదో భూతం ఆవేశించి ఇలా మాట్లాడిస్తుందా? అనిపించింది. అతనిని వివాహంచేసుకుంటే తన్ని అడ్డుపెట్టేవాడు ఒక నాన్న తప్ప మరెవరూ లేరు. తను గట్టిగా ఎదిరిస్తే ఆయనా ఏమీ చేయలేడు. కామాక్షిఆలోచన పూర్తిగా ఒడ్డుచేరకముందే లీల పైకివచ్చింది. ఆమె ఆయాసపడుతున్నది. నుదురంతా చెమటలతో తడిసిపోయిఉంది. కుడిచేత్తో నడుం నొక్కిపట్టుకుని అమ్మా అని పిలిచింది. ఆ పిలుపుతో కళ్లుమూసుకుని ఆలోచిస్తున్న కామాక్షి కళ్ళువిప్పి చూసింది.

"నాకు కడుపులో ఏదో బాధగా ఉన్నదమ్మా" అన్నది లీల. కామాక్షికి పరిస్థితి అర్థంఅయింది. లీలకి నొప్పులువస్తున్నయ్యి. నీరసంగా ఉన్న తన శరీరంలోని శక్తినంతా కూడతీసుకొని లేచి నిలబడి "పద లీలా!" అన్నది కామాక్షి.

* * * * *

"కనీసం ఒక్క చెడ్డగుణమన్నా లేనిదే ఏ మనిషీ మంచివాడు కాలేడు" అన్నాడు అబ్రహాంలింకన్. మంచివాళ్లు మంచివాళ్లవటానికి మొదటికారణం పిరికితనం. రెండవది: మంచివాడిని అనిపించుకోవాలనే ప్రలోభం. మూడవది: మంచికి ఉన్న మెజారిటీ. అలా కాకుండా చెడ్డపనుల్ని కూడా మంచికి ఉన్న గౌరవదృష్టితోనే చూస్తే ప్రపంచంలో ప్రతివాడూ హాయికలిగించే ఆ చెడ్డపనే చేస్తాడు. కాని పొరపాటునఅయినా ఆ మంచిజోలికి పోడు.

అదట్లా ఉంచి కొన్ని మానసికమైన బాధల్నించి తప్పించుకోవాలంటే తాగుడూ, నల్లమందూలాటి నిషా వస్తువుల్ని వాడతాడు మనిషి. ఇక్కడ ఇంకో చిత్రం ఏమిటంటే, స్త్రీమూలంగా కలిగిన బాధని మర్చిపోవాలంటే మరో స్త్రీనే మార్గం చేసుకుంటాడు మగవాడు.

ఏది ఏమయితేనేం? అదివరకు తను ఒక వ్యక్తిగా కూడా గుర్తించని లిల్లీని ఇంతదగ్గరగా తీసుకోగలిగాక తనని చూసి తనకే ఆశ్చర్యమూ, అసహ్యమూ కూడా కలిగింది డాక్టరుకి. తను కామాక్షికోసం ఎంతో వ్యధపడుతున్నాడో తనకోసం అంతకంటె కూడా ఎక్కువ వ్యధపడే స్త్రీలు బోలెడుమంది ఉన్నారు. కాని తను చేసిందేమిటి? బహుశా తనచేత ఈ పొరపాటుపని చేయించింది లిల్లి చూపించిన ఆప్యాయతేనా? ఎందుకు కాకూడదు? ఆమె కూడా స్త్రీ. నిజం చెప్పాలంటే వీరందరికన్న అధికంగా తనని గురించి ఆలోచించే స్త్రీ లిల్లీ.

ఒకవిధమైన మానసికోద్రేకంతో తను అనుకోకుండానే లిల్లీకి దగ్గరగా వచ్చేశాడు. ఆమె తనని జయించింది. సౌందర్యవతీ, తనతో సమానస్థాయిలో ఉన్న రోజావతిగాని, తనచేత ప్రేమించబడి తనని తిరిగి ప్రేమిస్తున్న కామాక్షిగాని తనకి ఇంతదగ్గరగా రాకపోవటానికీ, తను అసలు ఒక వ్యక్తిగా కూడా గుర్తించకుండా ఉన్న నర్సు లిల్లీ ఈ దౌర్భాగ్యస్థితిగాన తనకంత దగ్గరగారావటానికీ కారణం ఊహించలేకపోయినాడు డాక్టరు.

తనుచేసిన ఈ పొరపాటుపనికి నిజంగా కామాక్షే కారణం. కాని ఇంతలో మునిగిపోయిందేమిటి? ఇది ఒక పెద్ద తప్పుపని అనుకుంటే అవుతుంది. లేకపోతే కాదు. అది మామూలుగా స్త్రీపురుషులమధ్య జరిగిపోయే ఈ విషయానికి అనవసరమైన ప్రాధాన్యత ఇచ్చి తనని తాను వంచించుకుంటున్నాడు మానవుడు.

ఇంత మహోధృతమైన వాంఛని తను ఇన్నాళ్ళూ ఎలా నిగ్రహించుకోగలిగాడో అన్నది కూడా అతని రెండో ఆశ్చర్యానికి కారణం అయింది. ఆ తలపు వచ్చేసరికి అతనికి మళ్లీ దేహం పులకరించి ఎదురుతిరిగింది.

అదేసమయంలో కామాక్షి ఆ గదిలో ప్రవేశించింది. లీలని లిల్లీకి అప్పచెప్పి డాక్టరుకి ఆ విషయం చెప్పటానికి ఆమె లోపలికి వచ్చింది.

నిరాశతోనూ, వాంఛతోనూ సతమతమవుతున్న డాక్టరుకి ఆ దుస్థితికి కారణమయిన కామాక్షిని చూడగానే ఏదో కచ్చలాంటి భావం ప్రకోపించింది. ఆమెని బలవంతంగా

లొంగతీసుకుని గిజగిజలాడుతుంటే చూడాలనే కోరికని అతడు అణచుకోలేకపోయినాడు.

మగతో డేలుకళ్లల్లా క్రూరంగా తనవంక చూస్తున్న అతని కళ్లని చూసి కామాక్షి భయపడలేదు సరిగదా తను యెదురుచూస్తున్న ముహూర్తమేదో ఆసన్నమయినట్లు భావించింది. తనని ఆక్రమించుకుని నెత్తురు పీల్చటానికి వస్తున్న మగసింహాన్ని సివంగిలాగా చూసింది ఆమె.

"క్షమించాలి డాక్టర్! నాకు ఓపిక లేదు" అన్నది. డాక్టరుకి ఆ మాటతో యింకొంచెం ముందుకు పోవాలనిపించింది. ఆమెని గాఢంగా కౌగలించుకొని బొమికలు విరక్గొట్టాలన్నంత ఆవేశం కలిగింది. సరిగ్గా ఆ ముహూర్తంలోనే శంకరావుగారు ఆ గదిలో ప్రవేశించారు. ఆయన్ని చూడగానే కామాక్షికి యేదో శాంతి దొరికినట్లయింది. "ఎప్పుడొచ్చారు?" అని ప్రశ్నించింది. డాక్టర్ స్థితిమాత్రం వేడి గ్లాస్ మీద నీటిబొట్టు పడితే గ్లాస్ పేలిపోయినట్లుగా ఉంది.

కాని అతడు విద్యావంతుడూ, సంస్కారవంతుడూ. ఆ స్థితిలోంచి వెంటనే తప్పుకుని శంకరావుగారికి హృదయపూర్వకంగా స్వాగతమిచ్చాడు.

కామాక్షి వేసిన ప్రశ్నకి సమాధానంగా చిరునవ్వు నవ్వారు శంకరావుగారు. కామాక్షి తిరిగి అదే ప్రశ్న వేసింది. దానికి సమాధానంగా ఆయన కృష్ణకర్ణామృతశ్లోకం ఒకటి చదివారు. దానికి వ్యాఖ్యానంగా,

"గులాబీకెంజాయలూ, మంచుబిందువుల్లో మనోహర సౌందర్యాలూ, కృష్ణకర్ణామృతశ్లోకాలూ యెప్పటికప్పుడే

నూతనంగా ఉంటాయి. ఎప్పటికప్పుడే అందులో అందాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఇంత చక్కని శృంగారాన్ని ఎలా చిత్రించాడా ఆ కవి అని ఆశ్చర్యంవేస్తుంది!

ఈ ధోరణికి కామాక్షీ, డాక్టరుగారూ కూడా చాలా ఆశ్చర్యపోయినారు.

"ఒక్కతడవ కళ్ళుమూసుకోండి. అదిగో వేపల్లె! ఇరువది సంవత్సరాల ఒక అందగాడు ఎద్దు పాలిస్తుం దేమో అని ప్రయత్నిస్తున్నాడు. ఎవరయ్యా నువ్వు? ఎందు కంత పరధ్యానంగా ఉన్నావు? ఓ అందాలరాయా? నీకు యే సుందరి కనిపించింది?"

కామాక్షి తెల్లపోయింది. శంకరావుగారు తన ధోరణి ఆపలేదు.

"ఓహో ఎవరు నీవు? అతడే మాధవుడు. అతడే రాధికాధవుడు. అతడే శతసహస్రనారీహృదయాబ్జాలకు అళికుమారుడు. భావనాపథంలో రాధికాసౌందర్యపీయూషంతో మత్తుడై ఎద్దును పాలుతీయబోతున్నాడు."

ప్రసవవేదనతో లీల వేసిన వెర్రికేకకి కామాక్షీ, డాక్టరూ కూడా ఉలిక్కిపడ్డారు. శంకరావుగారి కళ్ళనుంచి కన్నీరు తెగిన ముత్యాలపేరులా జారుతోంది. మూసుకున్న ఆ కళ్ళవెనకాల యేదో మహత్తరదృశ్యాన్ని ఆయన దర్శిస్తున్నాడు.

ఎంతటి సౌందర్యదృశ్యం! అదుగో! కాలిఅందెల గలగలలూ, కవ్వపుచిందుల టకటకలూ, ఆమె కన్నుల కళకళలూ కలిసి ఒక చక్కని గీతాన్ని విప్పి చెపుతున్నాయి

ఎవరా వయ్యారి? ఎవరా మనోహరి? అంత సన్నని నడుము గల ఆ అందాలరాణి— ఆమె యెవరు?"

అప్రియత్నంగా కామాక్షి కూడా కళ్ళుమూసుకుంది.

"అతిపారవశ్యంతో అంతకన్న అతిగావున్న లాల సత్వంతో ఆ యువతి ఉత్తకుండలో చల్లచేస్తోంది.

కవ్వపుదెబ్బలు ఆ కుండకు తగిలి ఆ సంగం గాఁగానే ఆదీ టకటకమంటోంది."

డాక్టరుకి అప్పటికి చూచాయగా అర్థంఅయింది ఆయనకి మతిభ్రమణం కలిగిందని. ఆయన తన ధోరణిలో తను ఉన్నాడు.

"ఓ యువతీ! నీ మనోమీనాన్ని గాలంవేసి పట్టిన ఆ అదృష్టవంతు డెవరు?"

అప్రియత్నంగా డాక్టరువంక చూసింది కామాక్షి.

"అతడే మాధవుడు. అతడే మధుసూదనుడు."

ఉలిక్కిపడ్డాడు డాక్టరు మధుసూదనరావు. శంకర్రావు గారు కళ్ళుమూసుకుని తన ధోరణిలో తను మాట్లాడు తున్నాడు.

"అతడే మాధవుడు. అతడే మధుసూదనుడు. అతడే సకల వేదాంతసారాల చక్రవర్తి. అతడే అతిలోకసుందరు డైన యేకైక పురుషుడు."

లీల వెర్రిగా మరో కేక వేసింది.

"ఆ యువతి రాధ. ఆ యువకుడు మధుసూదనుడు. ఆ యువతి విశ్వసుందరి. ఆ యువకుడు విరాణ్మూర్తి."

కామాక్షిహృదయంలో ఏదో మహాసమరం ప్రారంభ

మయింది.

"ఓహోం! ప్రకృతి పురుషుల దివ్యసంయోగానికి జోహారులు."

నర్సు హడావిడిగా పరుగెత్తుకొచ్చి "ఆమెపరిస్థితి యేం బాగాలేదు డాక్టర్ !" అన్నది డాక్టరు హడావిడిగా లోపలికి పరుగెత్తాడు. కామాక్షి శంకర్రావుగారిదగ్గరికి వెళ్లి "నేను కామాక్షిని.. నన్ను గుర్తుపట్టారా" అని ప్రశ్నించింది.

కలలోంచివచ్చి ఆమెవంక చూశాడు ఆయన. "అవును. నువ్వు కామాక్షివి. మంగళగిరి నరసింహుని దగ్గరకు వెళ్లమన్నది నువ్వేకదూ" అన్నాడు.

"ఏమి ఇలా ఉన్నారు? ఒంట్లో బాగా లేదా?"

"ఆ, స్వస్థంగా ఉంది. ఇందాకటినుంచీ మీ యిద్దర్నీ చూసి రాధాకృష్ణు లనుకున్నాను. అయితే కారన్నమాట. ఎంత అపచారంచేశాను?"

"ఎందుకిలా అయిపోయినారు? అసలేం జరిగింది?"

"ఈ సృష్ట్యాదినుంచీ ఏం జరుగుతున్నదో యిప్పుడూ అదే జరిగింది!"

"అదేమిటంటారు?"

"చావు! అదుంది చూశావూ! అదెప్పుడూ మనకి అర్థంకాదు. ఇదిగో యిది చూడు."

ఆయనచేతిలో ఒక ఉత్తరం ఉన్నది. దాన్ని నిర్లక్ష్యంగా కామాక్షిమీదకి విసిరేశారు. అది అన్నపూర్ణ వ్రాసిన ఉత్తరం.

"మామయ్యా!

"తండ్రిలాగా నన్ను పెంచావు. నిన్ను మావయ్యా అని పిలవటంలోనే నాకు ఆనందం ఉంది. ఈమధ్య నేను పొరపాటుచేశాను. అది సరిదిద్దటంకోసం నీవే నన్ను పెళ్లి చేసుకున్నావు. కాని యే రోజూ నీలో భర్తని చూడలేక పోయాను. బహుశా అది నా తప్పుకాదు. కాని చనిపోయిన అత్తయ్యే నన్ను శిక్షించటం ప్రారంభించింది. నాకు ఒక్క క్షణంకూడా శాంతి అనేది లేకుండాపోయింది. నేనూ స్త్రీని. నాకూ కొన్ని వాంఛలున్నాయి. ఆ వాంఛల్లో అన్నిటికన్నా నన్ను ప్రలోభపెట్టింది రాజుతో స్నేహం. ఈ మద్రాసు నగరంలో యేది లభ్యమవుతుందని భ్రమించి నిన్ను కూడా తీసుకువచ్చానో అదే నాకు అలభ్యమైంది. నేను వెళ్ళిపోతు న్నాను. మొదట్లో నేను తప్పుచేసినప్పుడు ఏ హృదయంతో అయితే క్షమించావో అదే హృదయంతో మళ్ళీ ఒక్క సారి నాతప్పు క్షమించు. దీనిలో కామాక్షి గారికి ఒక ఉత్తరం పెడు తున్నాను. నువ్వు నాకోసం చేయాల్సిన ఆఖరి ఉపకారం ఈ ఉత్తరం ఆమెకు అందచేయటం."

కామాక్షి ఈ ఉత్తరం చదివేసరికి డాక్టరు వచ్చాడు.

"ఆమెకు మార్ఫియా యిచ్చాను. ఇంకా ప్రసవమవటానికి కొంతటైము తీసుకుంటుంది." అన్నాడు కామాక్షి వంక చూసి.

కామాక్షి సమాధానం యేమీ చెప్పకుండా మెదలకుండా ఆ ఉత్తరం అతనికి అందించి అన్నపూర్ణ తనకి వ్రాసిన ఉత్తరం చదవటం ప్రారంభించింది.

"కామాక్షిగారూ,!

నాబోటి దౌర్భాగ్యులు ఏ దీపకళికకాంతిలో జీవన గ్రంథం చదువుతూఉంటారో అదే దీపకళికను విసుగెత్తి నప్పుడు ఆర్పేస్తారు.

నేనుకూడా అందరు స్త్రీలలాగానే పుట్టాను. కాని అందరు స్త్రీలలాగా యెందుచేత బ్రతకలేకపోయినానో మాత్రం నా కర్థంకాలేదు.

నాకు తెలుసు, నేనంటే మీకు చాలా అసహ్యం అని. అందుకోసమే మీ కోసమే మీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. నేను జీవితం ప్రారంభిస్తూనే పెద్ద పొరపాటుచేశాను. ఆ పొర పాటు ఎలా సరిదిద్దుకోవాలో తెలియక మరోపెద్ద పొరపాటు, యిక యెప్పటికీ దిద్దుకోటానికి వీలులేనంత పెద్దపొరపాటు మరోటి చేశాను. నాకు లోకాన్నిచూస్తే అసూయ, సంసా రాన్ని చూస్తే అసహ్యం, విజ్ఞానాన్ని చూస్తే అపరిమితంగా కక్ష.

అన్నిటికంటె పెద్దది లోకం నన్ను అర్థంచేసుకోలేదనే ఆగ్రహం. అసలు ఆ లోకానికి నన్ను అర్థంచేసుకోటా నికి కావల్సిన అవకాశం నేనే యివ్వలేదన్న సంగతి నాకు జ్ఞాపకంవుండక అనవసరంగా లోకాన్ని ఒదించేదాన్ని. నాలో ఉండే యీ వ్యథనీ, జరుగుతున్న యీ సంఘర్షణనీ, రచనలద్వారా లోకానికి చెప్పాలని ప్రయత్నించాను. కాని అందులో కృతకృత్యురాలిని కాలేకపోయినాను. మీకు

గుర్తుందా? ఒకసారి నా కథలివ్వటానికి మామయ్యతో సహా మీ ఆఫీసుకు వచ్చాను!

ఆ రోజే రాజుని చూశాను. అహల్య, తార, అన్నా కెరినినా మొదలైనవాళ్ళంతా చేసేతప్పునే నేనూ చేశాను. కాని తప్పు అనుకుంటూ చేయటంవల్లనో ఏమో జీవితంలో శాంతి అనేది లేకుండాపోయింది.

మనసులో వ్యథ యెక్కువ అవుతున్నకొద్దీ దాన్ని దాచిపెట్టుకుని మరింత శాంతిగా గర్వంగా కనిపించాలని ప్రయత్నించేదాన్ని. నా యీ తెలివితక్కువ ప్రయత్నాన్ని లోకం నిర్లజ్జ అని నిందించింది.

తాగేవాడు అరుచికరమైన ఆ ద్రవాన్ని అమృతంగా భావించి యెలా అయితే తాగుతాడో అలాగే నేనుకూడా అరుచికరమైన యీ జీవితాన్ని అమృతంగా భావించి అనుభవించసాగాను. ఫలితం యేమిటంటే అమృతం అని నన్ను నేను భ్రమపెట్టుకున్న జీవితం విషంఅయి నా నరాల్ని, గుండెల్ని తూట్లు పొడిచింది. అందుకోసమే యింతకాలమూ ఏ దీపకళిక సహాయంతో యీ జీవితకావ్యాన్ని చదువుతున్నానో ఆ దీపకళిక ఆర్పివేస్తున్నాను. ఇకనైనా నన్ను అసహ్యించుకోవద్దని ప్రార్థిస్తున్నాను."

ఇట్లు,

అన్నపూర్ణ.

ఆ ఉత్తరం సాంతం చదివేసరికి కామాక్షికి ప్రపంచం అంతా శూన్యంఅయినట్లుగా అనిపించింది. యాంత్రికంగా ఆ ఉత్తరంకూడా డాక్టరుచేతి కిచ్చింది

డాక్టరు మధుసూదనరావు ఆ ఉత్తరం సాంతం చదివి టేబిలుమీద పెట్టాడు. శంకర్రావుగారికి మళ్ళీ ధోరణి వచ్చింది.

"ఎడారిపువ్వులు. భయంకరమైన ఈ జీవనసహారాలో చిన్న ఒయాసిస్ ఉంది. అది స్త్రీ. దానిపక్క ఖర్జూరపుచెట్టు. కోరికల ఆకులు తొడిగి రెండు పూలు పూసింది.

ఎడారిలో తప్పిపోయిన ఒంటరి ఒంటె తన నీరసపు మెడ సాచి ఆ పూలని అందుకుంటే అదృష్టం ఆ ఒంటెదా? పువ్వులదా? ఈ ప్రశ్నకి సమాధానం యెవరు చెపితే వాళ్ళకి వెయ్యిరూపాయలు బహుమానం."

కామాక్షీ, మధుసూదనరావూ ఒకరిమొగం ఒకరు చూసుకున్నారు.

"మీారు చెప్పలేరులే, నాకు తెలుసు. అది సరేగాని అన్నపూర్ణ యేం వ్రాసింది?"

"ఏమీ వ్రాయలేదు. మీారు కొంచెం కాఫీ తీసుకుంటారా?" అన్నది కామాక్షి.

"నెస్కఫె కాఫీ. ఇంతకూ నాప్రశ్నకి జవాబుచెప్పరేం?" అని గద్దించా డాయన. దీనికి చికిత్స లేదా? అన్నట్లు దిగులుగా డాక్టరువంక చూసింది కామాక్షి.

"అదిగో వాకిట్లో మహాలక్ష్మి, అన్నపూర్ణా పిలుస్తున్నారు. వాళ్ళనే అడుగుతాను— నా ప్రశ్న"

అంటూ మహావేగంతో వీధిలోకి పరుగెత్తా డాయన. ఆ క్షణంలో ఊహించలేని మహాఘోరంఒకటి జరిగిపోయింది. వేగంగా పోతున్న లారీ ఒకటి ఆయనమీాదనుంచి పోయింది.

శరీరంలో చాలాభాగం నుజ్జునుజ్జుఅయినా ఆయనని బ్రతికించాలని డాక్టరు మధుసూదనరావు యెంతో ప్రయత్నించాడు. కాని ఏ జ్యోతిసహాయంతో బాధలూ, దుఃఖాలూ, అసత్యాలూ, పాపాలతో నిండిన జీవితచిత్రాన్ని చిత్రిస్తూ వచ్చాడో, ఆ జ్యోతి ఆఖరిసారి గుప్పున వెలిగి శాశ్వతంగా ఆరిపోయింది.

ఆ దేసమయంలో పక్కగదిలో మరో మానవప్రాణి ఆ జ్యోతిని తనలో నింపుకొని జీవితాన్ని ప్రారంభించింది.

శంకరావుగారి మృతశరీరానికి అటొకవైపు యిటొకవైపు నిల్చున్నారు కామాక్షీ మధుసూదనరావులు. ఆయన పనిపోతూ ఆఖరిసారి అన్నమాట యిద్దరికీ ఒకేసారి జ్ఞాపకం వచ్చింది.

ఈ జీవనసహారాలో ఒయాసిస్ స్త్రీ, ఎడారిపువ్వులు భగ్నవ బ్రతుకులు.

ఆయన శవంమీదికి పూర్తిగా దుప్పటిలాగి చేతులు కలుపుకొని మృత్యుశీతలచ్ఛాయలు ఆవరించిన ఆ గదిలోంచి నిశ్శబ్దంగా వెలుగులోకి ప్రవేశించారు వాళ్ళిద్దరూ.

స మా ప్తి.